స్వర్గీయ **సర్దార్ జమలాపురం కేశవరావు గారు**



**3-9-1908** **29-3-1953**



మహారాజ పోషకులు మరియు సంపాదకులు శ్రీ జమలాపురపు నారాయణరావు శ్రీమతి గోపిదేవి గార్లు

'జమలాపురాన్వయ దర్శిని' సృష్టికర్త (ప్రారంభకులు)



# అంకితం



మా
"బామ్మ"

- చి. జమలాపురపు పాండురంగ విఠల్
ఆచార్య బి.యస్.సి.
శ్రీ విద్యారణ్య ఆవాస విద్యాలయం, జమ్మికుంట

## జమలాపురపు దుర్గాంబకు

కొన్నితరాలతో బంధాన్నిపెంచుకొని, అనురాగాన్నిపంచిపెట్టే స్త్రీమూర్తి బామ్మ. ముద్దుల మనుమరాలిగ, గారాల బిడ్డగ, బాధ్యత



నెరిగిన భార్యగా, - రక్తం పంచిపెంచిన మాతృమూర్తిగ, మనుమలను చూచి ఉప్పొంగిపోయే బామ్మగా చిరకాలం గుర్తుండే స్త్రీ మూర్తి బామ్మ. ఇలా కొన్నితరాలవారితో అనుబంధం కలిగి, అనురక్తిని కలిగించి అమరజీవిగా అందరి హృదయాలలో చెరగని ముద్రవేసి తన నిర్మలమైన ప్రేమను అందరికి పంచి ధన్యురాలైన మా బామ్మను మనస్సులో స్మరిస్తూ....

ఇన్ని తరాలతో ప్రత్యక్ష సంబంధం కలిగివున్న మా బామ్మ - మా కాదర్శం.

సమాజంలో కాలానుగుణంగా కల్గెడి మార్పులను గమనించి, వాటి కనుగుణంగా నడచుకోగల శక్తి సామర్థ్యాలతో, తను ప్రేమించిన వారి కన్నా తనను ప్రేమించిన వారి అనురాగాన్ని పంచుకొని ఆదరించగల నిండు మనస్సు గల తల్లి ఆమె. భౌతికంగా

ఆమె మనమధ్య లేకపోయినా ఆమె జీవించిన నాటి స్థితిగతులు, మధుర స్మృతులు తరువాత తరం వారికి గుర్తుండిపోయేటట్లుగా కీర్తి సంపాదించుకున్న మహితాత్మురాలు.

మా వెనుకటి తరాలవారు, మా తరంవారు ఏజన్మలో ఏ పుణ్యకార్యం చేశారో కాని మాకు అందివచ్చిన అదృష్టంగా దేవతయ్యైబామ్మ అండగా వుంది. నిజంగా ఆమె యెడల మాకు వుండే భక్తి గౌరవం, ప్రేమ అలాంటిది. ఆమె మాపై చూపిన ప్రేమ, అభిమానము మాకు తరగని పెన్నిధి. తమ కన్న బిడ్డలపై వుండే మమకారం అనుబంధం విడదీయరానిది.

అలాంటి మా బామ్మ ।౨8। సెప్టెంబర్, ౨వ తేదీన వినాయకచవితి సాయంత్రం 4-00 గం.లకు మమ్ము వీడి స్వర్గప్రయాణం గావించింది. ఆమె త్యాగమయ జీవితం చరితార్థం. అందుకే ఆమె హితాత్మకు ఈ గ్రంథం అంకితం.

★★★

## నిర్మల హృదయ - మా అమ్మ దుర్గాంబ



మానవ రూపంలో వున్న కనకదుర్గ మా అమ్మ దుర్గాంబ.
పేదసాదల పెన్నిధి - ప్రేమామృత అంబుధి
అంబర మనంతం - ఆమె మనసు విశాలం
కలాల కందని కరుణ తనది
పైరుల్లో పచ్చదనంలా మమత ఆమెది
"అమ్మా! ఆకలి." అంటే ఆదుకునే ఆప్తహృదయం
ఆమె ఇల్లు ఒక పెద్ద 'శారదా బిల్లు' అది ఆమెకే చెల్లు,
ఆమె అనాథలకు పెన్నిధి, ఆమె కరుణ - ఉదయించే అరుణ కిరణం
మాతలకే మాత కరుణామృత జాత
ఆమె 'నిర్మల హృదయము' జమలాపురపు వంశానికే ధన్యము.

- చి. వేములపల్లి వీరరాఘవులు
ఖమ్మం బి.ఎ., బి.ఇడి.,

★★★★★

ఎఱ్ఱుపాలెం ఫిర్కా 'ల్యాండ్ సర్వే' ట్రైనింగు సందర్భంలో ట్రైనింగు ఆఫీసర్లతో ఎఱ్ఱుపాలెం ఫిర్కా కరణంగార్లు (1934)



కూర్చొన్నవారు : సర్వశ్రీ జమలాపురపు పెద్ద వెంకట రామారావు గారు, మాది రాజు లక్ష్మీ కాంతారావు గారు, జమలాపురపు వెంకట కిషన్‌రావు గారు, లాండ్ సర్వే ఆఫీసర్లు (ఇద్దరు), బసవరాజు వీరభద్రరావు గారు, జమలాపురపు పెద్దనారాయణరావు గారు నిల్చున్నవారు మొదటివరుస ఎడమనుంచి మామునూరు నాగభూషణరావు గారు, మురుగుల వెంకటరెడ్డి గారు, గోవిందరాజుల శోభనాద్రి గారు, తెలియదు, జమలాపురపు లక్ష్మీనారాయణ గారు, వేదాల రాధాకృష్ణమూర్తి గారు ,నిల్చున్నవారు రెండవ వరుస ఎడమనుంచి బనిగళ్ళపాటి నారాయణరావు గారు, బసవరాజు లక్ష్మీ నరసింహారావుగారు, జమలాపురపు రామనరసింహారావు గారు, అల్లూరి పురుషోత్తమరావు గారు, పెగళ్ళపాటి రాధాకృష్ణమూర్తి గారు, రేమిడిచర్ల కిషన్‌రావు గారు, జమలాపురపు వెంకట రామారావు గారు, జమలాపురపు వెంకట్వేరరావు గారు, బుద్ధిరాజు నారాయణరావు గారు



కీ॥శే॥ జమలాపురం కేశవరావుగారు

3-9-1908 29-31953



కీ॥శే॥ మాడపాటి రామచంద్రరావుగారు

4-5-1903 5-12-1952



హైదరాబాదు స్టేటు కాంగ్రెసు కార్యవర్గ సభ్యులతో పండిత్ జవహర్‌లాల్ నెహ్రూ. ఇందులో కుడినుంచి శ్రీయుతులు మేల్కోటే, బిందూ, స్వామిజీ, నెహ్రూ, జమలాపురం కేశవరావు, నిల్చున వారిలో ఎడమనుంచి సర్వశ్రీ కోదాటి, కొమరగిరి, కె.వి. నరసింగరావు, షరాఫ్, ప్రాణేశాచారి, మాడపాటి రామచంద్రరావు గార్లు ఉన్నారు.

'జమలాపురాన్వయదర్శిని'

# సంపాదక మండలి



కీ॥శే॥ జ. వెంకట కిషన్‌రావు గారు



శ్రీ జ. నారాయణరావు గారు



శ్రీ మాదిరాజు వెంకట రామారావు గారు



శ్రీ అయ్యదేవర నరసింహ పురుషోత్తమరావు గారు



కీ॥శే॥ కొలిపాక మధుసూదనరావు గారు



శ్రీ జ. గోపాల కిషన్‌రావు



శ్రీ జ. నరసింహ కమలాకర కాశ్యప



శ్రీ జ. పాండురంగ విఠల్

# A. మహారాజ పోషకులు


III/14 శ్రీ ఫణి వెంకటరమణగారు


IV/12 శ్రీ నారాయణరావు శ్రీమతి గోపీదేవి గార్లు


IV/13 శ్రీ శ్రీనివాసరావు శ్రీమతి రాధాగార్లు


IV/14 ప్రవీణ్ కుమార్


IV/14 ప్రసన్న


IV/14 భవాని


IV/14 స్రవంతి


IV/15 శ్రీ మధుసూదనరావు, కార్తీక్ రాజా, శ్రీమతి లలిత గార్లు


V/6 శ్రీ పెద్దనారాయణరావు, శ్రీమతి శేషమ్మ గార్లు


V/8 శ్రీ జమలాపురపు వెంకటేశ్వరరావు గారి కుటుంబం

# A. మహారాజ పోషకులు


V/34 శ్రీ అయ్యదేవర పురుషోత్తమరావు శ్రీమతి పద్మావతి గార్లు


V/35 శ్రీ అయ్యదేవర వెంకటరమణ శ్రీమతి సుజాత గార్లు


V/36 సాయి శ్రీకృష్ణ చైతన్య


V/37 శ్రీహర్ష


V/38 శ్రీ అయ్యదేవర రామకృష్ణ శ్రీమతి అరుణ గార్లు


V/39 సాకేత్


V/40 సిద్ధార్థ


V/40 A శ్రీ బసవరాజు వెంకటేశ్వరరావు గారి కుటుంబం


V/50 A శ్రీ బండారు లక్ష్మీ నరసింహమూర్తి గారి కుటుంబం


V/62 A శ్రీ మాడపాటి వెంకట నరసింహారావు గారి కుటుంబం

# B. రాజ పోషకులు



I/9 శ్రీ జమలాపురపు హనుమంతరావు గారు



I/21 శ్రీ జమలాపురపు రాధాకృష్ణారావు గారి కుటుంబం



I/21 శ్రీ జమలాపురపు రాధాకృష్ణారావు గారి కుటుంబం



I/23 F జమలాపురపు విజయశ్రీ గారు



I/30 శ్రీ జమలాపురపు వెంకటరమణ గారి కుటుంబం



I/38 ప్రొఫెసర్ శ్రీ పింగళి కైలాసపతి శ్రీమతి విజయలక్ష్మీ గార్లు



I/32 శ్రీ జమలాపురపు రామానందరావు గారు



I/32 శ్రీ జమలాపురపు రామానందరావు గారి కుటుంబం

# B. రాజ పోషకులు



III/15C శ్రీ చెరుకూరి సూర్యమోహన్‌రావు శ్రీమతి తారాబాయి గార్లు



IV/23 శ్రీ జమలాపురపు శివరావుగారు



IV/23 రాజ్యలక్ష్మిగారు



IV/24 శ్రీ జమలాపురపు జగన్నాధరావు గారు



IV/26 శ్రీ జమలాపురపు గోపాలరావు గారు



IV/29 శ్రీ జమలాపురపు లక్ష్మిగణపతిరావు గారు



IV/55 శ్రీ జమలాపురపు జగన్నాధరావు శ్రీమతి లక్ష్మిరాజేశ్వరి గార్లు



IV/55 శ్రీ జమలాపురపు జగన్నాధరావు శ్రీమతి లక్ష్మిరాజ్యేశ్వరి గార్ల కుటుంబం



IV/56 E శ్రీ మాడపాటి వినయ్‌కుమార్ శ్రీమతి శారదాదేవి గార్లు



V/18 శ్రీ జమలాపురపు బాలకృష్ణారావు శ్రీమతి సత్యవతి గార్లు

# B. రాజ పోషకులు



V/45 A డా॥ వర్ధిపర్తి కామేశ్వరరావు శ్రీమతి అనూరాధ గార్లు



V/51 A శ్రీ బసవరాజు వెంకట రమణ శ్రీమతి హిమబిందు గార్లు



V/51C శ్రీ శ్రీధర్ రంగారావు శ్రీమతి సుధీర గార్ల కుటుంబం



V/51 O శ్రీ మాదిరాజు రాధాకృష్ణరావు శ్రీమతి వెంకట నరసమ్మ గార్లు



V/56 B శ్రీయల్లా ప్రగడ సత్యనారాయణ శర్మ, వెంకట నరేష్ శ్రీమతి కుసుమ కుమారి గార్లు





V/72 శ్రీ జమలాపురపు లక్ష్మీ నరసింహారావు గారు శ్రీ బసవరాజు హరికిషన్ రావు గారు



V/69 జమలాపురపు రంగనాయకమ్మగారు, భాస్కర్ శర్మ, విఠల్ కుటుంబాలతో



శ్రీ ఊటుకూరి నరసింహారావు శ్రీమతి రమాదేవి గార్లు

# C. పోషకులు



I/15 శ్రీ అక్కరాజు బాబూరావు గారి కుటుంబం



I/47 శ్రీ జి॥ శశిధర్‌రావు శ్రీమతి సంధ్యారాణి గార్లు



I/48 B శ్రీ కాళ్ళూరి వెంకట రామప్రసాదరావు శ్రీమతి అరుణాదేవి గార్లు



I/49 శ్రీ జి. వెంకటేశ్వరరావు శ్రీమతి కమల గార్లు



I/52 శ్రీ జమలాపురపు ప్రసాదరావుగారు



III/14C మేడికొండూరి సీతమ్మగారు



IV/47 శ్రీ జి. జగన్నాథశర్మ గారి కుటుంబం



IV/52X బండారు వెంకటేశ్వరరావుగారు



IV/59 శ్రీ జి. శ్రీధర్ గారు





V/7 శ్రీ జి. రామకిషన్‌రావు శ్రీమతి అనసూయమ్మ గార్ల కుటుంబం

# C. పోషకులు



V/27 శ్రీ జి. సత్యనారాయణ శర్మ శ్రీమతి అన్నపూర్ణమ్మ గార్లు



V/28 శ్రీ జి. సూర్యప్రకాశరావు శ్రీమతి సువర్చల గార్లు



V/29 శ్రీ జి. శ్రీనివాసరావు శ్రీమతి సుజాత గార్లు



V/30 శ్రీ జి. రామనరసింహారావు శ్రీమతి నిర్మల గార్ల కుటుంబం



V/30 శ్రీ జి. రామనరసింహారావు శ్రీమతి నిర్మల గార్లు



V/68 A ప్రొఫెసర్ మాదిరాజు సుధాకర్‌రావు శ్రీమతి కుసుమ కుమారి గార్లు



V/74G సీత స్వయంప్రభ గారు



V/52 C శ్రీ గోవిందరాజు దత్తు శ్రీమతి వరలక్ష్మి గార్లు



శ్రీ కీసర యోగానంద శర్మ గారు

# D. దాతలు



I/23 G శ్రీ గోళ్లముడి సత్యనారాయణరావు శ్రీమతి లక్ష్మి గార్లు



I/23 H శ్రీ షహమీరు వెంకటేశ్వరరావు శ్రీమతి ఉదయశ్రీ గార్లు



I/48 A శ్రీ దుగ్గరాజు గోపాలకృష్ణమూర్తి శ్రీమతి వెంకట దుర్గ నాగలక్ష్మి గార్లు



I/48 C శ్రీ కొర్రపాటి రాజేంద్రప్రసాద్ శ్రీమతి రమాదేవి గార్లు



I/48 D శ్రీ కొండపల్లి జానకిరామ శర్మ శ్రీమతి లక్ష్మీ ప్రసన్న గార్లు



I/59 శ్రీ జి. రాఘవరావు గారు



II/14 శ్రీ జి. బాబురావు శ్రీమతి లీల గార్లు



II/15 శ్రీ జి. శ్రీనివాసరావు శ్రీమతి పద్మ గార్లు



IV/52 E శ్రీ నందిరాజు అప్పారావు శ్రీమతి సత్యవతి గార్లు



IV/61 U శ్రీ పరిటాల వెంకట నాగ శేఖర్ శ్రీమతి సీతాకుమారి గార్లు

# I. భూమిక

భారతీయ సంస్కృతికి మూలము కుటుంబ వ్యవస్థ. కుటుంబపు విలువ ఆకుటుంబంలోని వ్యక్తులు, వారి 'వ్యక్తిత్వం' మీద ఆధారపడి ఉంటుంది. ఆకుటుంబ వ్యక్తిత్వ వికాసం అనేది ఆ గ్రామానికే కాక తత్సంబంధమైన సువిశాలమైన ప్రదేశానికి వెలుగునిచ్చి, చిరస్థాయి అయిన కీర్తిని తెచ్చిపెడతాయి. ఆ వెలుగు ప్రసరించినంతవరకు, ఆకుటుంబము నాధారపడిన సభ్యులెల్లరు ధన్యజీవులు. అది వారి పూర్వజన్మ సుకృతం - ఉదారచరితులైన వారి పుట్టుక వలన ఆ నేలఅంతా పునీతం అవుతుంది.

తమ పూర్వుల వైభవం కనులార చూడక పోయినా విని తద్వారా స్ఫూర్తిని పొంది, సుకృతాత్ములై, సజ్జన మాన్యులై తరించగలగడమనేది ఆయా వంశీయులైన వ్యక్తుల పుణ్య విశేషమనక తప్పదు.

ఎన్నో పవిత్ర ఇతివృత్తాలు, ఐతిహాసిక విలువలు సంతరించుకొని కాలగతంలో చరిత్రలుగా మిగిలి, కనుమరుగవడం చూస్తున్నాము.

ఏ దేశ చరిత్ర అయినా ఆ దేశ ప్రజల తర తరాల సంస్కృతి ప్రధానమైన నడత మీద ఆధారపడి ఉంటుంది. కాలగతిలో ఆనాటి ప్రజల నడక తీరు తెన్నులు తెరమరుగైనా అవి చరిత్రగా మారి శాశ్వతంగా నిలిచి పోతుంది. దేశ చరిత్రలో అందరూ అధ్యయనం చేయదగిన అమూల్యమైన అంశాలు ఎన్నో వుంటాయి. అందులోని భాగములే 'వంశము' లేక 'కుటుంబ చరిత్రలు'. వంశచరిత్రలు గానీ, కుటుంబ చరిత్రలుగానీ వారికి సంబంధించిన వ్యక్తులకే పరిమితం కావచ్చును. అయినప్పటికీ ఎవరి కుటుంబ చరిత్రను వారు వెలుగులోనికి తీసుకొని రావడం ఆ కుటుంబంలోని వారికి కనీస బాధ్యత. అది బహుజన ఆమోదం కాకపోవచ్చు. అయినా సంబంధిత కుటుంబములలోని వారికి నిశ్చయంగా తమ పూర్వోత్తరాలు యెంతైనా ఆసక్తిని కలిగిస్తాయనడంలో సందేహం లేదు.

ఆ దృష్టిలో నా కనీస బాధ్యతగ భావించి మన 'వంశచరిత్ర' ను "జమలాపురా న్వయదర్శిని" అను పేరుతో రూపొందించాను. ఈ నా ప్రయత్నాన్ని అధ్యయన పరులు సమాదరిస్తారని ఆశిస్తున్నాను. ఈ గ్రంధాన్ని అందుకొని అధ్యయనం చేయండి. ఆశీర్వదించండి.

మీ

ఎఱ్ఱుపాలెం
2-1-1999

జమలాపురపు గోపాలకిషన్‌రావు
ఎం.ఎ., ఎం.ఇడి.
గ్రంధకర్త

# II. అవతారిక

## జమలాపురపు గోపాలకిషన్‌రావు

మా తాత గారు కీ.శే. జమలాపురపు వేంకట కిషన్‌రావు గారు పూర్వం తయారు చేసిన 'చార్టు' నందు గల మగ వారి ఆధారముగా, సాధ్యమైనంతవరకు కుటుంములోని వివరాలు, మగపిల్లలే కాకుండా, ఆడపిల్లల కుటుంబ వివరాలు కూడా సేకరించడమైనది.

జమలాపురపువారి కుటుంబాలు, అందులోని వారి జీవిత విశేషాలు పలువురి అభిప్రాయాలను సేకరించి ఒక క్రమ బద్ధమైన పద్ధతిలో ప్రచురిం చడమైనది.

**మూలపురుషుడు పెద్దిరాజు**

పూర్వుల ఆధారంగా జమలాపురపు వారి వంశస్థులు నెల్లూరు జిల్లా ఉదయగిరి సమీపంలోని వరికుంటపాడు మండలం కడియంపాడు గ్రామ వాస్తవ్యులు కడియం పాటివారు. చరిత్రకు అందినంతవరకు పెద్దిరాజు మూల పురుషుడు.

ఒకనాడు పెద్దిరాజు యాత్రార్థియై భద్రాచలం పుణ్యక్షేత్రం దర్శింప కాలినడకన రేమిడిచర్ల (మధిర తాలూకా ఖమ్మంజల్లా) గ్రామము వరకు వచ్చెనట. అప్పటికే పొద్దు పోవ, ప్రయాణ బడలికచే ఆ గ్రామములోని కరణం గారి యింట విశ్రాంతి తీసుకొనెనట. ఆ కరణం గారు ఆతిధ్యం యిచ్చి భోజనా నంతరము కుశల ప్రశ్నలతో, యీ బాలుని గుణ గణములకు మెచ్చి తనకు గల ఒక కూతురు చుట్టకాళ్ళ ఆమెను మరియు ఆమెకు అండగా నిల్చుటకై రెండవ కూతురును కూడా యిచ్చి వివాహము చేసెను. తన అల్లునికి జమలాపురంగ్రామ కరిణీకము యిప్పించి కుటుంబము నిలిపెనట. అయితే పెద్దిరాజు యిద్దరు భార్యలలో పెద్ద భార్య అయిన చుట్టకాళ్ళ ఆమెకే సంతానము కలిగెనని తెలియ వస్తున్నది.

పెద్దిరాజు గారు అసమాన ప్రజ్ఞా విశేషములు కలవారు. ఏక సంధాగ్రాహి. ఆయన అప్పటి ప్రభువులు గోలుకొండ నవాబు అబుల్ హసన్ తానీషా ప్రభువువారి మెప్పను పొంది ఎఱ్ఱుపాలెం గ్రామానికి దక్షిణంగా రెండుకిలోమీటర్ల దూరంలో వున్న కేసిరెడ్డిపల్లిలో "ఇనాం" గా కొంత పొలము బహుమతిగా పొందుటయే గాక, 'దేశ పాండ్యా', 'మక్తేదార్' గా గౌరవింప బడెనని మా తాతగారు వ్రాశారు.

**జమలాపురం, జమలాపురపు :**

జమలాపురం గ్రామ కరిణీకము చేయుటచే ఆ కుటుంబీకుల గృహనామము 'జమలాపురపు' అనే విశేష నామముతో పిలువ బడుతూ వున్నది.

తరువాత కొంతకాలానికి నిర్మాణము జరిగిన ఎఱ్ఱుపాలెం గ్రామము జమలాపురపు వారికి స్థిరనివాసమైంది. క్రమ పద్ధతిలో వివరించుటకై పెద్దిరాజు (మూలపురుషుడు) గారి సంతతి నాల్గవ తరము నుండి ఏడు శాఖలుగా విభజించటమైనది.

# వంశ వృక్షము




జమలాపురపు వారి వంశము తెలంగాణా సర్దార్, జమలాపురం కేశవ రావుగారి వంటి త్యాగధనులకు జన్మనిచ్చింది. నిరతాన్నదాత జమలాపురపు జగన్నాధరావు గారు, మహాతపస్వి సీతారామయ్యగారు, క్రిమినల్ లాయరుగా పేరు, ప్రఖ్యాతి గాంచిన గోపాలరావుగారు, నిజాం ప్రభుత్వంలో తన శౌర్య పరాక్రమాలతో స్వామి భక్తిని చూపించిన మేరు నగధీరుడు పెద్ద వీరభద్రరావుగారు భద్రాచలం తహశీలుదారుగా వుండి తన వృత్తి ధర్మాన్ని నెరవేరుస్తూ దైవ కార్యాలలో పాలు పంచుకుంటూ తన జీవితాన్ని ధన్యం చేసుకొన్న బసవరాజుగారి వంటి అనర్ఘ రత్నాలు శాశ్వత కీర్తి నార్జించిరి.

నాటి హైదరాబాదు సంస్థానంలోని వరంగల్ జిల్లా, నేటి ఖమ్మంజిల్లా సరిహద్దు గ్రామమైన ఎఱ్ఱుపాలెం గ్రామము తెలంగాణా పోతుగడ్డ గా ప్రసిద్ధి చెందింది.

ఎఱ్ఱుపాలెం గ్రామానికి ఏడు కిలోమీటర్ల దూరంలో తూర్పు దిశగా వున్న తెలంగాణా తిరుపతిగా పేరుబడ్డశ్రీ శ్రీ శ్రీ వేంకటేశ్వరస్వామి 'స్వయంభువు 'గా వెలసిన జమలాపురం గ్రామము ఈ వంశానికి ఇంటిపేరుగా వుండటం యీ వంశం చేసుకున్న పూర్వజన్మ సుకృతం.

1932లో శారదా యాక్టు మదరాసు ప్రభుత్వం వారు విధించిరి. ఆయాక్టు ప్రకారం బాల్య వివాహాలు నిషేధింపబడినవి. ప్రక్కరాష్ట్ర మైన హైదరాబాధు రాష్ట్రంలోని సరిహద్దు గ్రామము ఎఱ్ఱుపాలెం గ్రామము కావటం వలన సనాతన సాంప్రదాయాలను పాటించే వారు, ఈ గ్రామం వచ్చి బాల్య వివాహాలు జరిపించుకొన్నారు. ఆ వచ్చిన వారికి వివాహాలను జరిపించుకోవటానికి సకల సౌకర్యాలను సమకూర్చి, కొన్ని వందల వివాహాలకు సహకరించిన కీర్తి అష్టైశ్వర్యాలతో తులతూగుతున్న యీవంశం వారికే చెందింది.

తెలంగాణాలో అప్పటి ఉమ్మడి మద్రాసు రాష్ట్ర ప్రధాని కీశే చక్రవర్తుల రాజగోపాలాచార్యులు గారు ఎఱ్ఱుపాలాన్ని కళ్యాణ నగరంఅని పేరు పెట్టారు. సర్దార్ జమలాపురం కేశవరావుగారు సత్యాగ్రహం చేసి కారాగారానికి వెళ్ళినప్పుడు ప్రక్కన యూనియన్ గ్రామాలలో వుండి తెలంగాణా ఉద్యమానికి సారధ్యం వహించిన వారిలో ప్రముఖులుగా వున్న శ్రీ మాడపాటి రామచంద్రరావుగారు జమలాపురపు వంశము వారికి

దౌహిత్రులేకాక ఈ గ్రామ నివాసి కావటం విశేషం. వారి తండ్రిగారు తిరుమలరావుగారు సుప్రసిద్ధ న్యాయవాదిగా, మధిర తాలూకాలో పేరు తెచ్చుకొన్నారు. తిరుమలరావుగారి తమ్ముడు హనుమంతరావుగారు హైదరాబాదు రాష్ట్ర వుద్యమంలో ప్రముఖులుగా వుండటమేగాక ఆంధ్రప్రదేశ్ తొలి లెజిస్లేటివ్ కౌన్సిల్ ఛైర్మన్‌గా మరియు హైద్రాబాద్ కార్పొరేషన్ మేయర్‌గా అత్యుత్తమ గౌరవనీయపదవి నధిష్ఠించారు. మాడపాటి హనుమంతరావుగారు కూడా జమలాపురపు వారి దౌహిత్రుడే (మనవడే)

మా తాతగారు జమలాపురపు వేంకట కిషన్‌రావుగారు ఎఱ్ఱుపాలెం గ్రామ పట్వారీగా 64 సంవత్సరాలు నిరాటంకముగా కరిణీకం నిర్వహించి, యిటు ప్రభుత్వము, అటు ప్రజల ప్రసంశలు పొందిన వారిలో అగ్రగణ్యులు. ఇంత సుదీర్ఘకాలం విధినిర్వహణ గావించిన ప్రముఖులు.

వేంకట కిషన్ రావుగారు తమ అసమాన ప్రజ్ఞా విశేషాలతో విధినిర్వహణ చేసుకుంటూ, జమలాపురపు వారి వంశ చరిత్ర వ్రాయతలపెట్టటం వారి విశాల దృక్పధానికి పరాకాష్ఠ. ఆనాటి తెలంగాణా రికార్డుల ప్రకారం ఉర్దూ భాషలో వున్న వంశ వృక్షం చార్టును. తెలుగులోకి మార్చి కరక్కాయ సిరాతో మా తాతగారు వ్రాసినది దొరికింది. వంశవృక్షంతో పాటు కొంత మంది జీవిత విశేషాలు మరియు ఆయన 'స్వీయచరిత్ర' వ్రాసుకొన్నది దొరికింది ఎంతో వ్రాయాలని అనుకొన్న స్వీయచరిత్ర ఏ కారణం వల్లనో అసంపూర్తిగా మిగిలి పోయింది. ఆ ఆధారంతో నేను ఈసాహసానికి పూనుకొన్నాను.

మా తాతగారి స్ఫూర్తితో ఆయన ధ్యేయాన్ని నెరవేర్చాలనే ఆశయంతో గత 40 సం.రాలుగా ఈ ప్రయత్నాన్ని కొనసాగిస్తూ! ఈమధ్యకాలంలో మా మేనత్తగారు మాదిరాజు వేంకటపేరమ్మగారు ఎంతో ఓర్పుతో ఎవరి పిల్లలను ఎవరికి ఇచ్చింది. వారివారి కుటుంబాల వివరాలు అన్ని చెప్పారు. అంతకంటే వృద్ధాప్యదశలో వున్నప్పటికి ఎంతో జ్ఞాపకశక్తివున్న జమలాపురపు వారి ఆడబిడ్డ. దేవరాజు గోపమ్మగారు గత 5,6 తరాల వారి వివరాలు ఇవ్వడం ఎంతో ప్రోత్సాహాన్ని ఇచ్చాయి. వారి ఇరువురికి నేను ఎంతో ఋణపడి వున్నాను.

జమలాపురపు వారిది పూర్వము కడియంపాడు (నేడు వరికుంటపాడు మండలం)

ఫిబ్రవరి 1998న నేను ఆ గ్రామానికి వెళ్ళాను అక్కడ కడియంపాడు వారు పూర్వం వున్నట్లుగా చెప్పారు. ప్రస్తుతం అక్కడ ఎవరూలేరు! ఆ గ్రామ కరణంగారు అనంతరాజుల లక్ష్మీనారాయణగారి సహాయంతో గ్రామస్తులను కలిశాను. గత మూడు వందల సంవత్సరాలకు పూర్వము మాది యీ గ్రామం అని నేను చెపితే వారెంతో ఆశ్చర్యచకితులై నన్ను వారందరికి సన్నిహితునిగా ఎంతో ఆప్యాయంగా చూశారు. 'నేతాజియువజన సంఘం' యువకులంతా కలసి నన్ను వూరి చివరవున్న కరణంగారి యిండ్ల పట్టు చూపించారు. అదినా జన్మ తరింపుగా అనిపించింది ఆ నేలను స్పృశించాను.

ఊరు బయట ఒకఆంజనేయ స్వామి విగ్రహం సుమారు 15 అడుగులు వున్నది అక్కడికి నన్ను తీసుకొని వెళ్లారు. కంపచెట్లల్లోంచి వంగివంగి వెళ్లాము. చాల అద్భుతమనిపించింది. ఆ అభయాంజనేయస్వామి విగ్రహం, అది ఆనాటి మన పూర్వులు నిర్మించిందని నా మనసులో తలచుకొని అంతటి అద్భుతమైన ఆంజనేయ స్వామికి మొకరిల్లాను, అది ఏ విధమైన ఆచ్ఛాదన లేక గ్రామానికి దాపులో వున్న నిర్జనమైనకంప చెట్ల చాటున వుండటం ఎంతో బాధకలిగించింది.

అందరూ నన్ను ఎంతో ఆదరణగా గ్రామం బయటదాక వచ్చి పంపించారు. అది నాకు చాలు, మన మూలపురుషుడు పెద్దిరాజుగారి జన్మస్థలం గుర్తుగా.

****



# III. బ్రాహ్మణ శాఖల ప్రసక్తి

- శ్రీ నేమాని సన్నయ్య పంతులుగారు, శ్రీకాకుళం

భారతదేశపు దక్షిణ ప్రాంతముల్లో ఆంధ్రదేశము 6వ, శతాబ్దము నుండి విస్తృతమైనదని చరిత్రలో నిర్ణయించబడ్డది. ఈ ఇండ్ల పేర్లు వృత్తులను బట్టి, దేవ బ్రాహ్మణ సిద్ధపురుషుల పేర్లను బట్టి, ఋషులను బట్టి గ్రామ నామములు పురస్కరించుకొని యిండ్ల పేర్లు వచ్చినవి.

ఇవి సామాజికమైన కట్టుబాట్లలలో వివాహోపనయనాది షోడశ సంస్కారములయందు, అపరకర్మలయందు. ...... పూజా భాజనములయందు వినియోగపడుచున్నవి. ఇప్పటివరకు తదావశ్యకతను అనుసరించి గోత్రపరంపర విప్రులకు శాఖలనుండి, పెక్కు ఉపశాఖల వ్యవహారము వెలుగునకు వచ్చుచున్నవి. ప్రప్రధమంగా వేదశాఖల్లో సంబంధించి వేదసామ్రాజ్య సంప్రదాయాన్ని అనుసరించి విప్రులనెల్లరను వైదికులని, సత్‌వృత్తిని ఆశ్రయించిన వారిని వైదిక బ్రాహ్మణులనుట పరిపాటైనది. లౌకిక దృష్టికి వీరి నుండి విడివడిన శాఖగా నియోగులని పిలువబడుచుండుట పరిసీలించవలసి ఉంది.

ఈ నియోగులలోనే 'ఆరువేల నియోగులని', నందవరికి నియోగులని, కరణకమ్మ నియోగులని, వెలనాటి నియోగులని (లేక పెసరవాయిల) తెలగాణ్య నియోగులని, ద్రావిడ నియోగులని, కాసలనాటి నియోగులని ఇలా పలు నియోగశాఖలు వెలువడి కాలగర్భంలో మరుగునపడినవి.

## ఆరువేల నియోగులు

కృష్ణానది దక్షిణ ప్రాంతమైన ఆరువేల మంది బ్రాహ్మణులు వైదిక వృత్తినుండి విడివాడినవారై, నియోగింపబడిన వృత్తులనుద్దేశించి ఆరువేలనియోగులైరి. గుంటూరు, నెల్లూరు జిల్లాలోని వైదిక బ్రాహ్మణంలోనే "ఆరువేల" నాడైన కారణముగాముస్నేరు నుండి, పెన్నావరకు గల బ్రాహ్మణులలో నియోగ శాఖీయుల్లో పాకనాటివారని వ్యవహారము కలదు.

కోటివిద్యలు కూటికొఱకే అను సామెత ప్రకారము కాలగతిలో చారిత్రక పరిశీలన మొనర్చి, వెలనాటి వైదీకులని, నియోగులని, తెలంగాణ్యులు ములకనాట్లు, వేగినాట్లు, ప్రధమశాఖ నందవరకులు, ద్రావిడులు, గౌడులు, స్మార్తులు, ఆరాధ్యులు అను పెక్కు బ్రాహ్మణ శాఖలు ఏర్పడినవి.

ఈ విధముగా గోత్ర సంబంధ ప్రవరల్లో గృహనామము వాడుక వచ్చినది. ఈ ఇండ్ల పేర్ల చివర పెక్కులు "రాజు" అను బిరుదులు చేర్చబడినవి. అలాగుననే "ప్రగడ" నామాంతముల్లో గృహనామాలు, నామాంత్యము వచ్చినది.

ఇంటిపేరు వ్యక్తి పేరునకు ముందుగా వెనకా వ్యవహరిస్తుంటారు. వృత్తి నామాల్లో అధికార్ల, అవధానుల, పంతుల, భాగవతుల, జనమంచి, సూరి భాట్టం, అలాగుననే సోమయాజి, శాస్త్రి.

ఈ విధముగా వంశపరాభివృద్ధిగా ఇప్పటికీ పరువు ప్రతిష్టలతో వుంటున్నాయి. 'సాముద్రిక' చేయువారు జోశ్య బట్ట ఏర్పడ్డది.

## గోత్ర గణాలు

వివిధ జన్మలందు, మంత్రార్థానము, వేదాభ్యానము చేయుచు ఆయాసంస్కారములందు అనుస్టానములయందు దక్షులగు మహానుభావుక మంత్రద్రష్టలనబడుచున్నాము. వారి నిమిత్తమై గోత్ర ప్రవరలను ఏర్పరచిరి. గోత్రముగాని, తత్సంబంధిత ప్రవరగాని మార్చరాదు. గోత్ర ప్రవరల స్మరణము కృతజ్ఞతా సూచకము. అదియుగాక పితృణ ఋషి ఋణములు తీర్చుకొనునంతటి ఫలితము. గోత్రము సంకానమని సుస్పష్టము.

కళకి, సంస్కృతికి అవినాభావ సంబంధమున్నది. అలాగుననే సాహిత్యానికి చరిత్రకి ఎడతెగని సంబంధమున్నది. ఈ విధముగా ఆలోచిస్తే కళ, చరిత్ర సాహిత్యము సంప్రదాయబద్దముగా ముడిపడి 'త్రివేణీ సంగమం'గా పెనవేసికొని ముందుకు సాగుతున్నది.

" వామదక్షిణ హస్తాభ్యాం దక్షిణోత్తర కలశౌ యుగపద్ గృహీత్వా, అక్కలశే స్వస్తి పుణ్యాహ సమృద్ధిరస్తు ! వర్ణశీత సంపూర్ణమస్తు !——— గోత్రాభివృద్ధిదస్తు !
శాతి: పుష్టితుష్టిశ్వాస్తు ! పునరపి గోబ్రాహ్మణేభ్య: !
శుభం భవత్, సర్వసంపత్కారమస్తు !
భగవాన్ వాస్తోష్పత్తి: ప్రీయతామితి భవంతో బృవంతు !

## గోత్ర ప్రవర నిఘంటువు

అంగీరస - బార్హస్పత్య - భారద్వాజ
కాశ్యప - అవత్సార - అసిత
అంగీరస - మాంధాత । కుత్స

వాసిష్ఠ - మైత్రావరుణ - కౌండిన్య యింకా మొత్తం 276 వున్నవి: తమ గోత్రము తెలియనివారు, గోత్రం చెప్పకోవలసిన సందర్భములో గురువు యొక్కగాని, కుటుంబ పురోహితుని యొక్కగాని గోత్రపదము వాడవచ్చు.





## III / 1
# అభినందన

- చి. ఆదిరాజు శ్రీనివాసరావు

ఎవరి కుటుంబాలను వారు, ఎవరి పిల్లలను వారు చూచుకునే ఈ రోజుల్లో, భావి తరాలకు వంశవృక్ష చరిత్ర తెలియచేయు మార్గ దర్శిని ఈ జమలాపురాన్వయ దర్శిని.

మనవంశమేమిటో? మనము ఏ పూర్వీకులకు సంభందించినవాళ్లము? మన గోత్రం ఏమిటి? అని తెలియచేయాలనే ఆలోచనకు శ్రీకారం చుట్టిన జమలాపురపు వెంకట కిషన్‌రావు గారి మనుమడు, రామన్నసింహరావు గారి కుమారుడు మరియు మా పెద్ద కిష్టి తాతయ్య అయినటువంటి జమలాపురపు గోపాల కిషన్‌రావు గారి కృషికి లభించిన ఫలమే ఈ జమలాపురాన్వయ దర్శిని.

తాతగారి ఆలోచనలకు పుస్తక రూపంలో ప్రచురించుటకు గోపాలకిషన్ రావు గారు పడిన శ్రమను కళ్లారా చూచిన వాడిగా వారిని అభినందించలేకుండా వుండలేక పోవుచున్నాను. పుస్తకాన్ని అసంపూర్తిగా ఎందుకు పూరించాలి. అనే ధృడసంకల్పముతో పుస్తకము ఆవిష్కరణ నాటినుండి నేటివరకు నిత్య కృషీవలుడై, ఇంకా ఎన్నో విషయాలు సేకరించాలి. పుస్తకంలో ప్రచురించాలి. అనే వారి ఆతృత, తపన మరువలేనిది మరపురానిది.

పుస్తక ఆవిష్కరణ కార్యక్రమంలో కూడా ఆయన మా తాతగారి, మా బామ్మగార్ని, మా నాన్నగార్ని గుర్తు చేసుకొని చలించిపోవుట ఆయనగారి ఆత్మీయతకు, బంధుప్రీతికి, నిదర్శనము.

వంశవృక్ష పుస్తక ఆవిష్కరణ కార్యక్రమం చూడటం నాకు అదే ప్రథమం. ఇంతకు ముందు ఎన్నడూ అటువంటి కార్యక్రమాలను చూడలేదు. ఆ కార్యక్రమానికి ప్రముఖ జర్నలిస్టు, దశ సహస్ర సభాకేసరి డా తుర్కపాటి కుటుంబరావు గారు విచ్చేయటం, అదియునూ మన ఎర్రుపాలెం స్వగ్రామంలో తాతయ్యగారి ఇంట్లో బంధు, మిత్రుల మధ్యన పుస్తక అవిష్కరణ జరగటం ఎంతో ఆనందము కలిగించినాయి.

ఈ కార్యక్రమానికి, పుస్తక ఆవిష్కరణకు సృష్టికర్త అయిన శ్రీ జమలాపురపు గోపాలకిషన్‌రావు గారికి ఆ భగవంతుడు ఆయురారోగ్యములు ప్రసాదించాలని మనసారా కోరుకొనుచూ అభినందించుచున్నాను.



# IV. అన్వయ ప్రాశస్త్యము

- శ్రీ కల్వల సీతారామారావు గారు,
రిటైర్డ్ ప్రిన్సిపాల్,ఖమ్మం

జమలాపురపు వంశజుడు, మచ్ఛిష్యుడు, మత్సమీపబంధువు (మా అల్లుడు గారి అన్నగారు) , చిరంజీవ గోపాల కిషన్‌రావు అత్యంత వినయశీలి, కార్యదక్షుడు.

గురువులకు శిష్య కోటి మెండుగా నుండును. కాని గుర్తుంచుకొనదగిన శిష్య గణము బహు కొద్దిమంది మాత్రమే. ఈ కోవకు చెందిన సద్గుణ సంపన్నుడు మచ్ఛిష్యుడైనందులకు గర్విస్తున్నాను.

"తమ కార్యంబు ఘటింపుచున్ పరహితార్థ వ్యాపృతుల్ మధ్యముల్" అను భర్తృహరి సుభాషితము ఈ చిరంజీవి వ్యక్తిత్వమునకు చక్కని ఉదాహరణ. తన కోపినంతలో పరోపకార చింతన కలిగిన మనస్తత్వము, వీరిబుషుల సంప్రదాయమునననుసరించి సాత్విక స్వభావము గలిగి మచ్చ లేని ఐహిక జీవనమునకు ముముక్షత్వమే పరమార్థమనెడి ఆముష్మికచింతనమునకు సదాపాటు బడుచుండుట ఈతని 'జీవన సరళిలో కాననగును.

ఈ చిరంజీవి నిరవధిక కృషి తో 'సంకలనము' చేసిన "జమలాపురాన్వయదర్శిని" వీరి కుటుంబ చరిత్ర. దీనిని బట్టి వీరి పూర్వీకులు 'కడియం పాటి' వారుగా విలసిల్లిరి. వీరి మూల పురుషుడు పెద్దిరాజు 'జమలాపురం' గ్రామము 'కరణము'గా నియమింపబడిన కారణమున వీరి ఇంటిపేరు 'కడియంపాటి' మారి 'జమలాపురపు' అనిస్థిరపడినది. సామాన్యముగా విప్రుల యింటిపేర్లు, వారి స్థిర నివాసము యేర్పరచుకొన్న గ్రామములపేర్లో, వ్యక్తుల పేర్లో, బిరుదుల పేర్లతో ప్రసిద్ధి గాంచుట సాంప్రదాయము, కావున వీరిది జమలాపురం స్థిర నివాసమైనదని చెప్పనొప్పును.

ఈ వంశజులకు 'దేశపాండ్యా' అనుబిరుదు ప్రభుత్వ పరముగా ప్రధానము గావింపబడెను. ఈ బిరుదులు దేశపాండ్యా దేశముఖ్, బంజరు దారు, మక్తేదారు అనునవి ఉబుసుపోక ప్రధానము చేయబడినవి కావు. బిరుదు గ్రహీతల నిస్వార్థ చింతనము, సామాజిక సేవ, సత్సంప్రదాయము మరియు ప్రభుత్వముచే నిర్దేశింపబడిన కార్యక్రమములలో విజ్ఞత, దక్షత కనబరచిన వారికి పై బిరుదులు

ప్రధానము చేయబడును. కావున ఈ 'దేశ పాండ్యా' బిరుదు జమలాపురం వంశజులకు వారి వైశిష్ట్యము, వినయశీలత పరోపకార బుద్ధిననుసరించి ప్రభుత్వముచే ప్రధానము చేయబడెననుట నిర్వివాదాంశము. ఈ బిరుదు గ్రహీతలకు వార్షికముగా ప్రభుత్వ పరముగా కొంతధనము "ఋసుము" (గౌరవ వేతనము) గా లభించెడిది. కావుననే ప్రభుత్వ దృష్టిలో సముచిత స్థానము కలిగిన ఉన్నత వంశమని చెప్పట సత్యదూరము కాదు.

**గోత్ర ప్రవరల ఆవిర్భావము :**

విప్రులకు గృహ నామము లెంత ముఖ్యమో 'గోత్ర ప్రవరలు' కూడా నిత్యకర్మల అనుష్ఠానములకంత ముఖ్యము. వారి వారి గోత్ర ప్రవరల వలన ఋషి సంప్రదాయమును తెలుసుకొనవచ్చును.

వివిధ జన్మలందు మంత్రార్థానము వేదాభ్యాసము చేయుచు ఆయా సంస్కారములందు అనుష్ఠానములందు గురువులేకనే, తపోవాసనాబలముచే, అద్వితీయ మహిమాతిశయముచే మంత్ర బ్రాహ్మణముల పట్ల దక్షులగు మహానుభావులే మంత్రద్రష్టలనబడుచున్నారు. విప్రుల శాఖలతోపాటు వారి కొరకు అధర్వ సూత్రకర్తలు గోత్ర ప్రవరలను యేర్పరిచిరి.

హౌత్రసూత్రకర్తలు, ఆశ్వలాయన సాంఖ్యాయనులు, ఆపస్తంబ, బోధాయన, సత్యాషాఢ, హిరణ్యకేశ, భారద్వాజ, వైఖానస, అగ్ని వేశ్యలోగాక్షికాత్యాయనులు గోత్రప్రవర శాస్త్రకర్తలు.

విశ్వామిత్ర, జమదగ్ని, భరద్వాజ, గౌతమి, అత్రి, వశిష్ఠ, కశ్యపులు వైవస్వత కాలీన సప్తఋషులు, వీరలకు అగస్త్య, భృగువు, అంగీరసులు కలియగా వీరలెల్ల గోత్ర గణాదులకు ఆద్యులుగా మూలపురుషులుగా గోత్ర ప్రవరలందు కన్పించుచున్నారు. వీరలందరికి వేర్వేరు గణములు కలవు.

ప్రస్తుతము ఈ 'జమలాపురాన్వయము'నకు ఆధిపత్య ఋషి కశ్యపుడు. ఈ కశ్యపఋషి సాంప్రదాయములో ద్వార్షేయ 2 ఋషులు. త్రయార్షేయ 3 ఋషులు. పంచార్షేయ 5 ఋషులు. సప్తార్షేయ 7 ఋషులు.

గల ప్రవరలుండుట గోచరమగుచున్నవి. ఈ ప్రవరల ఋషులు దిగువ విధముగానున్నారు.

| | | |
|---|---|---|
| ద్వార్షేయ | : | కాశ్యప, వత్సార |
| త్రయార్షేయ | : | 1. కాశ్యప, వత్సార, దేవల |
| త్రయార్షేయ | : | 2. కాశ్యప, వత్సార, అసిత |

త్రయార్షేయ : 3. కాశ్యప, దేవల, అసిత

పంచార్షేయ : కాశ్యప, వత్సార, శాండిల్య, కాశ్యప, దేవల

సప్తార్షేయ : కాశ్యప, వత్సార, నైధ్రువ, రేభ, రైభ, శండిల, శాండిల్య

ఈ సప్తార్షేయ ఋషి గణ కూటమియే జమలాపురాన్వయ ప్రవర.

సప్తార్షేయ కూటమి కావుననే, ఈ వంశము మిక్కిలి శక్తివంతమగుటయేకాక, ఋషుల కరుణా కటాక్ష వీక్షణముల వలన ఈ వంశజులలో, భగద్భక్తి, పారమార్థిక చింతన, పుణ్య కార్యాచరణాసక్తి, కార్యశూరత్వము, ఐహిక భోగములు నశ్వరములను భావన, నిరంతరంబుజోదర పాదార విందచింతనామృతపాన విశేష చిత్త వృత్తి మున్నగు సద్గుణములు ప్రస్ఫుట మగుచుండుట కాననగును.

చిరంజీవ గోపాల కిషన్ రావు నందు పై గుణములు రాసీభూతము కాబడినవి. కావుననే "కృషితో నాస్తి దుర్భిక్షం" అను గీర్వాణోక్తి నిదర్శముగా "ధీరుల్ విఘ్ననిహన్యమానులగుచున్ ధృత్యున్నతోత్సాహులై ప్రారబ్ధార్థము లుజ్జగింపరు సుమీ ప్రజ్ఞా నిధుల్ గావునన్" అనుసుభాషితమునకనుకూలముగా విజ్ఞతతో, ధృఢ సంకల్పముతో కృషి సలుపు చిత్త వృత్తి ప్రస్ఫుటమగుచున్నది. తన పూర్వీకులు సంకల్పించి అసంపూర్ణముగా వదలి వేసిన కార్యమునకు రూపకల్పన చేసినారనుట పరమ సత్యము.

ఈ చిరంజీవికి, తాను సంకల్పించిన వ్యాసంగమునకు ఇతోధికశక్తిని గోపాలకిషన్‌కు యిష్టదైవమైన వేంకటనాథుడు ప్రసాదించు గాత అని మనసా, వాచా, కర్మణా ప్రార్థించుచున్నాను.

**శతమానంభవతి :**





# V. స్నేహం !

శ్రీ కందికుప్ప అప్పలాచార్యులు గారు
రాష్ట్రపతి అవార్డు గ్రహీత M.A., (Lit) M.Ed
పెదపెంకి (పోస్ట్), విజయనగరం (జిల్లా)

*ఆప్త మిత్రులు, M.Ed లో సహాధ్యాయులైన శ్రీ జమలాపురపు గోపాల కిషన్‌రావుగారికి అభినందనలతో...*

సీ. జమలాపురము వారిచైద దెల్పెడు నూత్న
చైతన్య దర్శిక జాలు వారం
గోపాల కృష్ణుని కూర్మి సాంధ్యాన
ఫలిత మందియు వంశఫలము గొనగ
స్నేహ సౌహార్దాల సీమ యౌ నాంధ్రాన
తెలుగు సౌజన్య దీప్తులు జెలంగ
ఏనాటి బంధమో ఈ ఉషః సమయాన
ప్రేరణమును చేసె ప్రీతి గొలిపి
నెయ్యుడా! నీవు నూరేండ్లు నిష్ఠతోడ
సాహిత్య సేవ చేయుచు సంస్మతిని
జనులకుపకారములు సేయు పనులొనర్చ
వేడుకొందును దేవుని వేడ్కతోడ

****



# VI. వంశవృక్షము అంటే !

- శ్రీ మాదిరాజు వెంకట్రామారావు గారు,
హైద్రాబాద్

దేశ చరిత్ర భావి పౌరులకు ఒక దిక్సూచిలాంటిది. చరిత్ర స్ఫూర్తినిస్తుంది. సరోజనిదేవి, ఝాన్సీలక్ష్మీ, మొల్ల మొదలగు స్త్రీ మూర్తుల చరిత్రలే నేటి స్త్రీ జాతికి స్ఫూర్తి. ఆ స్ఫూర్తితోనే నేటి యువతులు అన్ని రంగాలలో ప్రవేశిస్తూ వున్నారు. చరిత్రలు సృష్టిస్తున్నారు.

భారతదేశం ఒక అనువంశీకదేశం. ఈ దేశ చరిత్ర, సంస్కృతి పురాతనమైనది. కౌటిల్యునిరాజ నీతి నేటికి విదేశాలన్నీ ఆచరణలో పెట్టినవి. రాజులు గాని, పేదలు గాని, వారి వారి వంశాలకు పేర్లున్నవి. అవే లేకపోతే నేడు ప్రతాపరుద్రుడు, యుగంధరుడు, అక్కన్న, మాదన్నలు, పోతనామాత్యులు, తిక్కన మొదలగువారు ఎవరు అనే ప్రశ్న వుదయించేది. నావాడు, నా వంశీకుడు అని గర్వంగా చెప్పకొనే ఆస్కారం కరువయ్యేది.

అందుకే తన పూర్వజులు వంశ వృక్షాలకు ప్రముఖ స్థానం యిచ్చారు. "మీతాత డాక్టరు, ఇంజనీరు, సంఘ సంస్కర్త, గాయకుడు, చిత్రకారుడు మరి నీవేమౌతావు రా?" అని అడగడం ఆస్ఫూర్తిని కలిగించడానికే.

పూర్వకాలంలో సమిష్టి కుటుంబాలుండేవి. ఆర్థిక వొనరుల తరుగుదల కారణంగా సమిష్టికుటుంబాలు వ్యష్టికుటుంబాలై వంశీకులంతా ఎక్కడెక్కడో చెల్లాచెదరై చెప్పకోవటానికి కూడ చరిత్రలు కరువైనవి. వారి వారి తాతలతోనే వంశ వృక్షాలు వ్రాసుకొన్న వారనేకులు కొన్ని కుటుంబాలలో వారి ఋషులు, గోత్రాలు కూడ తెలియని వారుండటానికి అనేక కారణాలు, ప్రకృతి యంత్రాలు విధించిన శిక్షలకు పసికందులు, బాలురెందరో వారి వంశ చరిత్ర తెలియని వారున్నారు. అలాంటప్పడు వారి పిల్లలకు స్ఫూర్తి నిచ్చే వారెవ్వరూ? వారి పిల్లలకు స్ఫూర్తి నొసగే ఘనకార్యాలు, గాధలు ఏమి వుండవు. వంశ చరిత్ర, వంశాచారము ఒక 'లక్ష్మణరేఖ 'లాంటిది.

"ఎవరికి పుట్టిన బిడ్డ ఎక్కెక్కి ఏడ్వ?" అనే యీ రోజులలో తమ పూర్వీకుల ప్రేరణతో జమలాపురపు వారి వంశీకులు, వారితోసంబంధ బాంధవ్యాలు కలిగినవారు రాష్ట్రవ్యాప్తంగా వున్న వీరందరి పూర్వీకులు పుత్రులు, పౌత్రులు, కూతుళ్ళు, వారి విద్యావయస్సు, వారి తాత ముత్తాతలు, శాఖాపరంగా పూర్వీకుల ఘన చరిత్రలతో ఒక పుస్తకరూపమున ప్రచురించ తలపెట్టిన మా బావగారైన చి. జమలాపురపు గోపాలకిషన్‌రావు, యిందులోని సాధక బాధకాలు గుర్తించియు పూనుకున్నారంటే వారి ధృడ సంకల్పము, దీక్షకు నా శతసహస్రనమఃసుమాంజలులు.

ఒక నవల, నాటిక, కధానిక వ్రాయటం చాల తేలిక, కారణం పాత్రధారులు, సంకలనం, మలుపు వారి వారి వూహాజనితాలు. ఎవరి తోడ్పాటు అవసరం వుండదు.

ఎక్కడెక్కడో విసిరేయబడ్డ యీకుటుంబీకుల వృత్తి వుద్యోగ, పిల్లల విద్య వయస్సు

సంబంధీకుల వివరాలు నీ పుట్టిన తేది ఏమిటంటే సర్టిఫికెట్లు చూచి చెప్పే యీరోజులలో, గోత్రాలు సహితం మరిచేయీ రోజులలో యింతటి జటిల కార్యానికి శ్రీకారం చుట్టి ఎంతటి మానసిక శారీరక శ్రమలకోర్చి పట్టువిడువని విక్రమార్కునిలా 25 సంవత్సరాలకు పూర్వ సంకల్పమేయైనా 10 సంవత్సరాల నుండి దృఢ దీక్షతో అనితర సహాయం లేకుండా కాలికి బలపం కట్టుకొని తిరిగి, లేఖల రూపంలో సమాచారం సంపాదించి (7) శాఖలకు సంబంధించిన వారి వారి చరిత్రలతో పుస్తక రూపమిస్తునందుకు యీ వంశీకులందరు ప్రశంశించవలసిందే. ఎవరికి వారు గుండెలపైచేయి వేసుకొని నిమేత్రులై ఆలోచిస్తేయిదెంతటి దుస్తర కార్యమో అవగతమౌతుంది. దాదాపు 100 కుటుంబాలకు చెందిన యీ వంశ వృక్ష పుస్తకాన్ని అమూల్య ధనంగా భావించి తగిన మూల్యం చెల్లించి తమ స్వంతం చేసుకోవటం ఎంతైనా అవసరం, ఆచరణీయమని ఘంటా పదంగా చెప్పగలను.

ఇంతటి చిరస్మరణీయుమైన వంశ వృక్షమనే గుప్తధనాన్ని వెలికితీసి ఆవిష్కరిస్తునందుకు వారిని బహుదా కొనియాడుతూ, యీ శుభ సమయంలో వారికి ధన వస్తు వాహనాలు ఆయురారోగ్యాలు పుత్రపౌత్రాభివృద్ధిగా తమ కరుణా కటాక్షవీక్షణాలను సదా వారి వంశీకులపై ప్రసరింపచేయాలని యీ కలియుగ దైవమైన శ్రీవేంకటేశ్వరస్వామి వారిని ప్రార్థిస్తూ మా బావగార్కి నా హృదయపూర్వక శుభాభినందనలు.



చిత్రీకరణ :
జమలాపురపు చంద్రమౌళీశ్వరరావు



# VII. ఆశీస్సులు

V వ, శాఖ
10 వ, తరము

-శ్రీ జమలాపురపు రామకిషన్‌రావు గారు,
అడ్వకేటు, ఖమ్మం

నా సోదరుడు చి. జమలాపురపు గోపాల్ కిషన్‌రావు షష్టిపూర్తి సందర్భంగా అతనికి నేను తెలియజేయు ఆశీస్సులు మరియు శుభాకాంక్షలు

నేను ఎల్లుపాలెం గ్రామ కాపురస్తుడను. అదే గ్రామంలో నా ప్రాథమిక విద్యాభ్యాసం జరిగినది నాకు యిప్పుడు 84 సంవత్సరాల వయస్సు నడుస్తున్నది. అప్పటి నా సమకాలికులు మరియు సమపాఠకులలో శ్రీమతి మాడపాటి బుజ్జమ్మ (వరలక్ష్మిబాయి), శ్రీ హరి అనంత పద్మనాభశాస్త్రి గారు, శ్రీ చీదెళ్ల నాగభూషణం గారు శ్రీలంకా విశ్వనాధంగారు, శ్రీ కొప్ప రామయ్యగారు, శ్రీ హరి దీక్షితులు గారు, శ్రీ అయితపు గురుమూర్తి గారు శ్రీఅయితపు లక్ష్మయ్యగారు, శ్రీ జమలాపురపు శేషగిరిరావుగారు,
శ్రీ కొప్పమార్కండేయులుగారు, మరియు శ్రీ కొణతం సత్యనారాయణగారు, గతించినారు. ఇప్పుడు నాతోపాటు ఒకరు మాత్రమే అనగా శ్రీ హరి వెంకటప్పయ్య శర్మగారు వున్నారు.

నా సోదరుడైన గోపాలకిషన్‌రావు నా కన్నా చాల చిన్నవాడు. అతని విద్యాభ్యాసం సమయంలో నాకు తెలియదుగాని ఉద్యోగ సమయము నుంచి నాకు పరిచయము చి. గోపాలకిషన్‌రావు చదువు యందు శ్రద్ధగలవాడు. అతి ఆసక్తితో చదివి ఉన్నత విద్యలో ఉత్తీర్ణుడై పోస్టు గ్రాడ్యుయేట్ పట్టభద్రునిగా నమోదు అయినాడు. ఇతను తన ఉద్యోగ ధర్మమును అత్యంత శ్రద్ధతోను, మరియు నిజాయితీతోను నిర్వహించి సంఘంలో మంచి పేరు ప్రతిష్ఠలు మరియు పలుకుబడి సంపాదించుకున్నాడు. ఇతను తన ఉద్యోగవృత్తితోపాటు యితర సాంఘిక సేవలో కూడ ఆసక్తి ఏర్పరచుకున్నాడు. ఒకవైపు సమాజసేవ మరొక వైపు తన వంశమునకు సేవ చేయుటలో తగు వుత్సాహము చూపుచూ అహర్నిశలు పాటుపడుతున్నాడు.

ఇప్పుడు ఉద్యోగ విరమణ తదుపరి కూడ తన కృషి మానకుండా యిప్పటికి సంఘమునకు ఎనలేని సేవ చేయుచున్నాడు. అందులో ఒక భాగమైన వంశ వృక్షము తయారు చేసి, ఈ షష్టిపూర్తి సందర్భాన ఒక పుస్తక రూపంగా ప్రచురించదలచినాడు. ఇది సామాన్య విషయం. కాదు, గొప్పశ్రమతోను, వ్యయప్రయాసలతోను కూడుకున్న విషయం. అయినను చాల ధైర్య సాహసములతోను మరియు అతి ఉత్సాహంతోను అహర్నిశలు పాటుపడుతున్నందుకు నేను ఎంతో గర్విస్తూ యితనికి నా అభినందనలు మరియు శుభాకాంక్షలు తెలుపుతున్నాను. భగవంతుడు యితనికి చిరాయువు నిచ్చి సర్వదా రక్షించి, మేలు కలుగజేయగలందులకు ప్రార్థించుచున్నాను. ఇక ముందు కూడ యిలాంటి సేవలు అందించుచుండగలందులకు కోరుతున్నాను.

★ ★ ★

ఓం

# జమలాపురాన్వయ దర్శిని

('జమలాపురపు' వారి వంశము - జీవిత విశేషాలు)



శ్రీ జమలాపురం వేంకటేశ్వరస్వామివారు


గ్రంథకర్త :

జమలాపురపు గోపాల కిషన్ రావు

ఎం.ఏ., ఎం.ఇడి.,

ఎఱ్ఱుపాలెం - 507 201. ఖమ్మం జిల్లా (ఆం.ప్ర)

# C. పోషకులు



V/7 శ్రీ జమలాపురపు రామకిషన్‌రావు గారి కుటుంబం



VII/30 శ్రీ జమలాపురపు వెంకటరామనరసింహారావు గారు

# D. దాతలు



II/13 B శ్రీ ముక్కపాటి గోపాలకృష్ణమూర్తి
శ్రీమతి సత్యవాణి గార్లు



కల్వల సీతారామారావు గారు

| | |
|---|---|
| శ్రీ సుంకర రామ మోహనరావు గారు | హైద్రాబాద్ |
| V/51 F శ్రీ కందిబండ వెంకట్రావు గారు | విజయవాడ |
| V/51 G శ్రీ ఆదిరాజు వెంకట సుబ్బారావు గారు | ఎఱ్ఱుపాలెం |
| V/51 H శ్రీ బసవరాజు రామేశ్వరరావు గారు | ఇనగాలి |
| V/51 K శ్రీ నారపరాజు వరప్రసాదరావు గారు | కందిబండ |
| VI/8 శ్రీమతి జమలాపురపు పద్మావతి W/o. సత్యనారాయణరావు గార్లు | మోటమఱ్ఱి |
| VI/21 శ్రీమతి జమలాపురపు రమాదేవి W/o. రామకిషన్‌రావు గార్లు | నేలకొండపల్లి |
| VI/23 శ్రీ జమలాపురపు మార్కండేశ్వరరావు | ఖమ్మం |
| VI/28 F శ్రీ బండారు అచ్యుత రామారావు గారు | ఖమ్మం |
| VI/25 శ్రీ జమలాపురపు మాధవరావు గారు | హైద్రాబాద్ |
| శ్రీ కేసర రవికుమార్ గారు | విజయవాడ |
| శ్రీ బోడవరపు చంద్రశేఖర్‌రావు గారు | గుడివాడ |
| శ్రీ చిలకలపూడి రామమోహన్‌రావు గారు | గుంటుపల్లి |

# తదితర బంధుమిత్రులు



I/8 శ్రీ జ.కొండలరావు శ్రీమతి కామేశ్వరి గార్లు



I/10 శ్రీ జ.వెంకట నాగేశ్వరరావు శ్రీమతి నిర్మల గార్లు



I/14 డా॥ జమలాపురపు రామారావుగారి కుటుంబం



I/11B బొమ్మకంటి సీతమ్మ గారు



I/21 శ్రీ జ. రాధాకృష్ణ,
I/40K శ్రీ నామవరపు వెంకటేశ్వరరావు గార్ల కుటుంబాలు



I/27 C సంబరాజు వెంకటేశ్వరరావు గారు



I/28 జమలాపురపు గోపాలరావుగారి కుటుంబం

# తదితర బంధుమిత్రులు



I/26 శ్రీమతి జమలాపురపు నందమ్మగారు



I/29 శ్రీ జ. రామకిషన్‌రావు గారి కుటుంబం



I/31 శ్రీ జ. శ్రీకిషన్‌రావు గారి కుటుంబం



I/38 శ్రీ జ. వెంకటేశ్వరరావు గారు



I/40 డా॥ జ. సత్యనారాయణరావు గారు



I/46 శ్రీ జ. చంద్రమౌళేశ్వరరావు శ్రీమతి రాజ్యలక్ష్మి గార్లు





I/47 శ్రీ జ. శశిధరరావు గారు



II/9 శ్రీ జ. రామమోహనరావు గారు



II/9 లక్ష్మీబాయమ్మ గారు



II/10 సత్యనారాయణ వ్రతం సందర్భంలో
జ. నాగేశ్వరరావు, జగన్నాథ శర్మ గార్ల కుటుంబం

# తదితర బంధుమిత్రులు



II/12 శ్రీ జి. సత్యనారాయణప్రసాద్‌రావు శ్రీమతి ఉమాదేవి గార్లు



II/13 శ్రీ జి. శ్రీనివాసరావు గారు



II/13C శ్రీ నారపరాజు రామచంద్రరావు శ్రీమతి దుర్గ



II/15 శ్రీ జి. శ్రీనివాసరావు శ్రీమతి పద్మ గార్లు



II/16 శ్రీ జి. రవి కుమార్ శ్రీమతి మీనా కుమారి గార్లు



IV/22 శ్రీ జి. వెంకట్రావు శ్రీమతి అన్నపూర్ణమ్మ గార్లు



IV/40K శ్రీ జి. జగ్గరాజుగారి కుమార్తెలు



IV/51 శ్రీ జి. చినరామారావు గారి కుటుంబం



IV/52 శ్రీ జి. వెంకటేశ్వరరావు

# తదితర బంధుమిత్రులు



IV/47 శ్రీ జి.జగన్నాథ శర్మ పిల్లలు



IV/52H శ్రీ ఇల్లెందుల నాగరాజేశ్వరరావు శ్రీమతి శారద గార్లు



IV/47 అరకు లోయలో జగన్నాథ శర్మ మొ॥లైనవారు



IV/42 I శ్రీ బవిరిగండ్లపాటి మోహనరావు గారు



VI/ 58 P శ్రీ గోళ్ళమూడి సూర్యనారాయణరావు గారు



IV/56 C P శ్రీ మాడపాటి తిరుమలరావు హనుమంతరావు గార్ల కుటుంబం



IV/ 58 శ్రీ జి. చంద్రమౌళేశ్వరరావు గారు



IV/59 జి. శ్రీధర్ గారి కుటుంబం

# తదితర బంధుమిత్రులు



IV/61 A శ్రీ పెగళ్లపాటి వెంకటేశ్వరరావు శ్రీమతి లక్ష్మీబాయి గార్లు



IV/61 H శ్రీ జివియల్ నరసింహారావు గారు



IV/61 M డా॥ ఆదిరాజు సత్యనారాయణరావు గారు



IV/61 B శ్రీ గడ్డమరుగు వెంకటేశ్వరరావు శ్రీమతి భవానీ గార్ల కుటుంబం



IV/61 M శ్రీ ఆదిరాజు సత్యనారాయణరావు శ్రీమతి సుశీల గార్ల కుటుంబం

# తదితర బంధుమిత్రులు



IV/61 i శ్రీ గోవిందరాజుల మల్లికార్జునరావు శ్రీమతి శ్రీలక్ష్మి గార్లు



IV/61 i/1 జి. వంశీ మోహనకృష్ణ గారు



IV/61 i/2 జి. శ్రీనివాసరావు గారు



IV/61 i/3 జి. గోపి కృష్ణ గారు



IV/61J జి. వెంకటరమణ గారు



IV/61 K జి. శ్రీరామ చంద్రమూర్తి గారు



V/51 D శ్రీ ఆదిరాజు వెంకటరామారావు గారు





V/7 శ్రీ జమలాపురపు రామకిషన్‌రావు గారి కుటుంబం





V/26 శ్రీ జమలాపురపు రామనరసింహారావు దుర్గాంబ గార్లు



V51D శ్రీ ఆదిరాజు వెంకటరామారావు శ్రీమతి లలితాబాయి (చిట్టెమ్మ) గార్లు

# తదితర బంధుమిత్రులు



V/26 జమలాపురపు దుర్గాంబ గారి అక్కచెల్లెళ్ళు



V/26 జమలాపురపు రామనరసింహారావుగారి కుమార్లు



V/27 [illegible]



V/31 బేబి కృష్ణసాయి ఆశాకీర్తన



V/31 శ్రీ జి. శ్రీనివాసరావు శ్రీమతి శిరీష గార్లు



V/34 శ్రీ అయ్యదేవర నరసింహ పురుషోత్తమరావు గారి కుటుంబం



శ్రీ బసవరాజు లక్ష్మీనరసింహారావు గారి కుమారులు, కుమార్తెలు

# తదితర బంధుమిత్రులు



V/34 శ్రీ అయ్యదేవర పురుషోత్తమరావు గారి కుటుంబం



V/34 శ్రీకృష్ణుడుగా అయ్యదేవర పురుషోత్తమరావు, శ్రీమతి పద్మావతి గార్లు



V/34 శ్రీకృష్ణదేవరాయలుగా అయ్యదేవర పురుషోత్తమరావు గారు



V/40 A కుమారి సంధ్య
B.A Literature (Functional English)
**(State 1st Rank) Gold Medal**
Osmania University A.P.



V/41 శ్రీ జమలాపురపు రామేశ్వరరావు శ్రీమతి రాజ్యలక్ష్మి గార్లు

# తదితర బంధుమిత్రులు



V/42 శ్రీ జి. శ్రీనివాసరావు శ్రీమతి ఇందిరా గార్ల కుటుంబం



V/45 A శ్రీ డా॥ వర్దిపర్తి కామేశ్వరరావు శ్రీమతి అనురాధ గార్ల కుటుం



V/46 శ్రీ జమలాపురపు గోపాలకిషన్ రావు కుటుంబం



[illegible] శ్రీ [illegible] నరసింహారావు శ్రీమతి రమాదేవి గార్ల కుటుంబం



V/46 శ్రీ మాటూరి నరసింహారావు శ్రీమతి సీతమ్మ గార్లు



V/50A [illegible], యస్. రమేష్, [illegible] సాయి కృష్ణ
[illegible] కృష్ణ యమ్. కమలాకర్, యస్. సత్యనారాయణ



IV/46 గోపాల కిషన్‌రావు, శ్రీ పెనుపాక కమలాకర్ గారు

# తదితర బంధుమిత్రులు



V/56 A మాదిరాజు వెంకట పేరమ్మ జి. దుర్గాంబ గార్లు



IV/46 A శ్రీ జమలాపురపు గోపాలకిషన్ రావు కుటుంబం



IV/46 A జమలాపురపు గోపాలకిషన్ రావు కుటుంబం



V/51 [illegible]



[illegible]



V/51 I [illegible]



V/51 F శ్రీ కందిబండ లక్ష్మీ నరసింహారావు గారి కుటుంబం



V/51 F కందిబండ సాయి వెంకట లక్ష్మీ నరసింహ సాకేత రాజు

# తదితర బంధుమిత్రులు



V/57 జి. లక్ష్మీ నరసమ్మ గారు



V/61 జె.వి. రామారావు గారు



V/62A జె.ఆర్. నరసింహరావు గారు



V/69 జి. రంగనాయకమ్మ గారు



V/70 శ్రీ జి. వేణుగోపాల్ విఠల్ గారి కుటుంబం



V/74 B శ్రీ కీసర పవన్ కుమార్ గారు



VI/8 శ్రీ జి. సత్యనారాయణరావు గారు



VI/8 శ్రీమతి జి. పద్మావతి గారు



VI/14A శ్రీ మాదిరాజు శ్రీనివాస్ శ్రీమతి ఛాయారూపిణి గార్లు



VI/14A శ్రీ గొర్తివర్తి యోగానందం శ్రీమతి జానకి గార్లు



VI/8 శ్రీ జి. సత్యనారాయణరావు గారి కుటుంబం





# సంపాదకీయం

శ్రీ జమలాపురపు నారాయణరావు గారు
రాజా అండ్ కో, సికింద్రాబాద్

వంశవృక్షమని ఎందుకంటారు? వృక్షం ఏవిధంగా శాఖోపశాఖలుగా విస్తరిల్లుతుందో అలాగే వంశం కూడా శాఖోపశాఖలుగా విస్తరిస్తుంది. విత్తు, చెట్టు తన జాతిని, ధర్మాన్ని మార్చుకోనట్లే వంశం కూడా తన వంశ నామాన్ని మార్చుకోలేదు. వృక్షానికి వేరు, కాండం ఎట్లో వంశానికి మూలపురుషుడట్లే అదే వంశానికున్న బలం, కీర్తి. ఒక వంశానికి చెందిన వారు ఏప్రాంతానికి తరళి వెళ్లినా వార్రై తన జన్మ స్థలాన్ని, వంశాన్ని ఎంతో ఆర్ద్రతతో చెప్ప కోవాలని పించటం సహజం. తన వారిని, తన వారి పూర్వ ఔనత్యాన్ని చెప్పకొని మురిసి పోవటం భారతీయ సంస్కృతికి చిహ్నానము. ఏ దేశానికి లేని నమ్మకం, తృప్తి, ఔదార్యము, ధర్మం, దాతృత్వము, సేవా భావం, దయ, నైతిక సైర్యము, మొదలైన సాంప్రదాయాలు భారతీయుల సొత్తు. వంశం ఓ శిలాక్షరంగా, లక్ష్మణరేఖగా భావిస్తారు.

ఎంతో కీర్తి ప్రతిష్ఠల నార్జించిన రఘువంశీయుడు భరతుడు. ఆ పేరుతో ప్రసిద్ధి చెందిన ఈ దేశం అంతటి కీర్తి ప్రతిష్ఠలనార్జించి భారత దేశంపు అనువంశీకం ప్రపంచ దేశాలకు గర్వకారణంమ్పైంది. ఆలాగే ఈ దేశాన్ని అనేక వంశీకులు పాలించారు. చాళుక్యులు, ఇక్ష్వాకులు వారి వారి వంశకీర్తి చిరస్థాయిగా నిలిపారు.

తదనుగుణంగా, ఆనూచానంగా వస్తున్న భారతీయ సంస్కృతి, సాంప్రాదాయాలకు ఎంతో కొంత అద్దం పడుతుందని చేసిన చిరు ప్రయత్నమే యీ 'జమలాపురాన్వయ దర్శిని'. నా వంశీకుడు చి. జమలాపురపు గోపాలకిషన్‌రావు భగీరథప్రయత్నంతో చేసి దృఢ సంకల్పంతో ఈ 'జమలాపురాన్వయదర్శిని' ని ప్రచురించినందుకు నా శుభాకాంక్షలు. నా యీ ౮౫ సంవత్సరాల వృద్ధాప్యదశలో, ఆ భగవంతుడ్ని వారికి వారి పుత్రపౌత్రులకు శుఖ, శాంతులు సకలైశ్వర్యాలు ప్రసాదించమని మనసా వాచా ప్రార్థిస్తున్నాము.

* * * * *




**డాక్టర్. తుర్లపాటి కుటుంబరావు, F.A.B.I. (USA),**
జర్నలిస్ట్

డా. తుర్లపాటి కుటుంబరావు స్ట్రీట్, లబ్బీపేట,
విజయవాడ - 520 010 ఫోన్: 476000


RECIPIENT OF :

"INTERNATIONAL MAN OF TH YEAR"
Award (England)

"GUINNESS BOOK"
Felicitation
(Highest number of Public Speeches)

"WORLD LIFETIME ACHIEVEMENT AWARD"
(America)

"NATIONAL CITIZEN AWARD" (Delhi)
(In journalism, arts, culture and literature fromPrime Minister of India)

"OUT STANDING MAN OF 20th CENTURE" (U.S.A)

Honorary Doctorate
"KALA PRAPOORNA"
By Andhra University

"2000 MILLENNIUM MEDAL OF HONOUR"
(America)

## తుర్లపాటి మాట

"మీ గోత్రమేమిటి?" అంటే నోరు వెళ్లబెట్టి, మా నాన్నను అడిగిచెబుతా ననేవారు ఈ రోజులలో చాలామంది ఉన్నారు!

అలాగే కొన్ని మతవిషయిక కార్యక్రమాలు నిర్వహించేటప్పుడు తండ్రిపేరు మాత్రమే కాకుండా, తాతముత్తాలపేర్లు కూడా అవసరమౌతాయి. అలాంటి సమయాలలో తండ్రి, తాత పేరు తెలియని వారు చాలామంది ఉన్నారు. తెలిసినా, జ్ఞాపకం రాక, తడుముకునే వారు అనేక మంది!

మన పూర్వీకులనుంచే మనంవచ్చాం! అలాగే మనవంశానికి మూలపురుషుడు, ఆ వంశపరంపరలో వంశోద్ధారకుడు, వంశం పేరుప్రతిష్ఠలు నిలబెట్టిన వారు కొందరు, పెంపు చేసినవారు మరెందరో! వారందరి గురించి తెలుసుకుంటే మనకు స్ఫూర్తి కలుగుతుంది, ఆనందం కలుగుతుంది. వారి చరిత్రలోని ఉజ్వల ఘట్టాలను గురించి తెలుసుకున్నప్పుడు ఉద్వేగం, ఉత్సాహం కలుగుతాయి. వారి పేరు నిలబెట్టాలన్న పట్టుదల, వారంత కావాలన్న తపన, వారిని మించిపోవాలన్న వాంఛనీయమైన స్పర్థ కలుగుతాయి!

అయితే, మన వంశ వృక్షం ఏది? మన తాతను దాటి, ముత్తాత, ఆయన తండ్రి, ఆయన తాత, ఆయన గారి తాత.....

వీరి పేర్లు ఎవరికి తెలుసు? ఎందరికి తెలుసు? ఉదాహరణకు, మా వంశలో తుర్లపాటి వాసుదేవమూర్తి గారనే ఆయన మేజిస్ట్రేటుగా పనిచేశారు. ఆయన న్యాయనిరతిని పరీక్షించదలచి, ఆయన ఉద్యోగ ధర్మంలో శిక్షించబడినవారు కొందరు, ఈయన భార్యకు కూడా శిక్ష వేయగల న్యాయదీక్షాపరుడా? అన్న ఈసడింపు తో ఒక న్యూసెన్సుకేసులో ఆమెను ఇరికించి, కోర్టులో కేసువేశారు. కేసును విచారించిన ఆయన సాక్ష్యాధారాలను బట్టి అమెను నేరస్తురాలిగా నిర్ధారించి,

ఆరోజులలో పావలా (ఇప్పుడు 25పైసలు) జరిమానా విధించారు! న్యాయపీఠంపై కూర్చున్న భర్తను అడిగి, పావలా తీసుకుని, జరిమానా చెల్లించి వెంటనే ఇంటికి వెళ్ళి ఆ అవమాన భారాన్ని భరించలేక నూతిలోపడి ఆత్మహత్య చేసుకున్నది! శిక్ష పడింది ఆమెకా? ఆ మెజిస్ట్రేటుకా? ఇది దాదాపు రెండు వేల సంవత్సరాల నాడు విజయవాడను పరిపాలించిన మాధవవర్మ అనే మహారాజు నేరం చేసిన తన కుమారుడినే ఉరి తీయించిన ఉదంతాన్ని జ్ఞాపకం చేస్తుంది!

వారి తరువాత వారి వంశాలలో జన్మించిన వారి వంశీకులకు ఈ సంఘటనలు ఎంత ఉత్తేజదాయకం! మరెంత గర్వకారణం! వారి అడుగుజాడలలో తాము కూడా నడవాలనే స్ఫూర్తిని కలిగించవా?

అయితే, ఈ చరిత్రలు చెప్పే వారెవ్వరు? ఈ వంశవృక్షాలను, ఆవంశాలలోని వటవృక్షాల వంటి వారిని గురించి తెలియజెప్పే వారెవ్వరు?

మన వంశవృక్షాలను గురించి వ్రాసే వారు చాలా తక్కువ మంది. వీరు మైలురాళ్ళువలె అక్కడక్కడ కనిపిస్తారు.

ఎందువల్లనంటే, వంశవృక్ష చరిత్ర రాయడం సులభంకాదు. అందుకు ఎంతో శ్రమకావాలి. ఆ వంశం పూర్వీకుల చరిత్రలను జాగ్రత్తగా, పొరపాట్లు లేకుండా సేకరించే ఓపిక, దీక్ష, పట్టుదల ఉండాలి. వంశవృక్ష చరిత్రను సేకరించిన తరువాత దాన్ని ముద్రించి, వెలుగులోకి తీసుకురాగల ఆర్థిక స్తోమతను సమకూర్చుకోగలగాలి!

కాగా, ప్రతివంశం ఎప్పుడో ఒకప్పుడు ఆ వంశీకుల కొందరి ప్రఖ్యాతితో ప్రసిద్ధమౌతుంది. ప్రతి వంశంలోను అందరూ కాకపోయినా, కొందరు ఏదో రంగంలో లబ్ధప్రతిష్ఠులైన వారుంటారు. వారు ఆ వంశప్రతిష్ఠను అజరామరం చేస్తారు.

అట్టి వంశాలలో జమలాపురం వారిది ఒకటి. జమలాపురం అనగానే ఖమ్మంజిల్లాలోని ఒక గ్రామం పేరే కాక తెలంగాణా స్వాతంత్ర్య పోరాట యోధుడు - మహాకవి దాశరథి పలుకులలో - స్వాతంత్ర్య దేవాలయ గోపురం సర్దార్ జమలాపురం కేశవరావు జ్ఞాపకం వస్తారు.

ఈ వంశ చరిత్ర పుటను వెదికితే, ఎన్నో ఆసక్తి కరమైన కథలు, గాథలు కానవస్తాయి. ఎందరో చరిత్ర సృష్టికర్తలు కనిపిస్తారు. ఈ వంశమూలపురుషుడు పెద్దిరాజు గారే ఒక చరిత్ర సృష్టికర్త. ఆ తరువాత ఆ వంశంలో ఎందరో మహానుభావులు! మరెందరో మహాత్ములు జన్మించి తమ వంశాన్నే కాక, తెలంగాణా ప్రాంతాన్నే పునీతం చేశారు.

కాగా, శ్రీ జమలాపురం గోపాలకిషన్‌రావు గారు మహత్తరమైన తమ వంశీకుల చరిత్రను గ్రంథస్తం చేసి, భావితరాలకు, ఈ తరం వారికి సమర్పిస్తున్నారు. ఇందుకు వీరు ఎన్నో సంవత్సరాలుగా కృషి చేశారు. తమ వంశీకులలో మిగిలిన వృద్ధమూర్తులను కలుసుకుని, వారివి, వారి పూర్వీకులవి ఎన్నో ఆసక్తి కరమైన విషయాలు సేకరించారు. వారిచేత వ్యాసాలు వ్రాయించారు. వీరిలో మహాకవి దాశరథి నిజాం సంస్థాన నాయకులు విమోచనోద్యమ సర్దార్ స్వామిరామానందతీర్థ మొదలైన మహామహుల వ్యాసాలు, ఆయా జమలాపురం వంశీకులలో ప్రముఖమైన వారి రచనలు ఈ గ్రంథానికి ఒక ప్రత్యేకాకర్షణ!

దీనివల్ల కేవలం జమలాపురం వంశవృక్ష విశేషాలు మాత్రమే కాక, ప్రసిద్ధమైన మాడపాటి, ఆదిరాజు, అయ్యదేవర, బసవ రాజు మొదలైన వంశీకులలో లబ్ధప్రతిష్ఠులైన వారి ప్రసక్తి మాత్రమే కాక, జమలాపురం వారి సన్నిహిత, సంబంధిత బాంధవ్యుల ప్రస్తావన కూడా కానవస్తుంది. ఈ గ్రంథం కేవలం ఒక వంశవృక్షంలోని పేర్ల పట్టిక కాదు. ఇది సమాకాలీన చరిత్ర గ్రంథంగా కూడా ఉపకరిస్తుంది. అలనాటి తెలంగాణా చరిత్రతోపాటు, అప్పటి ఆచార వ్యవహారాలు, సంస్కృతీ మర్యాదలకు ఈ గ్రంథం దర్పణం.

ఈ గ్రంథానికి వంశవృక్ష మని కాక, "జమలాపురాన్వయ దర్శిని" అని పేరు పెట్టడం అత్యంత సముచితంగా ఉంది. ఈ విజ్ఞాన సేకరణ కర్త జమలాపురపు గోపాలకిషన్ రావు గారు సౌజన్యమూర్తి, అత్యున్నత విద్యావంతులు. క్షీణించిపోతున్న మన ఉత్తమ సంస్కృతీ జీవనానికి ప్రతీక. మృదు స్వభావి. వీరు నివసించే ఎఱ్ఱుపాలెం గ్రామానికి ఆంధ్రప్రదేశ్ అవతరణ నాటి నుంచి - ( ౧౯౫౬ నవంబర్ ౧ వ తేదీ నుంచి )- ఈనాటి వరకు గ్రామాధికారిగా ఉన్న జమలాపురపు రామేశ్వరరావు గారు ఉద్దండుడు. ఆ ప్రాంతానికి వీరి కుటుంబం తలమానికం.

గోపాలకిషన్‌రావు గారి ఈ మహత్తర కృషి నేను అభినందిస్తున్నాను. అంతే కాదు - మరికొన్ని వంశవృక్షాల చరిత్రల రచనకు గోపాలకిషన్‌రావు గారి ఈ గ్రంథం ప్రోదిచేయగలదని ఆశిస్తున్నాను. ఈ గ్రంథం మనపూర్వీకుల జీవన విధానాన్ని తెలుకొనడానికి మార్గదర్శి. ప్రతి గ్రంథాలయంలో ఉండదగిన చారిత్రక గ్రంథం.

- కళాప్రపూర్ణ, డాక్టర్. **తుర్లపాటి కుటుంబరావు**

* * * * *

సాధుత్వాన్ని పెంచుకోవాలి. సాధువునగా కేవలం కాషాయ వస్త్రలు వేసుకున్నవారు మాత్రమే కాదు, వేషం వేసుకున్నంత మాత్రాన ప్రయోజనం లేదు. పవిత్రమైన భావాలను పెంచుకోవాలి. పవిత్రమైన భావాల ద్వారానే సాధుత్వం వ్యక్తమవుతుంది. మనము సాధువులు కానక్కర లేదు. వేషాలు ధరించనక్కర లేదు. హృదయాన్ని పవిత్రం గావుంచు కుంటేచాలు. రావణాసురుడు కూడ సాధువేషం ధరించాడు. కాని సీతను అపహరించాడు. ఇక్కడ వేషమా ? దుష్టగుణమా ఏది ప్రధానం ? మొదలు మనలో వున్న దుర్గుణాలను దూరం చేసుకొని, ఇతరులకు ఏ కించిత్ ఉపకారము చేసినా, అదే గొప్పగా అభివృద్ధి అవుతుంది. మన భావాలు మారకుండా ప్రచార ప్రభోధాలెన్ని చేసినా ప్రయోజనం లేదు. పవిత్ర భావాలతో హృదయాన్ని భద్రం చేసుకొని తగిన సాధనాలు సలపాలి.

'బాబా'

శ్రీవాణి మాసపత్రిక నుంచి

* * * * *





# అభినందనలు




**శ్రీ కొమరగిరి కృష్ణమోహన్‌రావు గారు**
**శ్రీవాణి సంపాదకులు**

శ్రీ జమలాపురపు గోపాలకిషన్ రావు గారు జమలాపురపు వారి వంశవృక్ష వివరాలు జమలాపురాన్వయదర్శిని పేర ఒక పెద్దగ్రంథమును ముద్రించి నందులకు వారిని ప్రత్యేకంగా అభినందిస్తున్నాను. ఇది సామాన్యమైన విషయము కాదు. ఇది ఒక పరిశోధనా గ్రంథము వంటిది. ఒక వంశవృక్ష వివరాలు సేకరించటం అంత తేలికకాదు. ఇంత పెద్ద గ్రంథమును వెలుగులోనికి తీసుకొనిరావటానికి వెనుక నున్న కృషి ఎంతటిదో ఆలోచించగలిగిన వారికి మాత్రమే బోధపడుతుంది.

జమాలపురపు వారి వంశం త్యాగధనులకు నిలయం. కీ.శే. జమలాపురపు కేశవరావుగారు తెలంగాణా సర్దార్ గా పేరు ప్రఖ్యాతులనందుకున్నారు. కీ.శే. మాడపాటి హనుమంతరావుగారు జమలాపురపు వారి మనుమడే. వీరు ఆంధ్రప్రదేశ్ తొలి శాసనమండలి ఛైర్మన్‌గా మంచి పేరు తెచ్చుకున్నారు. జమలాపురపు వారు మాకు అత్యంత ఆత్మీయులు, బంధువులు. ఆ కుటుంబాలతో మాకు మంచి సంబంధబాంధవ్యాలు కూడా ఉన్నాయి. పలు పర్యాయములు వారి స్వగ్రామమైన ఎఱ్ఱుపాలెం వెళ్ళి వారి ఆతిధ్యం స్వీకరించే అవకాశం కూడా నాకు లభించింది. వారి ఆరాధ్యదైవము, తెలంగాణా తిరుపతిగా పేరు గాంచిన జమలాపురం వెంకటేశ్వరుని దర్శించే మహద్భాగ్యం కూడా కలిగింది. అటువంటి ఉన్నత, ఉత్తమ వంశ చరిత్ర అందించిన శ్రీ గోపాలకిషన్‌రావు గారు నిజంగా ధన్యజీవి. వారికి నా కృతజ్ఞతలు.

సమిష్టికుటుంబవ్యవస్థ ఛిన్నాభిన్నమైన ఈతరుణంలో ఈ గ్రంథం సమాజానికి మంచి స్ఫూర్తినియిస్తుంది. విశాల భావాలను ప్రోత్సహిస్తుంది. సమైక్యతను, సంఘీభావమును పెంపొందిస్తుంది. వ్యష్టిక్షేమం సమిష్టిమీదనే ఆధారపడి ఉంటుంది. సమిష్టి సంక్షేమం సమాజక్షేమం మీద ఆధారపడి ఉంటుంది. సమాజ.శేయస్సు దేశ సంక్షేమం మీద ఆధారపడి ఉంటుంది. కనుక దేశ క్షేమమే దేహక్షేమం అని పలికిన భగవాన్ శ్రీ సత్యసాయిబాబా వారి మాటలలోని సత్యమును ప్రతి ఒక్కరు గుర్తించాలి.

శ్రీ గోపాలకిషన్‌రావు గారిని మార్గదర్శకంగా తీసుకొని, వారి అడుగు జాడలలో మిగతా వంశీయులు కూడా నడచి, వారి వారి వంశవృక్షాల చరిత్రలను పరిశీలించి, పరిశోధించి, భావితరాలకు అందించగలిగిన రోజున సమాజానికి మంచి చేకూరుతుంది. భావితరాలవారు వారి వారి వంశములలోని మహనీయుల చరిత్రలను తెలుసుకొని స్ఫూర్తిని పొంది సమాజ కళ్యాణానికి దోహదపడడానికి అవకాశం ఏర్పడుతుంది. కనుక ఇటువంటి మహత్తర ప్రయత్నానికి నాంది ప్రస్తావన చేసిన శ్రీ గోపాలకిషన్‌రావు గార్ని మనఃస్ఫూర్తిగా అభినందిస్తున్నాను.

* * * *

హైదరాబాదు
తే: 28-1-2000

**తెలుగుబాట**

ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం గారు.
తెలుగుశాఖాధిపతి
ఫార్మర్ డీన్ స్కూల్ ఆఫ్ ఓపెన్ యూనివర్సిటీ,
శ్రీవాణీ 1-8.702/105 నల్లకుంట
హైదరాబాదు - 500 013.

ఒక్కోవంశానికి ఒక్కోపేరుంటుంది. 'జమలాపురం' వారికి 'ఇదం బ్రాహ్మం ఇదం క్షాత్రం' అనే కీర్తి ఉంది. తెలంగాణంలో తన ముద్రవేసుకున్న ఇంటిపేరు జమలాపురం. ఆవంశ చరిత్రను నిర్మించే ప్రయత్నం ప్రశంసనీయం.

ఈ రోజుల్లో తాతగారి పేరు మనవళ్లకు గుర్తుండటం లేదు. కనీసం మూడు తరాల మగవాళ్ళు నాలుగుతరాల ఆడవాళ్లు ఉన్న తెలుగుకుటుంబాలను ఇదివరలో పుణ్యక్షేత్రాల్లా దర్శించేవారు. వేరు కుంపట్ల ఈనాటి సంస్కృతిలో ఆ సమ్మిళిత ఏకోశాన కనపడటం లేదు. అయినా, ఆ సంస్కృతి మీద అభిమానం మాత్రం ఇంకా కొన ఊపిరితో సాగుతూనే ఉంది. వంశంమీద, వంశచరిత్రమీద, వంశసంస్కృతి ఆదరగౌరవాన్ని కలిగించే విశిష్ట ప్రయత్నం 'జమలాపురాన్వయదర్శిని'.

వంశానుచరితం, వంశచరిత్ర, వంశవృక్షం, వంశదర్శిని - ఈ పేర్లన్నిటికీ ఆయావిలువలూ అర్థాలు ఉన్నాయి. వేదధర్మాన్ని ఒకవంశంలో ఆయావ్యక్తులు ఏయే త్యాగాలు చేసి రక్షించి పోషించారో చెప్పేది వంశానుచరితం. పురాణపంచ లక్షణాలలో అదిఒకటి. వంశంలో చతుర్విధ పురుషార్థసాధకంలో విశేషవిఖ్యాతి గాంచినవారి చరిత్రను ప్రధానంగా చెప్పేది వంశచరిత్ర. వంశంలో ప్రయోజకులను గురించి వివరిస్తూ వంశాన్ని అవిచ్ఛిన్నంగా ముందుకు సాగించిన వ్యక్తులను తరతరాలుగా పరిచయం చేసేది వంశవృక్షం. వంశంలో స్త్రీపురుష వంశాలకు సంబంధించిన వివరాలను అందించేది వంశదర్శిని. వంశదర్శిని ప్రాథమికమైన వివరాల పట్టిక ప్రధానంగా వెలువడేది. అది అన్నిరకాల చరిత్రలకూ వెన్నెముకలాంటిది. దానిని తయారుచేసిన శ్రీ జమలాపురం గోపాలకిషన్‌రావుగారు పితృ ఋణాన్ని తీర్చుకున్నారు. వంశంలోని కొందరినిగురించి వివరించే వ్యాసాలు వ్రాయించి దానికి వన్నె పెట్టించారు. సమాచార ప్రధానమైన ఆధునిక జీవితానికి అత్యంతం ఉపయోగపడేది ఈ గ్రంథం.

పూర్వం వంశపురాణాలు ఉండేవి. కులాలకు వేరేపురాణాలు ఉండేవి. ఆవంశ మూలపురుషులను, కులదైవాలను గమనిస్తే ఆవంశమూలస్వభావం ప్రధానంగా ప్రత్యక్షమౌతుంది. ఈ స్వభావం తెలుసుకొనటానికి ఈ గ్రంథం బాగా తోడ్పడుతుంది.

ఏమంచి జరిగినా, చెడు జరిగినా ఒక వ్యక్తి చరిత్రలో అతని తల్లిదండ్రులను గురించి, వంశాన్ని గురించి లోకులు గుర్తు చేసుకుంటారు. ప్రపంచాన్నంతా తెలుసుకుంటూ, సొంత వంశాన్ని గురించి ఓనమాలు కూడా దిద్దుకోని నేటి కొంత మంది యువతరానికిక ఈ గ్రంథం మార్గదర్శకం కాగలదని ఆశిస్తున్నాను. శ్రీ జమలాపురపు గోపాలకిషన్ రావుగారి కృషిని మనసారా అభినందిస్తున్నాను.

* * * * *

# సుదర్శనము

దిః 14-12-1999.

ప్రొఫెసర్ ముదిగొండ శివప్రసాద్ గారు ఎం.ఎ.పి.హెచ్.డి
శివకవీంద్ర - చారిత్రక నవలా చక్రవర్తి - బిరుదాంకితులు
2-2-647/132-బి. సెంట్రల్ ఎక్సైజు కాలనీ.
హైదారాబాద్ - 500 013

భారతీయులకు చారిత్రక దృష్టి లేదనే ఒక అపప్రధమవుంది. నిజానికి మన పురాణములన్నీ చరిత్రలే - శాసనములన్నీ చరిత్రలే- కైఫీయతులన్నీ చరిత్రలే- ఐతే భారతీయులు నమ్రతాప్రభావంతులు గొప్పలు గోరింతలు కొండంతలు చేసి చెప్పకోలేరు. పాశ్చాత్యులు ఆ పని చేశారు - ఆంగ్లో సాక్సన్‌యుగానికి ముందు బ్రిటిషు చరిత్ర ఏమిటి ? వారి పూర్వపురుషులంతా ఎవరు ? బందిపోటు దొంగలు - కొండగుహలలోని ఆదిమానవులు- కాని మన పూర్వీకులు ఎవరు ? ఋషులు.

ఈ గ్రంథములో జమలాపురము వారి చరిత్ర అందినంతవరకు సేకరించి ప్రకటించే ఒక ప్రయత్నము జరిగింది. జమలాపురం కేశవరావుగారు జగత్ప్రసిద్ధుడు. ఒక్కొక్కవ్యక్తి వల్ల మొత్తం వంశం వెలుగులోకి వస్తుంది. శ్రీఅయ్యదేవర పురుషోత్తమరావు గారు అంతర్జాతీయ కీర్తి నార్జించిన మహానటులు. నాకు ప్రియమిత్రులు. జమలాపురపు హరగోపాల్ బ్రిటనులోని ప్రముఖవైద్యుడు. మేము బ్రిటను వెళ్ళినప్పుడు మాకు ఎన్నోదినములు అతిథ్యమునిచ్చి ప్రయాణసౌకర్యము కల్పించిన సహృదయుడు. ఈ గ్రంథములో జమలాపురము వారిలో గల యోగులు. కార్యదక్షులు. స్వాతంత్ర్య సమరయోధులు మొదలైన వారి సమాచారమెంతో ఉన్నది. ఆయా వంశములవారి (తరములను) వివరములను పొందుపరుచుటలో గ్రంథకర్త శ్రీ గోపాలకిషన్‌రావు సఫలీకృతుడైనాడు. ఇది చాలా శ్రమతో కూడినపని. పరిశోధకులకు కూడా అవసరమైనది. ఈ దర్శిని సుదర్శనము. అనగా మంచి చూపు. కేవలం జమలాపుర వంశస్థులే కాక పరిశోధక విద్యార్థులకు కూడా ఇది ఉపయుక్త గ్రంథము కాగలదని ఆశించుచున్నాను.

ప్రమాథి - మార్గశిరం
హైదరాబాదు.

* * * * *







సర్దార్ జమలాపురం కేశవరావు గారు

శ్రీ హీరాలాల్ మోరియా గారు
మోహన్‌రోడ్, ఖమ్మం

ఆత్మీయమిత్రులు
శ్రీ జమలాపురపు గోపాలకిషన్‌రావు గారికి,
ఎల్లుపాలెం.

మీ లేఖ అందింది 'జమలాపురాన్వయదర్శిని' ని ఇప్పటి వరకు ముద్రితమైన మ్యాటర్‌ను చూచాను. ఇది అంతంతమాత్రపు కృషికాదు, వేరెవరూ చేయలేనిది కూడా. అయితే వెంటనే నా వ్యాసాన్ని పంపుదామనుకున్నా, నా ఆరోగ్యరీత్యా అది సాధ్యం కాలేదు. ఎలాగో వ్రాసి తెలుగు వ్రాత ప్రతిని మీకు పంపుతున్నాను.

సర్దార్ కేశవరావును గురించి కొన్ని అంశాలను నా స్మృతిపథంలోకి వచ్చిన వాటిని జోడించి వ్యాసం రాశాను. స్వీకరించగలరు.

# మహాపథికుడు - సర్దార్‌జీ

సర్దార్ జమలాపురం కేశవరావు జీవితమే ఒక మహోద్యమం. ఆయన జీవితాన్ని గురించి సింహావలోకనం చేసినప్పుడు, అతడెంతటి ఉన్నతుడో మనకు అర్థమౌతుంది. కళాశాల జీవితాన్ని అర్ధంతరంగానే ముగించుకొని, తండ్రిగారి ప్రోత్సాహం మీద ఉద్యోగంలోనికి ప్రవేశించాడు.

ప్రభుత్వోద్యోగం, అందలి బాధ్యతలు, ఆనాటి అధికారుల ప్రవర్తన, పరిస్థితులు ఆయనకు ఎంతమాత్రం నచ్చలేదు. ఎక్కువ కాలం ఉద్యోగం కొనసాగించలేక, స్వచ్ఛందంగా పదవీ విరమణ చేశారు. ఆ ఉత్తర క్షణంలోనే తనకు తాను ప్రజాసేవకు అంకితం చేసుకున్నాడు. స్వాతంత్ర్యపోరాటం రోజుల్లో ప్రమేయం కలిగించుకున్న ఆర్యసమాజం, ఆంధ్ర మహాసభ, కాంగ్రెస్‌పార్టీలతో సన్నిహిత సంబంధం కలిగించుకొని పని చేయసాగారు.

నిజాం రాష్ట్రంలో ఆనాటి పల్లెసీమల్లోని నిరుపేద ప్రజానీకాన్ని వెట్టి చాకిరీ పేరుతో వాళ్ళ శారీరక, మానసిక శ్రమ సంపత్తులను దోచుకొనటానికి ప్రత్యేకంగా ఏర్పడ్డ ఒక పెత్తందారీ వ్యవస్థ బలంగా ఉండేది. పేదవాడు, ఆ గ్రామ పెత్తందార్లు, జమీందార్లు, జాగీర్దార్ల కనుసన్నల్లో కనీసం కాలికి చెప్పులు గానీ ఒంటికి బట్టలు

గానీ ధరించడానికి వీలులేదు. వాళ్ళ ఇళ్ళల్లో ఏ పెండ్లయినా, శుభకార్యమైన మొట్టమొదటి సారిగా, పెత్తందార్ల ఇండ్లకు కాలినడకన మేళతాళాలతో వెళ్ళి వారికి ముడుపులు, మొక్కులు చెల్లించుకోవాల్సి వచ్చేది. గ్రామాధికారులు కూడా ప్రభుత్వాధికారులు, జమీందార్లు, జాగీర్దారుల అండతో తిరుగులేని జులుంను చలాయించేవారు. ఈ దోపిడి పరిస్థితి పెత్తందార్ల దౌర్జన్యచర్యలను గమనించిన సర్దార్ నెత్తురు ఉడుకెత్తింది. కన్నులు క్రోధావేశాలతో ఎర్రబడేవి. ఆ విపరీత అమానుష దోపిడీ చర్యల్ని నిరసిస్తూ జమీందార్లు, జాగీర్దార్లు, ఇతర పెత్తందార్లకు వ్యతిరేకంగా ప్రజల్ని సంఘటితం చేసి పోరాటోద్యమాన్ని తీవ్రతరం చేశాడు.

ఆరోజుల్లోనే కేశవరావుగారు హైదరాబాదు నిజాం కాలేజీ నుండి, ఇంటికి వచ్చి, తన నెలవుకు పోసాగాడు. అదే సమయంలో ఆదారి గుండా హైదరాబాదు సిటీ పోలీసు కమీషనర్, కోత్వాలు వెంకట్రామారెడ్డి గారు కారులో వెడుతూ కారుకు సన్నిహితంగా ఉన్న ఆరడుగుల ఒక యువకుడు నడుస్తూ కనిపించాడు. కోత్వాలు కారుఆపి, ఆ కుర్రాడ్ని పిలిచి, "బాబూ నీపేరేమి ? అని అడిగాడు ఆ బాలుడు తన పేరు "కేశవరావు" అని చెప్పాడు. తరువాత ఆయనే కేశవరావును మరిన్ని వివరాలు అడిగి తెలుసుకొని కారులో ఎక్కించుకొని నేరుగా తన యింటికి తీసుకొనిపోయి కూర్చుండ బెట్టి, తాఫీగా తనను పరిచయం చేసుకోని, "బాబూ ! నీవు మంచిదేహదారుఢ్యం ఉన్న వ్యక్తివి. పోలీసు డిపార్టుమెంటులో చేరిపో, బాగా రాణిస్తావు. ఆ ఉద్యోగం నేనిస్తాను" అని కూడా అన్నాడు.

సర్దార్, కొత్వాల్ వెంకట్రామా రెడ్డి గారి ఆకస్మిక దయావేశాన్ని పదే పదే అనుసంధానం చేసుకుని, దీర్ఘాలోచనలో పడిపోయాడు. అయితే అతని మనోవీధిలో అప్పటికే దేశ భక్తిభావాలు అయనలో బలంగా చోటు చేసుకొన్నాయి. కాబట్టి వెంటనే కొత్వాలుకు ఏమీ సమాధానం చెప్పలేక అతని మాటను తిరస్కరించలేక ఇరుకున పడిన విషయాన్ని రెడ్డిగారు గమనించి, "తొందరేం లేదు బాగా ఆలోచించి చెప్పు" అన్నాడు.

కేశవరావు ప్రధానంగా పల్లెవాసి. కాబట్టి పల్లెజనాలు పడే గతరకాల అవస్థలను గమనించి రాష్ట్రంలోని అలాంటి లక్షలాది మంది రైతులకు, రైతు కులాలకు ఒక సమర్థవైన నాయకత్వాన్ని, పలుకుబడి అందివ్వడానికి కృషిచేశాడు. యువకుడుగా ఉన్న కేశవరావు మొదట వరంగల్లు జిల్లా, తరువాత తెలంగాణా ప్రాంతంలోని జిల్లాల గ్రామాలలో విస్తృతంగా పర్యటించారు. అతని ఆ పర్యటన వల్లపేద రైతుకూలీలలో గొప్పధైర్యం ఏర్పడింది. క్రమక్రమంగా ఆయన కార్యరంగం పరిధి తెలంగాణా రాష్ట్రమంతటా వ్యాపించింది.

నిజాంరాష్ట్రంలోని జమీందార్ల, జాగిర్దార్ల, గ్రామపెత్తందార్ల కబంధహస్తాల్లో అనేక విధాలుగా నలిగిపోతున్న ప్రజలను, మేలుకొలిపి, కుల, మత, వర్గ, దోపిడీ విధానాలకు వ్యతిరేకంగా వారిని సమీకరించి పోరాటోన్ముఖుల్ని చేశాడు.

కేశవరావు గ్రామాలకు వెళ్ళినప్పుడు, ఆయన ప్రత్యేకించి నిరుపేద రైతుకూలీల ఇండ్లలో, బడుగు వర్గాల వారు నివసించే పూరిపాకల్లో మకాం పెట్టేవాడు. ఆయన వారి యిండ్లలో ఉన్నకాలాన్ని వారు ప్రేమతో పెట్టగా తిన్న ఆహారాన్ని వృధా కానివ్వకుండా వారి బాగోగుల్ని, కష్టనష్టాలను, అధికారుల పెత్తందార్ల దౌర్జన్యాలను గురించి తెలుసుకొనేవాడు. ఆ విధంగా కేశవరావు గారి నిర్విరామ గ్రామీణ పర్యటనల వల్ల ప్రజానీకం తమకు సరైన నాయకుని యొక్క అండదండలు పూర్తిగా ఉన్నాయని భావించసాగారు. ఆయన వెళ్ళిన చోటల్లా గ్రామ పారిశుద్ధ్యాన్ని గురించి చెప్పేవాడు చెప్పటకు వారుకొందరు సహచరులైన కార్యకర్తలను వెంటతీసుకొని హరిజన వాడలకు, మురికివాడలను శుభ్రపరచే కార్యక్రమాలు జరిపించేవాడు. స్వయాన సర్దార్‌జీ తన బట్టలను తానే తెల్లగా ఉతుక్కొని ఆరబెట్టుకొనేవాడు.

సర్దార్ కేశవరావు గారి వ్యక్తిత్వం క్రమంగా పల్లెల నుండి, తెలంగాణాలోని ఇతర పట్టణాలకు ప్రాకింది. కాంగ్రెస్ నాయకులు, కార్యకర్తలు, ఆర్యసమాజ్ కార్యకర్తలు, ఒకరేమిటి అన్నిరకాల ప్రజా సంఘాలవాళ్ళు, కేశవరావు సేవలను గుర్తించసాగారు యువకులు, వర్తకులు, ప్రభుత్వోద్యోగులు ఆయన సేవాభావంపట్ల ఎనలేని గౌరవం పెరుగుతూ వచ్చింది.

సర్దార్ జమలాపురం కేశవరావు గారు సిద్ధాంత ప్రవక్తకాదు ఆయన తత్వాన్ని బోధించడు. నూటికి నూరుపాళ్ళు ఆచరణవాది. భాషలో, భావాల్లో, ప్రవృత్తిలో, ప్రసంగాల్లో రైతుపక్షానికి సంబంధించిన అంశాలనేకం ఉండేవి. ఆయా సమస్యలకు ఆయన వద్ద ఖచ్చితమైన సమాధానం ఉండేది. నరనరాల్లో దోపిడీ వ్యవస్థకు వ్యతిరేకంగా అతి నిష్కర్షగా వ్యవహరించే తత్వం ఆయనలో జీర్ణించుకొని ఉంది

కేశవరావు ఎంత ఆవేశపరుడో అంత శాంతపరుడు కూడ ఎవరినీ ఏ కారణం లేకుండా నిందించే స్వభావం ఆయనలోలేదు. స్వతహా కార్యకర్త కాబట్టి ఆయనలోని 'నిరాడంబరత్వం' అందరినీ ఆకర్షించేది. వరంగల్లుజిల్లా నర్సంపేట గ్రామంలో జరిగిన ఒక బహిరంగ సభలో కేశవరావు గారు మాట్లాడుతూ పూరిపాకల్లో నివసించే పేదప్రజలే ప్రజాప్రభుత్వనాయకత్వం వహించడానికి అర్హులు. అంతే కాదు స్వయాన వారి సమస్యలను వారు పరిష్కరించుకోగలిగినస్థాయిలో ఉన్నారు అయితే దోపిడీవర్గం వారి పేదరికాన్ని ఆసరాగాచేసి ముందుకు రానీయడంలేదు. వాళ్ళ చదువులు, ఉద్యోగాలు అభివృద్ధి కార్యక్రమాలు వాళ్ళే చక్కపెట్టుకొని ప్రజాస్వామ్య వ్యవస్థలోని అన్నివనరులను వినియోగించుకోగలగాలి. ఆనాటి ప్రజాపోరాటం ఒక ప్రభుత్వ వ్యతిరేక పోరాటమని మాత్రమే కాదు. సంపూర్ణ ప్రజాస్వామ్యపు విలువలతో కూడిన నూతన వ్యవస్థా నిర్మాణానికి ప్రజలు స్వయాన

జరుపుకునే పోరాటం. ఇందులో సామాన్యుడే జయిస్తాడు. అసమాన్యులమనుకొని, సామాన్యులను నయవంచనకు, దోపిడీకి గురి చేసే పెత్తందార్లు మట్టిగరుస్తారు. ఇది నిజం" అని నొక్కి వక్కాణించాడు.

నల్గొండలో ఒక సభలో మాట్లాడుతూ ".భూమి ఏ ఒక్కడి బలవంతుడి హక్కు భుక్తం కాదు. అది కష్టం చేసి పండించుకొనే ప్రతి రైతుదీ, రైతుకూలీది" అని అన్నారు.సర్దార్‌జీకి ఉర్దూ, తెలుగు ఆంగ్ల భాషలు క్షుణ్ణంగా తెలుసు వీలుదొక్కిన ప్పడల్లా ఏదో ఒక పుస్తకాన్ని తీసుకొని మౌనపఠనం చేసేవాడు. ప్రతిరోజు ఉదయం లేవగానే కొద్దిసేపు 'వ్యాయామం' కూడ చేసేవాడు. ఆయన పోరాటం నిరంతరమైనది. భవిష్యత్తును గురించిన చింత ఆయనకు ఎన్నడూ లేదు. నిజాయితీతో కూడిన సరైన ప్రజాపోరాటాలు తప్పక విజయం సాధించి ఆద్యంతంలో సత్ఫలాన్ని అందిస్తాయి. శ్రామిక వర్గాల ప్రయోజనాలు వారి సమస్యలను గురించి ఆనాడే సర్దార్‌జీకి మంచి అవగాహన ఉండేది. సాధరణ ప్రజానీకాన్ని ఆయన ప్రాణసమానంగా గుర్తించి వారి శ్రేయోవృద్ధులను నిరంతరం వీక్షించేవాడు. వర్తమాన ప్రభుత్వ చట్టాల వ్యవస్థ సామాన్యుడు మరింత సామాన్యుడుగా, ధనికుడు అత్యంత ధనికుడుగా రూపాంతరం చెందేందుకు మాత్రమే తోడ్పడుతుందన్నారు. సలహాలు ఉపదేశాలు చేయడం తేలిక - అవి ఆచరణకు రాకపోతే నిరర్ధకాలేకదా ! వాటివల్ల ప్రయోజనం ఏమి ఉండదు.

కార్యవాదిగా పేరుగాంచిన సర్దార్ జమలాపురం కేశవరావు గారు చేసిన త్యాగాలు ఎన్నటికీ మరువలేనివి. సామాన్య ప్రజానీకం కోసం ఇంతగా ఆరాటపడి శ్రమించిన నాయకుడు తెలంగాణలో మరొకడులేడనే చెప్పాలి. ఆయన ఆవేశపూరిత ఉపన్యాసాలు, ప్రజాదోపిడీదారులకులు, పెత్తందార్ల గుండెల్లో రైళ్ళు పరిగెత్తించాయి. ఆయన వెళ్ళిన చోటున ప్రజలు తండోపతండాలుగా కొద్ది సమయంలో ఆయన చుట్టూ మూగి "సర్దార్ కేశవరావు గారికీ జై" అనే జయజయధ్వానాలు మిన్నుముట్టే విధంగా చేసేవారు.

భారత దేశం స్వతంత్రమైన తరువాత మొట్టమొదటి సారిగా పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ నేతృత్వంలో 'ప్రజాప్రభుత్వం' ఏర్పడింది. ఆ సమయంలో ఆయన "దక్కన్ సర్దార్ కేశవరావు" అని సంభోదించి ప్రజలకు ఆయన పట్ల గల గౌరవసూచనగా గుర్తింపుగా కాన్స్టిట్యుయెంటు అసెంబ్లీ సభ్యునిగా నియంమించారు.

'స్త్రీ విద్య', 'స్త్రీ జాతి చైతన్యం' అనే అంశాలపై సర్దార్‌జీ ఎంతో అభిమానం కలిగి ఉండేవారు. ఆనాటి సామాజిక వ్యవస్థ స్త్రీ అభివృద్ధికి ఎటువంటి దోహదకారిగా



శ్రీ బాలాత్రిపుర సుందరీ సమేత చంద్రమౌళేశ్వర స్వామివారు
ఎఱ్ఱుపాలెం

# ఓం



శ్రీ ఒద్దిరాజు మురళీధర్‌రావు గారు
M.Sc
రిటైర్డు సీనియర్ లెక్చరర్
వృక్షశాస్త్రం, హైదరాబాదు

నేను హైస్కూల్ విద్యార్థిగా ఉన్నరోజుల్లోనే శ్రీ.శే. జమలాపురం కేశవారావు, జమలాపురం గోపాలరావు గార్ల పేర్లు తరచుగా వినబడేవి. అంటే బాగా పేరు ప్రఖ్యాతులు గడించిన వంశం జమలాపురం వారని అన్నమాట. ఆ రోజుల్లో వారు చేపట్టిన ఉద్యమాల గురించి మాకు అంతగా తెలియదు. దానికి కారణ, మాపిన్నవయసు, రజాకారుజమానా, రాజకీయాల్లో ప్రమేయం లేకపోవడం.

మిత్రులు డా.కల్లకుంట కోదండరామాచార్యుల వారు "దక్కన్ సర్దార్ దర్శనము"పుస్తకము నాకు గౌరవముగా అందించారు. దాన్ని శ్రద్ధతో మొదటి నుండి చివరి వరకు చదివి, జమలాపురం కేశవరావు గారి మహాగొప్ప వ్యక్తిత్వం గురించి తెలుసుకొని ఆ ఘనతను నా కడుపులోనే దాచుకోలేక రచయితకు, రూపకల్పన చేసిన వారికి అంత మంచి పుస్తకాన్ని ప్రచురించినందుకు కృతజ్ఞతాలేఖలు రాశాను. ఆ పరిచయంతో శ్రీ. జమలాపురం గోపాలకిషన్ రావు గారు వారి 'షష్టిపూర్తి ఉత్సవాని'కి సహృదయంతో ఆహ్వానించారు. వారి ఆహ్వానంలో ఎంతో ఆత్మీయత కనబడింది. దాన్ని పురస్కరించుకొని, తప్పక దక్కన్ 'సర్దార్ జన్మించిన' గ్రామం చూడాలని గూడా మొదటిసారి ఎఱ్ఱుపాలెం, జమలాపురం వెళ్లడం జరిగింది.

'షష్టిపూర్తి ఉత్సవం' బంధుమిత్రుల సమక్షంలో ఘనంగా జరిగింది. ఆ సందర్భంలోనే శ్రీ తుర్లపాటి కుటుంబరావుగారి అధ్యక్షతన ఒక సభ ఏర్పాటు చేశారు. దాంట్లో సుమారు 7 - 8 మంది పెద్దలు, ప్రముఖులు ప్రసంగించారు. ప్రసంగించేవారిలో నన్నుకుడా చేర్చారు. అందరు బంధువులు, మిత్రులు, గ్రామస్తుల సమక్షంలో సర్దార్ కేశవరావుగారి ఘనత గురించి నాలుగు మాటలుచెప్పే, ఆ అవకాశం నాకు దొరికినందుకు చాలా తృప్తి చెంది, వారందరి సంతోషంలో పాలు పంచుకున్నాను.

"దక్కన్ సర్దార్ దర్శనము" గురించి సమాచారం సేకరించడలో,
ముద్రించడంలో ఎంతో శ్రమపడి, శ్రద్ధచూపి, ఆర్థిక వసతులు ఏర్పాటు చేసుకొని చక్కని పుస్తకం సమాజానికి అందించారు గోపాల కిషన్‌రావు గారు. ఆ పుస్తకం నేటి యువకులకు, రాజకీయనాయకులకు, చరిత్రకారులకు ఎంతగానో ఉపయోగపడుతుందనడంలో అతిశయోక్తిలేదు.

గోపాల కిషన్ రావు గారు ఇప్పుడు "జమలాపురాన్వయదర్శిని"

'వంశవృక్షం' వంశంలోని మగవాళ్ళ పేర్లు తరాలవారిగా, వారి వారి సంతానం, వారు చేసిన వృత్తులు, సాధించిన ఘనకార్యాలు, సంఘసేవలు, ఇంకా ఎన్నో విశేషాలు ఎంతో ఓపికతో సంపాదించడం ఒక విధంగా భగీరథప్రయత్నమే. తాతగారు మొదలుపెట్టిన కార్యక్రమం దీక్షగా పూర్తి చేశారు. ఈ వివరాలు ఒక క్రమపద్ధతిలో రిసర్చ్‌పేపరువలె పట్టిక (చార్టు) రూపంలో పొందుపరిచారు. దీనివలన వివరాలు సునాయాసంగా తెలుసుకోవచ్చు. ఈ ప్రాజెక్టు తన తాతగారికి ఆత్మతృప్తియే గాక ముందు తరాల వారికి అమూల్యసంపదగా అందజేశారు గోపాలకిషన్‌రావు గారు. ఇది ఎంతో స్ఫూర్తిని అందిస్తుందనడంలో సందేహం వుండదు. దీనికి కారణం ప్రతివారికి తమ పూర్వీకుల వివరాలు తెలుసుకోవడంలో ఎంతో కుతూహలం వుంటుంది. తమకు తెలిసినంత వరకు పిల్లలకు తెలియజేస్తుంటారు. దీని ప్రాముఖ్యత ఇతర దేశాలలో కూడా వుంటుందని తెలుపడం కొరకు నా అమెరికా యాత్రలోని ఒక ఘట్టం ఇక్కడ వివరించడం సమంజసం అనుకుంటాను.

న్యూయార్కు సమీపంలో (Ellis Island) ఎల్లిస్ ద్వీపకల్పం వుంది. ఇంగ్లాండు వంటి దేశాల నుండి ఉద్యోగాల కొరకు యు.యస్.ఏ వెళ్లేవారు. వారిని మొదట ఆ ఐలాండులోనే అపి వైద్యపరీక్షలు చేయించి, ఏ జబ్బు లేదన్న నిర్ణయానికి వచ్చాక ఇమ్మిగ్రెంటు (పర్మినెంటువీసా) జాబితాలో పేరు నమోదు చేసుకొని దేశంలోకి ప్రవేశం యిచ్చేవారు. ఆ జాబితా లోని వివరాలు ఇప్పటికి ఒక భవనంలో గోడలపై రాసి ఉన్నాయి. (వారి పేరు, ఏదేశం నుండి, ఎప్పుడు వచ్చినారు). వారిని పరీక్షల కొరకు వుంచిన రోజులలో వారికి కల్పించిన వసతులు, వాడిన వస్తువులు ఇప్పటికి చూడవచ్చు. అటువంటి వారి సంతతి మధ్యమధ్య అక్కడికి వెళ్ళి ఆ జాబితాలో వారి పూర్వీకుల వివరాలు చూసి ఎంతో మధురానుభూతి పొందుతారు, మురిసిపోతారు. ఆ మాదిరిగ ఆ దేశంలో ప్రవేశించిన వారిలో ఒకడు వాషింగ్‌టన్ పూర్వీకుడు. అతని పేరున ఏర్పడింది ఒక పట్టణం. అదే ఇప్పుడు యు.యస్.ఏ. ముఖ్య పట్టణం వాషింగ్‌టన్.

ఇదే మధురానుభూతి గోపాలకిషన్‌రావు గారు వారి మూల పురుషుడు పెద్దిరాజు జన్మస్థానమైన కడియంపాడు (నెల్లూరుజిల్లా) వెళ్ళి వారితో కలిసి అక్కడ గుడిగోపురాలు, ఆ ప్రదేశం సందర్శించి, ఎంతో అనుభూతిపొందారు. ఆ ఘట్టం వారి జీవితంలో మరుపురానిది. ఎన్నిసార్లు నెమరువేసుకున్నా తరగని సంతోషం.

ఈ పుస్తకంలోని వివరాలు, వారి వంశీయులకు ఆనందం, తృప్తినివ్వడమే గాక, ఆనాటి కాలపరిస్థితులు, ప్రయాణసౌకర్యాలు, కష్టసుఖాలు, జనజీవన విశేషాలు చరిత్ర రూపంలో పాఠకులకు ఉపయోగపడుతాయి. ఈ పుస్తకంలో అతి ముఖ్యమైన విషయం స్త్రీల వివరాలు కూడా పొందు పరచడం. ఈ మధ్య పార్లమెంటులో స్త్రీలకు

చట్టసభలలో 33 శాతం సీట్లు కేటాయించే బిల్లు ప్రవేశపెట్టారు. దాని కొరకు ఎన్నో తర్జనభర్జనలు చివరకు బిల్లుపాస్ అవుతుందో లేదో అనుమానమే. గోపాలకిషన్‌రావు గారు మాత్రం ఈ పుస్తకంలో స్త్రీల పాత్రను ఏమాత్రం కుదించలేదు. వారి విద్యార్హతలు, చేసిన వృత్తులు, సమాజసేవలు వివరంగారాశారు. ఇది చాలా ప్రశంసనీయమైన విషయం. సామాన్యంగా వంశవృక్షంలో స్త్రీల పేర్లు రాసే సంప్రదాయం ఇప్పటి వరకు లేదు. మా ఒద్దిరాజువారి వంశవృక్షంలో 22 తరాల వారి పేర్లు రాశారు. కాని కేవలం మగవారి పేర్లే. ఆడవాళ్ల వివరాలు లేని లోటు పూర్తి చేయాలనే కోరిక కలిగింది. గోపాలకిషన్‌రావుగారు వంశంలోని స్త్రీల వివరాలు రాయడం ఒక ముందడుగు, స్త్రీలపాత్రకు తగు ప్రాముఖ్యత నిచ్చి ముందు ముందు వంశవివరాలు రాసేవారికి మార్గదర్శకులైనారు. ఇందులో శ్రీమతి జమలాపురపు దుర్గాంబగారు 'స్వీయ చరిత్ర' ఎంతో వివరంగా రాశారు. ఎంతో ఆదర్శప్రాయజీవితం. భక్తి పుస్తకాలు చదువుకుంటూ కాలక్షేపం చేసుకునేవారు. కాశీ దర్శించలేకపోయినా దక్షిణ దేశ యాత్రలు పూర్తి చేసుకున్నారు మునిమనుమలు కలగడం, వారికి ఉగ్గు గిన్నెలు బంగారు పూలువేసియివ్వడం. ఊయలలో కూచోబెట్టి వూపడం జరిగింది. దానితో వారి జన్మతరించిందని తృప్తిగా రాశారు. ఇది ఎంతో అదృష్టవంతులకు మాత్రమే సాధ్యపడుతుంది. ఈ సాంప్రదాయం మాత్రం మన ప్రాంతంలో ఉంది. ఈ వ్యాసం చదివే వారికి ఎంతో సంతోషం కలుగుతుంది.

వీరి వంశములో పేరుగడించిన లాయర్లు, డాక్టర్లు, ఇంజనీర్లు, టీచర్లు, రెవెన్యూ ఆఫీసర్లు, రచయితలు, సంఘసేవకులు, బ్యాంకు ఆఫీసర్లు, స్వాతంత్ర్య సమరయోధులున్నారు. అతిథి మర్యాదలు చేయడంలో, యాత్రికులకు భోజన వసతులు ఏర్పాటు చేయడంలో వీరికి వీరేసాటి. నాటక రంగస్థలంలో కూడా వీరిపాత్ర విస్మరించలేము. హైద్రాబాదు బ్యాంకులో పని చేస్తూ నాటకరంగాన్ని సజీవంగా ఉంచడంలో శ్రీ అయ్యదేవర పురుషోత్తమరావుగారి పాత్ర సామాన్యమయినదికాదు. వారి ప్రతిభ ఆంధ్రప్రదేశ్‌లోనే గాక అమెరికాలో గూడా ప్రదర్శించడం జరిగింది.

చివరిగా స్వాతంత్రసమరయోధులు కీ.శే. జమలాపురపు కేశవరావుగారి గురించి ఒకటి రెండు లైన్లు రాయడం చాలా ముఖ్యమనుకుంటాను. వారి జీవిత విశేషాలు సవివరంగా 'దక్కన్ సర్దార్‌దర్శిని' లో రాశారు. ఆ పుస్తకం అచ్చుఅయే వరకు అందని వ్యాసాలు ఈ పుస్తకంలో ప్రచురించారు. దానిలో ఎంతో వివరంగా రాయబడిన వ్యాసం కీ.శే. దేశభక్త మిరియాల నారాయణ గుప్తాగారిది. తల్లంపాడులో బస్సుకొరకు ఆగినపుడు దూరాన వున్న తాటి చెట్టు ఎత్తున రెపరెపలాడే స్వాతంత్ర్యపతాకం చూడాలని కేశవరావు గారి కోరిక. భువనగిరి సమీపాన ఒక గుట్టపైన తను ఎగురవేసిన జాతీయ పతాకం చూపి (స్వా.స) కోదాటి నారాయణరావు

గారు లోగా అన్నమాట గుర్తుకుతెచ్చానని రాశారు. ఈ తీరు ముఖ్యుల చాలా వ్యాసాలు ఈ పుస్తకంలో చోటు చేసుకున్నాయి. స్వాతంత్ర్యపోరాటంలో వారి పాత్ర జవహర్‌లాల్ నెహ్రూ గారి ప్రశంసలు అందుకుంది. 'రాముడొకడు పుట్టి రఘుకుల మీడేర్చె' అన్నట్లు కేశవరావుగారు పుట్టి జమలాపురపు వంశానికి కీర్తి ప్రతిష్టలు తెచ్చారు. రాముని జననంతో అయోధ్య తరించింది. కేశవరావుగారి జననంతో ఎఱ్ఱుపాలెమే గాక అవ్వటి హైద్రాబాద్ రాష్ట్రం తరించింది.

సుమారు గడిచిన 14 తరాల వారి వివరాలు సేకరించడం సామాన్యమైన విషయంకాదు. అది ఓపిక, శ్రద్ధ, శ్రమ, ఖర్చుతో కూడిన పని, అంతభారం మీద వేసుకొని గోపాలకిషన్‌రావు గారు ఈ పుస్తకం ప్రచురించి ధన్యులైనారు. వీరు ఆ వంశంలోని భావితరాలవారికి ఆదర్శ ప్రాయుడైనారు. వారికి నా హృదయపూర్వక అభినందనలు. వారికి నూతన సంవత్సరం 2000 ఎ.డి. కొత్త మీలీనియం శుభాకాంక్షలు తెలుపుతూ వ్యాసం ముగిస్తున్నా. నాకు ఈ అవకాశం ఇచ్చినందుకు కృతజ్ఞతలు.

* * * * *



శ్రీ బుద్ధిరాజు వెంకటేశ్వరరావు గారు,
రిటైర్డ్ టీచర్,
అధ్యక్షులు, రామ కృష్ణ సేవాసమితి, మధిర.

ప్రియ శిష్యుడు కిషన్‌రావును దీవించి వ్రాయునది.
క్షేమానంతరము

మీరు పంపిన గ్రంథము అందినది. చాలా సంతోషము. దాదాపు 15 సంవత్సరముల సుదీర్ఘమైన ప్రయత్నము ఫలించినది. మీ కార్యదీక్ష చాలా అరుదైనది.

అనాడు భగీరథుడు సగర చక్రవర్తుల సంతానం ఊర్ధ్వలోక ప్రాప్తికి గంగను దివినుండి భువికి రప్పించిన ప్రయత్నమట్టిది మీ యీ ప్రయత్నము. భగీరథుడు తరువాత రాజ్యము పరిపాలించి తాత్విక జీవనము గడిపినాడు. అటులనే మీరు ఇక తాత్వికజీవనము గడుపు సమయము లభించినది.

శ్రీ శ్రీ. కేశవరావు గారి జీవితంలోని అంశాలను గమనిస్తే 'ధృత్యున్నతోత్సాహులై ప్రారబ్ధార్థములుజ్జగింపరుగదా ప్రజ్ఞానిధుల్‌గావునన్', ఎవరు తప్పినా ఎవరు రాకపోయినా వారి బాటనే వారు నడిచారు.

ఈ పుస్తక ప్రచురణ ఫలితంగా ఊర్ధ్వలోకప్రాప్తి పొందినవారు ఎవ్వరైనా ఉంటే వారికి కూడా స్వర్గప్రాప్తి కలుగుటలో సందేహం లేదు.

ఇట్లు
బుద్ధిరాజు వెంకటేశ్వరరావు
రిటైర్డ్ టీచర్, మధిర.

* * * * *

శ్రీ భండారు పర్వతాల రావు
హైదరాబాదు
102,star Apart ments,
Yella Reddyguda
Hyderabad - 500 073 (A.P)
Phone : 3742533.



HONY EDITOR,
NATIONAL INFORMATION SERVICES

MEMBER,
CENTRAL BOARD FOR FILM CERTIFICATION

MEMBER, INDIA POPULATION PROJECT (IEC) COMMITTEE

MEMBER,
U.B. RAGHAVENDRA RAO MEMORIAL TRUST

MEMBER,
TRIVENI FOUNDATION, PUBLISHERS OF TRIVENI, CULTURAL QUARTERLY

MEMBER,
SRI JWALA NRISIMHA SWAMY SEVA TRUST

FORMERLY,

DIRECTOR, INFORMATION & PUBLIC RELATIONS & E.O, DY.SECTY(GAD), GOVT. OF A.P.

M.D., A.P.S. FILM DEVELOPMENT CORPORATION

P.R.O, ANDHRA BANK

P.R.O. TO CHIEF MINISTER (1979 TO 86)

MEMBER-SECRETARY,
A.P. STATE NANDI FILM & T.V. AWARDS COMITTEE

మిత్రులు శ్రీ గోపాల కిషన్ రావు గారికి,

మీరు ఎంతో ప్రేమాభిమానాలతో పంపిన 'జమాలపురాన్వయదర్శిని' అందినది. ఉత్తరం కూడా చేరింది.

తరతరాల చరిత్రను తరతరాలపాటు భద్రపరచుకునేలా తయారు చేసిన మీకు ముందుగా నా ప్రత్యేకాభినందనలు. ఇంత చక్కటి పనిచేసి మీరు మీ వంశఋణం తీర్చుకున్నారు..

పుస్తకం చూడగానే, రచన వెనుక ఎంత సుదీర్ఘమైన కృషి ఉందో తెలుస్తుంది. ఇంత మందిని గురించిన వివరాలను సేకరించటం ఒక ఎత్తు కాగా, ఆ వివరాలను సులువుగా రిఫర్ చేసుకునే పద్ధతిలో పట్టికరూపంలో పేర్చికూర్చడం మరొక ఎత్తు. ఇందుకు జతగా నిష్ణాతులు, వయోవృద్ధులైన వారి రచనలను ఈ పుస్తకంలో చేర్చడం ఎంతో అభినందనీయం. అందువల్ల పుస్తకం పొడిపొడిగా వివరాల పట్టికగా మిగిలిపోకుండా పఠనీయతను సంతరించుకుంది.

ఇటువంటి అమూల్యమైన గ్రంథాన్ని అందరూ ప్రశంసించేలా తయారుచేసి ప్రచురించిన మీకు. మీకు సహాయసహకారాలందించిన వారందరకూ మరోసారి హృదయపూర్వక ప్రత్యేకాభినందనలు.

ముందు ముందు తమ తమ వంశాల గురించి ఇటువంటి అన్వయదర్శిలను వెలువరించటానికి మీ పుస్తకం ఎందరికో స్ఫూర్తిదాయకం కాగలదనీ, ఒరవడిని దిద్దగలదనీ ఆశిస్తున్నాను.

మీ రచన మీ వంశస్థులలోనే గాక, బహుళప్రజాదరణకు నోచుకోగలదని ఆకాంక్షిస్తూ..

నూతన సంవత్సర శుభాభినందనలతో...





# జమలాపురాన్వయ దర్శనం

**శ్రీ పింగళి వెంకట కృష్ణా రావు గారు**
తెలుగు లెక్చరర్, శాతవాహన
శ్రీనగరు - 2వ లైను సత్యనారాయణ పురం,
**విజయవాడ - 520 011**

మాన్యులు విద్యావేత్తలు సహృదయులు శ్రీ జమలాపురపు గోపాల కిషన్ రావు గారు రచించిన **జమలాపురాన్వయ దర్శిని** అనే గ్రంధాన్ని ఆమూలాగ్రంగా చదివాను. చదివాను అనటం కంటే ఈగ్రంధంలో **జమలాపురాన్వయాన్ని** దర్శించాను అంటే బాగుంటుంది. మాస్వగ్రామం నందిగామ తాలూకా (కృష్ణా జిల్లా) లోని గోకరాజుపల్లె ఎఱ్ఱుపాలానికి సుమారు పది పన్నెండు మైళ్ళ దూరంలో వుంటుంది. జమలాపురం వారిది ఎఱ్ఱుపాలెం. మాతాతగారు పింగళి రామకృష్ణయ్య గారు, తండ్రి గారు రామగోపాల రావు గారు. స్వాతంత్ర్య సమర సేనానులైన సర్దార్ జమలాపురం కేశవరావు గారి రాజకీయ దీక్షా దక్షతల్ని గురించి, నిత్యాన్న దాత జమలాపురం జగన్నాధరావు గారి దాతృత్వాన్ని గురించి చెప్పగా బాల్యంలో విన్నాను. ఇప్పుడు ఈగ్రంధం చదివిన తరువాత ఆవంశవృక్షం ఫలించిన మరెన్నో ఫలాల్ని గురించి తెలుసుకున్నాను.

గ్రంధకర్త గోపాలకిషన్ రావు గారు ఉత్తమ ఉపాధ్యాయులుగా లబ్ధ ప్రతిష్ఠులు. ఈ పుస్తకాన్ని సుబోధకంగా సమగ్రంగా రచించారు. కధా కావ్యాలు వ్రాయటం కన్నా జీవిత చరిత్రలు వ్రాయటం మరీ కష్టం. పూర్వా పరాల్ని వంశ శాఖోప శాఖల్ని సమన్వయం చేసుకుంటూ, సత్యనిష్ఠతో సాగించ వలసిన రచనయిది. సమాచార సేకరణ ఎంతో వ్యయ ప్రయాసలతో కూడు కున్నది. కిషన్ రావు గారు వంశాన్నికొన్ని శాఖలుగా, శాఖల్ని తరాలుగా వర్గీకరించారు. సాధారణంగా వంశవృక్షంలో పురుష సంతానాన్ని గురించి వ్రాస్తుంటారు. కాని వీరు పురుష సంతానంతో పాటు స్త్రీ సంతానాన్ని వారి వియ్యపు బాంధవ్యాల్ని తెలియ జేస్తూ ఎన్నో పట్టికలు రూపొందించారు. చక్కగా ముద్రింపించారు. వీరి కృషి మరెందరికో మార్గ దర్శకమవుతుందనటంలో సందేహం లేదు. ఈ రచన ఎంతో ఉదాత్తంగా వున్నది. గోపాల కిషన్ రావు గారు పొందిన, బంధువుల విశేష ఆదరాభిమానులగు ఇందులో కొన్ని వ్యాసాలు అద్దం పడుతున్నాయి. వారు అదృష్ట వంతులు ఆ వంశంలోని భావితరాలకు నూతన ఉత్తేజం కలగిస్తుంది. ఈ గ్రంధ రచనతో వీరు పితృఋణం తీర్చుకొని ధన్యులయ్యారు. సత్యనిష్ఠతో సాగిన ఈ రచన ఆదర్శ ప్రాయమయింది. వీరి కృషి ప్రశంసాపాత్రమయింది. నాతో ఈ రెండు మాటలు వ్రాయించిన వారి అభిమానానికి కృతజ్ఞతలు.

* * * * *





# శ్రీ గురు భ్యోన్నమః

విజయవాడ
ది. 1-8-2000

'జమలాపురాన్వయ దర్శిని' గ్రంధ కర్త శ్రీ జమలాపురపు గోపాలకిషన్‌రావు గారు పుస్తక ప్రచురణ విషయములో వారు తీసుకొన్న జాగ్రత్తలు ఈ సందర్భముగా ప్రస్తావించక తప్పట లేదు.

అధ్యాపక వృత్తిలో ఉండి మంచితనము, సత్ సాంప్రదాయము, సత్ప్రవర్తన, మితభాషిత్వము, అనే ఆయుధములతో ఎంతో మందికి విద్యాదానము చేసిన మహామహుడు శ్రీ జమలాపురపు గోపాలకిషన్ రావు గారు అంటే అభిమానించని వారు అరుదు. జమలాపురాన్వయ దర్శిని సృష్టికర్త, వారి తాత గారు శ్రీ జమలాపురపు వెంకట కిషన్‌రావు గారు మధ్యలో ఆపిన ఈ గ్రంధమును పూర్తి చేయవలెనన్న సత్సంకల్పము కల్గుట వారి వంశజుల అదృష్టము. ఈ సందర్భమున ఒక విషయము జ్ఞప్తికి రాక మానదు. శ్రీ మదాంధ్ర మహాభారతమును ఆంధ్రీకరించిన నన్నయ్య, తిక్కన, ఎఱ్ఱాప్రగడల వలన పూర్తి అయిన సందర్భము. వారి వారి గోత్ర నామములు తెలియని ఈ రోజులలో శ్రీ జమలాపురపు గోపాలకిషన్‌రావు గార్కి ఈ గ్రంధము వెలికి తీయవలెనన్న సత్సంకల్పము కలుగుట ముదావహము. ఈ గ్రంధ రచన, సేకరణలో వారు పడ్డ బాధలు వర్ణనాతీతము.

నివాసము-ఎఱ్ఱుపాలెం, పుస్తక ప్రచురణ - విజయవాడ, ఎండకు ఎండి, వానకు తడిసి, అన్నపానములు మాని, పుస్తక ప్రచురణ పూర్తి చేసిన శ్రీ జమలాపురపు గోపాలకిషన్‌రావు గార్కి, వారికి అన్ని విధములుగా సహాయ సహకారములందించిన దాతలకు, వంశజులకు భగవంతుడు ఆయురారోగ్య, ఐశ్వర్యములను ప్రసాదించ వలసినదిగా 'సాయి శృతి ఆఫ్‌సెట్ ప్రింటర్స్' తరపున, నేను, మా మానేజింగ్ పార్టనర్ శ్రీ బి. శ్రీనివాసరావుగారు, మరియు సిబ్బంది కోరు కొంటున్నాము.

ఇట్లు
హితైషి
**చివుకుల సీతారామ విఠల్**
'సాయి శృతి' ఆఫ్‌సెట్ ప్రింటర్స్
గాంధీనగర్, విజయవాడ.



# కృతజ్ఞతలు



– జమలాపురపు నరసింహ
కమలాకర కాశ్యప

★ వంశవృక్ష గ్రంధ ప్రచురణకు పునాది రాయిగా నిలిచిన మా ముత్తాత గారు కీ.శే. జమలాపురపు వేంకట కిషన్ రావు గారికి నివాళులర్పిస్తున్నాను.

★ జమలాపురాన్వయ దర్శిని గ్రంధ ప్రచురణ సందర్భంగా వంశములో వివిధ రకాలుగా పేరు, ప్రతిష్టలు గడించిన ప్రఖ్యాత వ్యక్తుల గురించి ఎంతో విలువైన సమాచార మందించిన ఎందరో మహానుభావులకు కృతజ్ఞతాభి వందనములు.

★ఈ గ్రంధమునకు మూలధారమైన కుటుంబ వివరములను ఎంతో శ్రద్ధతో, ఎంతో బాధ్యతతో సకాలములో అందించిన జమలాపుర వంశస్తులకు మరియు సంబంధితులకు ప్రత్యేక ధన్యవాదములు.

★ ఈ పుస్తక నిర్వహణలో ఎంతో బాధ్యత వహించిన సంపాదక మండలి సభ్యులు పూజ్యులు శ్రీ. జమలాపురపు నారాయణ రావు గారు, శ్రీ మాదిరాజు వెంకట రామరావు గారు, శ్రీ అయ్యగారి దేవర నరసింహ పురుషోత్తమ రావు గారికి, శ్రీ కొలిపాక మధుసూదన రావు గారికి, హృదయ పూర్వక నమస్కారములు.

★ ఈ గ్రంధమును గూర్చిన పరిచయం గావిస్తూ శుభాశీస్సులతో ముందు మాట పలికిన విజ్ఞులకు వందనములు.

★ ఎంతో శ్రమ అయినప్పటికి ఎంతో శ్రద్ధ, బాధ్యతతో డి.టి.పి. చేసిన క్లాసిక్ డి.టి.పి. రాజ శేఖర్ గార్కి, సూర్యా గ్రాఫిక్స్ శ్రీ మతి రజని గార్కి, విజయ సాయి గ్రాఫిక్స్ శ్రీ ఆర్. కిషోర్ గార్కి కృతజ్ఞతలు

★ ఈ పుస్తక ప్రచురణను అడిగినంతనే ఎంతో వుత్సాహంతో ఓర్పు, నేర్పులతో నిరంతరము సహకరించి చక్కగా ప్రచురించిన సాయి శృతి ఆఫ్ సెట్ ప్రింటర్స్ శ్రీ. బి.శ్రీనివాస్ గార్కి మరియు సి.హెచ్. ఎస్. ఆర్. విఠల్ గార్కి, మరియు సిబందికి నా హృదయ పూర్వక ధన్యవాదములు.

★ ఈ ప్రచురణలో ఆర్థికంగా తోడ్పడిన వదాన్యులకు శతాధిక వందనములు. నేటి పరిస్థితిలో పుస్తక ప్రచురణ సరియైన ఆర్థిక వనరులుంటేనే వెలుగు చూడగలుగుతుంది. ఇందుకు సహకరించిన మహారాజ పోషకులు, రాజపోషకులు, పోషకులు దాతలకు మరొక సారి శతసహస్ర వందనములు అర్పిస్తున్నాను.

* * * * *

# 1. జమలాపురం గ్రామ నిర్మాణం శ్రీ వెంకటేశ్వరస్వామి వైభవాది వర్ణన



- కీ.శే. దుర్గరాజు
లక్ష్మీనారాయణరావుగారు
ఖమ్మంజిల్లా, భీమవరం

శ్రీ వెంకటేశ్వరస్వామి వారు జమలాపురం గ్రామానికి ఉత్తరంగా వున్న కొండపైన కొన్ని తరముల క్రితం 'స్వయంభూః' వెలసియున్నారు. గాని వెలుగులోనికి రాలేదు.

జమలాపురంకు దగ్గరలో వున్న పెద్దగోపవరం గ్రామములో 'ఉప్పల' అను యింటిపేరు గల ఒక బ్రాహ్మణ కుటుంబం గలదు. వారిలో శ్రేష్ఠమైన భాగవత జీవనం గడిపే ఆస్తికోత్తములు పెక్కురు ఉద్భవించారు. వారు సుమారు నాలుగు వందల సంవత్సరాల క్రితం, వారిలో ఒక భక్తునికి ఒక రాత్రి కలలో శ్రీ వెంకటేశ్వరస్వామివారు కనపడి "నేను జమలాపురంలో ఒక గుట్టమీద వెలసితిని. నాకు తగిన భక్తులెవరు కనపడనందున యింతకాలము నేను నా వ్యక్త మూర్తిని వెలుగులోకి తేలేదు. గాన నీవు, నాకు నమ్మిన భక్తుడవు. నిన్నాదేశించేది ఏమనగా నీవు ఆ గుట్టమీదకు ఎక్కి, నన్ను కనుగొని తరువాత ప్రతి నిత్యము దీపారాధన నైవేద్యము పెట్టుచూ నాకు నమ్మకమైన భక్తులలో నా స్వయం వ్యక్తం తెలియపరచి భక్తి శ్రద్ధలతో నన్ను పూజించి నా వైభవమును వెలుగులోకి తేగలవు" అని చెప్పి అదృశ్యమాయెను.

మర్నాడు స్వామివారు నిర్దేశించిన గుట్టఎక్కి స్వామిని చూసి ప్రతిరోజు వారు సెలవిచ్చినట్లుగా పూజాధికములు నెరవేర్చుచుండెను. కాలం గడిచిపోగా ఆ బ్రాహ్మణ భక్తుడు వయోవృద్ధుడై కొండ ఎక్కలేక ఒకరోజు పూజాధికములు నెరవేర్చి స్వామితో ఇట్లు విన్నవించుకొనెను. "స్వామీ! మీ ఆజ్ఞానుసారం ఇంతకాలము మీ సన్నిధికి వస్తూ ప్రతినిత్యం పూజచేసుకొని దర్శనం చేసుకుంటూ వుంటిని. ఇక నేను వృద్ధాప్యమువలన ఈ కొండ ఎక్కలేక పోతున్నాను. ఇదే నా చివరి మనవి. అని సాష్టాంగ నమస్కారము చేసి దిగి ఇంటికి వచ్చెను. ఆ రాత్రి కలలో "నేను నీ మొరనాలించి దానికి దక్షిణంగా వున్న చిన్న గుట్ట మీదకి

దిగివచ్చియున్నాను. నీవు వచ్చి యధాప్రకారము నాకు దీపారాధన, పూజానైవేద్యములు చేయుము. నాకు ఆలయము కట్టించగలవు". అని ఆజ్ఞాపించెను. అంతట ఆ జమలాపురం. గ్రామములో దేశ పాండ్యాలు, కరణంగారైన జమలాపురం వంశీకులలో ప్రఖ్యాత మూల పురుషుని సహాయంతో ఆలయనిర్మాణం గావించి ధూప దీప నైవేధ్యములు జరుపుతూ వుండిరి. నాటి నుంచి నేటి వరకు ఉప్పల వంశీకులైన వారే అర్చకులుగా స్వామిని సేవించుచున్నారు.

శ్రీజమలాపురపు వంశపు వారందరూ ఉత్తములు. దైవ భక్తి గలవారు. వీరి తొలి నివాస ప్రాంతమ్మైన జమలాపురం అను గ్రామము 'జమలాయదుర్గము' ననుసరించి వున్న గుట్టల వరుసలో గలదు. ఈ జమలాయ దుర్గము ప్రస్తుత జమలాపురంకు పదిమైళ్ళ దూరం ఉత్తరాన వినగడప గ్రామం దగ్గర కలదు. అదే గుట్టల వరుస వినగడప, గుంటుపల్లి గోపవరం, భీమవరం, అయ్యవారి గూడెం, మామునూరు, చొప్పకట్లపాలెం, బనిగెళ్ళపాడు, పెదగోపవరం, జమలాపురం వరకు గలదు. జమలాయ దుర్గం అను పేరు ఎట్లు వచ్చెనో తెలియదు. ప్రస్తుతం స్వామి వారున్న గ్రామం 'జమలాపురం'గా ప్రఖ్యాతి గాంచినది. ఆ గ్రామము నిర్మించి, అభివృద్ధిలోనికి తీసుకొనివచ్చి స్వామికి ఆలయ నిర్మాణము గావించి మాన్యములు యిచ్చి స్వామి వారికి నిత్యనైవేద్య ధూప దీపాదులు సమర్పించుటకు అర్చకులను నియమించినది జమలాపురం వంశీకులు. ఆ గ్రామము దట్టమైన అడవిలో నుండెను. వారు చెట్టు, పుట్ట కొట్టించి గ్రామం అభివృద్ధిలోకి తెచ్చి, ఆ గ్రామములోనే నివాసం యేర్పరచుకొని వుండిరి. కాని, నైజాం నవాబు కాలంలో కొన్ని గ్రామములు నిర్మించి, రైతులను నిలకడగా కాపురం వుండుటకు తగిన వసతి కల్పించి అనగా బావులు, చెరువులు నిర్మించి, ఇండ్లు కట్టించి అభివృద్ధిలోకి తెచ్చుటకు కొందరిని తగిన వారిని నియమించి, వారికి దేశపాండ్యాలని బిరుదులు యిచ్చి వుంచిరి. అందులో ఈ జమలాపురం వారొకరు. వీరు జమలాపురంకు దగ్గరలో ఎర్రుపాలెం అను గ్రామము కూడా నిర్మించి అభివృద్ధిలోనికి తీసుకొనివచ్చి, వారుకూడా ఎర్రుపాలెంలో కొందరు స్థిరనివాసం యేర్పరచుకొని వుండిరి.



★ ★ ★ ★ ★



# 2. మూలపురుషుడు పెద్దిరాజు

- *శ్రీ అయ్యదేవర నరసింహ పురుషోత్తమరావుగారు, హైదరాబాద్.*

శ్రీ వేంకటేశ్వరస్వామి నూట ఎనిమిది తిరుపతులలో ఒకటైన జమలాపురం గ్రామం ప్రస్తుతం హైదరాబాద్, విజయవాడ రైలు మార్గంలో విజయవాడకు సమీపంలో వున్న ఎర్రుపాలెం రైల్వే స్టేషన్‌కు ఏడు కిలోమీటర్ల దూరంలో వుంది. జమలాపురం ''కరిణీకం'' చేయటం వల్ల ఆదిలో ఈ కుటుంబం వారికి ''జమలాపురపు'' వారు అని పేరు వచ్చింది.

జమలాపురపు వారి పూర్వీకులు నెల్లూరు జిల్లా ఉదయగిరి సమీపంలో వరికుంటపాడు మండలంలో వున్న కడియంపాడు గ్రామ వాస్తవ్యులు! వీరి యింటి పేరు కూడా కడియంపాటి వారే. ఆరువేల నియోగి శాఖకు చెందిన కాశ్యపస గోత్రీకులు. కాశ్యప, వత్సార, నైధృవ, రేభ,రైభ, శండిల, శాండిల్య సప్తఋషులు

మా తాతగారు జమలాపురపు వెంకట కిషన్‌రావుగారు వ్రాసిన జమలాపురపు వారి ''వంశ చరిత్ర,'' ఆయన స్వీయ చరిత్ర ఆధారం చేసుకొని, జమలాపురపు వారి వంశ చరిత్ర విపులంగా అందచేయడానికి చేస్తున్న ప్రయత్నమే యీ **జమలాపురాన్వయ దర్శిని.**



అది రేమిడిచర్ల గ్రామం. సూర్యుడస్తమిస్తున్నాడు. మసక చీకట్లు కమ్ముతున్నాయి. అప్పటి దాకా వీధి అరుగుమీద యెడ తెగని ముచ్చట్లు సాగించిన ఆ యింటి యజమాని, రేమిడిచర్ల కరణం గారు, స్నానం చేసి, అనుష్ఠానానికి ఉపక్రమించ బోతున్నాడు. ఒక ఆజానుబాహుడు, స్ఫురద్రూపి, నవయవ్వనం తొణికిసలాడుతూ, తేజస్సుతో కూడుకున్న ముఖం మీద చిరు చెమటలు, యెంతో దూరం కాలినడకన ప్రయాణం చేసినట్లు చూపిస్తున్న వ్యక్తి వచ్చాడు. ఆ క్రొత్త వ్యక్తి లోపలకు అడుగుపెట్టడం చూసిన ఆ యింటి యజమాని ప్రొద్దునే వచ్చిన వర్షం, పొద్దుగూకి వచ్చిన చుట్టం అన్న విషయం గుర్తుకు వచ్చి, అతిథి అభ్యాగతులకు ఆలవాలమైన తను ఎదురుబోయి యింట్లోకి సాదరంగా ఆహ్వానించాడు. అప్పడే ముట్టించిన చిరు దివ్వె వెలుగులో కనిపిస్తున్న ఆ నూతన వ్యక్తి, రూపురేఖలకు, తేజో సంపదకు ఆనందాతిరేకంతో ఆప్యాయంగా కౌగలించుకున్నంత పనిచేసి చేతులందించి, అక్కడ విశాలంగా వున్న పెద్ద బల్లమీద ఆశీనుడ్ని చేశాడు. కొద్ది క్షణాలు వారిరువురికి మధ్య మౌనం రాజ్యం చేసింది. యింతలో ఆ యింటి యజమానురాలు కాళ్ళు కడుక్కోవడానికి నీళ్లు తెచ్చి యిచ్చింది. ఆ వచ్చిన వ్యక్తి కాళ్లు, చేతులు తుడుచుకున్నాడు. ఇంతలో మరచెంబుతో మంచినీళ్లు యివ్వడం జరిగింది. కొంతసేపు సేద తీర్చుకున్న తరువాత ఆ వచ్చిన వ్యక్తే ఆరంభించాడు.

"నా పేరు పెద్దిరాజు! మా యింటిపేరు కడియంపాటి వారు. మాది నెల్లూరు జిల్లా ఉదయగిరి సమీపాన వున్న కడియంపాడు గ్రామం. వేము ఆరువేల నియోగులం. కాశ్యపస గోత్రీకులం. భద్రాచలం యాత్రకు పోతూ చీకటి పడ్డ కారణంగా యీ వూరు చేరుకొని మీ దర్శనం చేసుకోవడానికి వచ్చాను."

ఆమాటలు ఆ యజమానికి ఆద్యంతం ఎంతో ఉత్కంఠత కలిగించాయి. తన్మయత్వంలో మునిగిపోయాడు. సాటివాడు అయినందుకు ఒక్కమారు లేచి కౌగలించుకో బోయాడు. పెద్దిరాజు వినయ విధేయతలతో పాదాభివందనం చేశాడు. కరణంగారు అతన్ని కౌగలించుకొని ఆనందబాష్పాలు రాల్చాడు. కొద్దిసేపట్లో స్నానాదికాలు కావించుకొని యిరువురు అనుష్ఠానానికి చేరుకున్నారు. కొత్త వ్యక్తి వచ్చినట్లు తెలిసి గ్రామస్తులు కరణం గారి యింటికి వచ్చారు. వాళ్లు ఎన్నో ప్రశ్నలు వేశారు. ఆయన చెప్పిన ప్రతి సమాధానం అందర్నీ ఎంతో ఆకర్షించింది. ముఖ్యంగా కరణం గారికి ఎంతో ఆనందాన్ని కలుగచేసింది. ఆ రాత్రి ఎంతో పొద్దు పోయినదాకా ఎన్నో విషయాలు చర్చకు వచ్చినయ్. మధ్య మధ్య కరణం గారి భార్య కూడా ఆ చర్చలో పాల్గొనడం జరిగినది. చివరికి చాలా పొద్దుపోయిందన్న ఆమె హెచ్చరికతో ఆ చర్చకు తెర బడింది.

కోడి కూయంగానే ఆ యింటిలోని వారు మేల్కొన్నారు. ఆ యిల్లే కాదు, ఊరంతా మేల్కొన్నది. ఒక చెంప దూరంగా వినవస్తున్న రోళ్లలో జొన్నలు దంచుతున్న రోకళ్ల శబ్దం, ఆవుదూడల అరుపులు, పొలాలకు వెళ్తున్న అరకలు సాగించే రైతుల అదలింపులు ఆ వూరిని చైతన్యవంతం చేస్తున్నాయి.

కరణంగారు, పెద్దిరాజు స్నానాదికాలు పూర్తి చేసుకొని, అనుష్ఠానానంత రం నడివింట్లో చాపలు వేసుకొని కూర్చున్నారు. ఏపనీ చేయలేక పెద్దవాళ్లె యెవరో కొత్త వ్యక్తులు వచ్చారన్న మాట విన్న నలుగుర్దైదుగురు గ్రామ పెద్దలు, కరణంగారి సాదరాహ్వానాన్ని పొంది, శ్రద్ధాభక్తులతో కూర్చున్నారు. కోరిక మేరకు పెద్దిరాజుకు 'పోతన భాగవతం' అందియ్యబడింది. 'గజేంద్ర మోక్షం' ఘట్టాన్ని ఆయన ఎంతో శ్రావ్యంగా వినిపించాడు. కర్ణపేయంగా సాగిన ఆ కాలక్షేపంతో అక్కడ వున్న వాళ్లందరూ మంత్రముగ్ధులయ్యారు. మధ్య మధ్య ఆ ఇంటి ఇల్లాలు నడివింట్లోకి తొంగి చూస్తూ ఎంతో ఆసక్తితో వినసాగింది. ఆనంద పారవశ్యంలో మునిగిన ఒక 'చుట్టకాళ్ల బాలిక' గదిలోంచి గడప దాటి ముందుకు వచ్చింది. ఆమెనానుకొని, ఆమె చెల్లెలు మరో అందమైన అమ్మాయి ఆమెను ప్రక్కగా కూర్చుండబెట్టి ఆమె ప్రక్కనే ఆశీనురాలైంది. పెద్దిరాజు కటాక్షం పెద్దమ్మాయి మీద పడింది. ఆమె చాలా అందగత్తె. భగవంతుడు ఆమెకు ఆ అవుడు ఎందుకు కలుగచేశాడో! రెండో అమ్మాయి కూడా చిలక లాగా వుంది. పెద్దిరాజు చూపులు వారిద్దరిపై పడిన విషయం గమనించి, కరణం గారి కళ్లు చెమర్చినయ్. అది గమనించిన గ్రామ పెద్ద శ్రీ మిరియాల నారాయణ అందుకొని "బాబుగారూ! మా కరణం గారికి యీ యిద్దరు కమార్తెలు. వారికి ఈ పిల్లల వివాహమే ఒక సమస్య. మా కరణం గారు అష్టైశ్వర్యాలు కలవారు.

సౌజన్యమూర్తి. గుణసింధువు. అతిథి సత్కారాలలో అందె వేసిన చేయి. మా అందరికి యేడుగడ. ఈ చుట్టుప్రక్కల అన్ని వూళ్ళకి ఆయన తలమానికం. మీరు చూస్తే వారికి సాటివారిలా అనిపిస్తున్నారు. అన్నీ అనుకూలిస్తే మా కరణం గారికి మీరేదైనా మార్గం చూపిస్తే ఆయనే కాదు, మేమందరం ధన్యులం. మా జమలాపురం వేంకటేశ్వరస్వామి కరుణా కటాక్షం వల్ల ఆయన మీలో జొరబడి, మాకు మంచి రోజులు రావాలని కోరుకుంటున్నాము". అని చేతులు జోడించాడు. దానికి చకితుడైన పెద్దిరాజు ముందుకు జరిగి ఆయన రెండు చేతులు పట్టుకొని, "మీరు పెద్దవాళ్ళు, ఆశీర్వదించాలే గానీ, అలా చేతులు జోడించకూడదు. అయినా మనందరి జోడింపులు ఆ స్వామి వారికేలేండి" అన్నాడు.

ఆ మాటలు అక్కడ వున్నవారందరికి చాలా ఆనందాన్ని కలిగించాయి. అందరి సమక్షంలో పెద్దిరాజు ఒక మాట అన్నాడు. "మీరు యిస్తానంటే ఆ పెద్దమ్మాయిని నా అర్ధాంగిని చేసుకుంటాను. మీకు అల్లుడు కావడం కన్నా విశేషం నా జీవితానికి మరొకటి లేదు". కరణం గారు లేచి పెద్దిరాజును కౌగలించు కొన్నాడు. పెద్దిరాజు మరొకమారు పాదాభివందనం చేశాడు. సిగ్గుపడ్డ పెద్దమ్మాయి లేచి గదిలోకి పోవటానికి ప్రయత్నం చేసింది. చెల్లెలు ఆమెకు సాయం చేసింది.

గ్రామస్తులు అందరూ తథాస్తన్నారు . అందరి ముఖాలు వికసించి నయ్. పెద్దిరాజు గృహం ముందుకు వచ్చాడు. ఆ రాత్రి తనకేమీ అర్థం కాలేదు. నలువైపులా కలియజూశాడు. అది చాలా విశాలమైన ప్రదేశం. ఒక ప్రక్క జమ్మిచెట్టు, అంత దూరాన పున్నాగ చెట్టు. ఒక వైపు దూరంగా పశువుల దొడ్డి, దాని ప్రక్కన కొన్ని వందలున్న మేకల దొడ్డి. వాటినదలిస్తున్న కాపరులు. దాదాపు పాలిచ్చే ఇరవై బర్రెలు. అన్నీ కోడెదూడలే కావడం వలన పాలు వదలివేయబడ్డ ఆవులు. ప్రత్యేకంగా పాలు తీయడానికి యిద్దరు జీతగాళ్ళు. ఎనిమిది జతల ఎడ్లు, ఎడ్ల బళ్ళు, ఒక ప్రక్క పెద్ద వంట చెఱుకు, మరొక ప్రక్క కూరగాయల చెట్ల పాదులు అంతా సస్యశ్యామలంగా వుంది. అదంతా అతనికెంతో ఆనందాన్ని కలుగజేసింది. అనుకున్న ప్రకారం కరణం గారు పెద్దిరాజుకు పెద్దమ్మాయితో పాటు చిన్నమ్మాయిని కూడా యిచ్చి వివాహం చేశాడు. అల్లుడికి జమలాపురం కరణీకం యిప్పించాడు. అప్పట్నించి "కడియంపాటి పెద్దిరాజు", "జమలాపురపు పెద్దిరాజు" అయినాడు. ఆయనే జమలాపురపు వారికి మూలపురుషుడు. ఆ రోజు నుంచి పెద్దిరాజు ఆ యింట్లో ఒకడై పోయాడు. కరణం గార్కి రెండు మూడు వూళ్ల 'కరణీకం' వుంది. అందులో "జమలాపురం" కూడా ఒకటి. కరణీకానికి సంబంధించిన రాతపూతలలో, లెక్కాడొక్కలలో ఆరితేరిన పెద్దిరాజు కరణం గారి కార్యభారాన్ని ఎంతో తగ్గించివేశాడు. దాదాపు కార్యకలాపాలన్నీ తానే స్వయంగా నిర్వహించసాగాడు. ముఖ్యంగా జమలాపురం గ్రామంతో, అక్కడి ప్రజలతో, దేవాలయ అర్చకులతో ఆయనకెంతో సాన్నిహిత్యం ఏర్పడింది. పెద్దిరాజు సలహా సంప్రదింపులతో శ్రీ వేంకటేశ్వరస్వామి వారి ఆలయ పూజలలో, ఉత్సవాల నిర్వహణలో నూతనోత్సాహం ఏర్పడింది.

---

ఒకరోజు శ్రీరామనవమి సందర్భముగా జమలాపురంలో ఉత్సవాలు జరుగుతున్నాయి. ఎవరో గోదావరి జిల్లానుండి యిరువురు కవులు వచ్చారు. భోజనానికి ముందు వారు ఆశు కవిత్వాన్ని వినిపించారు. పెద్దిరాజు వారు ఏ పద్యం చదివినా తిరిగి ఆయన ఆ పద్యాన్ని వినిపించాడు. వచ్చిన ఆ కవులు ఆశ్చర్యపోయి "మీరు, ఏకసంథాగ్రాహులా? మమ్మల్ని మన్నించండి"! అని వారు పెద్దిరాజును అభినందించారు. ఆ సాయంత్రం జరిగిన విద్వత్ గోష్టిలో చుట్టు ప్రక్కల చాలా ఊళ్ల నుండి కవులు, గాయకులు వచ్చారు. అందరితో పెద్దిరాజు వ్యవహరించిన తీరు ఆయన విజ్ఞానం, భాషాపటిమ, వాగ్ధోరణి అందర్నీ ఆకర్షించింది. వచ్చిన పండితులందరూ పెద్దిరాజును బహుధా ప్రశంసించారు. ఆ రాత్రి అందరికి ఆతిధ్యం రేమిడిచర్లలోనే. ఇదంతాకళ్లారా చూస్తున్న రేమిడిచర్ల కరణం గారు, గ్రామ ప్రజలు పెద్దిరాజు వంటివారు తమ వాడు కావడానికి శ్రీ వేంకటేశ్వరస్వామియే కారణమని స్వామివారిని స్తుతించారు.

★ ★ ★ ★ ★

శ్లో॥ వక్రతుండ మహాకాయ కోటి సూర్యసమప్రభ
నిర్విఘ్నం కురుమేదేవ సర్వకార్యేషు సర్వదా

వక్రమైన తొండము కలవాడును, విశ్వమంతటిని తనలో నిముడ్చుకొనిన శరీరము కలవాడును, కోటి సూర్యుల కాంతిలో ప్రకాశించువాడును అయిన నీకు నమస్కరించు చున్నాను. నేను చేయు ప్రతీ పనియు నిర్విఘ్నముగా జరుగునట్లు అనుగ్రహింపుము.

★ ★ ★ ★ ★

శ్లో॥ యా కుందేందు తుషారహారధవళా యాశుభ్రవస్త్రాన్వితా
యావీణా వరదండ మండితకరా యాశ్వేత పద్మాసనా
యా బ్రహ్మాచ్యుత శంకర ప్రభృతిభిః దేవైః సదా వందితా
సామాంపాతు సరస్వతీ భగవతీ నిశ్శేషజాడ్యాపహాః

మల్లెపూవువలే, చంద్రునివలే, మంచువలే, ముత్యమువలె స్వచ్ఛమైన ధవళ వస్త్రములను ధరించి శ్వేత పద్మమునందు ఆశీనురాలై, బ్రహ్మ, విష్ణు మహేశ్వరులు మొదలైన దేవతలచే స్తుతింపబడుచు విద్యలకు దేవతయైన ఓ సరస్వతీ! మా మనస్సుల నుండి అజ్ఞానమును పూర్తిగా తొలగింపుము.

★ ★ ★ ★ ★

## Vవ, శాఖ, 8వ, తరము.



## 3. కీ.శే. జమలాపురపు వెంకట కిషన్‌రావు గారు వ్రాసి వుంచిన జమలాపురపు వంశజుల జీవిత విశేషాలు.

ఇద్దరి కన్యలతో పాణిగ్రహణము జరుగుటచే ప్రధమములో జమలాపురపు కరిణీకము, 'మిరాశి' యూ లభించుటచే 'జమలాపురపు పెద్దిరాజు అనే వాడుక పేరాయెను.

ఆ కాలములో "జమాబంది"కి గోలుకొండకు దస్తరాల సంయుక్తము "కరణము" పోయి జమాబంది చేయించుకొని రావటం ఉండెనట. అందరితో పాటు రేమిడి చర్ల, జమలాపురం దస్తరములు సంయుక్తం పెద్దిరాజు గోలుకొండ వెళ్లి అక్కడ కొంతకాలము వుండుటచే 'ఏక సంతాగ్రాహి' గనుక రాజకీయ భాష మాట్లాడ నేర్చుకొని చాకచక్యముగా జమాబందీ చేయించుటయు, అధికారులు మెచ్చుకొని, ఈ మధిర పరగణా అన్ని గ్రామాదుల జమాంబందీలు ఈయన కృతంగా జరిపించెరట.

ఈ స్థితి ప్రభువుగారికి తెలిసి సంతోషించి ఏమి కావలెనని అడుగగా.... బిల్ మక్తార్ 45రు.లు సాలు ఒకటింటికి చెల్లించుతూ పుత్ర పౌత్ర పరియాయముగా కావలెనని కోరినందున అదే ప్రకారము 'హుకుం' యిస్తూ 'దేశ పాండ్యాగిరి' కూడా యిచ్చిరి.

ఈ మధ్య "ఇనామతు" వారి దరియాప్తులోవచ్చే బిల్లును ఉంచుతూ...ద్వారా వసూలు కొరకు ఫయిసలా కాబడి మా గ్రామ భూమిని అనుభవిస్తూ, 'పట్టే దార్లమని' 'దేశ పాండ్యాల'మని పేరు మాత్రము ఇప్పటికీ మా వంశీకులకు కలిగెన ప్రతిష్ఠకు పెద్దిరాజు గారే మూల పురుషుడు.

ఈ పెద్దిరాజుకు నేను ఎనిమిదవ తరము వాడను. నా వంటి వారనేకులు కలరు. 'వంశ వృక్షము' యావత్తు కనపరచుట విధియేకాని, అంతా యిచ్చట వ్రాయుట దుస్తరము. వీలు వున్న 'వంశవృక్షము' మరి యొకప్పడు పొందుపరచెదను. ఇక్కడ క్లుప్తముగా మా వంశపు వివరాలు విశదీకరించుచున్నాము.

పెద్దవియును క్లుప్తపరచి అర్ధసహితముగ వ్రాయుట విశేష జ్ఞానులకు సులభముగాని నా వంటి అల్పజ్ఞులకు వశము కాదని దానికి చిన్న ఉదాహరణ.

ఒక కవి భారతమును వ్రాయుచుండెనట! ఆయన యింటికి ఒక గృహస్తు వచ్చి "మీ మామగారేమి చేయుచున్నారని"? నూతనముగా సంసారమునకు వచ్చిన నవోదయయగు కోడలిని అడిగెనట. ఆ చిన్నది యింటిపనులు చేయుచూ "మా మామగారు కొండవీటి చాంతాడు వలె భారతము వ్రాయుచున్నారని" బదులు చెప్పెనట. ఈ మాట మామగారు విని కోడలి సమాధానము కచ్చెరువంది "అమ్మాయి. ఒక కంద పద్యములో భారతమునంతయు యిమడ్చగలవా"? యని అడిగెనట.

తమ సెలవైతే అటులనే యని తక్షణమే ఈక్రింది పద్యము చెప్పెనట.

కం.. పదియును సప్త దినంబులు
పదపడి రెన్నాళ్లు నొకదివసమును పగలున్
కదనంబు చేసి మడసిరి
నది సుత, గురు, కర్ణ, శల్య నాగపురీశుల్

అని చెప్పట నా బోట్లకుశక్యమా కొంత హ్రస్వము, కొంత దీర్ఘము వుండును. ఇందు కవితా విమర్శగాక విషయ గ్రహణమే ముఖ్యమని పాఠకులు గ్రహించకోరెద.

**Vవ శాఖ 6వ, తరము**

**మా తాత కిష్టయ్యగారు :-**

మా తాతగారు బాల్యదశలో వుండే కాలమందు మా వంశములో తూర్పువంటు అనగా మూల పురుషుడ పెద్దిరాజు రెండవ కుమార్డు వీరరాజు వీరి సంతతి స్థితి ముందు రాబోవుచున్నది. తూర్పు వంటులోని వాడగు పెద్ద వీరభద్రరావుగారు (VIవశాఖ 7వతరము) ప్రయోజకుడై, ప్రముఖుడై మా మక్తా కేశిరెడ్డి పల్లి గ్రామమును, "దేశపాండ్యా"గిరిని తానొక్కడే స్వాధీన పరచుకొని జ్ఞాతివర్గమును చెల్లాచెదరు చేయగా, ఈదాడికి ఆగజాలక పై తావులకు వలస పోగా,ఎదిరించెడి వారు లేక నిరంకుశముగా వర్తించెనని మా తాత కిష్టయ్యగారు పెద్ద వాడై హైదరాబాద్ వెళ్లి ఈ 'పట్టే తహదు' తన పేర పెట్టుకొని తిరిగివచ్చువరకు పెద్ద వీరభద్రరావుగారు వ్యాధిగ్రస్తులై చివరకు నిస్సంతుగానే మిగిలిపోయిరి. దీనికి సమకాలము రాజ రామమోహన్‌రాయలు సీమకు వెళ్లి 'సహగమనము' నిషేధపు ఉత్తరువు వచ్చినదై యున్నది. మా తాతగారు వ్యవహారానికి వచ్చి వలస పోయిన వారిని రప్పించి ఎవరి ఊళ్ల "కరిణీకము" వారికియిప్పించి నెమ్మది కలుగ జేసెనని మా వాళ్లందరు నా చిన్నతనములో చెప్పేవాళ్ళు. వీరి కుమారులు.

1. **వెంకటప్పారావుగారు : వీరికి** రెండు వివాహములై, రెండవ భార్యకు సంతతి కల్గియు దక్కలేదు. మా వంశములోని తూర్పువంటులో లక్ష్మన్న గారి అయిదవ కుమార్డు రామకిషన్‌రావు గారిని దత్తుగొన్నాడు. వెంకటప్పారావుగారు ఫారసీలో పండితులు కాకపోయిననూ కొంత వరకు చదువుట వ్రాయుట కల్గి తెనుగును సంస్కృతము 'అచారకాండ' మొదలైనవి చాలమటుకు తెలుసును. నైతికము త్రికాండ, అమరము, కాలామృతం తెలుసును. కవిత్వమందుకూడా ప్రవేశము కలదు.

దిత క్రియా కాలనంబు చెంద.......

బుద్ధి పోనతన్, జాలి దొరంగి వేగమననా! పరమేశ్వరునుతించుమా అని, హరి పాదములాశ్రయించుమా! అని ... పరమేశ్వరునిపై శతకము చెప్పిరి. అది మా యిల్లు పరశురామ ప్రీతిలో పోయెను. యావదాస్తితో పోయినది. "అగన్, మగన్, యగన్, బేగన్ చేయు మా! రెండు నీ కుమారుడు గాగ" అని మొదలగు అనేక చాటుదారు పద్యములు రచించిరి. పేష్కారీ, తాసిల్దారీ వరకు నల్లగొండ నాగర్ కర్నూలు జిల్లాలలో పనిచేసిరి. హైదరాబాద్‌లో అనేక మంది గొప్పవారలతో

పరిచయము, స్నేహము సంపాదించిరి. కీర్తిశేషులు కాపురాజుగడ్డ దివాని శంకరరావు గారితో బంధుత్వము కన్న మిన్నయగు స్నేహముతో మెలగిరి. వారి కుమార్డు రామచంద్రరావు గారి ప్రధమ వివాహములో మా పెత్తండ్రి గారికి బహుమతి చేయబడిన గొప్ప శాలువా మొన్నమొన్నటివరకు వున్నది.

## Iవ శాఖ
## 10వ తరము.

1. **సుబ్బారావు** : కోత్వాల్ (సబ్ ఇన్‌స్పెక్టర్) పనిచేసిరి. ఒక కుమార్తె, ఒక కుమార్డు కొండలరావును కలరు. ఎఱ్ఱుపాలెంలో స్వస్థలము నందు ఒక చతుశ్శాల భవనము కలదు.

**2. వీరభద్రరావు :**

ఈయన కూడా మంచి ఉద్యోగము చేసెను.కుమార్డు డాక్టరు పాసై ప్రాక్టీసు చేస్తున్నాడు.

**3. వెంకటేశ్వరరావు :**

ఈయన ఖమ్మం మెట్టులో మంచి గృహ నిర్మాణము చేసుకొని వకాలతు పాసై వకీలుగా ఖమ్మం, మధిర వగైరా కోర్టులలో పనిచేయుచున్నాడు. మిక్కిలి సజ్జనుడు, కుమార్డు సత్యనారాయణరావు యం.ఎ. చదివెను.

**4. నారాయణరావు :**

మా కుటుంబానికి దత్తుడుగా వచ్చెను. (Vవ శాఖ ౨వ, తరమునకు)

**5. గోపాల్ రావు:**

హైకోర్టు వకీలు. హనుమకొండ, కిషన్ పురాలో స్వగృహము నిర్మించెను. అదాలతు జిల్లా సబ్‌కోర్టులో పనిచేయుచున్నాడు. వీరందరూ స్ఫురద్రూపులు. తెలివిగలవారు. కుమారులు రామకిషన్‌రావు, శ్రీ కిషన్‌రావు, శ్రీ రాంరావు. Iవ శాఖ, 7వ తరము పాపయ్యగారు ప్ర[illegible]ఖులు, వ్యవహారతులు పాపయ్యగారి కుమార్డు కొండలరావుగారు కూడా తండ్రిగారి వంటి వారే.

తమ్ముడు లక్ష్మయ్యగారి రెండవ కుమార్డు రామారావును దత్తు చేసుకున్నారు. రామారావు మాలీ ఉద్యోగం చేసెను. అద్భుత వ్రాతలెక్కలకు పేరు పొందెను. సంగీత కవిత్వము తెలుసును. లక్ష్మయ్యగారి పెద్ద కుమార్డు పాపయ్యగారి కుమారు కొండయ్య మాలీ ఉద్యోగము చేసెను. తెనుగు వ్రాతలో ఎంత పొడవైన పంక్తియైననూ అక్షరము విడివిడిగా వుండి, గొలుసుతెగకుండా పంక్తి ఆద్యంతమును వ్రాసేవేర్పరి. పాపయ్య కుమార్డు కొండలరావు ద్విభాషి, ఉత్తముడని పేరు పొందెను. కొడుకు పరాంకుశరావు దుభాషి, వకీలు, వకాలతు పాసాయను. వీరభద్రరావు గారు స్వార్జితముగా యెర్రుపాలెం మాలీపటేలు గిరి సంపాదించి ఇరువది అయిదు సంవత్సరములు నాతోపాటు పటేలు గిరి చేసెను. ఈయనకు ఒక కుమార్డు శీతారామారావు. బిడ్డ గోపమ్మ, దౌహిత్రుడు దేవరాజు సుబ్బారావు.

సూర్య నరసింహారావు మాలీలో ౩౦ సంవత్సరములు ఉద్యోగము చేసి చివరకు నగదీశగావుండి నెల ఒకటింటికి ౩౦ రూపాయిలు ఉపకార వేతనము పొంది యున్నాడు. ఈయన కుమార్డు లక్ష్మీపతిరావు మెట్రిక్యులేషన్ పరీక్షకరోడ్‌గిరిలో రు ౩౦ నుంచి ౬౦లు గల ఉద్యోగము అయిదారు సంవత్సరముల నుంచి పని చేస్తూవున్నాడు. నరసింహారావు రెండు భాషలలో దస్తూరి మాత్రము సామాన్యులకు తెలియదు.

IIవ శాఖ

4వ తరము :

వెంకట్రాయుడు :

బాపిరాజు రెండవ కుమార్డు వెంకట్రాయుడు ఈ సంతతిలో అంతా సామాన్య ప్రయోజకులే.

IIIవ శాఖ

4వ తరము :

భాస్కరుడు

భాస్కరుడి సంతతిలో శేషయ్య కుమార్డు లక్ష్మీపతిరావు తొర్లపాటి కరిణీకమును చేసెను. కుమారుడు చిన్న వెంకట సుబ్బారావు తండ్రి అనంతరము చేయుచున్నాడు. యిద్దరిలో పెద్ద కుమారుడు వెంకట్రామారావు, ఇంటి వద్దనే వుండి తండ్రికి సహాయముగా వున్నాడు. లక్ష్మీపతిరావుగారి రెండవ కుమార్డు జగన్నాధరావు హైదరాబాద్‌లో బి.ఎ. సీనియర్ క్లాసులో ఉన్నాడు. రెండవ కుమార్డు శేషగిరి రావు మధ్య అంధుడు.

భాస్కరుడి సంతతిలో జోగయ్యకు గోపాల కిష్టయ్యగారి కుమార్డు పెద్దవాడు గుర్రావు రెండు విద్యలు నేర్చి మాలీసేగేదారుగా వుండి పారమార్ధికుడనే పేరు వడసెను. నిస్సంతుగా వుండెను.

IVవ , శాఖ

4వ , తరము :

## రామన్న

ఈ సంతతిలో జగన్నాధరావు గారు స్వార్జితంగా అనేక భూములు సంపాదించిరి. అతిధి అభ్యాగతులే కాక, కొంతకాలము భద్రాచల యాత్రార్ధులకు కూడా "అన్నదానము" చేసి పేరు వడసిరి. లౌక్యములో కూడా మిక్కిలి సమర్ధత చూపిరి. వీరి అల్లుడు మాడపాటి తిరుమలరావుగారు ఉద్యోగము వదలిపెట్టి ఇక్కడకు రావడం, దివ్యమైన యిల్లు కట్టించి నందుకు వీరు వకాలతులో అవ్వల్దర్జా వరకు పాసై సర్వవిధముల మామగార్కి అండగా వుండుటవల్ల జగన్నాధరావుగారి కీర్తి విస్తరిల్లెను. దౌహిత్రుడు రామచంద్రరావు కూడా ఎల్.ఎల్.బి. పాసై మధిరలో ప్రాక్టీసు పెట్టాడు.

జగన్నాధరావుగారు జమలాపురం శ్రీవెంకటేశ్వరస్వామి వారి ఘట్టు వద్ద పనులకు చాల శ్రద్ధతో తోడ్పడిరి.

జగన్నాధరావుగారు తమ్ముడు సీతారామయ్యగారు సుమారు నలభై

సంవత్సరముల కాలము దైవ భక్తి గలవాడై ఈ ఎర్రుపాలెం గ్రామములో గ్రామ మధ్య మొండిగోడలలో నివసించి యున్న శ్రీఆంజనేయ విగ్రహమును ప్రతిష్టించెను. తండ్రి వీరభద్రరావుగారు కొట్టించి తెచ్చి గ్రామ మధ్య సావడివేసి వుంచిన "ధ్వజస్థంభము" ప్రతిష్ఠ చేసి ఆ స్థలములోనే "శ్రీ చంద్రమౌళేశ్వర స్వామి" ప్రతిష్ఠయు, అనంతరము "శ్రీ బాలా త్రిపుర సుందరి"యు "సత్రశాల" మొదలగు గాగల సర్వకార్యములు పూర్తి చేసిరి. ఈ శివాలయము నిత్య నైవేద్య దీపారాధనలకు మా జమలాపురపు వారికి మక్తాగ్రామమైన కేసిరెడ్డిపల్లిలో మా అందరి సముదాయములో నుంచి ఇనాం యివ్వబడినది. శీతారామయ్యగారి జీవిత కాలమువరకు కళ్యాణ మహోత్సవము మొదలైన అనేక వుత్సవములు జరుగుతూ వుండెడివి. వారు గతించిన సంవత్సరము నుంచి అన్నిచప్పబడి "ఇనాం" వల్ల నిత్యనైవేద్య దీపారాధనలు మాత్రము జరుగుచున్నవి. ముందు జరుగబోయే స్థితి ఇప్పడు వ్రాయుజాలను. వీరభద్రరావుగారి మనుమడు పెద్దిసుబ్బారావుగారు దైవభక్తిగలవాడు. మంచి స్థితిలో వున్నాడు.

## IVవ శాఖ

## 4వ తరము :

## బుచ్చిపాపయ్య :

1) **వెంకటప్పారావుగారు** సంతానము లేనందున మా వంశములోని తూర్పు వంటు (శ్రీరాములు)రామ కిషన్‌రావు ను దత్తు తీసుకొని వచ్చారు.

రామకిషన్ రావుగారు (శ్రీరాములు) నిస్సంతుగా చనిపోవడం వల్ల మా పెదతండ్రి గారి కోడలు సీతమ్మ గారికి మా పడమర వంటులోని రామారావుగారి నాల్గవ కుమార్డు నారాయణ రావును దత్తు చేసిరి.

నారాయణరావు మిడిల్ పరీక్ష అయెను. చాల తెలివి గలవాడు. జమలాపురం పట్వారీగిరి (కరణీకం) చేస్తున్నాడు. ఈయన కుమాళ్ళు 1 రామకిషన్‌రావు 2. వెంకటేశ్వరరావు. 3. బాలకృష్ణారావు.

2) **రామారావు** గారికి నేను వెంకట కిషన్‌రావును కుమారుడ్ని, నాకు రామనరసింహారావనే కుమార్డు. వాడికి ఇప్పడు ముగ్గురు కుమార్లు, ఒక ఆడపిల్ల ఆడ పిల్ల వివాహ మయింది.

3) **సుబ్బారావు** నా పెద్ద పిన తండ్రి వీరికి సంతానము లేక పోవుటచే వారి తమ్ముడును నాకు పినతండ్రియైన వెంకట్రావు గారి రెండవ కుమారుని దత్తుచేసుకున్నారు. ఈ దత్తుడు పెద్ద వెంకట్రామారావు కు ముగ్గురు కుమార్లు, 1. కేశవరావు 2. నారాయణరావు (దత్తువెళ్ళినాడు) 3. మాధవరావు.

4) **వెంకట్రావు** నా చిన్న పినతండ్రి వీరికి ఇద్దరు కుమార్లు, రెండవ పెద్ద వెంకట్రామారావును అన్న సుబ్బారావు గారికి దత్తు యిచ్చాడు. పెద్ద కుమారుడు మార్కండేశ్వరరావు, ఈయనకు 1. వెంకట్రావు, 2. శేషగిరిరావు 3. లక్ష్మీనరసింహరావు (బుల్లబ్బాయి) 4. రాజారావు.

నా యిద్దరి పినతండ్రులలో పెద్ద సుబ్బారావుగారు ఖమ్మం వరంగల్ జిల్లాలోను, చిన్న వెంకట్రావు గారు నాగర్ కర్నూలు నల్లగొండ జిల్లాలలోను మస్తఖిల్ పేష్కార్ మధ్య మధ్య మున్సరం తాసిల్దారీలు చేసి పేరు గణించిరి. చివరకు యిక్కడికి వచ్చి యిళ్ళు కట్టించుకొని ఇక్కడనే వుండి నాకు పెద్ద లేని లోటును తీర్చి స్వశక్తులు కలుగు వరకు నన్ను కాపాడినారు.

భాతృవాత్సల్యముతో, జ్యేష్ఠుడనగుటచే ఇప్పటికిని విధేయులై యుండెదరు. నా పెత్తండ్రిగారి మనుమడునూ నారాయణరావు కూడా కిష్టయ్యగారి కుటుంబము నాల్గు యిళ్ళల్లోని నేను వయోవృద్ధుడనని నా గౌరవము కాపాడు విషయమ్పై అనుకూలురై మెలుగు చుండిరి. కుటుంబ అనుకూలము వల్ల మనఃశాంతికి ముఖ్యహేతువు.

**VIవ శాఖ**

**4వ తరము :**

**పాపరాజు :**

**1. పాపరాజుగారి కుమారుడు లక్ష్మీనరసయ్య గారి 4గురు కొడుకులు**

వెంకటరామప్ప గారి రామద్దాసు (రామచంద్ర)రావు అనే కుమార్డు. తెలివిగల వాడుగా వుండి చేసిన తన వ్యవహారములో మక్తా ఇనాం హైదరాబాదులో వుండి పెద్దిరాజు (మూలపురుషుడు) ఆర్జించిన వంశస్థులందరికి చెందియున్న గ్రామము యొక్క ముంతేఖిబ్‌లు ఒక్క తన తాతగారు లక్ష్మీనర్సు గారి నలుగురు కుమార్లలో వెంకట్రామయ్యగార్కి పట్టేదారుగా తన పినతండ్రి పెద్ద వీరభద్రరావుగారు మా వంటు (పడమర) లో తాతయ్యగారికి తన పినతండ్రి రామకిష్టయ్యకు దత్తు వెళ్ళుట వల్ల మా వంటు పట్టేదారు సంతతి లక్ష్మారావు పట్టేదారాయెను.

**2. వెంకట్రామయ్య దత్తుడు విశ్వనాధరావు లక్ష్మన్న**

**3. రామకృష్ణయ్య**

II వ శాఖ, 5వ తరము తాతయ్యగారికి దత్తు పోయెను.

4. 6వ తరము పెదవీరభద్రరావు గారికి లక్ష్మీనరసింహారావు, విశ్వనాధరావు ఇద్దరు కొడుకులు, విశ్వనాధరావును పెద వీరభద్రరావుగారి అన్న వెంట్రామయ్య గారికి దత్తు ఇచ్చారు.

లోగడ వ్రాసిన జ్ఞాతులందరని చెట్లు పట్టించి మైలవరం జమిందారు గారితో 'ముఖాబిలా' చేసి గడ గడ లాడించి రేమిడిచర్ల పొలిమేర రాయి మైలవరం జమిందారీ దివాణం పడమర ప్రహరీలో వేయించినారనియు, వారితాలుకు ఆవులు మందలను మధిర బందెల దొడ్లో తోలించినారని ఇంకా అనేక అద్భుత విషయములు చెప్పకుండేవారు.

పెద్ద వీరభద్రరావుగారు పెద్ద కుమార్డు లక్ష్మీనరసింహారావు గారు గౌరవరం, తాటిగూడెం, త్రిపురవరం పట్వారిగా చాలకాలము జేసిరి. వీరికి ముగ్గురు కుమార్లు వీరభద్ర రావు 2. రామారావు 3. శీతారామారావుగార్లు సర్కారీ మాలీ వుద్యోగము చేసిరి.

లక్ష్మీనరసయ్యగారు ఇప్పటికీ సజీవులై ఇతర గ్రామములకు పాదచారియై ప్రయాణిస్తూన్నారు. వయస్సు 88 సంవత్సరములు. మక్తాకేశిరెడ్డి పల్లెకు రెండు పటీలు గిరీలకు అసలుదారు.

## VIIవ, శాఖ

### 4వ తరము :

### వెంకన్న 4

ఈ వెంకన్న సంతతి వారందరికి ఈ ఎర్రుపాలెం సరిహద్దు ఉత్తరము రెండు మైళ్ళ దూరమున ఉండే పెద్ద గోపవరం నివాసము. మిరాశిగ్రామము. ఈయన సంతతివారు మూడు శాఖలయినవి.

పెదవెంకట్రాయుడు : 7 వ, తరము

వీరు పెద గోపవరం పటేల్ గిరి చేసి భూమి, ధన, పసు సంపత్తి గణించి సమర్థుడు, కర్మిష్టి అని పేరు గడించెను.

వీరి పెద్ద కుమార్డు లక్ష్మారావు మిక్కిలి తెలివి గలవాడై వివాహితుడై చిన్నతనము నందే దంపతులిద్దరు గతించిరి. రెండవ కుమార్డు జోగారావు ౨, ఫారసీలో మంచి పండితుడై మాలీ వుద్యోగము చేసెను. ఒక కుమార్తె కల్గెను చక్కని వ్రాత మృధుమధురశైలి.

తిరుమలరావుగారి రెండవ కుమార్డు రామచంద్రరావు ఫారసీలో పండితుడు. వక్త. ఆయన గారు కూడా అన్న గారి వలెనే పేష్కారీ తాసిల్దారీ పనులు నల్లగొండజిల్లాలో చిరకాలము చేసిరి. వారికి పుత్ర సంతానము లేదు. రెండవ భార్యకు ఒక ఆడపిల్ల ఆపిల్లను మేనరికము మాడపాటి హనుమంతరావు గారికిచ్చిరి. ఆమెకొక ఆడపిల్ల, బుజ్జమ్మ.

**2) వీరయ్య**

వీరికి బాపయ్య, వెంకట్రాయుడు అనే ఇద్దరు కుమార్లు, వీరు కరీంనగర్ జిల్లాకు పోయి అక్కడనే స్థిరపడిరి.

**3) బాపయ్యగారు :**

వీరికి రామకృష్ణయ్య, సూర్యారావు యిద్దరు కుమార్లు రామకృష్ణయ్యకు ఒక ఆడపిల్ల, ఆ ఆడపిల్లను బుద్ధిరాజు కామేశ్వరరావుకి యిచ్చి చేసిరి. వీరిని బనిగడ్లపాటి చిన్నకృష్ణయ్యగారి కుమార్డు నారాయణరావుకు దత్తు చేసిరి. రామకిష్ణయ్యగారి భార్య రాంబాయమ్మ కేసిరెడ్డి పల్లెలో తన భాగం అనుభవిస్తూ వుంది.

**సూర్యారావు :**

వీరు మంచి ప్రయోజకులు బందో బస్తులో ములాజుంగా హనుమకొండలో ఉండిరి. ఒక కాలమందు వ్యవహారవిషయములో నాకు చాల సహాయం చేసిరి. వీరు నిస్సంతు.

**రామారావు (8 వతరము)**

వీరి నివాసము 'మిరాశి' గ్రామమ్మైన పెద్ద గోపవరంలో ఉండక దూరస్తము ఎక్కడనో ఉత్తరాది వూళ్ళల్లో వుండిరి. నిసబ్ ఖాల్సా నాల్గవ నెంబరులో ఎవరి షిక్మి హిస్సాలకు వారిపేర్లు, నమోదు సన్ 1289 ఫసలీలోనే చేసుకొంటిమి. రామదాసు (రామచంద్రరావుగారి తెలివి, అవకాశము ఈ విధంగా ఉపయోగించిరి. వీరికి పుత్ర సంతతిలేదు. వీరికి రామారావు, సుబ్బారావు అని యిద్దరు కుమార్లు, రామారావు

కరోడ్గిరి లో వెంసూరు పట్టి మర్లపాడులో ఉన్నందున అక్కడనే భూమిని సంపాదించి ఇల్లు కట్టుకొని నివాసమేర్పరచుకొనెను. గనుక సదరు ఉభయులు తల్లి సహా మర్లపాడులోనే ఉండి చుట్టు పట్ల ఊళ్ళ కరిణీకాలను చేస్తున్నారు. ఇద్దరు మంచి రాతగాండ్లు, ప్రస్తుతం పెదగోపవరంలో ఉండే మక్తాలో నాల్గవ వంతుకున్న గోపవరం మిరాశీ కి వారసులు వారే. ఇట్టి వీరికి గోపవరంలో నివేశ స్థలము కూడా అన్యాక్రాంతము కాగ మక్తాలో వీరికి చివరకు ఒక నెల గ్రాసమైన చెందుతున్నదో లేదో సందేహమే 'సర్వం నిష్ఫలితమాయను.'

**8 లక్ష్మయ్యగారు : 8 వ తరము**

ఈయనకు భాస్కరరావు, రామయ్య, సూరయ్య, వెంకటప్పయ్య అనే నలుగురు కుమార్లు భాస్కరరావు మంచి రాతగాడు. మా నాయన గారి వద్ద లెక్కలు వ్రాయగా చూసి తిని గోఫవరం మాలీపటేల్ అసలు వతందార్లు, కొంతకాలము పటేలు గిరి చేసిరి. ~~భ్రష్టావారలుగానే వుండిరి.~~

వెంకటప్పారావు (8 వ తరం) మా వంటులోని చిన్న సుబ్బయ్యగారి కుమార్డు IV వ శాఖ (74) పెద్దలక్ష్మయ్య గారు దత్తుడి,

## అస్మత్ గురు భ్యోనమ :
## నా యొక్క స్వీయ చరిత్ర

*-కీ.శే. జమలాపురపు వెంకటకిషన్‌రావు*
*పట్వారి, ఎఱ్ఱుపాలెం.*

మొదటి ప్రకరణమందు మా వంశచరిత్ర వ్రాసితిని. పునరుక్తి అనవసరము గనుక క్లుప్తముగా సూచించుచున్నాను.

1 వ తరం పెద్దిరాజు (మూలపురుషుడు) 2 వ తరం బసవరాజు 3 వ తరం జగ్గరాజు 4 వ తరం బుచ్చి పాపయ్య 5 వ తరం బాపిరాజుకు 6 వ తరం కిష్టయ్యకు నలుగురిలో రెండవవారు మా తండ్రి రామారావుగారికి ఏక పుత్రుడను నేను. వెంకట కిషన్ రావును. నాకు ఏక పుత్రుడు రామనరసింహారావు వాడి ప్రస్తుతము ఉన్న కుమార్లు 1. సత్యనారాయణ శర్మ 2. పురుషోత్తమ శర్మ, 3. రామేశ్వరరావు. (మాతామహునిపేరు) 4. ఒక ఆడపిల్ల చిట్టెమ్మ (లలితాబాయి)

**నేను, నా జననం :**

రక్తాక్షి నామ సంవత్సర (1864) కార్తీగ.................................స నా జననాది నాల్గు సంవత్సరములు గడచే వరకు మాతల్లి మహలక్ష్మమ్మగారు జీవిత ప్రధమ పాదము (25 సంవత్సరముల) లోనే పరలోకము చేరెను. 'మాతృహీన శిశువు జీవనము వృధా'! యనునట్లు ఆయెను నా బ్రతుకు.

**మాతృ వియోగానంతరము :**

మా నాయన గారు నాయందు సహజమగు పితృప్రేమయే గాక తల్లిలేని బిడ్డడనని అపారమైన ప్రేమ చే కాపాడు చుండెడివారు. ఇట్లుండ జీవయాత్ర

గడచుటకై ద్వితీయ వివాహమాడిరి. ఆమెగారికి ఒక ఆడపిల్ల కల్గిన పిమ్మట బహుధాన్యనామ సంవత్సర కార్తీక బహుళ చవితి (1879) రోజున మా నాయనగారు స్వర్గస్తులైరి. నా సవతి చెల్లికి యెనిమిది సంవత్సరముల ఈడు వచ్చేవరకు ఆ పిల్లకూడ నాతోపాటు తల్లిదండ్రులు లేని పిల్ల ఆయెను. మా అమ్మగారు కాలము చేసిన 1,2, సంవత్సరములలోనే నన్ను సాదుటకు ఇంటిలో ఆడ దక్షత లోపమాయెను. నా మేనత్త గోవిందరాజుల వెంకమ్మగారు మాత్రము వుండిరి. ఇక్కడ ఆమె స్థితి క్లుప్తముగా వ్రాయవలసి వచ్చినది.

మా తాతగారి సంతానము నలుగురిలో నా పెత్తండ్రి వెంకటప్పారావు గారు, మా నాయన రామయ్యగారి తరువాత మా మేనత్తయూ, నా పినతండ్రి వెంకట్రావు, వీరితండ్రిగారు కుమార్లతోపాటు కుమార్తెకు కూడా విద్య చెప్పించిరి. అన్నలతో పాటు త్రికాండ అమరము చదివించారు. కీ.శే. ముదుకుట్ల అప్పయ్య శాస్త్రులవారి వద్ద పంచకావ్యములు కూడ పఠించిరి. ఆమెగారు యనభై సంవత్సరములు పై కాలము జీవించి దివంగతులైరి. ఆమెగారు, భారత, భాగవత, రామాయణ, హరివంశము మొదలగు గ్రంధములు ఎల్లప్పడూ స్త్రీలకు పురాణముగా చదివి అర్ధము చెప్పచుండుట నేనేగాక ఈ గ్రామములో ఇప్పటికీ ఉండే వయోవృద్ధులంతా ఎరుగుదురు ఆవె గారిని బెజవాడలో కీర్తి శేషులైన గోవిందరాజుల వెంకయ్యగారి మొదటి భార్య కుమార్డు రామయ్యగారికిచ్చి వివాహము చేసిరి. ఆమెగారికి ఆనంద నామ (1854) సంవత్సరము తొలి చూలి మగశిశువు కల్గి తొమ్మిది మాసములు పెరిగేవరకు ఆమెగారు వితంతువు. బాలుడు పితృహీనుడాయెను. దినవారములు వెళ్ళగనే మానాయనగారు బెజవాడ వెళ్ళి తొబుట్టువును, మేనల్లుడ్ని ఇంటికి తీసుకొని వచ్చి తన వద్దనే వుంచుకొనెను. ఆయనగారి పేరు శోభనాద్రిరావు. వారు నాకంటే పది సంవత్సరములు పెద్ద. నేను పుట్టిన తరువాత వారిని పెద్దబ్బాయి, నేను చిన్నబ్బాయి అని మా వాళ్ళందరూ పిలువసాగిరి. నాకు మాతృ వియోగము కలిగి నా పోషణకు ఆడరక్షణ లేకుండుట మా బావగారు విద్యాభ్యాసమునకు అన్యోన్య సహాయ మవసరమగుటచే మా పెత్తండ్రి, పినతండ్రి ఉద్యోగములో వుండి సూర్యాపేట, నల్లగొండ, నాగర్ కర్నూలు, భోనగిరి, ఖమ్మం మెట్టు, మోటుకూరు తావులకు నన్ను వెంబడించుకొని వెళ్లి వుండెడి వారము. మా చిన పినతండ్రి వెంకట్రావు గారు మొదట నాగరు కర్నూలు తరువాత నల్లగొండ జిల్లా వేముకొండ తాలూకా ముస్తఖేర్ తాసీలు కచ్చేరిలో పనిచేసిరి.

నా మేనత్త గారి కుమార్డు శోభనాద్రి రావుగారు మేనమామల వద్ద వుండితెనుగు, కొంత సంస్కృతము మొదలైనవిచదివి ఫారసీలో మిక్కిలి పాండిత్యము గడించి ఉద్యోగములో ప్రవేశించి కంది కొండ తాలూకా నెల్లికుదురు తహసీలు ముస్తఖిల్ పేష్కారీలో ఉండి వ్యాధి గ్రస్తులై సన్ 1297 ఫసలీలో (ముప్పది మూడు సంవత్సరములకే) దివి కేగిరి. స్ఫుర ద్రూపులు. మృధుమధురవాణి. వారినెరింగిన వారు మావూరిలో యిప్పటికీ కొందరు కలరు. అతిశయోక్తిగా నుండునని వీరి వర్ణన విస్తరించజాలక వదలితిని.

ఇంకొక సంగతి మరచితిని, నా చిన పినతండ్రి వెంకట్రావు గారికి ఒక తొలిచూలు ఆడపిల్ల, నాకంటే ఒక సంవత్సరమున్నర చిన్న, వెంకట్రావమ్మ వుండెను. మేమిద్దరము ఏ కోదరులవలే మా బాబయ్య పిన్ని, గార్ల వల్ల మిక్కిలి గారాబముగా నాగర్ కర్నూలు, మోటుకూరు, భోనగిరిలో కొంతకాలము పోషించబడితిమి. తిరిగి వెంకట్రావమ్మను మేనరికము శోభనాద్రి బావగారికిచ్చిరి. కొలది కాలమునకే ఆమె గతించెను, అప్పటికి మా పిన్ని (వెంకట్రావుగారి భార్య) గర్భవతిగా మాత్రముండెను. ఒక పసి కూనయైన లేకుండెను. అప్పటి స్థితి తలంచుకున్న నీరయి పోవును. నేను మాత్రము వారివద్దనే వుండుటచే నేను వారి కుమారుడుగా, వారే నాకు తల్లి దండ్రులుగా నుండుటచే తనూ క్రమేణ దుఃఖముపశమించు కొలది దినములలోనే పుత్రోదయము మ ర్కండేశ్వరరావు గారు కలుగుటయు జరిగెను.

**మా మేనత్త కుమార్తె :**

శోభనాద్రిగారికి ప్రథమ కళత్రము వెంకట్రావమ్మగారు దివంగతయగుటచే నా సవతి తల్లి కుమార్తె లక్ష్మమ్మను ద్వితీయ వివాహమాడిరి. లక్ష్మమ్మ కాపరానికి వెళ్లిన కొలది కాలమునకే 1297లో మా బావగారు కాలము చేసిరి. నిస్సంతుగా పోవుటచే శనగపాడు గోవిందరాజుల వెంకటప్పయ్యగారి మూడవ కుమార్తె నరసింహారావును తీసుకొని వచ్చి మా బావగారికి, చెల్లెలికి దత్తు చేసితిమి. నరసింహారావుకు శోభనాద్రిరావు, శివరామారావు, నరసింహారావు అనే కుమాళ్లు కలిగిరి. శోభనాద్రిరావుకు ఇద్దరు కుమాళ్లు కలిగిరి. ఇందువల్ల మా తాతగారి సంతతి నల్గురు కుమార్లతో పాటు కుమార్తె సంతతి నా చెల్లెలి కుటుంబము కూడా వృద్ధిలో వుండె అయిదు యిళ్ల వాళ్లమయితిమి.

**విద్యాభ్యాసము :**

నాకు పది సంవత్సరముల యీడు రాకమునుపే తిరిగి యింటికి రాబడితిని, మా నాయనగారి వద్ద వుండే మా గ్రామం తెలుగులో పండితుడనే పేరు పొందిన కీర్తి శేషులు గడ్డ మణుగు వెంకటప్పయ్యగారి గురువర్యుల వద్ద విద్య నభ్యసించితిని.

ఇంతలో నా పెద్ద పినతండ్రి, సుబ్బారావు గారు వచ్చి, వారు ఖమ్మం మెట్టు పేష్కారీలో ఉన్నందున నన్ను తీసుకొని వెళ్లి ఖమ్మం సర్కారీ మదరసా కీ.శే. మౌల్వీ అబ్దుల్ రహీం, సాహెబ్ గారి వద్ద ఫారసీ మొదలు పెట్టించిరి.

అక్కాలములో అనగా 1286 ఫసలీలో మౌల్వీ అధికారి అబ్దుల్ కరీం సదర్ తాలుక్దారుగారు ఖమ్మం మెట్టు దౌరా దయచేసిరి. వారు మదరసా పరీక్షించుటకు వచ్చిన కాలమందు వుండే ఫారసీ విద్యార్థులలో నేనొకడైయుండుటచే శ్రీవారి దివ్య మంగళ విగ్రహమిప్పటికీ నా మనోనేత్రములకు గోచరమగుచున్నది.

నేను ఖమ్మం ఫారసీ మదర్సాలో చదివే కాలములో హుమక్తజులీగా వుండే ఖమ్మం ఖాజీసాహెబ్ గారి కుమాళ్లు ఖాజా కమాలుద్దీన్, ఖాజా జమాలుద్దీన్, ఖాజా ఇమాముద్దీన్, ఖాజా నిజాముద్దీన్ సాహెబ్‌గార్లు మొదలగు ఉత్తమ వంశీకులతో

కలసి మెలసి చదువుతూ వృద్ధిలోనికి రానున్నతరి 'అన్యదా చింతితం కార్యం దైవమన్యతం చింతయేత్' అనునట్లు నా జీవయాత్ర రెండవ దారిలో మరలెను.

**పితృ వియోగము - కరిణీకము :**

ఎర్రుపాలెంలో పూర్వం నించి కరిణీకం చేస్తూ వ్యవసాయం మొదలగు హంగులతో ఇంటి వద్ద వున్న మా నాయనగారు వ్యాధిగ్రస్థులైనందున మైనరును నన్ను తీసుకొని రాగలందులకు ఉత్తరము, గుఱ్ఱము ఖమ్మం వచ్చెను. ఆరాకయే నావిద్యకు తిలాంజలి యాయెను.

నేను ఇల్లు చేరిన కొంతకాలమునకు నా యొక్క దురదృష్టము వల్ల బహుధాన్య నామ సంవత్సర కార్తీక బహుళ చవితి రోజున మా నాన్నగారు పరమపదించారు.

నా పినతండ్రులు నాకు అండగా నుండిరి. గనుక సన్ 1288వ ఫసలీ ఆదిలోనే మిరాసతన్ అప్పటి వక్తు గోవిందరావు అవ్వల్ తాలుక్దారు గారు ఎర్రుపాలెంకు నన్ను పట్వారిగా చేసిరి. ఆరోజులలో ఈ సుబేదారుగారిని, జిల్లాలు మరియు తాలుకాల స్థితిని నేనెరిగినంతవరకు రాసెదను.

(అసంపూర్తిగా సంపూర్తి అయ్యినది)

★ ★ ★ ★ ★ ★

శ్లో

*శాంతాకారం భుజగశయనం - పద్మనాభం సురేశం*
*విశ్వాధారం గగన సదృశం - మేఘవర్ణం శుభాంగం*
*లక్ష్మీకాంతం కమలనయనం - యోగిహృద్ధ్యాన గమ్యం*
*వందేవిష్ణుం భవ భయహరం - సర్వలోకైక నాథం*

శాంత స్వరూపా! భుజగశయనా! నాభి యందు పద్మము గలవాడా దేవతలకు అధిపతయ్యైనవాడా! విశ్వమునకు ఆధారమ్మైనవాడా! ఆకాశము వలె సర్వత్రా వ్యాపించినవాడా! మేఘమువంటి నీలమ్మైన వర్ణము కలవాడా! శుభమ్మైన అంగములు కలవాడా! లక్ష్మీపతీ! కమలనయనా! యోగులకు ధ్యానగమ్యము నీవే. ఓ విష్ణూ ! సంసార భారమును హరించువాడా నీకు నమస్కరించుచున్నాను.

★ ★ ★ ★ ★ ★



## 4. ఎఱ్ఱుపాలెం - గ్రామ పరిపాలన

- శ్రీ జమలాపురపు రామేశ్వరరావు గారు,
గ్రామపరిపాలనాధికారి, ఎఱ్ఱుపాలెం

నా తమ్ముడు చిరంజీవి గోపాలకిషన్‌రావు, రిటైర్డు టీచరు 'షష్టిపూర్తి' సందర్భములో మా జమలాపురపు వారి వంశవృక్షము 'జమలాపురాన్వయ దర్శిని' పుస్తకరూపములో విడుదల చేయుటకుగానూ నిర్ణంచుకొని ఈ కార్యక్రమము ప్రారంభము చేయనైనది.

మేము, అనగా మా అయిదుగురు సోదరులము నిజాంపరిపాలనలో జన్మించిన వారమే. అనగా 1948 సంవత్సరమునకు పూర్వము జన్మించినవారమే. అంటే మేము 1947 నుండి 1948లో జరిగిన రజాకార్ల హింసాకాండను రుచిచూచినవారమే. మేము, మా కుటుంబం మూలపురుషుడు కడియంపాటిపెద్దిరాజుగారని, ఈపెద్దిరాజుగారు, నెల్లూరు జిల్లాలోవున్న కడియం పాడు నుండి భద్రాచలం పోవుటకు మార్గమధ్యంలో వున్న రేమిడిచర్ల వరకు వచ్చి అక్కడ ఆ గ్రామ కరణంగారి ఇబ్బంది చూచి వారికి సహాయపడే వుద్దేశ్యము తో వారి ఇంటి వద్ద వుండి ఆ గ్రామలెక్కలన్నీ సమగ్రముగా తెలుసుకొని 'ఏకసంథాగ్రాహి' అవుటచే జమాబంధి లెక్కలలోజమాబంది పుస్తకాలు నవాబుకు చూపించుటకుపోయేటప్పడు మార్గమధ్యంలో ఒక్క ఏరును గుఱ్ఱము మీద దాటుచుండగా మొత్తము రికార్డు అందులో కొట్టుకు పోయినది. కావున అక్కడ చూపించుటకు లెక్కలు లేనందున నవాబు ప్రభుత్వము ఆయనను కట్టడి చేసారు. ఆయన 'ఏకసంతాగ్రాహి' కనుక కొంతవ్యవధిలో జమాబంది లెక్కలు కంఠస్తము కనుక వ్రాసి నవాబు మన్ననలుపొందినారు. నిజాం ప్రభువును మెప్పించి. నవాబుగారి మన్ననలను పొంది, నవాబుగారివలన కేశిరెడ్డిపల్లి అనుపేరుగల (బేచిరాగుమవుజా) గ్రామమునకు సంబంధించిన మెరక భూమి బహుమానముగా పొంది. ఈ భూమితోపాటు జమలాపురం గ్రామములోని 'పుట్టకోట' అనుస్థలమును ప్రభువుగారి నుండి పొంది నివాసమేర్పరచుకొని, స్వల్పకాలమే అక్కడవుండి, ఆ ప్రాంతము నివాసమునకు పనికిరాదని గ్రహించి మరల నిజాం ప్రభువుగారి అనుమతితో ఎఱ్ఱుపాలెం గ్రామంలో నివశించుటయే అనుకూలమని గ్రహించి అప్పటి యఱ్ఱుపాలెం 'గ్రామకోట' వున్న ఖాళీస్థళము స్వాధీనము చేసుకొని ఏరు దగ్గరగావుండుట వలన 'ఎఱ్ఱుపాలెం' అని నామకరణం జరుపబడినదని వినికిడి. మా పూర్వీకుడు పెద్దిరాజుగారు తనకు తోడుగా కొంతమందిని పేదవారిని భాగ్యవంతులను పిలిపించుకొని, వారికి తగిన సహాయము చేసి స్థళంలో స్థళం, పొలంలో పొలం యిచ్చి అందరిని ఈ ఎఱ్ఱుపాలెంకు మకాం మార్పించారని పూర్వచరిత్ర వలన తెలుసుకొననైనది. ఇదిగాక ఈ ఎఱ్ఱుపాలెం గ్రామములో జనమే కాక కృష్ణాజిల్లాకు సంబంధించిన పెద్దాపురం మరియు గూడెం మాధవరం గ్రామమునకు సంబంధించిన రైతులకు కూడ భూములు యిచ్చి పేదవారందరికి జీవనోపాది కల్పించిరి. వీరి ఆశీర్వాద ఫలితమే అనేకమంది పేదరైతులు. పెద్దిరాజుగారు

యిచ్చిన భూముల వలన ఈ రోజువరకు కరువు, కాటకాలకు గురికాకుండా ఆనందముగా అనుభవించుచున్నారు. తరాలు గడిచినవి, వందల సంవత్సరములు గడిచినవి. ఈ రోజువరకు గ్రామములోని భూములు పెద్దిరాజుగారి వంశీకులైన అప్పటి జమలాపురపు వారి పేరుతోనే పట్టాలు కలిగియున్నారు. రైతులకు పట్టాదారులకు కాలం మారినా పేచీలు లేవు. ఎప్పుడు కుదిరితే అప్పడు ఆరైతుకు అప్పటికప్పడు పట్టామార్పిడి చేయుచున్నారు.

300 సంవత్సరముల నుండి ఈ రోజువరకు కేశిరెడ్డి పల్లి గ్రామములోని రైతులందరు పట్టాదారుల మేలుమరువరు. జమలాపురం వంశంవారి చెప్పచేతులలోనే వున్నారు. ప్రస్తుతము నేను ఈ గ్రామమునకు గ్రామపరిపాలనాధికారిగా పనిచేయుచున్నాను.

మా తాతగారు 64 సం. (1879-1942) ఎర్రుపాలెం గ్రామ కరిణీకము చేసి మంచి పేరు ప్రఖ్యాతులు సంపాదించినారు. వినికిడి. వారి తదనంతరము మా తండ్రి గారైన జమలాపురం రామనరసింహారావుగారు మూడు సంవత్సరములు, వారి తరువాత మా మేనత్తగారి భర్త మాదిరాజులక్ష్మీకాంతరావుగారు 3 సంవత్సరములు, వారి తరువాత సర్దార్ జమలాపురం కేశవరావుగారి తండ్రి, మా చినతాతగారైన జమలాపురపు వెంకట్రామారావుగారు 8 సంవత్సరములు, వారి తరువాత వారి మూడవ కుమారుడు మాధవరావు గారు 3 సంవత్సరములు కరణీకము చేసినారు.

నేను 1956 వ సంవత్సరం, నవంబరు 1 వ తేదీన అనగా 'ఆంధ్రప్రదేశ్ అవతరణ' రోజున కరిణీకంలో ప్రవేశించి ఎర్రుపాలెం గ్రామ కరణంగా పనిచేస్తున్నాను. ఈ విధముగా నేను మరియు నా తాతగారైన జమలాపురపు వారము ఎన్నో సంవత్సరములు ఈ గ్రామ పరిపాలనాధికారులుగావున్నాము.

మా వంశమూలపురుషుడైన పెద్దిరాజుగారి గొప్పతనమునకు గాని, మా వంశములోని రాజకీయ నాయకుడైన సర్దార్ జమలాపురం కేశవరావుగారి పేరు ప్రతిష్ఠలకు గాని భంగము రాకుండ మేము ఎంతో జాగ్రతగా నడుచుకుంటూ అందరి మన్ననలు పొందేవిధంగా ప్రవర్తించున్నాము.

ఇదేవిధంగా రాజకీయరంగం లో ఎర్రుపాలెం గ్రామంలో మాకు గలమెరుగైన సంబంధాలలో పినతండ్రిగారైన శ్రీజమలాపురము లక్ష్మీనరసింహారావుగారు 16 సంవత్సరములు, నాకనిష్ఠ సోదరుడు. చి.జమలాపురపు వేంకటకిషన్‌రావు 8 సంవత్సరములు మొత్తం 24 సంవత్సరములు పంచాయతి ప్రెసిడెంటుగా పనిచేసినారు. వీరుగాక మా వంశంలో అనేకమంది అనేక గ్రామాల కరణాలుగా, లాయర్లుగా పెద్దవుద్యోగస్థులుగా డాక్టర్లుగా, ఇంజనీర్లుగా, తహశీలుదారులుగా ప్రస్తుత మండల రెవెన్యూ ఆఫీసరులుగా, ఉపాధ్యాయులుగా పనిచేయుచున్నారు. ఇది మా వంశ చరిత్ర.





# 5. జమలాపుర స్వర్ణమకుటంలో బసవరాజు మణిమాణిక్యం



- శ్రీ బసవరాజు హరికిషన్ రావు గారు 13-12-98
వ్యవస్థాపకులు శ్రీ అరవింద సొసైటీ సెంటర్, గుంటూరు -4
ఫోన్ : 355132, 352167

రామలక్ష్మణులు, రాధామాధవు... రామాయణ మహా భారతాలు, రాత్రిపగలు, సూర్యచంద్రులు, భూమ్యాకాశాలు, పార్వతి పరమేశ్వరులు, గంగాయమునలు, మందారమకరందాలు ఇలా ఎన్నో ఎన్నె... - వీటి సంబంధ అనుబంధాలు ఎలా వున్నవో అలాగే జమలాపురపు వారి వంశంతో బసవరాజు వారి వంశానికి కూడా అవినాభావ సంబంధం ఉన్నది. అనేక సందర్భాలలో ఇది సుస్పష్టంగా కనిపిస్తుంది.

బస్సులు రోడ్లు లేని ఆ రోజుల్లో బండ్లు కట్టుకొని బసవరాజు వారమ్మైన మేము చొప్పకట్లపాలెంలో బయలుదేరి ఎర్రుపాలెం వెళ్ళి కీ.శే. జమలాపురపు రామనరసింహారావుగారి ధర్మపత్ని , అమ్మను మరపింపజేసే 'అమ్మలగన్నయమ్మ' మాదుర్గమ్మత్తయ్య నిత్యాన్నదాత, నిర్మల హృదయ అయిన ఆమె చేతులమీదుగ నోరూరించే వేడివేడి వంటకాలతో తనవి తీర కడుపార భుజించి ప్యాసింజర్ రైలు ఎక్కి మధిరకో, ఖమ్మానికో, బెజవాడకో వెళ్ళేవాళ్ళం. అలాగే ఎర్రుపాలెం నుండి జమలాపురపు వారు బండ్లు కట్టుకొని చొప్పకట్లపాలెం వచ్చి, మా ఇంట్లో మా అమ్మ వండే అడ్డెడు తప్పాలాలు ఖాళీచేసి ఇనగాలి వెళ్తుండేవారు.

ఈ రెండు వంశాలలోని వారు ఎవరి ఇండ్లకు ఎవరు వేళాపాళా లేకుండా అర్ధరాత్రిగాని అపరాత్రిగాని ఎప్పుడు వెళ్ళినా బోర్డింగ్ అండ్ లాడ్జింగ్ ఫ్రీ ! ఇది యిరువంశాలవారి ఆత్మీయతకు నిదర్శనం.

నాకు ముఖ్యంగా జమలాపురపు వారితో చాలా దగ్గరి సంబంధం ఉంది. నేను దత్తత వెళ్లడానికి సూత్రధారులు కీ.శే. జమలాపురపు వెంకటేశ్వరరావుగారు, జమలాపురపు నారాయణరావుగారు.

పార్థివ నామ సం॥ జ్యేష్ఠ బ॥ గురువారమునకు సరి అయిన మర్కుంచంద్ అమర్దాదు, స్న 1354 ఫసలి తారీఖున, మహబూబాబాదు తాలూకా (ఆరోజుల్లో) జల్లెపల్లి, చీరవోలు మవుజాలలో మక్తేదారు, ఇజారెదారు అయిన కీ.శే. బస్వరాజు సీతారామచంద్రరావు గారికి నేను దత్తత వెళ్లాను. ఆయన అక్కగారు వెంకట్రామనర్సమ్మ గారు ఖమ్మంలో పేరు గాంచిన హైకోర్టు వకీలు. కీ.శే. జమలాపురపు వెంకటేశ్వరరావుగారి భార్య. వెంకటేశ్వరరావుగారు గంభీర స్వభావుడు. షేర్వాణి, చుడీదార్ పైజమా తలపాగా ధరించి వెండి పొన్ను కర్రచేతిలో ధరించి అదాలత్‌కు దస్తరం పట్టుకున్న మున్షీతో టాంగాలో వెళ్తుంటే ఆ ఠీవి చూసి తీరవలసిందే. ఆయనకు ఎదురుగా వెళ్లాలంటే అందరం భయపడేవాళ్లం. అంతెందుకు నా దత్తత తండ్రి రామచంద్రరావుగారు ఆరడుగల ఆజానుబాహువు, బుర్రమీసాలు

కలిగి షేర్వాణి, పైజమా, టోపి, బూట్లు ధరించి చేతిలో మందుకూర్చిన పెద్ద తుపాకీతో గుర్రపుస్వారీ చేసేవారు. ఆయన చేతిలో తన్నులు తినని జీతగాడుండడు. పెద్ద పెద్ద మోట బావుల్లో ఎగిరి దూకి ఈతకొట్టేవారు. జీతగాళ్ళు మొక్క జొన్న కంకులు కాలుస్తుంటే వెన్నలో ఉప్పకారం, జీలకర్ర కలిపి డజన్ కంకులకుపైనే అవలీలగా తినేసేవారు. ఆయనను చూస్తే మా అందరికి భయంగా ఉండేది. అటువంటి నా దత్తత తండ్రి కూడా జమలాపురపు వెంకటేశ్వరరావుగారిని చూస్తే భయపడేవారు. పైకి చూడడానికి ఎంత గంభీరంగా వున్నా వెంకటేశ్వరరావు మామయ్య అంతకంటే సున్నితమైన మనసు కలిగిన వారు. నాకు ఒకసారి టైఫాయిడ్ జ్వరం వస్తే డాక్టర్ అబ్దుల్ మజీద్ అనే ఆ రోజుల్లో పేరు గాంచిన యం.బి.బి.యస్. డాక్టర్‌ను ఇంటికి తీసుకొని వచ్చినాకు వైద్యం చేయించారు. నేను ఖమ్మంలో వాళ్ళింట్లో మర్కజీ తెహతానియాలో ఉర్దూ మీడియంలో చదువుకున్నాను. ఆయన కూతురు కమలమ్మ (సంబరాజు వెంకటేశ్వరరావు గారి భార్య) గారి కుమారుడు శ్రీనివాసరావు కూడా వాళ్ళింట్లో ఉండి చదువుకున్నాడు. మేమిద్దరం మంచి దోస్తీగా కలసి మెలసి ఉండేవాళ్లం.

1948 సెప్టెంబరు, 13వ తేదీన రజాకార్ మూమెంట్‌కు 'నైజాం సంస్థానాని'కి చరమగీతం పాడడానికి భారత సైన్యాలు నైజాం స్టేటులో ప్రవేశించాయి. పైన విమానాలు క్రింద యుద్ధటాంకులు, గుర్రాలపై గ్వాలియర్ మిల్టరీ, మోటారు వాహనాలపై , సిక్కు, ఘుర్కా మిలట్రీ, మలబార్ పోలీస్ మొ. సైనికులు ఖమ్మం పట్టణంలో ప్రవేశించినారు. వాతావరణం అంతా భీతావహంగా ఉంది. ఆ సమయంలో నేను కొంతమంది మిత్రులతో మహాత్మాగాంధీ ఫోటోకు పూలమాలవేసి ఒక కర్రకు కట్టి "బోలోస్వతంత్ర భారత్‌కు జై!" "మహత్మాగాంధీకి జై!" అంటూ నినాదాలు చేసుకుంటూ ఊరేగింపుగా వెళ్ళి నేను చదువుకుంటున్న మర్కజీ తెహతానియాలో మహాత్ముని ఫోటో పెట్టి ఇంటికి వెళ్లాను. జమలాపురపు వెంకటేశ్వరరావుగారింట్లో నేనుండి చేసిన సాహసం యిది. అప్పడు నాకు 10 సం. మాత్రమే నా పుట్టిన తేది సెప్టెంబరు 21, 1938వ సంవత్సరం అన్నమాట.

వరంగల్ వెళ్తే జమలాపురపు గోపాల్ రావుగారింట్లో వుండే వాళ్లం. ఆయనకూడా మంచి పేరున్న వకీలు. సర్దార్ జమలాపురపు కేశవరావుగారు మంచి ఆజానుబాహువు. ఆయన్ని కూడా రెండు మూడు సార్లు ఎర్రుపాలెంలో చూశాను. జమలాపురపు రాంకిషన్‌రావుగారు ఖమ్మంలో మంచి పేరున్న వకీలు. నాకు మొదటి నుండి సన్నిహిత సంబంధం, మంచి బంధుప్రీతి, ఆత్మీయత కలిగిన వ్యక్తి.

మా సత్యం బావ ఎర్రుపాలెంలో వాళ్లింట్లో 'పంగలగుంజ' మీద కూర్చొని జోకులు వేస్తుంటే మంచి సరదాగా వుండేది. మరి మా జమలాపురపు రామేశ్వరరావు బావగారు మంచి వాగ్దాటి వున్నవ్యక్తి. ఆయన మాటల్లో ఎంత మందినైన ఆకట్టుకుంటాడు. మంచి పేరున్న పట్వారీ సాహెబ్. నా చిన్నప్పటి సంగతి ఎర్రుపాలెంలో 'తెనుగు తల్లి' నాటకంలో అందులో పెంటు అనే ఒక ముస్లిం పాత్ర ధరించాడు. చాలా చక్కగా చేశాడు. నేను యిప్పటికీ మరవలేను. మాకు బావగా మారడానికి ఎర్రుపాలెంలో బయలుదేరి కాలినడకన అలుగువాగుదాటి చొప్పకట్లపాలెం 'రాజ్య' కాంక్షకోసం ఎన్నిసార్లు వచ్చాడో నేను మరువలేను. ఆరకంగా ఎర్రుపాలానికి - చొప్పకట్ల పాలానికి ఒక వారధి ఏర్పడి జమలాపురపు వారికి బసవరాజు వారికి వియ్యం ఏర్పడింది. ఆయన ఇద్దరు తమ్ములూ మేము ముద్దుగా పిల్చుకునే పెద్దకిష్టి, చిన్న కిష్టి, గోపాల్ కిషన్‌రావు, వెంకటకిషన్‌రావు, మా చిన్న బావలు. వారి ఆత్మీయత

ఈ నాటికి మరువలేనిది. చిన్న బావ మళ్ళీ మా చొప్పకట్లపాలానికి సంబంధం మరింతపెరిగి యిప్పడు అక్కడ చెప్పకోదగ్గ బాంధవ్యం ఏర్పడింది. కీ.శే. బసవరాజు సూర్య ప్రకాశరావు మా పెద్దనాన్నగారితో ఏర్పడిన వియ్యమేయిది. ఇకముఖ్యంగా చెప్పకోవాలంటే కృష్ణపరమాత్మ పాత్రధారి, భువన విజయ నిర్మాత శ్రీ కృష్ణ దేవరాయలు, కొండలలో నెలకొన్న కొనేటి రాయడు, కలియుగ వైకుంఠనాధుడు, ఆంధ్రుల ఆరాధ్య దైవం, ఏడుకొండలరేడు శ్రీ వేంకటేశ్వరుడి దివ్యమంగళ విగ్రహాన్ని తనపాత్రలో జీవింపజేసుకొని మా పెద్ద చెల్లెలు పద్మావతికి, 'పొడగంటిమయ్యా పురుషోత్తమా!' అంటూ భర్తగా లభించిన మా అయ్యదేవర పురుషోత్తమ రావు బావ జమలాపురపు వారి 'వంశ వృక్షం' లో విరపూసిన పారిజాత సుమ దళాల పుష్పరాజమేకదా! ఆంధ్రుల, రాజధాని భాగ్యనగరమైన హైదరాబాదులో 40 సంవత్సరముల క్రితమే 'విజ్ఞాన దీపిక' లను నల్దిశలా వెలిగింపచేయడమేకాక మహానటుడైన సి.యస్. ఆర్. (కీ.శే. చిలకలపూడి సీతారామాంజనేయులు) కళామందిరం స్థాపించి రంగస్థల కళామతల్లికి సేవ అందించిన ఘనకీర్తి ఆయనకే దక్కుతుంది. అమెరికాలో జరిగిన 'తానా' తెలుగు మహాసభల్లో ఆంధ్ర కీర్తిని మరొక్కసారి చాటిన ఘనత కూడా ఆయనదే. ఆయన తనయుడు రామకృష్ణ పై మా అమ్మాయి అరుణారుణ కాంతులు ప్రసరించి మాకు అల్లుడుగా లభించడం ఇరు వంశాల బాంధవ్యాలను మరచిపోకుండా వుండడానికే కదా! ఇరువంశాల వారధికి మధ్య బుల్లి 'పిల్లర్స్‌గా' వుండటానికి మా మనుమళ్ళు సాకేత్, సిద్ధార్థ రెడీగానే వున్నారు కదా!.

ఇలా చెప్పకుంటూ పోతే మా గోపాల్ కిషన్‌రావు బావ రెండో వాల్యూమ్ కూడా వెయ్యాల్సి వస్తుంది. ఆయన 40 సంవత్సరాలుగా సంకల్పిస్తున్న శుభసమయం రానే వచ్చింది. 'జమలాపురపురాన్వయ దర్శిని', మన వంశాలలోని 'మురందు' తరాల వారికి మార్గదర్శకమై ఆదర్శమై నిలుస్తుంది.

సాధారణంగా రాధాకృష్ణులు, సీతారాములు అంటూ వుంటారు. మరి మా బావ గోపాలకృష్ణులు, మా చెల్లెలు సీతమ్మతల్లి ఇదేమిటి విడ్డూరం! ద్వాపరయుగాన్ని, త్రేతాయుగాన్ని కలిపేశారు వీరిరువురూ. భారతీయ సంస్కృతినీ, సంప్రదాయాలను చాటి చెప్పడానికే కాబోలు. యీ కలయిక. ఈ తరం వారు రాబోయే తరం వారు మా తరం వారిని పొరపాటున కూడా మరచి పోకుండా మా బావ ఆయన 'దర్శిని' లో బంధించి వేశాడు.

'షష్టి పూర్తి చేసుకొని మళ్ళీ నవయువకుడిగా మారటానికి ఉరకలు వేస్తున్న మా బావకు అతనికి తోడూనీడగా వుంటున్న మా చెల్లెలికి, వారి కుటుంబ సభ్యులకు ప్రశాంతి నిలయాధీశుడు 'భగవాన్ సత్యసాయి బాబా' వారి దివ్యాశీస్సులు లభించి ఆయురారోగ్య ఐశ్వర్యాలతో తులతూగుతూ సమాజానికి మరిన్ని సేవలందించాలని కోరుకుంటున్నాను.

'జమలాపురాన్వయ దర్శిని' స్వర్ణమకుటంలో బసవరాజు మణిమాణిక్యంగా శాశ్వతంగా భాసిల్లుతూ ఉంటుంది.



# 6. జమలాపురపు వారి బాంధవ్యము

- కీ. శే. మంచికంటి గురవయ్య గుప్తా గారు
ఎఱ్ఱుపాలెం, మాజీసర్పంచ్

ఖమ్మం జిల్లా, మధిర తాలూకా, ఎఱ్ఱుపాలెం గ్రామము. పూర్వపు నిజాం ప్రభుత్వ కాలంలోనే ప్రసిద్ధిచెందిన గ్రామం. ఈ గ్రామంలో జమలాపురపు వంశపు వారు, మాడపాటి వంశపువారు ఆరువేల నియ్యోగులున్నూ మరియు హరివారు, అయితవువారు వైదిక బ్రామ్మణులు ముఖ్య కుటుంబమువారు, అధిక కుటుంబములవారు తదితర కులస్తులు కూడ గలరు.

ఈ గ్రామములో అనాది సిద్ధముగా జమలాపురపువారు అధిక సంఖ్యలో కలరు. వారు చాలా ఉన్నతమైన కుటుంబములవారు. దైవ భక్తి కలవారు. వీరి కుటుంబీకులలో జగన్నాధరావుగారు నిరతాన్నదాతలు. వీరికీర్తి ఆంధ్రలో పూర్వపు నెల్లూరు జిల్లా ప్రకాశంజిల్లా (ఇప్పటి) ఉభయ గోదావరి జిల్లా, కృష్ణ, గుంటూరు జిల్లాలో వీరిపేరు తెలియనివారు లేరని అనవచ్చును. వీరి కుటుంబములో వీరి తమ్ములగు కీ.శే. జమలాపురపు సీతారామయ్యగారు. ఈ గ్రామంలో బాలా త్రిపుర సుందరి సహిత చంద్రమౌళేశ్వరస్వామి వారి దేవాలయము నిర్మించి దాని నిత్య నైవేద్య దీపారాధన కొరకు భూవసతి ఏర్పరిచినారు. దేవాలయ నిర్మాణము కాక హరికధలు, సప్తాహములు, పురాణములు సలుపుకొనుటకు దేవాలయము చుట్టు ప్రహరి వగైరా నిర్మించియున్నారు. ప్రతి సంవత్సరము దేవీ నవరాత్రములు, శరన్నవరాత్రములు జరుపుచూ వుండెడివారు.

ఈ కుటుంబములోని కీ.శే. పెద్ద సుబ్బారావుగారు, కీ.శే. చిన్న సుబ్బారావుగార్లు సీతారామ కళ్యాణము ప్రతి సంవత్సరము జరుపు చున్నారు. వీరి తదనంతరము కొంతకాలము జరుగలేదు.

ఇపుడు మరల జరిగించుచున్నారు. వారి మనుమలు భక్త సమాజమును ఏర్పరచి ఆలయ పునరుద్ధరణ భక్తుల విరాళములతో జరిపించు ఏర్పాట్లు చురుకుగా సాగించుచున్నారు.

ఇకపోతే ఈ జమలాపురపు ఆడపడచులను మాడపాటివారు, దేవత్రాజువారు, గోవిందరాజులవారు, ఆదిరాజువారు, మాదిరాజువారు, ఊటుకూరువారు, పెండేలవారు అను యింటిపేర్లు గల వారికె యిచ్చి వివాహములు జరిపించి వీళ్ళ

నందరను తమ అండగా నేర్పరచుకున్నారు. ఈ జమలాపురపు వంశమువారు ఎఱ్ఱుపాలెం, జమలాపురం, పెద్దగోపవరం, కేశిరెడ్డిపల్లి, తొర్లపాడు, పెగళ్లపాడు, రాజుపాలెం, త్రిపురవరం, రంగగూడెం, తాటిగూడెం, కాచవరం వగైరా గ్రామాదుల గ్రామాధికారులుగా వున్నారు. వీరి ప్రాబల్యము చుట్టుపట్ల గ్రామాల్లో కలదనుటలో నిస్సందేహము.

ఈ జమలాపురపు వారి వంశములోనే కీ.శే. జమలాపురపు వెంకట రామారావుగారి జ్యేష్ఠకుమారుడు కేశవరావన్న నామధేయులు జన్మించి వున్నత విద్య నభ్యసించిరి. నిజాం పరిపాలనలో 'కష్టంసు' శాఖలో ఆడిటర్‌గా ఉద్యోగము చేసి కాంగ్రెస్‌వారి పిలుపుతో ఉద్యోగమునకు రాజీనామాచేసి ఉద్యోగము నుంచి బయటకు వచ్చి 'కాంగ్రెస్ కార్యకర్త'గా నిజాం ప్రభుత్వమునకు వ్యతిరేకంగా ప్రచారముచేసి జైలుకు వెళ్ళి జైలు జీవితము గడిపి బయటకు వచ్చినారు. తదుపరి వారు అవిరళకృషి జరిపి 'తృతీయ ఆంధ్ర మహాసభ' ఖమ్మం పట్టణములో జరిగినప్పుడు ఎఱ్ఱుపాలెంలోని కార్యకర్తలను వెంటనిడుకొని వారు మరియు కీ.శే. మాడపాటి రామచంద్రరావుగారు అచ్చం పూర్తి బాధ్యతలు తమ భుజస్కంధాలమీద వేసుకొని సభను జయప్రదముగా జరిపించినారు. తదుపరి 'కంది' 13వ, మహాసభలో అధ్యక్ష పీఠము నలంకరించినారు. వీరు ఢిల్లీ రాజ్యసభా సభ్యులైనారు. వీరు 'సర్దార్ కేశవరావుగారు' అనే బిరుదును వహించి నిరాడంబరముగా వుండేవారు. కనీసము జనులెవరికైనా బాధకలిగిన భరించరాని బాధపడువారు. వీరికి ఇద్దరు కుమార్తెలు, ఒక కుమారుడు కలరు. కుమారుడు యం.బి.బి.యస్ చదివి ప్రస్తుతం లండన్‌లో వున్నారు. కేశవరావుగారు హైదరాబాదులో దివంగతులైనారు. వీరి కీర్తి నలుదిశలా వ్యాపించి వున్నది వీరు మరియు మాడపాటి వారి కుటుంబముల వల్లనే ఎర్రుపాలెం యొక్క కీర్తి ప్రతిష్టలు వర్ధిల్లుచున్నవని అనుట అతిశయోక్తికాదు.

కీ.శే. మాడపాటి తిరుమలరావుగారు, వారి తమ్ములు హనుమంతరావుగారు వీరు యిద్దరు ఉన్నత విద్య అభ్యసించి న్యాయవాదులుగా గణుతికెక్కినారు. వీరి జన్మ స్థలము కృష్ణాజిల్లా నందిగామ తాలూకాలోని పొక్కునూరు గ్రామము. తిరుమలరావుగారికి జమలాపురపు జగన్నాధరావుగారి ఎకైక కుమార్తెను యిచ్చి వివాహము చేశారు. వీరికి ఏకైక పుత్రులు రామచంద్రరావుగారు కూడా వున్నత విద్య నభ్యసించి కాంగ్రెసు వుద్యమము నడుపుచుండువారు. రామచంద్రరావుగారు

విజయవాడలో కాంగ్రెసు ఆఫీసుపెట్టి కార్యకర్తలను సమీకరించి వుద్యమము నడిపి నిజాం ప్రభుత్వమును అంతమొందించిన వారిలో ప్రముఖులు. వీరు తెలంగాణా కాంగ్రెసు జనరల్ సెక్రటరీగా వ్యవహరించి హైదరాబాదు నగరంలో కాంగ్రెసు భవనమున నిర్మాణమునకు కృషిసల్పినారు. వీరి సెక్రటరీ సమయములోనే యర్రుపాలెం గ్రామములోనే దివంగతులైనారు. వీరికి ముగ్గురు కుమారులు, అయిదుగురు కుమార్తెలు అందరికందరు వున్నత విద్యనభ్యసించినవారే.

ఇక మాడపాటి హనుమంతరావుగారు న్యాయవాదులుగా హైదరాబాదు పట్టణములో నివాసము ఏర్పరచుకొని న్యాయవాదులుగాను ఆంధ్ర మహాసభను ఏర్పాటు గ్రంథాలయ ఉద్యమములలో అవిరళ కృషిసల్పినవారు వీరు హైద్రాబాదులోని మేయరుగా వ్యవహరించి పేరు ప్రఖ్యాతులు గడించినారు. నిరాడంబర జీవితము గలవారు. వీరి కీర్తి ప్రతిష్టలు తెలియని వారు చాలా అరుదు. వీరికి రెండు వివాహములు జరిగినవి మొదటి భార్య కుమార్తె కలిగిన తర్వాత ప్రధమ కళత్రము దివంగతులు అగుటవల్ల ఆ కుమార్తెను వీరి అన్నగారగు యర్రుపాలెం గ్రామ కాపురస్తులు తిరుమల రావుగారు వారి ధర్మపత్ని పెంచి పెద్దచేసి గుంటూరు వాస్తవ్యులకు యిచ్చి వీరే వివాహములు జరిపించినారు.





చిత్రీకరణ :

**జమలాపురపు రవికుమార్**

**18-2-97**

# 7. జమలాపురం వారితో పరిచయాలు



- శ్రీ కోదాటి నారాయణరావుగారు
హైదరాబాద్

స్వ॥ ఆంధ్ర పితామహ శ్రీ మాడపాటి హనుమంతరావు గారి అగ్రజుడు తిరుమలరావుగారు. తమ్ముడు హనుమంతరావు గారు చిన్నతనంలోనే తండ్రిని కోల్పోవడం వల్ల మేనమామల వద్ద జమలాపురపు వెంకట్రావుగారు వారి తమ్ముడు జమలాపురపు రామచంద్రరావుగారు సూర్యాపేటలోనూ, నల్లగొండలోనూ చాలాకాలం పేష్కారుగా పనిచేశారు. అందువల్లనే మాడపాటి సోదరుల బాల్యం సూర్యాపేటలోనూ, నల్లగొండలోనూ గడిచింది. తిరుమలరావుగారు మాపెదతండ్రి కోదాటి వెంకట రామారావుగారు సహాధ్యాయులేగాక ఆప్తమిత్రులు కూడా. వారిరువురు మా స్వగ్రామము రేపాల అనేకసార్లు రావడం, గుట్టలు గట్లు ఎక్కడం, మొదలయినవన్నీ తిరుమలరావుగారు మంచంలో ఉండగా వారిని చూడటానికి వెళ్లిన నాతో బాల్యక్రీడలన్నీ నెమరువేసుకుని చెప్పారు. మా తాతగారిని ఆయన మామయ్యా ! అని పిలిచేవారు. స్వ॥ హనుమంతరావుగారిని సూర్యాపేట అంటే చాలా అభిమానం. ఆంధ్రోద్యములలో సూర్యాపేట ప్రాధాన్యత వహించడానికి ఇది కూడా ఒక కారణం కావచ్చును. ఇది 'జమలాపురం' వారి గురించి నాకు తెలిసిన మొదటి వృత్తాంతం. స్వ॥ తిరుమలరావుగారు జమలాపురం వారి అల్లుడు. మేనమామ కుమార్తెనే చేసుకున్నాడు. తిరుమలరావుగారి మామగారి దత్తపుత్రుడు సూర్యనారాయణరావు గారిని నేను బాగా ఎరుగుదును. అనేకసార్లు వారిని ఎల్లుపాలెంలో కలిసి మాట్లాడాను. కొంతకాలం మాడపాటివారికి, వారికి వ్యాజ్యాలు నడిచినాయని జ్ఞాపకం. కొంతకాలం తర్వాత తిరుమలరావుగారి కుమార్డు రామచంద్రరావుగారికి, సూర్యనారాయణ రావుగారికి సత్సంబంధాలే ఏర్పడినవి. మాడపాటి రామచంద్రరావుగారితో కూడా నాకు బాల్యంలోనే పరిచయం ఏర్పడినది.

1934 డిశెంబరులో తృతీయ ఆంధ్రమహాసభ జరిగే సందర్భంలో నేను ఖమ్మంమెట్టు వచ్చి స్థిరపడ్డాను. ఆ రోజులలో ఖమ్మం లో బ్రాహ్మణ సంఘం, వైశ్య సంఘం వారు కరుడు గట్టిన పూర్వాచార పరాయణులు. 'తండ్రి తాత ధర్మం

తప్పకండి' అని గోడపై వ్రాశారు. పూర్వాచార పరాయణుల మధ్య సంఘర్షణలతో ఆంధ్ర మహాసభ జరిగింది. ఖమ్మం మొత్తంలో ఇద్దరు ముగ్గురు మాత్రమే సంఘ సంస్కర్తల పక్షం పూర్వాచారపరాయణులకు సుప్రసిద్ధ న్యాయవాది. స్వ॥ ఇటికాల రాజేశ్వరావు, జమలాపురం వెంకటేశ్వరరావుగార్లు నాయకులు. వారు తమ ఉద్యమాన్ని చాలా పకడ్బందీగా నిర్వహించారు. అయితే వ్యక్తిగతంగా వారు ఇరువురు సర్వోదయులు. సంఘ సంస్కార పక్షంలో నేను నిరాకరిస్తైనప్పటికీ నన్ను చాలా అభిమానించేవారు. జమలాపురం వెంకటేశ్వరరావుగారు తను యవ్వనంలో గ్రంధాలయ ఉద్యమానికి, స్వదేశీ ఉద్యమానికి చాలా తోడ్పడ్డారు. ఆ విషయాలన్నీ వారు అప్పుడప్పుడు నాతో చెప్పుతుండేవారు. లోకమాన్య బాల గంగాధర తిలక్ పట్లవారికి చాలా అభిమానం వుండేది. తంజావూరు సరస్వతీ మహల్ భాండాగారం నుండి ఖమ్మంమెట్టు వాస్తవ్యులయిన హరిభట్టు వ్రాసిన వరాహపురాణం ప్రతిని వ్రాయించి తెప్పించారు. దానిని ప్రచురించవలెనని వారి సంకల్పం తీరని కోరికగానే ఉండిపోయింది. జమలాపురం వెంకటేశ్వరరావుగారు కుమారునితో నాకు కొంత పరిచయం ఏర్పడింది కాని ఆ సందర్భం ఎంతో జ్ఞాపకం లేదు. ఇది జమలాపురం వంశంవారితో నాకు కలిగిన రెండవ పరిచయం.

1938, స్టేట్ కాంగ్రెసు సత్యాగ్రహం తర్వాత నాకు వరంగల్లుతో సన్నిహిత సంబంధం ఏర్పడింది. యువకులతోపాటు అప్పటి ప్రముఖ న్యాయవాదులయిన స్వ॥ మాదిరాజు రామకోటేశ్వరరావు, పర్చా రంగారావుగార్లతో కూడా పరిచయం ఏర్పడింది. వీరునూ ఆ కాలంలో సుప్రసిద్ధ న్యాయవాదులే. తొలిదశలో ఆంధ్రోద్యమంతో సబంధం ఉన్నప్పటికీ, తర్వాత వారంతగా ఆంధ్రోద్యమాన్ని గురించి పట్టించుకున్నట్లు లేదు. వ్యక్తిగంతంగా సహృదయులు.

సత్యాగ్రహోద్యమంలో ప్రభుత్వోద్యోగానికి రాజీనామాఇచ్చి సత్యాగ్రహం చేసి కారాగార శిక్ష అనుభవించి వచ్చిన పిదప స్వ॥ సర్దార్ జమలాపురం కేశవరావుగారితో పరిచయం కలిగింది. ఆ పరిచయం అనతికాలంలోనే గాఢమైన స్నేహంగా పరిణమించింది. కేశవరావుగారితో పరిచయుకులుగగానే ఎవరైనా ఆయనతో హత్తుకపోతారు. మాడపాటి వారికీ, జమలాపురం వారికీ వియ్యం కావడంవల్లనూ, ఆప్యాయత పెరగడంవల్లనూ, కేశవరావుగారిని నేను "పెద్దన్నా" అని పిలుస్తుండేవాడిని. స్వ॥ మాడపాటి రామచంద్రరావుగారు వారి వరుసలో చూస్తే నాకు బావవరుస అయినప్పటికీ ఆయన మా పిన తండ్రుల సమకాలీకుడు కావడం వలన ఆయనకు 'మామా' అని పిలిచేవాడిని. తిరుమలరావుగారు జబ్బుగా ఉన్నప్పుడు వారిని చూడడానికి మొదటిసారిగా ఎర్రుపాలెం వెళ్ళాను.

తర్వాత కేశవరావుగారితోనూ, కేశవరావుగారిని కలవడానికి చాలాసార్లు ఎర్రుపాలెం వెళ్ళాను. అప్పుడు ఎరుప్రాలెంలో చాలామందితో పరిచయం కలిగింది. ఎర్రుపాలెం కరణంగారు అప్పటికి వయోవృద్ధులు. వారిపేరు జమలాపురపు వెంకటకిషన్‌రావుగారు. వారి ఇంటిలో 2, 3 సార్లు భోజనం చేసినట్లు జ్ఞాపకం. కేశవరావుగారి తండ్రి రామారావుగారు తమ్ముళు నారాయణరావు, మాధవరామగార్లు నాకు సన్నిహితులయినారు. అనేకసార్లు వారి ఆతిధ్యం పొందాను. ఈ విధంగా అనేకమంది జమలాపురం వార్లతో నాకు పరిచయం కలిగింది.

ఎర్రుపాలెంకుసమీపంలో జమలాపురం అనే గ్రామము ఉన్నది. ఇటీవల వెంకటేశ్వర స్వామి మహత్యం ప్రకటితం కావడంతో జమలాపురం చాలా ప్రసిద్ధి గాంచినది. జమలాపురం వారంతా చాలా సరళ స్వభావులు. వీరిలో కలుపుగోలుతనం చాలా సర్వసాధారణం.

'ఇక పెద్దన్న' కేశవరావుగారిని గురించి చెప్పవలసి వస్తే - చాలా కష్టపడే స్వభావం కలవారు. అతి సామాన్య జీవి. తాను ఎంత ఉన్నత పదవిలో ఉన్నా తోటి కార్యకర్తలతో కలిసిమెలిసి తిరిగేవారు. 1938 స్టేటు కాంగ్రెసు సత్యాగ్రహం తర్వాత ఆయన కీ.శే. వాశిరెడ్డి వెంకటపతి, కీ.శే. వట్టికొండ నాగేశ్వరరావు, అనే ఇరువురు కార్యకర్తలతో కలిసి దాదాపు మధిర తాలూకా అంతా కాలినడకన తిరిగారు. మనిషి ఉక్కులాటి శరీర దారుఢ్యం కలవాడు. ఆయన కార్యకర్తలందరితో కలిసి ద్వారాలు కట్టడం, పందిళ్ళు వేయడం మొదలయిన పనులన్నీ నిర్వర్తించేవాడు. ఇదొక్కటి చాలు ఆయన సహృదయానికి ఉదాహరణ.

కేశవరావుగారు తరువాత కాలంలో చాలా ఉన్నత స్థానాన్ని అధిరోహించారు. ఆంధ్ర మహాసభకు అధ్యక్షుడయినారు. హైదరాబాదు స్టేటు కాంగ్రెసు ఆంధ్ర శాఖకు అధిపతి అయినాడు. 'స్టేటు కాంగ్రెసు హైదరాబాద్'లో వారు కూడా ఒకరు. పార్లమెంటుకు కూడా కొద్దికాలం సభ్యుడుగా ఉన్నారు. ఎక్కడ ఉన్నా కేశవరావుగారి మనస్తత్వం వొకటే. చాలా ఆకస్మికంగా ఆయన స్వర్గీయులైనారు. వారి కుటుంబంలో అందరినీ నేనెరుగుదును. కేశవరావుగారి పెద్ద కుమార్తె కలిసినపుడల్లా ఆప్యాయంగా 'బాబాయి' అని పలకరిస్తుంది.

జమలాపురం వారి కుటుంబం నుండి అయ్యదేవర వారి కుటుంబానికి దత్తుడుగా వెళ్ళిన శ్రీ పురుషోత్తం రావుగారు కూడా నాకు చిరకాల మిత్రుడు. ఆయన బ్యాంకు ఉద్యోగంలో తీరికలేని పదవిలో ఉండి కూడా నాటక రంగానికి సారస్వత రంగానికి, ఎంతగానో సేవచేస్తున్నారు.




శ్రీ కీసర జ్వాలా నరసింహశర్మగారు

(8)

శ్రీరాములు

శ్రీ మద్వేంకటేశ్వర: సర్వేషాం
భక్తానాం శుభం కుర్యాత్

గండేపల్లి
Pin. 521 185
Via నందిగామ
కృష్ణా జిల్లా (A.P.).

చి॥ జమలాపురపు గోపాల్ కిషన్‌రావుకు ఆశీర్వచనములు

ఉభయకుశలోపరి

మా తమ్ముడు యోగానంద శర్మ నాకు మీరు వ్రాసిన లేఖ చూపినాడు. నాకు చాల సంతోషమైంది. మీరు సంకల్పించిన కార్యక్రమమునకు నాకు అమితానందము కలిగినది. నాకు మీ జమలాపురపు వారి వంశముతో సాన్నిహిత్యము. మా చెల్లెలు చి॥ల॥సౌ॥ రాజ్యలక్ష్మమ్మను శ్రీ జమలాపురపు మార్కండేశ్వరరావుగారి కుమారుడు చి॥ లక్ష్మీ నరసింహారావుకు యిచ్చినది లగాయతు బాంధవ్యముతో ప్రారంభమై వారి గురించిన పూర్వాపరాలు బాగా అవగాహన కలిగినది.

'జమలాపురపు వారి వంశము' వారు తర తరముల నుండి పేరు ప్రతిష్ఠలు కలవారు. అన్నదాతలుగా మంచి పేరు కలవారు. త్యాగశీలురు. ఒకరి సొత్తును ఆశించేవారు కాదు.

ఒక పర్యాయము నేను కేశవరావుగారి యింటి వద్ద వున్న సమయములో ఆగ్రామస్తుడైన ఒక కుమ్మరి వచ్చి అక్కడ వున్న కేశవరావుగారితో తనవద్ద ఒక సబ్ ఇన్‌స్పెక్టరుగారు కుండలు ఖరీదు కని తీసుకొని పైకము చెల్లించక పోగా, కొట్టి వెళ్లగొట్టినారని భోరున యేడ్చెను. వెంటనే కేశవరావుగారు ఆ కుమ్మరిని వెంట బెట్టుకొని ఆ సబ్ ఇన్‌స్పెక్టరుగారి వద్దకు వెళ్లి ఆ కుండలను ఆకుమ్మరికి యిప్పించినాడు. ఆయన గారిని చూచినంతనే ఆ సబ్ ఇన్‌స్పెక్టరు గారు గజగజ వణికినారు. ఇది అంతా ఆ పోలీసు ఠాణాలో మా సమక్షంలో జరిగింది. ఇది సుమారుగా 1944వ సం॥లో జరిగిన సమాచారము.

'నైజాం మిలట్రీ యాక్షన్' రోజులలో వారి తండ్రి గారైన జమలాపురపు పెద్ద వెంకట్రామారావుగారు వారి యిల్లు వదలి మా నందిగామ తాలూకా నందలూరు గ్రామములో వున్నారు. 'మిలట్రీ యాక్షన్' అయిన తరువాత కేశవరావుగారు, బొమ్మకంటి సత్యనారాయణగారు కలిసి వారి నాన్నగార్ని చూడటానికి నందలూరు వెళ్ళుటకు గండేపల్లి వచ్చినారు. వారితో నేను నందలూరు వెళ్లినాను. తండ్రిగారికి కేశవరావుగారు సాష్టాంగ నమస్కారములు చేసినారు. తండ్రి గారైన రామారావు

గారు కుమారుని కౌగలించుకొని భోరుమని విలపించినారు. అది చూచిన మేమందరము కంటతడి పెట్టినాము. ఇవి నేను వారిని గురించి చూసిన ముఖ్య సన్నివేశములు.

కేశవరావుగారు చక్కటి మృదువాక్యములతో, ఆకర్షణీయమైన విగ్రహముతో పిన్న, పెద్దతారతమ్యములు పాటించక అందరిని పలకరించేవారు.

జమలాపురపు వంశ యశో వికాసా కేశవరావు నామాంకితా !

ఆదర్శ సద్గుణ గుణాన్ని పేద జన సముద్ధరణ నిష్ఠాతా !

తెలంగాణా స్వాతంత్రోద్యమ దీక్షా కంకణా ప్రజాసేవకు ప్రాణాలొడిన ఉద్యమ సారధ్య నాయకా !

మాజీ ప్రధాని నరసింహారావు ప్రాణదాతా !

అమరజీవిగా ప్రజల నిత్య స్మరణాన్వితా !

సత్ కీర్తితో స్వర్గమందు శాశ్వత సింహాసనాధిష్ఠా !

మీకివే ఆంధ్రజాతి ప్రణామములు

## (9)

చి॥ గోపాలకృష్ణారావుకు కీనర యోగా నందశర్మ ఆశీర్వచనములు.

ఉభయకుశలోపరి

మీరు నన్ను జమలాపురపు వారితో గల పరిచయమును గురించి ప్రస్తావించ వలసినదిగా కోరినందున మాకు ముందుగా జ్ఞాపకమునకు వచ్చునది శ్రీ జమలాపురపు శ్రీ వెంకటేశ్వరస్వామివారు. శ్రీ స్వామివారు కేవలం మనకు మాత్రమే కాదు. సమస్త భారతావనికి ఇలవేల్పు. ఈ ప్రాంతమునకు జమలాపురం గ్రామము ఇక్కడికి వుండుటచే మేము తరుచుగా శ్రీస్వామివారి సమక్షంలో, అన్నప్రాసన, పుట్టు వెంట్రుకలు, ఉపనయనము మొదలగు శుభకార్యములు అనాదినుంచి జరుపుకునే ఆచారము కలదు. మాకు జమలాపురపు వారితో సంబంధ బాంధవ్యములు ఏర్పడిన తరువాత, వారు శ్రీస్వామి వద్దకు వెళ్ళుచున్నపుడు మా బావగారు జమలాపురపు లక్ష్మీనరసింహారావుగారు మాకు జాబు వ్రాసేవారు. అందరం కలసి శ్రీ స్వామివారి సన్నిధిలో పూజలు జరుపుకొనేవారము. ఒకసారి శ్రీ జమలాపురపు మార్కండేశ్వర రావుగారు మాకుటుంబ సభ్యులు శ్రీవారి సన్నిధికి వెళ్లినాము. శ్రీ మార్కండేశ్వర



శ్రీ గండేపల్లి యోగానంద శర్మగారు
గండేపల్లి

రావుగారు శ్రీ వారిని ఈ క్రింది విధముగా స్తుతించినారు. "కల్యాణాద్భుతగాత్రాయ, కామితార్థ ప్రదాయినే శ్రీమత్ వేంకటనాథాయ శ్రీనివాసాయ మంగళం" యెఱ్ఱుపాలెం వచ్చిన తరువాత ఈ శ్లోకమును మా అన్నగారు జ్వాలానరసింహశర్మగారు," శ్రీ మార్కండేశ్వరరావుగారి వద్ద నుంచి వ్రాయించుకున్నారు.

సుప్రభాత పఠనముచే శ్రీ స్వామివారు సాక్షాత్కరించి మంగళా శాసనము అనుగ్రహింతురని కరుణారసమువర్షింతురని శ్రీ మార్కండేశ్వరరావుగారు చెప్పచుండేవారట.

## 10. ఖమ్మం పట్టణ నివాసియైన జమలాపురపు రామకిషన్‌రావు, అడ్వకేట్ యొక్క జీవిత విశేషాలు మరియు అనుభవాలు కొన్ని మాత్రమే క్లుప్తముగా

నాకు యిప్పడు 84 సం॥ల వయస్సు వచ్చినది. నా జన్మ తేది 'నళ' నామ సంవత్సర వైశాఖ శు॥ 3 సోమవారము 'నరసింహజయంతి' రోజు సరియగు 25 ఖుర్దాద్ 1325 ఫసలి. నేను జన్మించినది మా స్వగ్రామమైన ఎర్రుపాలెం గ్రామంలో మా పిత్రార్జితమైన స్వగృహమందు మా నాన్నగారైన పెద్దనారాయణ రావుగారు నాజన్మ కుండలిని యిప్పటి అయితపు మంగపతిశర్మగారి తాతగారైన శ్రీమంగయ్య సిద్ధాంతిగారి చేత వ్రాయించినది. యిప్పటికి నావద్ద వున్నది. మా నాన్నగారు వారికి ఎర్రుపాలెం గ్రామంలోగల వారి స్వగృహమునందు నివశించుచూ, ప్రక్కన వున్న జమలాపురం గ్రామ కరిణీకం చేస్తుండేవారు. వారు తమ వృత్తి కరిణీకాన్ని వారి అంతిమ జీవితం వరకు మంచి పేరు ప్రతిష్ఠలతోను మరియు మంచి పలుకుబడితోనూ నిర్వహించి తుదకు వారి 78వ, సంవత్సరం వయస్సులో కాలధర్మం చెందినారు. వారు చాలా ధైర్యవంతులు. సాహసవంతులు. ప్రతిపనిని మంచి పట్టుదలతోనూ, నమ్మిన దానిని విశ్వసించి, దృఢసంకల్పంతో ప్రతికార్యం నిర్వహించేవారు.

వారి సహచరులలో అప్పటివారు శ్రీహరి లక్ష్మీనారాయణగారు, శ్రీ అయితపు మంగయ్యగారు, శ్రీ హరి సీతారామయ్యగారు, శ్రీ అయితపు సుబ్బయ్యగారు మరియూ శ్రీ సూర్యనారాయణగార్లు. శ్రీ యింగువ క్రిష్ణయ్యగారు, రామనాధంగార్లు వున్నారు. వీరందరిని నేను చూచాను.





ఓం

శ్రీ మాత్రేనమః



శ్రీ జమలాపురం వేంకటేశ్వరస్వామి

భగవాన్ శ్రీశ్రీశ్రీ సత్యసాయి బాబా వారల

దివ్య కృపాకటాక్ష వీక్షణాశీస్సులతో



# జమలాపురాన్వయ దర్శిని

(జమలాపురపు వారి జీవిత విశేషాలు)

గ్రంథకర్త:

జమలాపురపు గోపాలకిషన్‌రావు

ఎం.ఏ., ఎం.ఇడి.

ఎర్రుపాలెం - ఖమ్మం జిల్లా.

జమలాపురపు ప్రచురణలు

ప్రచురణ కర్తలు:

జమలాపురపు నరసింహ కమలాకర కాశ్యప

జమలాపురపు పాండురంగ విఠల్ బి.ఎస్.సి.

ఎర్రుపాలెం - 507 201, ఖమ్మం జిల్లా, ఫోన్ : 76588.

1998

ఆజాద్ గారు, శ్రీమతి ఇందిరాగాంధీగారు, మరియు శ్రీమతి సరోజనీ నాయుడు గారు, కె.యమ్. మున్షీగారు చూచిన వారిలో వున్నారు. వారిలో కొందరి అమూల్య సందేశములు సహితము విన్నాను. మరియు నా న్యాయవృత్తికె సంబంధించిన వాలలో గొప్ప మేధావులు మరియు దేశ ప్రఖ్యాత గాంచిన అప్పటి న్యాయవాదులు అలహాబాదు హైకోర్టుకు చెందిన శ్రీ తేజ్ బహద్దూర్ సప్రూగారు, మరియు మద్రాసు హైకోర్టుకు చెందిన శ్రీ న్యారిమన్‌గారు, శ్రీ భోలాభాయ్ దేశాయి గార్లును చూశాను. మరియు వీరిలో కొంతలని అనుభవోగ్యమైన వాదనలు కూడ విన్నాను. వీరందరూ నైజాం గారి పాలనలో హైదరాబాద్ హైకోర్టుకు మరియు జుడీషియల్ కమిటికి కేసులో వాదించుటకు వస్తూ వుండేవారు. కనుక యివి నాస్వానుచారాలు, యదార్థ విషయాలు.

మా తండ్రి గారి జనక స్థానంలో వారి అన్నదమ్ముల వివరాలు. నాకు తెలిసినంతవరకు వ్రాస్తున్నారు.

**1) అందరిలో పెద్దవారైన శ్రీ సుబ్బారావుగారి జీవిత విశేషము**



వారు నాకు తెలిసినంతవరకు పోలీసు శాఖలో సబ్ ఇన్‌స్పెక్టర్‌గా చాలా కాలం నైజాంగారి టైములో పని చేసి రిటైర్ అయినారు. ఉద్యోగ విరమణ తదుపరి ఎర్రుపాలెం గ్రామంలోనే వారు స్థిర నివాసం ఏర్పరచుకున్నారు. ఒక కుమారుడు ఒక కుమార్తె వున్నారు. వారి వివరాలు వంశ వృక్షంలో చూపబడినవి. వారు చాల ధైర్యసాలి. సాహసవంతులు. పోలీసుశాఖకు తగినవార నిపించుకున్నారు. లా & ఆర్డర్ బాగా Maintain చేసే వారని విన్నాను. బయట వ్యవహారముల లోనే కాక యింట్లో కూడా అందర్ని హడలు పెట్టించేవారు. వారు నాపదమూడు సంవత్సరముల వయస్సునందు 1338 ఫసలాలో కాలధర్మం చెందినారు.

**2) శ్రీవీరభద్రరావు గారు**



వారు అప్పటి రెవెన్యూ శాఖలో పని చేసె ఉద్యోగ ధర్మం పాటిస్తూనే అకస్మాత్తుగా బలవత్మ రణము చెందినారు. వీరు చాల సాత్విక స్వభావులు. ఎవరిని నొప్పించకుండా తమ పనిని తాము నిర్వర్తించు చుండెండెవారు. అందరితోను కలిసె మెలసి వుండెడెవారు. వీరు నాచిన్నతనము నందే అనగా నా పదిసంవత్సరముల వయస్సునందే మరణించారు.

3) శ్రీ వెంకటేశ్వరరావు గారు



వీరు నాకు గురువర్యులు, పితృసమానులు. వీరు నాకు న్యాయవాద వృత్తిలో అక్షరాభ్యాసము చేసినవారు. నేను యిప్పుడు ఈ స్థితికి రావటానికి వీరే కారకులు. వీరిని నేను ఎన్నటికి మరువజాలను. వీరు దైవ స్వరూపులు, ఎల్లప్పడు దైవచింతనయే వీరి జీవిత లక్ష్యం. అతి సాత్వీకులు. న్యాయవాద వృత్తి కూడ చాల నిజాయితీగా నిర్వహించినారు. వీరు తమ జీవితంలో మంచి పేరు ప్రతిష్టలు సంపాదించుకున్నారు. వీరు తెలుగు భాషలో వేదాంత గ్రంథములను అధ్యయనం చేసి గొప్ప పాడిత్యం సంపాదించుకొనటమేగాక హిందీ భాషలో కూడ ప్రావీణ్యత సంపాదించిన వారు. వీరు తన జీవితంలో మధ్య వయస్సులోనే శ్రీ స్వామి వివేకానందగారి వ్యాసములను తెలుగు భాషకు అనువదించి వాటి ప్రచురణలను పుస్తకరూపంలో వెలువరించారు. వారు నా బాల్యమునుండియే పరిచయము. నేను వారివద్ద పెరిగి పెద్ద వాడనైనాను. వారి లైబ్రరీలో న్యాయశాస్త్రానికి సంబంధించిన పుస్తకాలేగాక ఎన్నో వందలకొలది వేదాంత గ్రంథములుండెడివి. వారు ఎల్లప్పడు వాటిని అధ్యయనం చేస్తూ వుండేవారు. అట్టి పుస్తకములు తదుపరి వారి జీవితానంతరం గ్రంథాలయానికి యివ్వబడినారు. వారి దీర్ఘకాలం జీవించి 1956లో కాలధర్మం చెందినారు.



4) పెద్దనారాయణరావుగారు

మా నాన్నగారు వారి విషయము పైన సవివరంగా తెలిపారు.

5) గోపాల్‌రావుగారు

ఆఖరి వారు అయిదవ వారైన గోపాల్‌రావు



గారు. వారి విషయం సవిస్తారముగా, మరియు యధార్థముగా మంచి అనుభవంతో కీ.శే. కాళోజీ రామేశ్వరరావుగారు వరంగల్ పట్టణ వాస్తవ్యులు ఏ అతిసయోక్తి లేకుండా వ్రాసినారు.

నేను వారి అనుభవాలతో మరియు పరిచయాలతో కూడిన అభిప్రాయముతో అక్షర అక్షరంతో ఏకీభవిస్తున్నారు. శ్రీ కాళోజీ రామేశ్వరరావుగారు మంచి మేధావి, ప్రతిభావంతులు. వారు నాకు చిరపరిచయస్తులేకాక దగ్గర బంధువులు కూడ.

వారి తమ్ముడు కాళోజీ నారాయణరావుగారు కాలేజీలోను, న్యాయవృత్తిలోను సహపాటకులం, సమకాలికులం. కనుక మా పినతండ్రిగారైన శ్రీ గోపాల్‌రావుగారి స్మృతులను ఎన్నటికినీ మరువజాలము. ఇక వారి పెద్దకుమారుడు మా అన్నగారైన కిషన్‌రావుగారి గురించి వారి అల్లుడు శ్రీ పింగళి కైలాసపతిగారు అనుభవాలతో వ్రాసిన వ్యాసానికి నేనేకీభవిస్తున్నాను.

మా పిన తండ్రిగారు గోపాల్‌రావుగారి అల్లుడు ఊటుకూరు నారాయణ రావుగారి విషయంలో నా స్వానుభవాలు తెలుపుతున్నాను.

శ్రీ ఊటుకూరు నారాయణరావుగారు వరంగల్ కోర్టులలో వారి మామగారు గోపాల్‌రావు గారితో కలిసి న్యాయవాద వృత్తిని నిర్వహించి పిదప వారు పాలవంచకు మారి అక్కడ కోర్టులలో పనిచేయసాగినారు. తుదకు ఖమ్మం జిల్లా కోర్టు ఏర్పడిన తర్వాత ఖమ్మంలోనే వుండి తుదివరకు వారి న్యాయవాద వృత్తిని నిర్వహించినారు. వారు నా దగ్గర బంధువులు మాత్రమేగాక విద్యార్థి దశలోను, న్యాయవాద వృత్తి సమయమందు సమకాలికులు. ఆయన తన 75 సం॥ వయస్సులో ఖమ్మం పట్టణమందు తన స్వగృహంలోనే గతించినారు. మేమిద్దరం ఒకేసారి న్యాయవృత్తిని ఆరంభించినాము. మరియు కలిసి మెలసి యున్నాము. నారాయణరావుగారు మంచి ధైర్యశాలి. సాహసవంతుడు. ఆయన కోర్టులలో ధైర్యంగా వాదించుటయేగాక ఇతర రాజకీయ కార్యకలాపాలతో కూడుకున్న ప్రజా జీవితంలోను మంచి వుత్సాహంతో ధైర్యంతో సమస్యలను ఎదుర్కొనేవారు. వారు రాజకీయంలో ప్రవేశించి తెలంగాణా మూలంలో ఎనలేని కృషిచేసి అప్పటి నైజాం గవర్నమెంటుకు వ్యతిరేకంగా పోరాడినారు. తుదకు వారు నైజాం గవర్నమెంటులో అరెస్టుకాబడి శ్రీ సర్దార్ జమలాపుర కేశవరావుగారితో పాటు వరంగల్ సెంట్రల్ జైలులోను, గుల్బర్గా, ఔరంగాబాద్, నిజామాబాదు జైళ్లలోను వుంచబడినారు. రెండు సంవత్సరములు అలాగే కేశవరావుగారితో పాటు గడిపినారు. పోలీస్ యాక్షన్ జరిగిన తరుపరి తోటి నాయకులతో విడుదలైనారు.

శ్రీ నారాయణరావుగారు తామ్రపత్ర గ్రహీత. రాజకీయనాయకుడు. కార్యకర్త. మంచిపేరు ఎనలేని గౌరవం సంపాదించుకున్నారు.

నా జ్ఞాపకాలను ఆయన మీదవున్న గౌరవ సూచకంగా సమర్పిస్తున్నాను.

ఇది మా కుటుంబ పెద్దల విశేషాలు నాకు తెలిసినంతవరకు నా జీవిత అనుభవాల గురించి సమగ్రంగా తెలియపరుస్తున్నాను.

☆☆☆

# 11. నేనెరిగిన జమలాపురపు వారు



- శ్రీ శ్రీధర కేశవ రావుగారు,
ఎడ్వకేట్
ఖమ్మం

గత స్మృతులు, షుమారు యాభై సంవత్సరముల పైమాటే.

మళ్ళీ గుర్తు తెచ్చుకునే అవకాశం శ్రీ జమలాపురపు గోపాలకృష్ణమూర్తి బావగారి ద్వారా కలిగినందుకు సంతోషిస్తూ, కీర్తి శేషులైన శ్రీ జమలాపురపు వెంకటేశ్వరరావు వకీలుగారి గురించిన, బహుకొద్ది విషయాలు నాకు తెలిసినవి వ్రాస్తాను -

అప్పుడు నాకు 14, 15 సంవత్సరముల వయస్సు. మా తండ్రిగారైన కీ॥శే॥ శ్రీధర కేశవరావుగారు, శ్రీ వెంకటేశ్వరరావుగారు చాలా ఆప్తమిత్రులు. వారు ప్రతిరోజు సాయంకాలం ఆరుగంటల మొదలు రాత్రి పొద్దుపోయేవరకు యేవో విషయాలు మాట్లాడుతూ ఉండేవారు. ఆరోజుల్లో కోర్టు వ్యవహారాల నిమిత్తమై స్వంతపనులపై మా ఇంటి అల్లుళ్ళు వారి మిత్రులు, మందీ, మార్బలం మా ఇంటికి రావడం కొన్ని రోజులవరకు మకాం చేయడం జరుగుతుండేవి.

మా మిల్లు తగాదాలో అందులో ఒక భాగస్తులైన శ్రీ జమలాపురపు వెంకటేశ్వరరావుగారు (ఖమ్మం), వారి సోదరులు శ్రీ గోపాలరావుగారి ద్వారా వరంగల్‌లో ఆకేసు నడిపిస్తూ ఉండేవారు. ఆకేసు పధ్నాలుగు సంవత్సరముల తర్వాత మా పక్షంవైపు తీర్మానించడిన అనంతరం ఆర్థిక విషయంగా మా దత్తత తండ్రిగారైన రంగారావుగార్కి శ్రీ జమలాపురం వెంకటేశ్వరరావుగార్కి మధ్య బేధాభిప్రాయాలు రావడం వాటి పరిష్కారమైన రెండు సంవత్సరాల వరకు ఎడమొగం పెడమొగంగా ఉన్న ఉభయ మిత్రులు స్పెషల్ కలెక్టరు బంగ్లా (ప్రస్తుతం ఉన్న మున్సిఫల్ ఆఫీసు) మెట్లపై ఎదురుబడి గాఢాలింగం చేసుకొని కంటతడిబెట్టటం ఇంకా నాకు గుర్తు.

శ్రీ వెంకటేశ్వరరావుగారు మా మిల్లు తగాదాలో సివిల్ సూట్ డ్రాఫ్టు చేయగా హైదరాబాద్‌లో సివిల్ కేసుల్లో 'దిట్ట' అని పేరున్న వకీలు దానిని చూడటం ఆయన తాలూకా లెవల్లో అంత బాగా డ్రాఫ్టు చేసినందుకు ఎంతగానో మెచ్చుకున్నట్లు మా నాయనగారు ఆ సంతోషంతో మాముందు చెప్తూ వుండేవారు

శ్రీ వెంకటేశ్వరరావుగారు దైవభక్తులు. మడిఆచారాలు, పూజా పురస్కారాలు పాటించేవారు. అంతేకాక కోర్టు నుంచి తిరిగి వచ్చిన తరువాత స్నాన సంధ్యలు ముగించుకొని సాయంత్రం నాలుగు గంటలకు భోజనం చేసేవారు మళ్లీ రాత్రి 10 గం॥లకు స్నానం, సంధ్య వార్చటం అయిన తరువాతనే భోజనం చేసేవారు. వారు బేస్త బజారు నందు రామాలయం ప్రక్కన వున్న విద్యార్థి సంఘ నిలయం. గ్రంధాలయానికి ఎన్నో హిందీ, తెలుగు ఆధ్యాత్మిక గ్రంధాలే కాకుండా పుస్తకాల బీరువా కూడ యిచ్చిన దాత. ఆ గ్రంధాలయ నిర్మాణంలో శ్రమదానం చేసిన పుర ప్రముఖులలో వీరు కూడా వుడటం వారి సేవా తత్పర ప్రవృత్తికి అద్దం పడుతుంది.

వారి ఇంటి కెదురుగా కీ.శే. జమలాపురపు పరాంకుశరావుగారు వుండేవారు. ఆయన మా అమ్మగారి స్వంత అక్కగారి కుమారుడు. మేధావి. కాని విధివక్రించి ఆర్థిక క్షీణతవల్ల రాణింపుకు రాలేదు.

ఇకపోతే సర్దార్ జమలాపురం కేశవరావుగార్ని ఖమ్మం రైల్వే ప్లాట్‌ఫారంపై చూసే అవకాశం ఒకసారి నాకు కలిగింది. ఆయన గారు ఖద్దరు లాల్చీ ధోతీ ధరించేవారు. అజానుబాహు విగ్రహం మంచి ఛాయతో చూపరులను యిట్టే ఆకట్టుకునేది.

ఆయనగారి ఉపన్యాసం ఖమ్మం బహిరంగ సభలో వినటం నాకు యింకా గుర్తు. వారి ఉపన్యాసం చాల సరళమైన భాషలో పండితులు, పామరులకు అర్థమయ్యే విధంగా ఆకట్టు కునేదిగా వుండేది. ఆనాటి నైజాం ప్రభుత్వాన్ని దుయ్యబడుతూ వారు చేసే ఉపన్యాసం ఈనాటికి నాకు జ్ఞాపకం.

# 12. ఖమ్మం నివాసులైన జమలాపురపువారు

- శ్రీమతి గోళ్ళమూడి లక్ష్మి (జయశ్రీ), ఖమ్మం



మా నాన్నగారు డాక్టర్ రామారావు గారు తనకు చిన్నతనంలోనే తల్లి వెంకట్రావమ్మ గారు పరమ వదించటంలో నవతి తల్లి సీతారావమ్మ గారి పెంపకంలో పెరిగారు. ఆమెకు సంతతిలేదు. మా తాతగారు ద్వితీయ వివాహం చేసుకున్న 2 సం॥లకే పోవటంతో పినతండ్రిగారి దగ్గరుండి చదువుకున్నారు.

చిన్నతనం నుంచి కష్టపడటానికి అలవాటుపడ్డ రామారావుగారు డాక్టర్ చదివి ఖమ్మంలో వైద్యవృత్తిలో నిలబడటం అంటే ఆయనగారి పట్టుదలే కారణం.

* * *

ఖమ్మం పట్టణంలో ఐదు దశాబ్దాలకు పూర్వం ఉన్న న్యాయవాదుల్లో సుప్రసిద్ధులు వెంకటేశ్వర రావుగారు. కుశాగ్ర బుద్ధి, సమయస్ఫూర్తి, చక్కని రచనా పాటవం జడ్జీలను కూడ అచ్చెరు వందించేది.

గ్రంధాలయాభివృద్ధికి కృషిచేయటమేగాక అనేకమైన ఆధ్యాత్మిక గ్రంధములను రామాలయము ప్రక్కన గ్రంధాలయమునకు యిచ్చిరి. వారు నిత్యము బ్రహ్మ ముహూర్తములో లేచి సంధ్యావందనము, గీతా పారాయణము తిరిగి సాయంత్రము సంధ్యా వందనము ఆచరించెడివారు. ఎక్కువగా సాహితీ, సాంస్కృతిక సదస్సులలో పాల్గొనెడివారు. అన్ని వర్ణములవారు ఆయన్ను పూజ్యభావముతో చూచెడివారు. ఖమ్మంలో ఆయన వేదవిద్యాభివృద్ధికి వేద పాఠశాల నెలకొల్పిరి. మంచికి మారు పేరే ఆయన అని జన శృతి కలదు. ఈయన ఏకైక కుమార్డు. సత్యనారాయణరావు హైదరాబాద్‌లో స్థిరపడ్డారు.

- శ్రీ జమలాపురపు సత్యంబాబు గారు, ఖమ్మం

# 13. మా 'మాతామహుల స్థానం' ఎఱ్ఱుపాలెం

## కీ.శే. జమలాపురపు జగన్నాథరావుగారు



- శ్రీ పెగెళ్లపాటి వెంకట్రావుగారు, మధిర

కీ.శే. జమలాపురపు జగన్నాథరావుగారు నిరతాన్నదాతగా పేరు గాంచారు. ప్రతి సంవత్సరం శ్రీరామ నవమికి ముందుగా నెలరోజులనుంచే ఎఱ్ఱుపాలెంలో అన్నదాన సత్రం ప్రారంభించేవారు. అప్పటికి భద్రాచల పుణ్యక్షేత్రానికి రైలుమార్గం గాని, బస్సుమార్గం గాని లేదు. ఎఱ్ఱుపాలెం నుండి భద్రాచలం ఎడ్లబండ్లు కట్టుకొని పోయేవారు. రు. 60-/ నుండి 100 రూపాయల వరకు కిరాయి వుండేది. రోజూ దాదాపు రెండు, మూడువందల మంది యాత్రకులకు జగన్నాథరావుగారు భోజనం ఏర్పాటు చేసేవారు. ఊళ్లోవాళ్ళు ఏ కొద్దిమందో తప్ప ఊరు ఊరంతా పొయ్యి రాజేసే పని వుండేదికాదు. నిత్యం అన్నదాన కార్యక్రమాల్లో అందరూ పాలుపంచుకొని ఉత్సాహంగా పని చేసేవారు. వచ్చిన యాత్రికులు కొందరు శనివారం వంటి పర్వదినాల్లో రాత్రిళ్లు భోజనాలు చెయ్యనివారికి అటుకులు, పేలపిండి ఫలహారం పెట్టేవారు. మడిఆచారులు పాటించే యాత్రికులకని జగన్నాథరావుగారి యింట్లో ఆడవారు మంగమ్మగారు వారి కూతురైన మాడపాటి రావమ్మగారు, వారికి తోడుగా కావమ్మగారు, శేషమ్మగారు, రంగమ్మగారు, గానుగపాటి రంగమ్మగారు మొదలైనవారు మడిగట్టుకొని అటుకులు దంచేవారు. శ్రీ గరిమెళ్ల సుబ్బయ్యగారు బస్తావడ్లు అటుకలకని గుండిగలు, గుండిగలు ఒక్క చేతిమీదిగానే వార్చేవారు.

జగన్నాథరావుగారు, జమలాపురం దేవాలయం వీరి ఆధీనంలో వుండటంతో నెలలో సగం రోజులు అక్కడి దేవాలయ కార్యక్రమాలు చేసేవారు. అక్కడ కూడ భోజనాలు యధావిధిగా మడిఆచార సాంప్రదాయాలు, నియమ నిష్టలతో నిత్యం జరుగుతుండేది. రైల్లో వచ్చేవారు, బండ్లు కట్టుకొని భద్రాచలం పోతూ, వస్తూ ఎఱ్ఱుపాలెం, జమలాపురంలో నిత్య కళ్యాణం పచ్చతోరణంగా జరుగుతుండేది. ఇంట్లో, వీధిలో విశాలమైన పందిళ్లు వేసేవారు. దేవుడి గుడి దగ్గర నుంచి రాజవీధి వరకు పగులు, మాపులు వందమందికి తక్కువలేకుండా భోజనం ఏర్పాటు చేసేవారు.

## కీ.శే. జమలాపురపు సీతారామయ్యగారు

14 సంవత్సరాలకే అడవుల్లోకి పోయి తపస్సు చేసుకున్నారు. అన్నల చొరవ వల్ల తిరిగి యింటికి వచ్చి సాంసారిక జీవనంలో ప్రవేశించినప్పటికి దైవారాధన వదలలేదు. ఇంట్లోనే దేవీనవరాత్రులు పెట్టాలు. రాత్రి పదిగంటల వరకు దేవి పూజలో నిమగ్నమై వుండేవారు. చనిపోయే ముందు తను పోయేది తెలుసుకొని ముగ్గువేసుకొని చాపపరచుకొని పడుకొని అంతిమశ్వాస విడిచారు. తను నమ్మిన అన్న జగన్నాధరావుగార్ని, తాను దేవుడుకని యిచ్చిన 3 ఎకరాల మాగాణి చేయించటం, పండిన ధాన్యాన్ని దైవకార్యక్రమాలకు కైయంకర్యం చేయటం తప్ప అన్యచింతన లేకుండా వుండేట. వాక్సుద్ధిగలిగి, తపో నిష్టాగరిష్ఠుడైన సీతారామయ్యగారు నిరంతర భ.గవద్ధ్యానంలో వుండేవారు. శీతారామయ్యగారు మహాతపశ్శక్తి సంపన్నుడు. నిర్వికారి. అట్టి .మహానుభావుడు తొంభై సంవత్సరములు జీవించి, జీవితాంతం ఆకుటుంబం ,ల్లాపాపలతో క్షేమంగా వుండటం ఆయన చేసుకొన్న పూజాఫలం. వృద్ధాప్య దశలో కూడా జమలాపురం నడిపోయేవారు.

## కీ.శే. జమలాపురపు పెద్దసుబ్బారావుగారు

పెద్ద సుబ్బారావుగారు పెద్దగోపవరం మాలీపటేల్‌గిరి, చిన్న సుబ్బారావుగారు తొండల గోపవరం కరణీకం రెండూ కలిపి అన్యోన్యంగా చేసుకుంటూ వుండేవారు.



దస్తరాలు పెద్ద సుబ్బారావు గారి యింట వుండటం నాకు బాగాగుర్తు. వారిరువురు శ్రీరామ నవమి ఘనంగా జరిగిపేవారు. రామమందిరం నుంచి అటు దేవాలయవైపు యిటు సుబ్బారావు గార్ల వీధివైపు విశాలమైన పందిళ్లు వేసి సీతారాములవారి కళ్యాణం వైభవోపేతంగా జరిపేవారు. సంవత్సరాది పండుగనుంచి శ్రీరామనవమి పూర్తయిన తరువాత కూడ గ్రామంలో ఆబాలగోపాలం ఎంతో ఉత్సాహంగా పాల్గొనేవారు.

# కీ.శే. జమలాపురపు చిన్నరామారావుగారు



చిన్నరామారావుగారు తండ్రి వారసత్వం పోనీయకుండా పెద్దగోపవరం కరిణీకం చేసుకుంటూ దైవకార్యక్రమాలలో ఉత్సాహం చూపిస్తూ, రాజకీయ కార్యక్రమాలలో కూడ పాల్గొనేవారు. నైజాం దురంతాల సమయంలో పరిటాల క్యాంపులో పనిచేశారు. సాహిత్యాభిమాని. ఇంట్లోనే స్వయంగా గ్రంధాలయం ఏర్పరచుకొన్నారు. కొంతకాలానికి ఎఱ్ఱుపాలెంలో వున్న మహబూబియా గ్రంధాలయానికి ఆ గ్రంధాలను సమర్పించారు. వితరణశీలి. ఉత్సాహవంతులు. పేరు ప్రతిష్ఠలు సంపాదించారు.

ఎఱ్ఱుపాలంలు గ్రామం మేధావులకు పుట్టినిల్లు. జమలాపురపు వారి వంశం మహానుభావులకు జన్మనిచ్చింది. సర్దార్ జమలాపురం కేశరరావుగారు, మాడపాటి హనుమంతరావుగారు, మాడపాటి రామచంద్రరావుగారు వంటి మహోనత వ్యక్తులు జన్మించటం ఆ గ్రామం చేసుకున్న పూర్వ పుణ్య సుకృతం. జమలాపురపు వెంకటకిషన్‌రావుగారు, జమలాపురపు పెద్ద రామారావుగారు, జమలాపురపు పెద్ద నారాయణరావుగారు తమ కరిణీకాలలో ఆనాటి వరంగల్ జిల్లా అంతటికి ప్రధమశ్రేణి పట్వారీలుగా పేరుపొందారు. జిల్లా కలెక్టర్‌ల ప్రశంసలు పొందారు. నైజాం నవాబు కొంతమంది గ్రామాధికారులకు 'మెడల్స్' బహుకరించారు. అట్టి మెడల్స్ ఎఱ్ఱుపాలెం వారికి రావటమేకాక మడిపల్లి మాలీ పటేలుగారైన కీ.శే. శివరాజు వీరభద్రరావుగార్కి వచ్చిన మెడల్ మచ్చుకు యిది ఒకటి.



జమలాపురపు వెంకటేశ్వరరావుగారు, జమలాపురపు గోపాల్‌రావుగారు పేరుబడ్డ వకీళ్ళుగా ప్రఖ్యాతినార్జించారు.

# 14. జమలాపురపు వారితో పినపాకవారి అనుబంధం



డా॥ పినపాక కమలాకరరావు గారు
B.A; B.Ed
మధిర

గడచిన శతాబ్దంన్నర కాలంలో పినపాకవారికి, జమలాపురపువారికీ, అన్యోన్య సంబంధాలు వున్నాయన్నది నగ్నసత్యం. ముఖ్యంగా నైజాం ప్రభుత్వం ఏలుబడిలో దక్షిణ సరిహద్దులోని ఎఱ్ఱుపాలెం, జమలాపురంలలో స్థిరనివాసం ఏర్పరచుకొన్న జమలాపురపు వారికీ, జి. కొండూరు సమీపంలోని పినపాక గ్రామం నుండి గూడెం మాధవరం వరకు గల 15 కిలో మీటర్లలో గల లోయ గ్రామాలలో కరిణీకం, మున్సబు గిరీలను చేపట్టి అధికారం చెలాయించిన పినపాక వారికీ, అన్యోన్య సంబంధ బాంధవ్యాలు వుండేవి. ఈ ప్రాంతం అప్పటి ఆంగ్ల ప్రభుత్వ ఏలుబడిలోని ఉత్తర సరిహద్దు గ్రామాలు. బ్రిటీషు రాజ్య సరిహద్దు గ్రామాలైన గూడెం మాధవరం, దుగ్గిరాలపాడు, గంగినేనిపాలెం, రామన్నపాలెం, సున్నంపాడు, మునగపాడు, చెర్వు మాధవరం, గడ్డమణుగు, కొండూరు, పినపాక గ్రామాల గ్రామాధికారులు కొందరు పినపాక గ్రామంలోను, గంగినేనిపాలెం గ్రామంలోను, స్థిరనివాసం ఏర్పరచుకొన్నారు.

గంగినేనికి, ఎఱ్ఱుపాలెం గ్రామానికీ, మధ్య 10 కిలోమీటర్ల దూరమే వున్నా, రెండు గ్రామాల మధ్య నైజాం - బ్రిటీషు సరిహద్దు ఏర్పడి విభజనగావుంది. 'శారదాబిల్లు' అమలులో వుండటంవల్ల ఆనాడు బ్రిటిషు ఏలుబడిలో నివశించే బ్రాహ్మణులు తమ మైనరు పిల్లల వివాహాలు చేసికొనుటకు నైజాం సరిహద్దు గ్రామాలైన గంగినేని పాలెంలో దిగి పినపాక వారిండ్లలో ఆతిథ్యము పొంది, పరిస్థితులు విచారించి ఎఱ్ఱుపాలెం వెళ్ళి వివాహాలు జరుపుకొని జమలాపురం వారిండ్లలో ఆతిథ్యం పొంది తిరిగి వాళ్ళ - వాళ్ళ ప్రదేశాలకు తరలివెళ్ళేవారు. ఆనాడు దేశ పాండ్యాలైన జమలాపురం వంశజులు తమ యిళ్ళలో వచ్చిన వారికి ఆతిథ్యం యిచ్చి, పెళ్ళిళ్ళు చేసి పంపండంలో పరమానం దాన్ని అనుభవించేవారు.

అంతేగాక జమలాపురపువారి ఆడబిడ్డలు శ్రీ జమలాపురపు పుల్లయ్యగారి కుమార్తెలు పుల్లమ్మ, వెంకట్రావమ్మగార్లను మా తాతగారగు లక్ష్మయ్యగార్కి యిచ్చి వివాహం చేశారు. తర్వాత శ్రీ జమలాపురపు చినరామారావుగారి చెల్లెలు వెంకాయమ్మను మా పెత్తండ్రి కుమార్డు వెంకటేశ్వరరావుగారికి, మరల చిన్నరామారావుగారి కుమార్తె రాజ్యలక్ష్మిని మేనల్లుడు రామాంజనేయశర్మకు యిచ్చి సంబంధ బాంధవ్యాలు స్థిరపర్చుకున్నారు. ఈ తరంలో రామాంజనేయ శర్మ

కుమార్తె లలితను జమలాపురపు విశ్వనాధరావుగారి కుమార్డు చి॥ నారాయణరావు కు యిచ్చి వివాహం జరుపుటచే బాంధవ్యాలు విడతీయరానివిగా మారినవనుట నిస్సందేహం.

ఉద్యోగ ధర్మంగా నేను సరిహద్దు గ్రామమైన కొత్తపాలెంలో ఉపాధ్యాయునిగా పనిచేయుచున్నప్పడు రేమిడిచర్ల పాఠశాలలో శ్రీ చింతా దుర్గాప్రసాదరావు, జమలాపురపు వంశజుడైన గోపాల్‌కిషన్‌రావు, ఎఱ్ఱుపాలెం వాస్తవ్యులు హరిలక్ష్మీ నరసింహారావు, ఆకెళ్ల రాధాకృష్ణమూర్తి, ఐతవు వీరభద్రరావు మున్నగువారు ఉపాధ్యాయులుగా పనిచేస్తుండగా అందరం కల్సి సమితిస్థాయిలో ఆటలు, సాంస్కృతిక కార్యక్రమాలు నిర్వహించి రేమిడిచర్ల పాఠశాలను సమితిలో వెలుగులోనికి తెచ్చిన కృషి ప్రశంసనీయం.

నేను గోపాల్ కిషన్‌రావు ఇరుగు పొరుగు గ్రామాలలో ఉపాధ్యాయులైనా కృష్ణార్జులవలె ఏ కార్యక్రమాలనైనా విజయవంతం చేయగలిగాము. మా కిషన్‌రావుకు కోపం క్షణం మాత్రమే. ఓసారి మేమిద్దరం ఎర్రుపాలెం వెళ్తుండగా వాళ్ళచేలో ఒక గొర్రెలకాపరి గొర్రెలు మేపుతుండగా కిషన్‌రావుకు కోపం వచ్చి వానిచేతిలో కర్రతో కొట్టబోగా నేను ఆ కర్ర లాక్కొని గొర్రెల కాపరిని తేలిగ్గా రెండు దెబ్బలు కొట్టి తిట్టి వదిలేశా. ఎందుకంటే కిషన్‌రావు వాడని దెబ్బలతో చంపుతాడన్న భయంతో నేనే ముందుగా శిక్షించాను.

కిషన్‌రావు అన్నగారు శ్రీ రామేశ్వరరావుగారు రాజకీయంగా పలుకుబడికల వారు గనుక వారి తమ్ముడు వెంకటకిషన్‌రావును సర్పంచిగా (ఎఱ్ఱుపాలెం) ఎన్నిక చేయించి గ్రామాన్ని తీర్చిదిద్దగలిగారు. మేం ఏమిచేసినా ఆరోజుల్లో ఒక లక్ష్యాన్ని ఆశించి చేసామేగానీ, వేరే ప్రతిఫలాక్ష కోరలేదు. రేమిడిచర్ల కిషన్‌రావుగారు జమలాపురం దేవస్థాన అధ్యక్షునిగాను, వారి తమ్ముడు దివాకరరావుగారు పట్వారీ గాను, రేమిడిచర్ల గ్రామస్థులైన సామినేని వెంకయ్యగారు, కొల్లి వెంకటస్వామిగారు, రామభద్రరాజుగారు, జానకిరామయ్యగారు, చింతా సుబ్బారావుగారు, యల్లమందల చిన్న సీతయ్య గార్ల ప్రోత్సాహం మా కార్యక్రమాలు విజయవంతమవడానికి బాగా తోడ్పడ్డాయి.

పై విధంగా జమలాపురం వారి కుటుంబాలతో పినపాక వారి కుటుంబాలు సంబంధ బాంధవ్యాలు కలిగి విడదీయరానివిగా పెనవేసికొని పోయినవనుటలో అతిశయోక్తి లేదు. అలానే యిక రాబోయే ముందు తరాల్లో కూడా యీ సంబంధాలు సాగాలనీ, భగవానుడు ఇలవేల్పు శ్రీ వెంకటేశ్వరస్వామి మమ్ములను, వారినీ, ఆయురారోగ్య ఐశ్వర్యాలతో, కృపాకటాక్ష వీక్షణాలతో కరుణించాలనీ మనసారా కోరుకుంటూ యీ విషయ పరిజ్ఞానాన్ని అనేక శ్రమలకోర్చి భావితరాలకు అందజేయ సంకల్పించిన శ్రీ గోపాల్‌కిషన్‌రావును ఆశీర్వదిస్తున్నాను.

☆ ☆ ☆

# 15. వంశ వృక్ష మహాయజ్ఞం



- చి॥ జమలాపురపు
శ్రీనివాసరావు బి.ఇ
ఎఱ్ఱుపాలెం

"వంశవృక్షం పుస్తకం కోసం నువ్వు సాయంత్రాని కల్లా రాసి ఇవ్వాలి" అని బాబాయ్ చెప్పినపుడు నా మనసులో మెదిలిన ఊహ రాయటానికి నాకుగల అర్హత ఏమిటి ? అని, బాబాయ్‌కి నా మీద కలప్రేమ, అనురాగం తప్ప నేను రాయటానికి వేరే అర్హత ఏమీలేదు.

జనరల్‌గా రాయి అని బాబాయ్ చెపితే అనేక ఆలోచనలు, మేరు పర్వతంలాంటి కేశవరావుగారి గురించి రాయాలా, అమృతమూర్తి, సిరతాన్నదాత, అజాత శత్రువు మాబామ్మ గురించి రాయాలా, మహాయజ్ఞాన్ని పెట్టుకున్న మా బాబాయ్ గురించి రాయాలా లాంటి ఆలోచనలు మెదిలాయి.

అసలు వంశవృక్షం అవసరమేమిటి అని ఆలోచించినపుడు జీవన వేగం పెరిగిపోయి చెట్టుకొకళ్లం, పుట్టకొకళ్లం అయిపోయిన అన్నదమ్ముల మధ్య ఒక సజీవ సంబంధం ఏర్పడటానికి వంశవృక్షం దోహదం అవుతుంది. కాలగమనంలో దేశం నలుమూలలకు చెదిరిపోయిన సోదరులు ఏ ఊరులో ఉన్నారో తెలుసుకోగల అవకాశం ఈ పుస్తకం వల్ల లభిస్తున్నది.

వేగం పెరిగిపోయి, బంధుత్వాలు సన్నగిల్లి 5 రోజుల పెళ్ళిళ్ళు, 16 రోజుల పండుగదాకా బంధువులంతా కల్సి వుండే రోజులు మధుర స్మృతులుగా మారిపోయి, అత్యంత ముఖ్యుల ఇళ్ళల్లోని వివాహాలకు అరగంట ముందుపోయి, బఫే అయిన వెంటనే వచ్చివేసే సంస్కృతినుంచి దూరంగా తీసుకొనిపోయే ఒక మధురమైన మలయ మారుతం ఈ వంశ వృక్షం.

దాదాపు 15 సంవత్సరాల క్రితం 1985లో బాబాయ్ నాకు మొదటిసారిగా ఈ వంశ వృక్షం తాలూకు కాగితాలను చూపించాడు. దీనికి ఒక క్రమమైన రూపాన్ని ఇవ్వాలని బాబాయ్ చెప్పినపుడు ఒక రోజల్లా మధిరలో కూర్చొని దాదాపు 12 తరాల వివరాలను ఒకే పెద్దకాగితం మీద వచ్చేటట్లు చేసి ఇస్తే బాబాయి ఆరోజు పడిన సంతోషం, ఆనందం నాకు ఈ రోజుకూ గుర్తు ఉన్నది. ఆరోజు నుంచి దాదాపు 15 సంవత్సరాలుగా బాబాయి దీన్ని ఒక మహాయజ్ఞంగా భావించి, దీన్ని పూర్తి చేయడం మా తరాలకు ఒక వరం.

ఎక్కడో అమెరికాలో జన్మించి 7 తరాల క్రితం తన తాతకు ముత్తాతను దక్షిణ ఆఫ్రికానుంచి ఎలాబానిస బంధించి తీసుకొని వచ్చింది, పరిశోధన చేసి రచించి నోబెల్ ప్రైజు పొందిన "రూట్స్" నవలకు సమసాటి మన జమలాపురపు వారి వంశ వృక్షం. బాబాయికి కూడా అంత కీర్తి లభించాలని ఆశిస్తూ ...

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 72 | 9 | <u>శ్రీ జమలాపురపు లక్ష్మీనరసింహారావుగారి ఆడపిల్లలు</u> | | | | | |
| 74A | 10 | 1) జయప్రద<br>భర్త<br>భాస్కరశర్మ | 1953<br><br>1942 | | | | శ్రీ కీసర రామనరసింహ<br>రావు గారికుమారుడు<br>గండేపల్లి |
| 74B | 11<br><br><br>12<br>12 | 1) పవన్‌కుమార్<br>భార్య<br>స్వాతి<br>1) సోహన్ భార్గవ్<br>2) సంజయ్ భార్గవ్ | | | | రామకృష్ణా<br>పురం<br>Hyd<br>బజాజ్<br>కంపెనీ.<br>దిల్‌సుక్‌నగర్ | |
| 74C | 11 | <u>ఆడపిల్ల</u><br>కరుణ (అవి) | 1964 | | | | |
| 74D | 10<br><br><br>11 | 2) లక్ష్మీప్రసన్న<br>భర్త మున్నంగి<br>వెంకటేశ్వరరావు<br>శ్రీకాంత్ | 1953 | | | | శ్రీ మున్నంగి రామ<br>కోటేశ్వరరావు గారి<br>కుమారుడు, మున్నంగి<br>భారద్వాజస<br>గుంటూరు జిల్లా |
| 74E | 11 | <u>ఆడపిల్ల</u><br>చంద్రకళ<br>భర్త ______ | | | | | |
| 74G | | 3) సీతాస్వయంప్రభ<br>భర్త పలివెల<br>వెంకటేశ్వరరావు<br>మనోజ్‌కుమార్ | 17.1.56<br><br>1.10.54<br>26.6.84 | B.A.B.Ed<br><br>B.A<br>10th | ఉపాధ్యాయిని<br>నేలకొండపల్లి<br>Jr. Asst.<br>N.C.C.Office | ఇందిరానగర్<br>కాలనీ,మమత<br>పోలీస్ క్వార్టర్స్<br>దగ్గర, ఖమ్మం | శ్రీ పలివెల మంగపతి<br>రావు, భారతిదేవి గార్ల<br>కుమార్లు కలకోట |
| 74G | | 4) రాజ్యశ్రీ<br>భర్త దేవత్రాజు<br>సత్యనారాయణ (దత్తు)<br><br>ప్రశాంత్<br><u>ఆడపిల్ల</u><br>ప్రసూన | 1964<br><br><br><br>1988<br><br>1990 | 10th<br>B.Com | <br>ప్రైవేటు<br>స్కూలు<br>మేనేజ్‌మెంట్ | <br>రెడ్డిగూడెం<br>కృష్ణాజిల్లా<br>పిన్ : 521215 | శ్రీ కొటూరి వెంకయ్య<br>గారు, సరస్వతి గార్ల<br>కుమారుడు<br>శ్రీ దేవత్రాజు వెంకట<br>గణం [illegible]ములగార్ల<br>[illegible]త్తు కుమార్లు<br>శ్రీవత్స, రెడ్డిగూడెం |
| 74H | | రాధ<br>భర్త పలివెల<br>శ్రీనివాసరావు<br>1) నితీష్ భార్గవ<br>2) నవీన్ భారతి | 15.9.67<br><br>28.9.59<br>27.9.90<br>28.3.98 | | | సత్తుపల్లి<br>ఖమ్మంజిల్లా<br>గోల్డ్‌స్పాట్<br>కంపెనీ | శ్రీ పలివెల మంగపతి<br>గావు భారతీదేవి గార్ల<br>కుమార్లు. కలకోట |
| 75 | 9 | [illegible]రావు (అవి) | 1923 | | | | |

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 64 | 8 | కీ.శే జమలాపురపు మార్కండేశ్వరరావుగారి ఆడపిల్లలు | | | | | |
| 75A | 9 | 1) వెంకట్రావమ్మ<br>భర్త ఏటూరి<br>సత్యనారాయణరావు<br>నిస్సంతు | 1910 | | | | శ్రీ ఏటూరికిషన్‌రావు<br>గారి 2వ కుమార్తు<br>జలగుమాడు, శ్రీవత్స<br>ఖమ్మంజిల్లా |
| 75B | 9 | 2) లక్ష్మీబాయమ్మ<br>భర్త మామునూరు<br>వీరభద్రరావు (నిస్సంతు) | 1913 | | | | |
| 75C | 9 | 3) విమలాబాయి<br>భర్త దేవత్రాజు<br>వెంకట రత్నం | 1922 | | కరిణీకం | రెడ్డిగూడెం<br>(గ్రామము)<br>521 215<br>కృష్ణాజిల్లా | శ్రీ దేవత్రాజు ——<br>—— గార్ల<br>కుమారుడు<br>రెడ్డిగూడెం |
| 75D | 10<br><br><br>10<br>11<br><br>11 | సత్యనారాయణ<br>(దత్తుడు)<br>భార్య<br>రాజశ్రీ<br>ప్రశాంత్<br>ఆడపిల్ల<br>ప్రసన్న | | B.Com<br><br><br>10th | ప్రైవేటు<br>స్కూలు<br>మేనేజ్‌మెంట్ | | కాటూరి వెంకయ్యగారు<br>గారు,సరస్వతిగార్ల<br>కుమారుడు<br>దత్తుగా వచ్చెను.<br>శ్రీ జమలాపురపు లక్ష్మీ<br>నరసింహారావు<br>కమలమ్మ (రాజలక్ష్మి)<br>గార్ల కుమార్తు<br>శ్రీవత్స, కౌసికస,<br>విశ్వామిత్ర, అఘమర్షణ |
| 75E | 9 | 4) రాంబాయి<br>భర్త<br>మాదిరాజు సుబ్బారావు | 1916 | | | సత్తుపల్లి | శ్రీ మాదిరాజు రామ<br>కోటేశ్వరరావు గారు<br>అనంతమ్మ, గార్ల<br>పెద్ద కుమారుడు<br>ఆత్రేయస జొజ్జూరు |
| 75F | 10 | 1) వెంకట కృష్ణారావు<br>భార్య<br>అనసూయ | ---8.42<br><br>1946 | బి.కాం.<br><br>9వ తరగతి | UTI & LIC<br>ఏజెంట్ | సిద్ధారంరోడ్<br>సత్తుపల్లి<br>ఫోన్. 72689 | శ్రీ సోమరాజు హను<br>మంతరావు మధురబాయి<br>గార్లకూతురు సత్తుపల్లి |
| 75G | 11 | 1) సుబ్రమణ్య తిలక్<br>భార్య కళ్యాణి<br>1) వెంకటసుబ్రమణ్య<br>హర్షనందన<br>ఆడపిల్ల<br>హరిచందన | 13 9 68 | B.E | ఇంజనీర్<br>విజయవాడ | | శ్రీ మెట్లపల్లి సత్య<br>నారాయణగారు<br>రాజేశ్వరిగార్ల<br>కుమార్తె |

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 75H | | 2) వెంకటసుబ్రమణ్య | | | | | |
| | | అశోక్ | 25.6.75 | | ఎల్.ఐ.సి | దేవరకొండ | |
| | | ఆడపిల్ల | | | | | |
| 75I | | వెంకట శేషు రమ | 27.3.70 | | | | శ్రీ వెల్లంకి సుందర |
| | | భర్త వెల్లంకి | | | సీనియర్ | | రావుగారు, సూర్య |
| | | లక్ష్మీనారాయణరావు | | | అండర్ | | కాంతంగార్ల కుమార్డు |
| | | కృష్ణభరత్‌రాజ్ | 1993 | | మేనేజర్ | | భారద్వాజస |
| | | ఆడపిల్ల | | | సింగరేణి | | |
| | | హర్షిత | 1991 | | భోపాల్‌పల్లి | | |
| 75J | 10 | 2) పార్ధసారధి | 7.10.45 | PUC | సూపరింటెంట్ | వరంగల్ | శ్రీ కొమర్రాజు వెంక |
| | | భార్య పుష్పలత | 1.9.54 | 7th | ఆంధ్రప్రదేశ్ | | టేశ్వరరావు, సరోజిని |
| | 11 | నాగేంద్ర | 19.6.75 | Diploma in | వికలాంగులశాఖ | | గార్ల కూతురు |
| | | | | Aeromatic | | | ఎడ్లపల్లి |
| | | ఆడపిల్ల | | Engineering | | | |
| | | హేమబిందు | 23.3.78 | B.A.Comp | చదువు | | |
| 75K | 10 | 3) రమేష్ చంద్రరావు | 24.6.48 | B.Com | జాయింట్ | హైదరాబాద్ | శ్రీ బూదరాజు నర |
| | | భార్య | | | డైరెక్టర్ ఆ.ప్ర | ఫోన్ నెం. | సింహారావు, రాజ్య |
| | | సీతాలక్ష్మి | | | వికలాంగులశాఖ | 4036246 | లక్ష్మిగార్ల కూతురు |
| | | ఆడపిల్ల | | | వరంగల్ | | బాపట్ల |
| | 11 | 1) గాయత్రి | 23.1.78 | B.A | చదువు | | |
| | 11 | 2) స్వప్న మానస | 1980 | B.A | చదువు | | |
| 75L | 10 | 4) ఫణిశంకరరావు | 2.11.52 | B.Sc | టెలిఫోన్ | 2.5.343 | శ్రీ గొల్లనపల్లి రామకోటే |
| | | భార్య | | | డిపార్ట్‌మెంట్ | నక్కలగుట్ట | శ్వరరావు, జ్ఞానప్రసూ |
| | | పద్మావతి | 4.6.60 | | | వరంగల్ | నాంబ గారికూతురు |
| | 11 | సందీప్ | 10.12.80 | ఇంజనీరింగ్ | చదువు | | భారద్వాజస, గొల్లన |
| | | ఆడపిల్ల | | | | | పల్లి గన్నవరం |
| | 11 | శిరీష | 5.10.82 | ఇంటర్ | చదువు | | |
| 75M | 10 | 5) శేషతల్పసాయి | 12.1.54 | | క్యాషియర్ | వరంగల్ | శ్రీ పింగళి రామేశ్వర |
| | | భార్య | | | నాగార్జున | | రావుగారు సరోజని |
| | | జ్యోతి | –4.58 | | గ్రామీణ | | దేవిగార్ల కూతురు |
| | 11 | కౌసిక | 5.3.83 | ఇంటర్ | బ్యాంక్ | | కొత్తూరు కరీంనగర్‌జిల్లా |
| | | ఆడపిల్ల | | | | | భారద్వాజస |
| | 11 | కీర్తి | 31.3.82 | ఇంటర్ | | | |

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 75E | 9 | కీ.శే. మాదిరాజు సుబ్బారావుగారి ఆడపిల్లలు | | | | | |
| 75N | 10 | 1) హేమలత (చిట్టి) భర్త మాదిరాజు సత్యనారాయణగారు | 1939 | | | | |
| | 11 | వెంకటేశ్వరరావు (గణేష్) | | | జర్నలిస్టు | | |
| | | ఆడపిల్ల | | | | | |
| 75O | 11 | శారద భర్త తుమ్మల కేటేశ్వరరావు | | | | | |
| | | ఆడపిల్లలు | | | | | |
| | 12 | 1) | | | | | |
| | 12 | 2) | | | | | |
| 75P | 10 | 2) కమల భర్త అలవాల వేణుగోపాల్‌రావు | 28.12.54 10.8.48 | 10th | | P.No. 182 Excise Colony Warangal | శ్రీ అలవాల వాసుదేవ రావుగారు, రుక్మిణి గార్ల జ్యేష్ఠ కుమార్తు కుత్సవస, అంబరీష, మాంధాత, యవనాశ్వ కాకుత్స (5) |
| | | శ్రీనివాసరావు | 26.8.71 | B.Tech | Mechanic Engineer | | |
| | | రమాకాంత్ | | B.Sc Comp | Hyd | | |
| 53 | 8 | పెద్ద వెంకట్రామారావు (దత్తు వెళ్లెను) | | | | | Vవ, శాఖ 7వ తరము సుబ్బారావు గార్కి దత్తు వెళ్లెను |



బాలల అకాడమీ ఆధ్వర్యంలో
ది. 16-11-98న నిర్వహించిన వరంగల్
జిల్లా స్థాయి, డ్యాన్స్ పోటీలలో మూడవ
బహుమతి సాధించిన
విఠల్‌రావుగారి కుమార్తె

## జమలాపురపు శాలినీ భవాని

(7వ తరగతి)

V వ శాఖ 8 వ, తరము

## కీ.శే. జమలాపురపు వేంకట కిషన్‌రావుగారి సంతతి

- శ్రీ అయ్యదేవర పురుషోత్తమరావు గారు
హైదరాబాదు



కీ.శే. వేంకట కిషన్‌రావుగారు బాల్యంలోనే తల్లి లేని వారైనారు. పినతండ్రి నాగర్ కర్నూలు, మహబూబ్ నగర్ జిల్లా తహశీల్‌దారుగా వున్నారు. జమలాపురపు వెంకట్రావుగారు విద్యాభ్యాసం చేయించారు. కిషన్‌రావుగారి భార్య గౌరమ్మగారు లింగమర్ల వారి ఆడబడుచు. వారికి ముగ్గురు కుమార్తెలు ఒక కుమార్డు. పెద్ద కుమార్తె రాజ్యలక్ష్మమ్మగారిని ఆదిరాజు కొండల్‌రావు గారికి, రెండవ కుమార్తె వెంకట పేరమ్మగారిని మాదిరాజు లక్ష్మీకాంతారావుగారికి మూడవ కుమార్తె సీతారామమ్మగారిని. అల్లప్రగడకొండూరు పింగళి వారికి యిచ్చి వివాహాలుచేసారు.

ఏకైక పుత్రుడైన రామనరసింహారావుగార్కి ఇనగాలి కీ.శే. బసవరాజు రామేశ్వరరావుగారి మూడవ కుమార్తె దుర్గాంబను యిచ్చి వివాహం చేశారు. కిషన్‌రావుగారు 78 సం జీవించిరి. 64 సం. ఎఱ్ఱుపాలెం గ్రామ కరణంగా అవిశ్రాంతగా, అనన్య సామాన్యంగా 'తనను మించిన వాడు లేడు' అనిపించుకున్నారు. ఈ ప్రాంతపు కరణాలలో తలమానికంగా కీర్తి గడించారు. సాహిత్యాభిలాషి, ఎర్రుపాలెంలో 'మహబూబియా గ్రంథాలయా'నికి వ్యవస్థాపకుడు, అధ్యక్షుడు 'విజ్ఞాన చంద్రికా మండలి' ([illegible] స్థాపించినది.) సభ్యులు. ఆ మండలి గ్రంథాలయం తన యింట్లో చిన్న గ్రంథాలయాన్ని ఏర్పరచుకున్నారు. కిషన్‌రావుగార్కి కందుకూరు వీరేశలింగంగారంటే చాలా అభిమానం వుండేది. అధికారులు హైందవేతరులైనా కిషన్‌రావుగార్ని చాలా గౌరవించేవారు. ఆయన కుశాగ్రబుద్ధి, చతురత ఉర్దూ, తెలుగు, మొదలైన భాషలు వారి వాక్ నైపుణ్యానికి అందరూ చకితులయ్యేవారు. ఆరోజుల్లో ఆయన మాటకు తిరుగుండేదికాదు. [illegible] ఉపయోగించేవారు గుర్రపు స్వారిలో మంచిపేరు గల దిట్ట. [illegible] చరమ దశను తానే సూచించిన మేధావి. [illegible] భోగభాగ్యాలతో తులతూగుతూ తనమాటకు తిరుగులేక కొడుకు కోడలు పిల్లలతో సుఖశాంతులతో [illegible]. అదృష్ట వంతుడు! ఆయన కున్న సాహిత్యాభిమానం ఆయనచేత వంశ చరిత్ర, [illegible] ప్రముఖుల జీవిత విశేషాలతో [illegible] వ్రాయించింది. ఆ స్ఫూర్తితోనే యీ జమలాపురాన్వయ దర్శిని [illegible]



## V వ శాఖ 9 వ. తరము

## కీ.శే. జమాలపురపు రామనరసింహారావు గారు

రామనరసింహారావుగారు జమలాపురపు వెంకట కిషన్ రావుగారి ఏకైక పుత్రుడు. ఆ రోజుల్లో మెట్రిక్ పాసైనారు. 1900 లో జన్మించారు. ఒక్కడే కొడుకు కావటం వల్ల, తండ్రి పెద్దవాడవటం వల్ల రామనరసింహారావుగారు యింటి వద్దనే వుండి తండ్రి గారి కరిణీకం వ్యవహారాలను చూడవలసివుంది. వీరి భార్య దుర్గాంబ ఇనగాలి బసవరాజు రామేశ్వరరావు, వెంకమ్మగార్ల మూడవ సంతానం. రామనరసింహారావుగారు తండ్రి చాటు బిడ్డ, భార్య, భర్తలిద్దరు ఆ రోజుల్లో విరివిగా సాగిన శారదా యాక్టు బాల్య వివాహాలకు తమయింట ఎంతో ప్రోత్సాహాన్ని యిస్తూ వాళ్లకు ఎన్నో సౌకర్యాలు కూర్చేవారు. తమది సంపన్న కుటుంబం, ధనధాన్యాదులతో పాడి పంటలతో అనేకమంది పనివాళ్లతో వున్న కుటుంబం కావటం వల్ల, కోస్తా ప్రాంతానికి అతి సన్నిహితంగా వుండి రైలు ప్రయాణం సౌకర్యం వున్న ఎర్రుపాలెంలో వీరి యింటికి తాము వివాహం జరిపించుకోవటానికి వచ్చేవారు. వచ్చిన వారికి పాలు పెరుగు, కూరగాయలు, వంట సామగ్రి, వంట చెఱకు, పనివాడ్లు, అందుబాటై వుంటం వల్ల పెండ్లి వారికి ఎంతో అండదండలు లభించాయి. రామనరసింహారావుగారికి ఏడుగురు మగసంతానము. ఒక ఆడపిల్ల. పెద్దవాడు సత్యనారాయణశర్మ, భార్య అన్నపూర్ణమ్మ, గడ్డమడుగు వారి ఆడబడుచు. 2వ ఆడపిల్ల లలితాంబ (చిట్టెమ్మ) మేనల్లుడు ఆదిరాజు వెంకటరామారావుకి ఇచ్చారు. 3,4 సీతారామారావు, వెంకటేశ్వరరావు చిన్న తనంలోనే పోయారు. 5 పురుషోత్తమరావు పిన తల్లికి పెంపకం యిచ్చారు. భార్య పద్మావతి చొప్పకట్లపాలెం లక్ష్మీనరసింహారావు గారి కూతురు రామేశ్వరరావు భార్య రాజ్యలక్ష్మి 3 చొప్పకట్ల పాలెం

7. గోపాలకిషన్‌రావు ఎం. ఎ. ఎం.ఇడి. ఉపాధ్యాయుడు ఈ గ్రంధకర్త, భార్య సీతాకుమారి మొలుగుమాడు కొమ్మరాజు బస్వేశ్వరరావు గారి మూడవ కూతురు.

8. వెంకటకిషన్‌రావు ఎఱ్ఱుపాలెం గ్రామానికి మాజీ సర్పంచ్ భార్య కృష్ణకుమారి. కల్వల సీతారామారావుగారి పెద్ద కుమార్తె, ఖమ్మం.

రామ నరసింహారావుగారు నడివయస్సులోనే తన 45వ యేట. స్వర్గస్థులైనారు.

## దుర్గాంబ :

జమలాపురపు, వెంకట కిషన్‌రావుగారి కోడలు, జమలాపురపు, రామనరసింహారావు భార్య నడివయస్సులోనే భర్తను పోగొట్టుకున్న దురదృష్టవంతురాలైనది. ఆమె చిన్నప్పటినుంచి ఆధ్యాత్మిక చింతనతో తన విద్యాభ్యాసాన్ని, రామాయణ భారత గ్రంధ పారాయణం చేస్తూ అల్లుడు ఆదిరాజు వెంకట్రామరావుగారి జనక తల్లియైన వెంకాయమ్మగారిచే ప్రభావితమై తమ ఆధ్యాత్మిక చింతనను యినుమడింపజేసుకొన్నారు. ఆమె దాన ధర్మాలకు పెట్టింది పేరు. 'అపర అన్నపూర్ణ' 'అభినవ డొక్కా సీతమ్మ' 'లేదు' అనేమాట ఆమె నిఘంటువులో లేదు. తన సంతానం మీద వున్న ప్రేమాభిమానాలనే ప్రపంచం మీద ప్రసరింపచేసేది. చూడటానికి అమాయకురాలుగా కనిపించినా చాలా కుశాగ్రబుద్ధి గలది భార్యా భర్తలిద్దరు అటువంటివారే. వారి దాంపత్యం స్వల్ప కాలమే అయినా సాటి వారికి ఎంతో మేలు చేసి ఆదర్శ దాంపత్యం. వారిద్దరూ పరోపకారమే ప్రధానంగా పెట్టుకొనేవారు. ఆమె ı ౬ మంది బోయిలు మోసే మేనాలో ప్రయాణం చేస్తువుండేది. అందరికి మహాతల్లిగా భాసించేది. ఎదుటివారి కష్టాలకు ఆమె చేదోడు వాదోడుగా వుండి ఎంతో సేవచేసేది. ఆమె తన జీవిత చరిత్రను సంక్షిప్తంగా వ్రాసి ఈ గ్రంధస్థానికి దోహదం చేసింది. తనకు బహు సంతానమే అయినా అందరిని ఆదరాభిమానలతో పెంచుతూ తన అయిదవ సంతానమైన పురుషోత్తమరావును తన చెల్లెలు రంగనాయకమ్మకు దత్తతయిచ్చింది. తనచెల్లెలు భర్త అయ్యదేవర లక్ష్మీనరసింహారావు తనకు మేనత్త కుమార్డు, దుర్గాంబ జీవితం ఉత్తమ గృహిణికి ఉదాహరణ. ఏ కోడలికైనా మార్గదర్శకం. ఒక స్త్రీకి ఆదర్శం.

## కీ. శే. ఆదిరాజు కొండలరావు గారు

వీరు జమలాపురపు వెంకట కిషన్‌రావుగారి పెద్ద కుమార్తె రాజ్యలక్ష్మమ్మగారి భర్త. ఉద్యోగరీత్యా వరంగల్‌లో, పెంచికల్‌పేట ప్రాంతంలో వుంటూ గొప్పగా ధనార్జన చేసి ఎర్రుపాలెం వచ్చి మామగారి యింటి ప్రక్కన స్థలంలో యిల్లు కట్టుకొని ఎర్రుపాలెం లోనే కాక యితర గ్రామాలవారికి కూడా బంధువులకు, స్నేహితులకు, ఆర్తులకు అడిగినదే తడవుగా ఆర్థిక సహాయ మందించి బ్యాంకులు లేని రోజుల్లో ఎంతో సహాయపడ్డారు. సంతానం లేని కారణంగా ప్రక్కవూరి అల్లూరి వెంకటసుబ్బారావు కనిష్ఠ కుమారుని పెంచుకొని తన బావమరిది రామనరసింహారావు ఏకైక పుత్రిక లలితాంబను కోడలుగా చేసుకున్నారు.

## కీ.శే. ఆదిరాజు వెంకట్రామారావు గారు

పెద్దాపురం నుంచి ఆయన్ని పెంచుకోవటానికి ఒక విచిత్ర సంఘటన జరిగినది. పాఠశాల ఆవరణలో జామచెట్టు క్రింద తోటి పిల్లలతో ఆడుకుంటూ వుండగా ఆయన్ని పట్టుకొని తీసుకొనివచ్చారు. తోటి పిల్లలు ఆశ్చర్యపోయి "మన బుచ్చయ్యగార్ని ఎవరో ఎత్తుకుపోతున్నారని ఆయన వెంట ఎర్రుపాలెందాక ఆపిల్లలంతా వెంటపడి వచ్చామని ఆనాటి పిల్లలో ఒకరైన ౨౦ సంవత్సరాల కురువృద్ధుడు శ్రీ యర్రగుంట గోపయ్య కంట తడి పెడుతూ చెప్పినప్పుడు ఆనాటి స్నేహితుల అప్యాయత ఏమిటో అర్ధమైనది. అది పశువులలో మాత్రమే వుండటం విశేషం.



వేంకట్రామారావుగారు సహృదయుడు - సాధుశీలుడు. మితభాషి. చిన్నతనంలో తండ్రిని పోగొట్టుకున్న బావమరుదులకు అండదండగా వుంటూ వారి అభివృద్ధికి ఎంతో దోహదం చేశాడు. రజాకార్ల దురంతాల రోజుల్లో తమతోపాటు ఎంత ఐశ్వర్యం వున్నా, ఎంత ఆస్తి పాస్తులువున్నా, తన లోగిళ్ళు ఎంత పెద్దవైనా, పాడిపంటలు ఎంత అభివృద్ధిలో వున్న కట్టుబట్టలతో తనను అనుసరించిన అత్తగార్ని, బావమరుదుల్ని ప్రక్కవూరు గూడెం మాధవరావులో పెద్దన్న గారైన అల్లూరి నారాయణరావుగారి యింటిలోతనతోపాటు తల దాచుకోటానికి అవకాశం కల్పించారు. సర్దార్ జమలాపురపు కేశవరావుగారు ఎట్టు పాలెం ఎప్పుడు వచ్చిన వీరిదగ్గరే వుండేవారు. వెంకట్రామరావుగారి భార్య చిట్టెమ్మ పినతండ్రి కేశవరావుగార్ని తండ్రి కన్నా ఎక్కువగా చూచుకునేది. కేశవరావుగారు జైలుకు పోయినప్పుడు ఆ దంపతులు పడ్డ ఆందోళన, ఆయన రాజ్యసభ సభ్యుడైనప్పుడు వారుపడ్డ ఆనందం, దేశానికి ఎంత సేవ చేసినా చివరకు ఎన్నికల్లో జయం పొందలేక పోయినాపొందిన విచారం అనన్యసామాన్యము.

## కీ.శే. మాదిరాజు లక్ష్మీకాంతారావుగారు :



రాజావాసిరెడ్డి వెంకటాద్రినాయుడుగారికి సమకాలికుడైన మాదిరాజు వారి వంశంలోని మహారాజ కృష్ణవంత్ బహద్దూర్ నిజాం నవాబుకు దివాన్‌గా వుండేవారు. మాదిరాజు వారు ఉర్దూ, ఫారసీ, సంస్కృతం, తెలుగు భాషలలో మంచి పరిజ్ఞానం గల విద్యావంతులు వకీళ్లుగా, వైద్యులుగా,

ఉపాధ్యాయులుగా, నిజాంపాలనలో వివిధ పదవులలో కీర్తి ప్రతిష్ఠలు కలిగివున్నారు. ఆ కుటుంబానికి చెందిన మా చిన మేనత్తగారి భర్త మాదిరాజు లక్ష్మీకాంతరావుగారు వున్న వనరులకు మించిన విద్యాధికుడై మన ఎర్రుపాలెంలోనే వుంటూ తన చిన్న తనంలో పోయిన తన బావమరిది జమలాపురపు రామనరసింహారావుగారి కుటుంబాన్ని ఆదుకుంటూ ఎర్రుపాలెం కరిణీకాన్ని బాధ్యతను కూడ నిర్వహించుచు పిల్లలు లేని కారణంగా తన కుటుంబం వాడైన మాదిరాజు కోటేశ్వరరావుగారి రెండవ కుమార్ని రాధాకిషన్‌రావును పెంచుకొని విద్యా బుద్ధులు నేర్పించారు.

## మాదిరాజు వెంకట పేరమ్మగారు :

వెంకట పేరమ్మగారు కిషన్‌రావుగారి రెండవ కుమార్తె మాదిరాజు లక్ష్మీకాంతరావుగారి భార్య. ఆమెకు సంతానము లేని కారణంగా అన్నగారైన రామనరసింహారావుగారి సంతానం మీద ప్రేమాభిమానమెక్కువ. అక్కగారు రాజ్యలక్ష్మమ్మ గారు ఒక కొడుకును పెంచుకొని మేన కోడళ్ని కోడలు చేసుకొన్నట్లుగా ఇంకొక మేనకోడలు పుడితే తాను ఒక కొడుకును పెంచుకొని మేనకోడళ్ని వారసులుగా చేసుకోవాలనే కోరిక వుండేది. కాని ఆమె కోరిక ఫలించలేదు. వదినగారు పుత్రులనే కన్నదికాని, పుత్రికలను కనలేదు. అది వెంకట పేరమ్మగార్కి నిరాశ, నిస్పృహలు కలిగించింది. చివరకు ఒక కొడుకును రాధాకిషన్‌రావును పెంచుకొని పినతండ్రిగారి కొడుకైన సర్దార్ జమలాపురం కేశవరావుగారి కుమార్తె వెంకటనర్సమ్మను చేసుకొని ఉపశమనం పొందింది. వదినగారు దుర్గాంబ, తన అక్క దత్త కుమారుడైన వెంకట్రామారావు కన్న తల్లి వెంకాయమ్మగారు ముగ్గురు ఆధ్యాత్మిక చింతనలో మంచి స్నేహితులుగా వుండేవారు. తన జీవితాంతం తన అన్నగారి సంతానానికి అండదండలుగా వుండి వారి అభివృద్ధి క్షేమసమాచారాలు తరచు కనుగొంటూ వుండేవారు. అన్నగారు నడివయస్సులో పోయిన కారణంగా తను, తన భర్త మాదిరాజు లక్ష్మీకాంతరావుగారు, మేనల్లుళ్ళను కన్నకొడుకులవలె చూసుకుంటూ ఏ యిబ్బంది లేకుండా కనిపెట్టుకొని వుండేవారు.



### కీ.శే. మాదిరాజు రాధాకిషన్‌రావు గారు

సర్దార్ జమలాపురం కేశవరావు గారి పెద్ద అల్లుడు హైదరాబాద్‌లో కోపరేటివ్ డిప్యూటి రిజిష్ట్రర్‌గా వున్నారు.

భార్యవెంకట నర్సమ్మ, పిల్లలు, కేశవరావు, నాగేందర్, నవీన్ డా. రాజ్యలక్ష్మి అరుణకుమారి, పదవి విరమణ చేసినా సాటి ఉద్యోగస్థులకు సలహా సహకారాలు సంప్రదాయులు చివరి ఘడియవరకు సమాజ సేవచేసిన శ్రేయోభిలాషి. సాహిత్యాభిమాని.

## శ్రీ జమలాపురపు సత్యనారాయణ శర్మ గారు



సత్యనారాయణ శర్మ వెంకటకిషన్‌రావుగారి పెద్ద మనుమడు. రామనరసింహారావుగారి పెద్ద కుమార్డు. బావ వెంకట్రావురావు, మేనమామ బసవరాజు రావు చంద్రారావు, పెద తండ్రి కుమార్డు మీనవోలు గంగాధర రావు ఈ నలుగురు సమవయస్కులు. విద్యాభ్యాసము నిమిత్తం పినతల్లిగారైన అయ్యదేవర రంగనాయకమ్మగారి దగ్గర బెజవాడలో చిన్నతనంలో తండ్రిపోయిన మేనమామ రామచంద్రరావుతోపాటు విద్యాభ్యాసానికి వెళ్ళినారు. తరువాత ఖమ్మంలో కొంతకాలం విద్యనభ్యసించిరి. చిన్నతనంలో విద్యతోపాటు తాతగారు ఉండగా వివాహం వైభవంగా జరిగింది. చిన్నతనంలో తన పెద్దమనుమడు విద్యావంతుడు కాలేదని తాతగారు వేంకట కిషన్‌రావుగారికి మనస్తాపంగా వుండేది. తండ్రి చనిపోయిన తరువాత సత్యనారాయణశర్మ కుటుంబ బాధ్యతలు వహించి రజాకార్ల దురంతాల కాలంలో తన కుటుంబానికి జరిగిన తీవ్ర నష్టానికి ఎంతో బాధపడి అకష్టనష్టాలకు నలిగిపోవటం జరిగింది. ఆయన భార్య అన్నపూర్ణమ్మగారు గడ్డమడుగువారి ఆడపడుచు కొడుకులు సూర్యప్రకాశరావు, రామనరసింహారావు లక్ష్మీకమలకుమారి (పెద్దమ్మాయి) తన మేనల్లుడు రాజేశ్వరరావు తో వివాహము జరిపించారు.

★★★★★



చిత్రీకరణ : చి. బండారు లక్ష్మీగాయత్రి, విజయవాడ

# IV వ శాఖ
# 9 వ. తరము

## స్వీయ చరిత్ర

- శ్రీమతి జమలాపురపు దుర్గాంబగారు, ఎఱ్ఱుపాలెం.

**దుర్గాంబ జననం :** పరాభవ నామ సంవత్సర ( ౧౨౦౬ ) పాల్గుణ బ. పంచమి శుక్రవారం

నాకు డెభై సంవత్సరములకు నా జీవిత చరిత్ర వ్రాయవలెనని కోరిక కలిగింది. నా జీవితం ౩౦ యేండ్ల వరకు చాల బాగ జరిగింది. నరుడికి నాలుగు అంశలుగదా ! ఒక కాలమందు లక్షాధికారిని. అష్టైశ్వర్యాలు అనుభవించాను. మధ్యలో నా జీవితం వ్యర్థమైంది. నా పూర్వ ఖర్మవల్ల భగవంతునికి దయలేకపోయింది. అది నా దురదృష్టము అనుకున్నాను. అప్పుడు నాకు తెల్వి ఎక్కువగా వుండేది. నా మెదడు చాల పెద్దది. వ్రాయటంలో, చదవటంలో తెలివిగా వుండేదాన్ని. కరణీకం దస్తరం కూడా వ్రాసినాను. ఇప్పడు అన్ని పూర్ణమయిపోయినవి. ఇప్పటికీ వ్రాయగలను. చదవగలను. చత్తువారం రాలేదు. మతిమరపు లేదు. పదియేండ్ల క్రిందట చాల జబ్బు చేసినది. ఆలగాయతు దూరం మాట వినిపించదు. అవసరం వుంటే దగ్గరకు వెళ్లి తెలుసుకుంటాను. ఎవరి మనసులో యేదివున్నది గ్రహించుతాను. నాకు **తత్వ విచారణ** ఉన్నది. 'వేదాంత బోధ' వున్నది. నా గురువు వల్ల తెలుసుకున్నాను. నాకు దైవభక్తి, భగవన్నామము అపేక్షగా వుంటుంది. పుస్తకాలు అన్నీ చూసుకుంటాను. నా వయస్సులో పెద్ద వంటలు చేసి పెట్టి అందరిని మెప్పించాను. నేను పెద్ద సంసారం చేశాను. పాడిపంటలు సంవృద్ధిగా వుండేవి. నౌకర్లు, దాసీలు, నన్ను అమ్మా! అని పిలిచి నా ఆజ్ఞ శిక్షలో వుండేవాళ్ళు, నా మామ గారి పేరు వెంకట కిషన్‌రావుగారు. అత్తగారి పేరు గౌరమ్మగారు. ఆమె కొంచెం అమాయకురాలు. మామ గారు పెద్ద అసాధ్యుడు. ఆయన్ను చూసిన వాడ్లు దడిసే వాండ్లు, అందరిని కొట్టేవాడు, గుఱ్ఱం మీద సవారీ చేసేవాడు. కుడి చెయ్య కుంటిది. యడమ చెత్తో అన్ని పనులు చూచుకునేవాడు. ఆయన ౬౪ సంవత్సరములు కరిణీకం చేసినాడు. అత్తగారు పోయిన ఎనిమిది సంవత్సరములకు పోయినాడు. నల్లమందు బాగ తినేవాడు. తెల్లవారుఝామున అయిదింటికి భోజనం చేసేవాడు. కొడుకును గారాబంగా చూసుకొనేవాడు. యెప్పడూ దగ్గరనే కూచోబెట్టుకునేవాడు. ఆయనకు 'మెడల్సు, తమకా బిళ్లలు' బహుమతి వచ్చినవి. వెండిది, బంగారపువి వచ్చెను. పండు వృద్ధుడు అయినాడు. కొద్ది జబ్బు చేసినది. మాట్లాడుతూనే వున్నాడు. అందరూ చూచుటకు వచ్చినారు. తాశీలు దారు వచ్చి నాడు "అమ్మాయి దుర్గా! పాలు తీసుకురా! అన్నాడు. వెండి గిన్నెలో పాలు తీసుకొని పోయినాను కొడుకు పట్టుకొని కూర్చోబెట్టినాడు. పాలు పట్టినాను. త్రాగాడు. అందరి ఎదుట "మా కోడలు మా పూజకొద్ది దొరికింది. నాకు కోడలు కాదు. బిడ్డగా చేసినది". అని అన్నాడు. అందరికి సంతోషమైంది. నాకు మనస్సు కుదుట పడ్డది. "అమ్మా! కొడుకులను బాగచూసుకో" అని చెప్పినాడు. తన కొడుకుకు ఎన్నో బోధలు పోసినాడు. మాట్లాడుతూనే వెళ్లి పోయినాడు.

ఆయనకు బిడ్డలు ముగ్గురు, పెద్ద బిడ్డపేరు రాజ్యలక్ష్మి, చిన్న బిడ్డపేరు వెంకట పేరమ్మ, మూడవ బిడ్డ సీతారావమ్మ, నేను అత్తగారికి, ఆడపడుచులకు అందరికి చేసి మెప్పించాను. ఈ యింట్లో సుఖం పూరి మొత్తం మీద లేదు అని అందరూ అనేవాళ్ళు అందరికి వస్త్రదానం, అన్నదానం చేసినాను. దాసీ వాండ్ల పిల్లలకు పెండ్లిళ్ళు చేసినాము ఆరోజులు వేరు.

నాకు ఏడుగురు కొడుకులు, ఒక కూతురు. నా ఇద్దరు చిన్నతనంలోనే పోయినారు కొడుకును నా చెల్లెలుకు పిల్లలు లేని కారణం వల్ల నాలుగు సంవత్సరములు నా పుత్రరత్నాన్ని తీసుకొని వెళ్ళినది పినతల్లికి అలవాటు అయి యిక్కడకు వచ్చేవాడుకాదు. చెల్లెలువొక నెల యిక్కడ దేవాలయంలో ప్రదక్షిణలు చేసినది. రామేశిరి పుట్టినప్పుడు వచ్చినది. "బావ! నాకు ఒకపిల్లాడు కావలెనే" ని అన్నది. "అమ్మా! వొకపిల్లవాడ్ని తీసుకు వెళ్తా" అన్నారు. "నేనే వస్తా" అనిపినతల్లితో వెళ్ళినాడు. నా కొడుకులపేర్లు 1. సత్యనారాయణరావు 2. పురుషోత్తమరావు 3. రామేశ్వరరావు 4. గోపాలకిషన్‌రావు 5. వెంకట కిషన్‌రావు. కూతురిపేరు లలితాబాయి అమ్మాయి నేను పట్టు బట్టలే కట్టేవాళ్ళము. యిద్దరం అనేక రకాలనగలు పెట్టుకున్నాము. పిల్లలను నన్ను ఇనప గొలుసుల వుయ్యాలలో పడుకోబెట్టి దాసి వూపుతూ వుండేది పురుషోత్తమును తీసుకువెళ్ళిన తరువాత నాకు జబ్బుచేసినది. మూడు మాసములు మంచంలో వున్నాను. మనాది జబ్బు అన్నారు. డాక్టరు అప్పడు అబ్బాయిని తీసుకొని వచ్చి చూపించారు. కొంతవరకు కుదుటపడింది. అప్పడు వాళ్ళు విజయవాడలో వున్నారు మరిది మంచి వుద్యోగం చేసేవాడు. అబ్బాయిని చదువు చెప్పించినారు. నెలకు ఒక పర్యాయం తండ్రి నేను వెళ్ళి చూసి వచ్చే వాళ్ళము. కొంత వరకు మనసు కుదుట పడ్డది.

విజయవాడలో సొంత యిల్లు వుండేది. మరిది తెలివి కలవాడు. ఆపేక్షగలవాడు కొడుకుని బాగా చూసేవాడు. మాకు అట్లాగే వుండేది. తండ్రికి జబ్బు చేసినది కొద్ది వయస్సులో చనిపోయినారు. తండ్రి పోయిన ఆరు మాసములకు మరిది "మేవ... దత్తం, వొడుగు చేసుకుంటాం" అన్నారు. చేసుకున్నారు. తండ్రి, తాతవున్నప్పుడు జరిగితే బాగుండేది. అప్పడు జరగలేదు.

ఇంతలో రజాకార్ల హడావుళ్ళు వచ్చినవి. మేము యిల్లు వదలి సామానంత వదలిపెట్టి మాధవరం నాకూతురు బావగారి యింట్లో వున్నాము. పదినెలలు జరిగినది ఇంతలో యిళ్ళు వచ్చినవి. ఇంట్లో సామాను యిత్తడి గుండిగలు, అన్నీ శూన్యము అయినవి. ఇల్లు వున్నది. ఏమి చేయవలెనో తోచలేదు. పెద్ద వాడు నాకు చేతకాదన్నాడు. ఇక పిల్లలకు చదువులు రావలెగదా! ఇహ నేను త్యాగం చేశాను. నాకొడుకులు చదువుకావలె. ప్రయోజకులు కావలె అని ధైర్యం తెచ్చుకొని, దద్దమ్మవలె కూచోక, పెద్దలు ఎవరూ లేరు గదా సలహాకు నేనే చూచుకోవలెననుకున్నాను. విజయవాడ వెళ్ళినాను. వంటి మీద వస్తువులు సొంతం అమ్మినాను. డబ్బు తెచ్చుకున్నాను. పునాది ఎత్తవలసి వచ్చినది. రామేశ్వరరావును హైదరాబాదులో వుంచినాను. పెద్ద కృష్ణుడు, చిన్న కృష్ణుడిని మధిరలో వుంచాను. చదువులు బాగాసాగినవి. ప్రైవేటు చెప్పించినాను. కొంతవరకు నా కష్టము ఫలించినది. ఇంతలో పిల్లలు పెద్దవాళ్ళు అయినారు. రామేశ్వరి నేను వుద్యోగము చెయ్యను కరిణీకం చేస్తానన్నాడు. పెద్దబ్బాయితో విభాగాలు కావలెనన్నాడు. మేనమామను విజయవాడ

వెళ్ళి పినతండ్రిని తీసుకొనివచ్చినాడు. విభాగాలు అయినవి. ముగ్గురి వాటాలు మేమే చూసుకున్నాము. అదివరకు పాడిపంటలు లేవుగదా. ఇరవై బర్రెల పాడి అన్నిటినీ మాధవరంలో విక్రయం చేసి ఒక బర్రెను వుంచుకొన్నాము. వ్యవసాయము పెట్టినాము. పంటలు పండినవి. రామేశ్వరి కరిణీకం చేస్తున్నాడు. బాగానే జరుగుచున్నది.

ముందు పురుషోత్తం పెండ్లి అయినది. మా పెద్దనాన్న పెంపుడు కొడుకుకు మగపిల్లలు. ఆడపిల్లలు వున్నారు. చక్కని పిల్లలు, పెద్దపిల్లను పురుషోత్తంకు చేసినాము. పిల్లల తండ్రిపేరు నరసింహారావు. తల్లిపేరు విమల. మా చెల్లెలుకు బావగారి మనమరాళ్ళు, రెండోపిల్లను మా రామేశ్వరునికి చేసినాము. పెద్దదానిపేరు పద్మావతి. చిన్నదాని పేరు రాజ్యలక్ష్మి. పురుషోత్తం పెంపుడు పోబట్టి చిన్నవాడికి రెండో పిల్లను చేసినాము.

మేనరికం పిల్లలు, మేనకోడళ్ళు నన్ను ఖదరుగా బాగ చూస్తారు. బాగనే జరుగుతున్నది. వెనుకటి రోజులు వచ్చినవి. కాని కొడుకుల రాజ్యం కదా! వాళ్లు చెప్పినట్లు వినవలెను. మాట పోగొట్టుకో కూడదు. మంచి పేరు రావలెను. నా బాధలు కొంచెం పెద్ద కృష్ణుడికి తెలుసు. వాడు వుద్యోగం చేస్తున్నాడు. పెద్ద కృష్ణుడికి చిన్న కృష్ణుడికి వివాహాలు బ్రహ్మాండంగా జరిగినవి.

కొంతకాలము జరిగినది. సంతాన్నాలు గలిగినవి. మాకు విభాగాలు కావలెనన్నారు. పొలాలు పంచుకొన్నారు. ఇళ్ళు పంచుకొన్నారు. ఎవరిది వారు చూచుకొంటున్నారు. అందరి పని బాగానే వుంది.

రామేశ్వరికి యిద్దరు కొడుకులు. ఒక బిడ్డ. పెద్దకొడుకు పేరు శ్రీనివాసరావు. చిన్న కొడుకుపేరు ఫణివేణు. బిడ్డపేరు రాధాబాయి. వాళ్ళు బాగా చదువుతున్నారు.

నేను రామేశ్వరి దగ్గర వుంటాను. అందరి దగ్గరకు వెళ్తుంటాను. అంతా సమానమే గదా. ఒక చోటనే వుండను.

పురుషోత్తంకు హైదరాబాదులో యిల్లు వుంది. బ్యాంకి వుద్యోగం చేస్తున్నాడు. నాటకాలు బాగా వేస్తాడు. వుద్యోగం, పెద్ద వుద్యోగమే. పేరు ప్రకాస్తిగానే వున్నది. కవీశ్వరుడు! అబ్బాయికి ఒక బిడ్డ, దానిపేరు విజయ, బాగాచదువుకొన్నది. యం.ఎ. చదివినది. వుద్యోగము చేస్తున్నది. దానికి యిద్దరు పిల్లలు. ఒక ఆడపిల్ల, ఒక మగపిల్లవాడు. నా కోడలు పేరు పద్మావతి మంచిది. అపేక్షగలది. కోడలు తమ్ముడికి బిడ్డను యిచ్చారు. ఆ అబ్బాయిపేరు బుజ్జిబాబు. ఆ అబ్బాయి వుద్యోగం చేస్తున్నాడు. నా కొడుకుకు యిద్దరు మగపిల్లలు. పెద్దవాడిపేరు వెంకటరమణ. చిన్నవాడిపేరు రామకృష్ణ, వాళ్ళు చదువుకుంటున్నారు. అబ్బాయికి పెంపుడు తల్లి వున్నది. తండ్రి యిటీవలె కాలం చేశాడు.

నాకు కాశీ పోవలెనని కోరిక వున్నది. వెళ్తానో లేదో తెలియదు. వంట్లో బలము తగ్గుతుంది. ముఖ్యముగా కొడుకులు తీసుకువెళ్ళవలెనని కోరిక. యిష్టము ప్రాప్తముండవలెను. కాశీస్మరణ చేసుకుంటాను. పూజలు చేసుకుంటాను. పురాణాలు, చదువు కుంటాను. నరుడికి నాలుగు అంశలు గదా!

నాకు నాలుగో అంశ వచ్చింది. జపం, ధ్యానం చేసుకుంటాను. యేది అవసరం లేదు. నాకు నా జన్మ తలంపు చూసుకుంటాను.

గోపాల కృష్ణుడికి ప్రత్యేకంగా వొక యిల్లు వుంది. వాడు వుద్యోగంలో వుంటూ

వుంటాడు. అబ్బాయి భార్యపేరు సీతాకుమారి. ఒక బిడ్డ. చదవుకుంటున్నది. బి.ఎ. చదవుతున్నది. దానిపేరు వాణిశ్రీ అబ్బాయి బి.ఎ. చదివాడు. అబ్బాయికి ఇద్దరు కొడుకులు. పెద్దవాడిపేరు కమలాకర్, చిన్నవాడి పేరు పాండు రంగ విఠల్, చదువు కుంటున్నారు. వాడ్ల సంసారము బాగనేవుంది.

చిన్నకిష్టుడికి ముగ్గురు ఆడపిల్లలు. పెదమ్మాయిపేరు హిమబిందు. చిన్నఅమ్మాయి పేరు నీరజ. మూడో అమ్మాయిపేరు సుధీర. ముగ్గురు చదువుకుంటున్నారు. పెద్దవాళ్ళు అయినారు. అబ్బాయి వ్యవసాయం చేయించుకుంటున్నాడు. కోడలు పేరు కృష్ణకుమారి. కొడుకులు అంతా సమానమే. కోడళ్ళూ, అంతే. నేను అమాయకురాలినని వాళ్ళ వుద్దేశ్యము. నాసంతానమే గదా! నాకు తెలివి బుర్ర వుండ బట్టే వాళ్ళు ప్రయోజకులు అయినారు. వంశం పెద్దది.

నాకు యిప్పుడు ఎవరితో అవసరం లేదు. నాకు యిప్పడు వెనుకటి మనిషిని కానని నా వుద్దేశ్యం. పెత్తనం వచ్చినది. భగవన్నామము అవసరము గదా! ఎప్పడు భగవద్గీత పారాయణం చేసుకుంటాను. భక్తి గల పుస్తకాలు చూసుకుంటాను. అన్ని దక్షిణ యాత్రలు వెళ్ళి వచ్చాను. మునిమనుమలు పుట్టినారు. ఉగ్గుగిన్నెలు, బంగారం పూలు వేసి యిచ్చినారు. వాళ్ళు నన్ను వుయ్యాలలో కూచోబెట్టి వూపేవారు. నా జన్మ తరించింది.

నా కూతురు యిల్లు మా యింటి ప్రక్కనే వున్నది. మా పెద్ద ఆడ బడచుకు పిల్లలు లేరు. ఆమెపేరు రాజ్యలక్ష్మి పెనిమిటిపేరు కొండలరావు. వాళ్ళకు ఒక మగపిల్లవాడు పెంపుడు కొడుకు కావలెనని అనుకున్నారు. పెద్దాపురంలో ఒక అబ్బాయిని తీసుకొని వచ్చినారు. దత్తు ఒడుగు చేసుకున్నారు. వెంటనే పెండ్లి చెయ్యవలెనని అనుకున్నారు. మా అమ్మాయినిచ్చాము. అయిదురోజుల పెండ్లి బాగ జరిగింది. చుట్టాలు అంతా వున్నారు. పదహారు రోజుల పండగనాడు కొండలరావుగారు గతించారు. ఆయన పోయిన నాలుగోరోజున నా కొడుకు వెంకట్ అనే వాడు ఆరు సంవత్సరములు వున్నవి. అకస్మాత్తుగా జబ్బుచేసినది. విజయవాడ తీసుకొని వెళ్లినాము. అక్కడనే పోయినాడు. మందులు పనిచేయలేదు. రామేశ్వరి కడుపులో వున్నాడు. మేము యెట్లా వున్నామో ఆ భగవంతుడికి ఎరుక. మామగారు వున్నారు. అది వరకు ఒకపిల్లవాడు పోయినాడు (అమ్మాయి తరువాత మొత్తం యిద్దరు పోయినారు) అందు వల్ల అందరికి భయము పుట్టినది. పురుషోత్తముని యిక్కడ వుంచలేదు. రామేశ్వరి పుట్టక ముందే నాలుగు సం. పిల్లవానిని యెక్కడవున్నా బాగా వుంటేసరి అని అనుకున్నాము.

కొండలరావుగారు పోయిన నాలుగో మాసంలో ఆడబిడ్డ పోయినది. అమ్మాయిని అత్తవారింటికి పంపినాము.

గోపాలకిష్టుడు పుట్టినాడు. వాడికి నాలుగో సంవత్సరము. వెంకట కృష్ణుడు పుట్టాడు. వీడు పుట్టగానే పెద్ద కృష్ణుడికి జబ్బుచేసింది. మూడు రోజుల మన తెలివి లేదు. ఎన్నోమందులు పోశారు. లాభంలేదు అన్నారు. కింద పడుకోబెట్టారు. నా పిల్లలు చక్కని పిల్లలు. నా ఘోష చెప్పటానికి వీలులేదు. డా. జగింతి సుబ్బారావుగారు వైద్యం చేస్తున్నారు. కేశవరావు మాడపాటి రామచంద్రరావులు కనిపెట్టుకొని వున్నారు. 'గరగడం' పోయమన్నారు. పాము విషం అటో యిటో తేలుతుందన్నారు. పోసినారు. పోసిన అర్థఘంటకు కదలినాడు. అప్పడు మంచం


డా. జయంతి సుబ్బారావు గారు

మీద పడుకోపెట్టారు. నన్ను బాలింతరాలిని గనుక దగ్గరకు రానీయలేదు గోలచేసినాను. కిటికీలోంచి చూసినాను. నా సాయచూసి నవ్వినాడు. జబ్బు తిప్పకున్నది అన్నారు. నన్ను దగ్గరకు రమ్మన్నారు. వచ్చి ఎత్తుకున్నాను. మూడు నెలలకు మెడలు నిల్చినాడు.పెద్ద కృష్ణుడ్ని చిన్న కృష్ణుడ్ని యిద్దరిని కవ్వాల పిల్లలను సాదినట్లుసాదాను. చాలా కష్టపడ్డాను. కష్టం ఫలించిందిపెద్దకృష్ణుడు కోలుకున్నాడు.

అమ్మాయికి చిన్నతనంలో సంతానం కలిగినది. అల్లునికి కన్న తల్లివెంకాయమ్మగారు యిక్కడనే వుండేది. ఆమె చాల మంచిది. ఆమె వెంకాయమ్మగారు. నాకు గురువు. తెలివి కల్లది. నాకు 'తత్వ విచారణ' వేదాంత బోధ, 'పంచీకరణం', పంచభూతాలు, పంచ సహస్రారానికి లయం చేయటం, జపం, ధ్యానం, వుపదేశం చేసినది. నాకు అర్హత వున్నదో లేదో అని పరీక్ష చేసి వుపదేశముచేసినది నాకు అన్ని చెప్పినది. మననము అయినది. నా గురువు ౭౦ సంవత్సరములు బ్రతికినది. కనిచూపు తగ్గినది. ఎప్పడూ నేను ఆమె దగ్గరనే పురాణాలు చదువుతూ, కూడా వుండేదానిని. ఉపమానాలు చెపుతూ వుండేది. ఆమెపండుపండివెళ్లిపోయినది. ఆమెకు జన్మలేదు. ఆమె జన్మ తరించింది. నాకు మా అమ్మ, మాతృదేవత 'రామతారకం' వుపదేశము చేసినది. ఆమె గురువే నాకు. ఆమె వెళ్లపోయినది. ఇప్పడు సజ్జన సావాసము లేదు. నాకు. నా గాధ ఎవరికి తెలువదు. నా విషయం నాకే తెలుసు. అందరూ నాకు వినవడదు. నేను అమాయకురాలినని వాళ్ల వుద్దేశ్యము. కరంటు పెట్టించుకోవాలని అంటారు. అన్నీ వినపడితే కొంత పాపము. వినిపించకపోతేనే మంచిది అంటాను. నా పరిస్థితి యిది.

పెద్దబ్బాయికి తండ్రి వున్నప్పడే పెండ్లి అయినది. ఒక పిల్లవాడు పుట్టినాడు. మనుమడిని చూసినారు. అప్పడు అమ్మాయికి యిద్దరు మగపిల్లలు పుట్టినారు. అమ్మాయి సంతానము చూసినారు. తండ్రి పోయిన తరువాత అమ్మాయికి ఒక ఆడపిల్ల మూడో కొడుకు పుట్టినాడు. అమ్మాయి కొడుకుల పేర్లు పెద్దవాడు రాజారావు , చిన్నవానిపేరు సుబ్బారావు, బిడ్డపేరు ఇందిరాదేవి. కొడుకులకు బిడ్డకు పిల్లలు కలిగినారు. వాళ్లసంసారము బాగానే వుంది. నా పెద్ద కొడుకుకు యిద్దరు మగ పిల్లలు, ఒక ఆడపిల్ల కలిగినది. దాని పేరు కమల కుమారి. దానిని అమ్మాయి పెద్ద కొడుకుకు యిచ్చినారు. దానికి యిద్దరు పిల్లలు. ఒక ఆడపిల్ల ఒక మగపిల్లవాడు కలిగినారు. దానికి అకస్మాత్తుగా జబ్బుచేసి చనిపోయినది. పిల్లలు యిద్దరు చిన్నవాళ్ళు, రాజారావుకు రెండో వివాహము చేసినారు. పెద్దకోడల చెల్లెలు బిడ్డను చేసినారు. మంచిది. దాని పేరు రేవతి. పిల్లలను బాగ చూస్తుంది. అమ్మాయి మూడో కొడుకు పేరు కొండలరావు (సత్యనారాయణమూర్తి)

సుబ్బారావుకు యిద్దరు ఆడపిల్లలు. ఉష, వసంత చదువు కుంటున్నారు. వాడి భార్యపేరు పద్మావతి.

పెద్దఅబ్బాయికి యిద్దరు కొడుకులు వుద్యోగాలు చేస్తుంటారు. పెద్దవాడి పేరు సూర్యప్రకాశరావు, రెండవవాడి పేరు రామ నరసింహారావు, పెద్ద కోడలు పేరు సువర్చల

యిద్దరు పిల్లలు ఒక మగపిల్లవాడు, ఒక ఆడపిల్ల చిన్న కోడలుపేరు నిర్మల దానికి యిద్దరు పిల్లలు. ఒక మగవాడు ఒక ఆడపిల్ల.

మా పెద్ద అబ్బాయి యింటి దగ్గర వుండి పొలాలు చూసుకుంటూ వుంటాడు. పెద్ద కోడలు పేరు అన్నపూర్ణ, బిడ్డపోయిన విచారము. అట్లాగే బిడ్డ పిల్లలను చూసుకుంటూ వుంటుంది.

నేను అందరికి చేసినాను. నాకు ఎవరు చేస్తారో తెలియదు. ఇంతవరకు ఎవ్వరు చెయ్యటం లేదు. నా పనులు నేనే చూసుకుంటాను. నేనే వొకరికి చేస్తున్నాను. భగవంతుడి దయవుంటే ఎవరు చెయ్యనవసరము లేదు. ఎట్లా వుండునో మనకు తెలువదు. ఎదటి కష్టం చూడలేను. నాకు లేకపోయినా సరే ఒకరికి సాయపడతాను. నాకు ఎవరు సాయం చేస్తారో తెలియదు. శరీరం ఆరోగ్యంగా లేదు.

చిన్న ఆడపడుచుకు పిల్లలు లేరు. ఒక అబ్బాయిని దత్తు తెచ్చుకున్నారు. మా చిన్న మామగారి కొడుకు సర్దార్ కేశవరావు కూతురిని యిచ్చినారు. దాని పేరు వెంకట నర్సమ్మ దానికి సంతానము వున్నది. కేశవరావుపెద్ద పేరు తెచ్చుకొనినాడు. భార్య అన్నపూర్ణమ్మ యింకో బిడ్డకుసుమకుమారి (చిన్నమ్మాయి) వున్నది. ఒక కొడుకు పెద్ద డాక్టరు హరగోపాల్.

కేశవరావు చిన్న పిల్లవాడప్పుడు నా పిల్లలతోటే వుండేవాడు. నేను మా నాలుగు యిండ్లకు పెద్ద కోడలిని. మరుదులు అందరూ నా మీద ఆపేక్షగా వుంటారు. కొడుకుల వలె నేను అందరిని చూసే దానిని. కేశవరావు జైల్లో వున్నప్పుడు అన్నపూర్ణ తరచూ నా దగ్గర వుండేది. మామగారికి ఆమెకు సరిపడేదికాదు. నా సంసారము పెద్దది. ఎంతమందినైనా భరించేది. ఎప్పుడూ అట్లాగే జరుగుతున్నది. నన్నువద్దు అనే వాడ్లు కాదు కోడళ్ళు, ఎక్కడవున్నా నాకు బాగనే జరుగుతున్నది. అందరితో అనుకూలంగా వుంటాను. అందరూ నన్ను ఖదరుగా చూస్తారు. పెద్దలు, పిల్లలు అందరూ ఆపేక్షగా వుంటారు.

## నా బాల్యం

నా బాల్యంలో జరిగిన సంగతులు. నా జనన స్థానం. నా పుట్టిల్లు ఇనగాలి. మానాన్న గారిపేరు బసవరాజు రామేశ్వరరావుగారు. మా అమ్మపేరు వెంకమ్మ. మేము నలుగురము ఆడపిల్లలం. అప్పుడు మగ సంతానము లేదు. అందువల్ల మా నాన్నగారు మాకు యింట్లో పంతులిని పెట్టి బాగా చదువులు చెప్పించినాడు. భారత, భాగవతాలు, చెప్పించినాడు. తెలివిగలవాడ్లము అయినాము. మగపిల్లలను చూసినట్టు చూసుకొనేవాళ్ళు. గారాబంగా పెరిగినాము. లెక్కలు బాగా చేసే వాడ్లము. పెద్ద అక్కయ్యపేరు వెంకట రావమ్మ, చిన్న అక్కయ్యపేరు లక్ష్మీబాయమ్మ, నా పేరు దుర్గాంబ చెల్లెలు పేరు రంగనాయకమ్మ మానాన్నకు (ఇనగాలి) పటేలుగిరి వుండేది. దస్తరం మేము వ్రాసేవాడ్లము. మానాన్న మగ పిల్లలను చూసినట్లు చూసుకొన్నారు. మా పెద్ద నాన్నకు పిల్లలు లేరు. ఆయనది చొప్పకట్ల పాలేం. అక్కడ యిల్లు వున్నది. మానాన్న అన్న దమ్ములు ముగ్గురు. మా బాబాయి రామయ్య గారు పెంపుడు బోయినాడు. మా మేనత్తలు ముగ్గురు. వాండ్లకు కొడుకులు వున్నారు. పెద్ద అత్తయ్య కొడుకుకు చిన్న అక్కయ్యను యిచ్చి చిన్న పిల్లలకు చొప్పకట్ల పాలెంలో చాల బాగ పెండ్లిండ్లు చేసినారు. పెద్దక్కయ్యకు చిన్న తనంలోనే పెనిమిటి కాలం చేసినాడు. అక్కయ్య

పుట్టింట్లోనే వున్నది. ఆమెకు అత్తవారు ఎవరూ లేరు. ఇప్పుడు పెద్దది అయినది. తమ్ముడు బాగా చూసుకుంటాడు. ఆమెకు వస్తువులు వున్నవి ఆస్తి కొద్దిగా వున్నది ఆమె అత్తగారి ఆస్తిని తీసుకోలేదు.

నేను, చెల్లెలు పెద్దవాళ్లము అయినాము మాకు పెండ్లి చేయవలెనని అనుకున్నాడు. మా నాన్నగారు చెల్లెలుకు మేనరికము వున్నది. నాకు పెద్ద సంబంధము చూసి వచ్చినాడు. చాల మంచి సంబంధము బాగా నచ్చినది. నన్ను మా మామగారు చూచుటకు బడికే వచ్చినాడు. ఒడిలో కూర్చున్నాను. అక్కడికి వచ్చి పరీక్ష చేసినాడు. అన్నిటికీ జవాబు చెప్పినాను. ఇంటికి వచ్చినాడు. నాన్న అమ్మతో మాట్లాడుకున్నారు. నేను చెల్లి బడినుంచి వచ్చినాము. మమ్ములను యిద్దరినీ దగ్గర కూర్చోపెట్టుకొన్నాడు. 'నాకు నచ్చినది పెద్ద పిల్లను చేసుకుంటాము అని వెళ్లినాడు. అందరికి యిష్టము అయినది. ఆలస్యము చేయలేదు. లగ్గాలు పెట్టుకున్నారు. రెండు పెండ్లిళ్ళు అయిదురోజులు బ్రహ్మాండంగా జరిగినవి. నా బాల్యంలో నేను చాల బాగ వుండేదానిని తెలివి బాగా వుండేది వ్రాయటం చదవటం బాగా వచ్చు. పద మూడు సంవత్సరాలకే అత్తవారింట్లో అడుగుపెట్టినాను. నా అత్తగారు నన్ను ఖదరుగా చూచుకునేవాండ్లు వక్క కోడలినే కనక నా యిష్టానుసారముగా జరిగినది. నాకు 15 సంవత్సరమునకు పెద్ద అబ్బాయి కలిగినాడు. మా అమ్మకు 40 యేండ్లకు మా తమ్ముడు పుట్టినాడు. నా కొడుకు సంవత్సరము పిల్లాడు. నా కొడుకు చలవ అని అందరికి సంతోషము కలిగినది. మా తమ్ముడిని గారాబంగా చూసుకునే వాండ్లు. ఇంతలో అయిదు సంవత్సరములు వచ్చినవి మా తమ్ముడికి. మా నాన్నకు జబ్బుచేసి కాలం చేసినాడు. మా అమ్మ చదువు చెప్పించుకొని పెంచి పెద్ద వాడిని చేసినది. పెద్దవాడు అయినాడు.

పెండ్లి చేయవలెనని అనుకున్నారు. మా చిన్నక్కయ్యకు యిద్దరు ఆడపిల్లలు. పెద్దపిల్లను మా తమ్ముడికి యిచ్చి పెండ్లి బాగా అయిదు రోజులు చేసినారు. కాపరానికి వచ్చినది. కొంతకాలము కాపురం చేసినది. సంతానము కలగలేదు. (30) సంవత్సరము వచ్చినవి. ఇంతలో పెద్ద జబ్బు చేసి చనిపోయినది.

మా తమ్ముడు రామచంద్రరావుకు రెండో వివాహము చేసినారు. భార్య కాపరానికి వచ్చినది. పిల్లలు కలిగినారు. తొలిచూలు ఆడపిల్ల నలుగురు మగ పిల్లలు పెద్దవాడ్లు అయినారు. చదువుకుంటున్నారు. బిడ్డకు పెండ్లి చేసినాడు. దాని పేరు కమల తమ్ముడి భార్యపేరు సీతాకుమారి. పెద్ద కొడుకు పేరు రామేశ్వరరావు. రెండోవాడి పేరు గోపాలక్రిష్ణుడు. మూడో వాడి పేరు శ్రీనివాసులు. నాలుగో వాడిపేరు సురేష్ బాబు. బిడ్డ అత్తవారింటికి వెళ్లినది. మంచి సంబంధము అల్లుడు చంద్రశేఖర్ మంచి వాడు బిడ్డకు యిద్దరు కొడుకులు కలిగినారు. చిన్న అక్కయ్యకు ముగ్గురు కొడుకులు. ఒక ఆడపిల్లను అక్కయ్యకు కోడండ్లు బాగా చూస్తారు. మనమలు మనమరాండ్లు వున్నారు. మేము నలుగురం ఆడవాళ్లము. తమ్ముడిని నెలకు ఒక పర్యాయము చూస్తుండవలెను. మాకు అపేక్షలు యెక్కువ. మా పుట్టింట్లో మా మరదలు సీత మమ్మల్ని బాగ చూస్తుంది.

సంసారం మంచిదే. మా నలుగురికి పెత్తనములు వచ్చినవి. భగవంతుడి దయ భగవన్నామము చేసుకుంటూ వుంటాము.





# 3. శ్రీ 'అయ్యదేవర' అమెరికా యాత్ర

- విజ్ఞాన దీపిక, హైదరాబాద్.

1993 లో 'ఉత్తర అమెరికా తెలుగు సంఘం' (TANA) ఆధ్వర్యంలో న్యూయార్క్‌లోని లాంగ్ ఐలాండ్‌లో జులై మొదటి నుండి అయిదు రోజులు జరిగే ప్రపంచ మహాసభలో పాల్గొనటానికి 'సాహితీ సాంస్కృతిక సంస్థ 'బయలు దేరు సందర్భంలోని ప్రత్యేక వ్యాసం.

శ్రీ అయ్యదేవర పురుషోత్తమరావు 30-06-1933వ, తారీఖున ఖమ్మం జిల్లా, ఎఱ్ఱుపాలెం గ్రామంలో జన్మించారు. తల్లిదండ్రులు శ్రీమతి జమలాపురపు దుర్గాంబ, శ్రీ రామనరసింహారావు గారు, పినతల్లిగార్కి అయ్యదేవరవారికి పెంపుడు వెళ్లడం మూలాన అయ్యదేవర ఇంటి పేరు అయింది. పెంపుడు తల్లిదండ్రుల శ్రీమతి రంగనాయకమ్మ, శ్రీలక్ష్మీనరసింహారావు గార్లు, ఇంటర్‌మీడయట్ దాక విద్యాభ్యాసం విజయవాడలో సాగినా హైదరాబాదు ఉస్మానియా పట్టభద్రుడు, స్టేట్ బ్యాంక్ ఆఫ్ హైదరాబాద్. హైదరాబాద్‌లో వుద్యోగం.

తెలుగు వారికి సంస్కృతిక కేంద్రమైన విజయవాడలో చిన్న తనంలో వున్న కారణంగా సాహిత్య, సాంస్కృతిర రంగాల మీద ఆయనకున్న అభిరుచి, అభినివేశంగా మారి మంచి రచయితగా, నటుడుగా గల నాలుగు దశాబ్దాలుగా తెలుగు నాట మంచి పేరు తెచ్చుకున్నారు. సాహిత్యంలో ఆయన అభిమాని విశ్వనాథ వారు అయినా ఆయన రచనలు అడవి బాపిరాజును తలపింపజేస్తాయి. నటనా రంగాలలో అభిమానం సి.యస్. ఆర్. మీద అయినా ఆయన నటన "బందాని" ని గుర్తు చేస్తాయి.

'విజ్ఞాన దీపిక' సి.యస్. ఆర్. కళా మందిరం సంస్థల' ద్వారా హైదరాబాదులో డా॥ కె.యల్.రావుగారు, తుమ్మల, దివాకర్ల, ఇంటూరి, వంగర, టి. రామకృష్ణ శాస్త్రి, పీసపాటి, శాసన సభ స్పీకర్ శ్రీపాదరావు ఊటుకూరి సత్యనారాయణ గార్లను ఇంకా ఎందరో మహనీయులను సన్మానించారు.

సంగీత, సాహిత్య, అభినయం ముప్పేరి గొన్న పురుషోత్తమ రావు గారి "శ్రీకృష్ణ" పాత్ర చూసిన శ్రీ దివాకర్ల వెంకటావధాని గారు తమ "భువన విజయం" సాహిత్య రూపకంలో శ్రీ కృష్ణ దేవరాయల పాత్రకు ఎన్నిక చేశారు.

మిగతా సాహిత్య రూపకాలలో "కనకాభిషేకం"లో ప్రౌఢదేవరాయలు. "ఆంధ్ర భారతావతరణం" లో రాజరాజ నరేంద్రుడు. "కవి బ్రహ్మ" లో మనుమసిద్ధి పాత్రలను ధరించారు. సాహిత్య రూపకాలు ఆంధ్రదేశంలోని పెక్కు నగరాలలోనే కాక ఢిల్లీ, బొంబాయి, బెంగుళూరు మొదలైన ప్రదేశాలలో ప్రదర్శించారు

శ్రీ కృష్ణుడుగా ఈయన పాండవుద్యోగ విజయాలలో, శ్రీ కృష్ణతులాభారం, గయోపాఖ్యానం, రాధాకృష్ణ, "కర్ణ"లో నటించారు. "శ్రీ కృష్ణాంజనేయ యుద్ధం"లో కృష్ణుడుగా, "పాదుకాపట్టాభిషేకం"లో మరియు "రామాంజనేయ యుద్ధం"లో రాముడుగా, "హరిశ్చంద్ర"లో హరిశ్చంద్రుడుగా, "శకుంతల"లో దుష్యంతుడుగా, "అనార్కలి"లో సలీంగా, "రామదాసు" లో రామదాసుగా, "తుకారం"లో తుకారంగా, "చింతామణిలో బిల్వ మంగళుడుగా "వెంకటేశ్వర మహాత్యం" లో విష్ణువు, శ్రీనివాసుడుగా "కన్యాశుల్కం" లో రామప్ప పంతులుగా మునిమాణిక్యం నరసింహా రావు గారి "గృహప్రవేశం" లో కాంతయ్యగా, చలం చర్లవారి "పోతకుడు" లో పోతనగా పెక్కు పాత్రలు వహించి మూడుసార్లు హైదరాబాదు త్యాగ రాయగాన సభలో "సంప్రదాయక నాటక సప్తాహాలు" నిర్వహించి అన్ని నాటకాలలో ప్రధాన పాత్ర ధరించి పెక్కు రంగ స్థల కళాకారులకు సన్మానం చేయించి మంచి పేరు తెచ్చుకున్నారు.

ఈయన సరసన బుర్రా సుబ్రమణ్య శాస్త్రి, వేమూరి రామయ్య, వేమూరి సీతారామశాస్త్రి, సుభాషిణి, రజని, శ్రీ అబ్బూరి ఆదినారాయణ శర్మగారు, శ్రీ బి.వి. రంగారావుగారు, శ్రీ పొన్నాల రామసుబ్బారెడ్డిగారు, సైదులు మొదలైన ప్రసిద్ధ కళాకారులతో నటించారు.

1980 నుంచి 84 దాక 'త్యాగ రాయగాన సభ' హైదరాబాదులో ప్రతినెల ఒక నాటకం ప్రదర్శించారు. 1980లో "తెలుగు-నాటక శతజయంతి" సందర్భంగా "విజయభారతి" కళాసమితి వారు "నటసారధి", 1985లో త్యాగ రాయ నాటక కళా పరిషత్తు వారు "అభినవ కృష్ణ" బిరుదులనిచ్చి సత్కరించారు. 1998లో యువకళావాహిని వారు ఈలపాట రఘురామయ్య పురస్కారం యిచ్చారు.

రచయితగా ఎన్నో పత్రికలలో, సావనీరులలో సాంస్కృతిక, సాహిత్య సంబంధమైన "మరదలు", "పతితులు", "మాయని - మమతలు", "సుస్వరాలు" నవలలు ముద్రించబడ్డాయి.

ఉత్తర అమెరికాలోని తానా (తెలుగు సంఘం ఉత్తర అమెరికా) ఆధ్వర్యంలో న్యూయార్క్‌లోని లాంగ్ ఐలాండ్‌లో జరుగుచున్న ప్రపంచ తెలుగు మహాసభలకు వెళ్ళుచున్న సందర్భంగా స్టేట్ బ్యాంక్ ఆఫ్ హైదరాబాదు జోనల్ ఆఫీసర్ డిప్యూటీ జనరల్ మేనేజర్ శ్రీ యస్. మురళిగారు మరియు పెక్కుమంది బ్యాంకు అధికారుల సమక్షంలో సన్మానించారు..

ది. 28వ తేది మంగళవారం ఆయన అమెరికా వెళ్ళారు. శ్రీ అక్కిరాజు సుందర రామకృష్ణ, డా॥ ప్రసాద రాయకులపతి, డా॥ ముదిగొండ శివప్రసాద్‌రావు గారు, డా॥ ధారా రామనాథ శాస్త్రి గారు ప్రభృతులతో కలసి భువన విజయం మొదలైన కార్యక్రమాలలో పాల్గొన్నారు.

★★★★

# 4. జన్మస్థలం



- శ్రీమతి బసవరాజు విజయలక్ష్మి M.A TPT
హైదరాబాద్

మా నాన్నగారి స్వగ్రామం ఎఱ్ఱుపాలెం. మా నాన్నగారు విజయవాడ దత్తు పోవడం వల్ల నా జన్మస్థలం విజయవాడ. నా చిన్ననాటి జ్ఞాపకాలు విజయవాడ అనగానే కృష్ణానది, దాని ప్రక్కన ఇంద్రకీలాద్రి పర్వతంపైన చిఱు నవ్వుతో భక్తుల యెడ కరుణా కటాక్షవీక్షణాలతో పసుపుపచ్చని ఛాయలో మెరిసిపోతున్న 'కనకదుర్గ' గుడి, మదిలో మెదిలే నా 'జన్మస్థలము' విజయవాడ అయినందుకు మనస్సంతా ఆనందమయ మవుతుంది. నాకు నా జన్మస్థలంతోపాటు మా నాన్నగారి జన్మస్థలమయిన ఎఱ్ఱుపాలెం అంటే అంతులేని మమకారం. ఈనాడు ప్రతి మనిషి దైనందిన జీవితంలో ఎన్ని పరుగులు పెడుతున్నా హృదయాంతరంగంలో మాతృభాష అన్నా, మాతృమూర్తి, అన్నా మాతృదేశం అన్నా, జన్మస్థలమన్నా చిన్న స్పందన రాకమానదు. ఆనాటి మధుర స్మృతులు జ్ఞాపకం రాకమానవు.

నాకు చిన్నతనం ఊహతెలియని వయస్సు. మా నాన్నగారు హైదరాబాదులో బ్యాంకులో పనిచేస్తూ వుండటం వల్ల హైదరాబాదులోనే నా బాల్యం అంతా గడిచిపోయింది. కానీ ఆ బాల్యంలో ఒక మధురానుభూతి ఏమిటంటే, అది రైలెక్కి పూలీ ప్యాసింజరులో ఎఱ్ఱుపాలెం వెళ్ళటం. ఒక పగలు లేదా ఒక రాత్రి గానీ ప్రయాణం చేయక తప్పదు. ఈ రోజుల్లో లాగా ఎక్స్‌ప్రెస్ రైళ్ళు లేవు. అంతటి సుదీర్ఘ ప్రయాణమైనా ఏ మాత్రం విసుగు, అలసట లేకుండా కిటికీ ప్రక్కన కూర్చుని ఆతృతతో ఎఱ్ఱుపాలెం ఎప్పుడు వస్తుందా అని ఎదురుచూసేదాన్ని. నా ఆతృత కనిపెట్టినట్లుగా నా నిరీక్షణ ఫలించి ఎఱ్ఱుపాలెం వచ్చేది. నా కళ్ళు మా బాబాయిల కోసం వెతికేవి. ఇంతలో వాళ్ళురానే వచ్చేవారు. మా బాబాయిలు ఎత్తుకుని ఇంటికి తీసుకు వెళ్ళేవారు. మా చిట్టి చెల్లెళ్ళు తమ్ముళ్ళు నా కోసం పెద్ద పెద్ద కళ్ళలో చిఱునవ్వులు చిందిస్తూ ఎదురు వచ్చేవారు. మా బామ్మ దుర్గాంబ, పెద్దనాన్న సత్యనారాయణరావు, మేనత్త (లలిత), మామయ్య రామారావు గారు పెద్ద బాబాయి రామేశ్వరరావు, రెండవ బాబాయి గోపాల్‌కిషన్‌రావు, చిన్న బాబాయి

వెంకటకిషన్‌రావు. మా మేనత్త లలిత వారి అమ్మాయి ఇందిర వెండి పళ్లెంలో అన్నం కలిపి ఎత్తుకుని తినిపించేవారు. మా మామయ్య పిల్లలకోసం చెక్క పెట్టెలో దాచివుంచిన కోవాబిళ్లలు తినిపించేవారు. మా అత్తయ్యకు ముగ్గురు కొడుకులు రాజారావు, సుబ్బారావు, సత్యనారాయణమూర్తి. మా పెద్దనాన్నకు ఇద్దరు కొడుకులు, ఒక కూతురు. వారు సూర్యప్రకాశరావు, రామనరసింహారావు కమల వీరంత ఎంతో ప్రేమాస్పదులు.

మా ఎఱ్ఱుపాలెంలో మేము ఉన్నన్ని రోజులు మాకు పండుగే. మా బామ్మ దుర్గాంబ ఆదరణ అపారము. ఆమె చేతి భోజనం తినని వారు ఆ ప్రాంతాల్లో లేరు అని అంటే అతిశయోక్తి కాదేమో. బంధువులను ప్రేమగా చూడటం సహజమే అనుకున్నా ఆమె పాలేర్లను సహితం ఎంతో ఆదరణతో కన్నబిడ్డల్లాగా చూసుకునేది. పెద్ద పెద్ద గిన్నెలతో అన్నం వండి మీగడ పెరుగులతో వడ్డించేది. మీగడ పెరుగులలో ఉన్న మాధుర్యము ఆమె ఆప్యాయతలో కనబడేది. తన కోసం తాను బ్రతకటం తప్పకాకున్న పరుల కొఱకు బ్రతికే ధన్య జీవులలో మా బామ్మ కూడా ఒక ధన్యజీవి. చిరస్మరణీయురాలు. ఆమె మా బామ్మ కావటం మా అదృష్టంగా భావిస్తాను.

మా నాన్నగారు పురుషోత్తమరావుగారు జమలాపురం వంశం నుండి అయ్యదేవర వంశానికి దత్తత వెళ్ళారు. మా నాన్నగారు బ్యాంకులో తన వృత్తి ధర్మం నిర్వహిస్తూనే ప్రవృత్తి నటనాభిలాష కావటం వలన వేల పౌరాణిక నాటకాలు నిర్వహిస్తూ 'బ్యాంకు కృష్ణుడి'గా పేరు పొంది 'నటసారథిగా' బిరుదు పొంది అవిరామంగా ఈనాటికి కళాసేవ చేస్తూ కళామాతల్లికి ముద్దు బిడ్డగా ఉండి స్వదేశంలోనే కాక విదేశాల్లో కూడా శ్రీ కృష్ణరాయబారం లాంటి పౌరాణిక నాటకాలను, భువన విజయంలాంటి సాహిత్య రూపకాలను ప్రదర్శిస్తూ ప్రజల ప్రశంసలను అందుకుంటున్నారు. ఆరోజుల్లో మా పెద్ద బాబాయి రామేశ్వరరావు ఉమ్మడి కుటుంబాన్ని నడిపిస్తూ వ్యవసాయంలో అసామాన్యమైన ప్రతిభను కనబరచి చక్కటి పంటలను పండించేవారు.

ఆ రోజుల్లో మా బాబాయిలది ఉమ్మడి కుటుంబం. బాబాయిల ప్రేమ తండ్రి ప్రేమకు ఏ మాత్రం తీసిపోయేది కాదు. పినతల్లుల ప్రేమ తల్లిప్రేమకు తక్కువకాదు. తోటికోడళ్లయినా స్వంత అక్కచెల్లెళ్ల వలె కలిసిపోయి ఎంతో ఐక్యతగా ఉండే ఈనాటికి అత్తగారి అడుగుజాడలలో నడుస్తూ మా అమ్మతో సహా అందరూ అతిథి మర్యాదలు పాటిస్తూనే ఉన్నారు. ఎప్పుడూ ఈ ఉమ్మడి కుటుంబం అన్నదానం చేస్తూనే ఉండేది. అదే విధంగా మా బాబాయిల, పెద్దనాన్న పిల్లలము అందరము ఒకే తల్లిపిల్లలవలె కలిసిమెలసి ఎంతో అనురాంగా ఉంటాము.

ప్రక్క ఊరైన జమలాపురం వేంకటేశ్వరస్వామి మా ఇంటి ఇలవేల్పు. ఆ ఊరే ఇంటి పేరైంది. పూర్వం శారదాబిల్లు కాలంలో మా ఇంట్లోనే వందల మందికి వివాహాలు జరిగేవట. అన్నదానానికి లోటు లేదు. దానధర్మాలు, పరోపకారమే పరమావధిగా ప్రఖ్యాతి వహించిన కుటుంబాలలో ఇది ఒకటి. మా పెద్ద బాబాయి రామేశ్వరావుగారు మీనవోలు, ఎఱ్ఱుపాలెం గ్రామాలకు కరణంగా ఉండి ఎంతోమందికి సహాయం చేసి మంచి పేరు తెచ్చుకున్నారు. రెండవ బాబాయి గోపాలకిషన్‌రావు ఆదర్శనీయమైన ఉపాధ్యాయ వృత్తిలో ఉండి ఎంతోమంది విద్యార్థులను ఉత్తమ భావిభారత పౌరులుగా తీర్చిదిద్దారు. చిన్నబాబాయి గ్రామీణులకు ఎల్లప్పుడు తన సహాయసహకారాలను అందిస్తూనే ఉంటారు. అదే ఆయనను కొన్ని సంవత్సరాలు సర్పంచ్‌గా నిలబెట్టింది. పదవి ఉన్నా లేకున్నా వీరి సహాయ సహకారాలు మాత్రం యధాతధంగా సాగుతూనే ఉన్నాయి.

ఎఱ్ఱుపాలెం గ్రామంలో చంద్రమౌళీశ్వరస్వామి వారి ఆలయం ఉన్నది. ఇది ఊరి మధ్యలో నిర్మితమై ఉన్నది. చంద్రమౌళేశ్వరస్వామి వారి ఆలయం ప్రజలలో భక్తి భావాన్ని ఇనుమడింపచేస్తూ దర్శించిన ప్రతివారికి కన్నుల పండుగగా ఉండి ఒక మధురానుభూతిగా మిగిలి పోతుంది.

"మాతృదేవోభవ, పితృదేవోభవ, ఆచార్యదేవోభవ, అతిథిదేవోభవ అన్నది మన సంస్కృతి సంప్రదాయము. పూర్వకాలంలో మన పూర్వీకులు అతిథులకు "భిక్ష మివ్వకుండా భోజనము చేయని మహోన్నతమైన సంప్రదాయానికి ప్రతీకలు. అందుకనే కాబోలు అల్లసాని పెద్దన తన 'మనుచరిత్ర'లో అతిథులకోసం ప్రవరాఖ్యుడు నిరీక్షించటం, హిమాలయ పర్వతం పైన ఇంటికి రాలేక విలపిస్తూ అందులో ఒక భాగంగా 'అతిథి సంతర్పణలేమయ్యెనో' అని అంటాడు. అటువంటి గడ్డపై జన్మించిన మనము ఆ సంప్రదదాయాలనే పాటించాలి. అటువంటి సంప్రదాయాలను పాటిస్తూ పరోపకారమే పరమావధిగా కలిగిన కుటుంబాలలో ఇది ఒకటి. ఈ కుటుంబము సత్సాంప్రదాయాలకు మచ్చుతునక అని చెప్పవచ్చు.

మా రెండవ బాబాయి గోపాలకిషన్‌రావు M.A., M.Ed చేసి Phd చేయకుండా వదిలివేశారు. విద్యనభ్యసించడానికి వయస్సుతో పనిలేదంటూ P.U.C. పాసైన చాలా సంవత్సరాలకి M.A.,M.Ed. చేశారు. "Phd ఎందుకు వదిలేశారు బాబాయి ?" అంటే చిన్నగా నవ్వి ఊరుకున్నారు. దాని అర్థం అప్పుడు తెలియలేదు. జమలాపురం వారి వంశంలో మణిపూసగా భాసిల్లిన జమలాపురం కేశవరావుగారి జీవిత చరిత్ర వ్రాశారు. నవలలు, కథలు వ్రాయటం తేలిక. కేవలం మేధాశక్తి కొద్ది రచయిత ఊహలకు అనుగుణంగా ఊహించి వ్రాయవచ్చు. కానీ

ఒక మహనీయుని జీవిత చరిత్ర వ్రాయటం అంత సులభంకాదు. జీవిత చరిత్రలో వర్ణనలకు ఊహలకు తావులేదు. అంత యధాతథంగా ఉండాలి. మొత్తం జీవిత విశేషాలను సమీకరించటం అంత మామూలు విషయమేమీకాదు. భావితరాల వారికి తమ వంశంలోని మహానుభావుడి జీవిత చరిత్రను అందించాలనే సత్సంకల్పంతో ఎన్నో శ్రమలనోర్చి జమలాపురం కేశవరావుగారి జీవిత చరిత్రను వ్రాశారు. మహనీయుల జీవిత చరిత్రలు మనకు మార్గదర్శకులు కాబట్టి ప్రతివారు దీనిని చదివి కొంతవరకైనా మంచిని గ్రహిస్తే రచయిత కృషి ధన్యమైనట్లేనని భావించవచ్చు. ఈ జీవిత చరిత్ర రచించి అంతటితో విరమించకుండా జమలాపురపు వంశంలో జన్మించినందుకు తన వంతు కృషిగాని ఆ వంశానికి అందించాలనే పవిత్రమైన ఆశయంతో "జమలాపురాన్వయం దర్శిని" అనే వంశ వృక్షాన్ని అనేక శ్రమలకోర్చి ఎంతో పరిశోధనగావించి ఒక పరిశోధనా గ్రంధంగా తీర్చిదిద్దారు.

జమలాపురం కేశవరావుగారి జీవితచరిత్ర జమలాపురాన్వయదర్శిని Phd క్వాలిఫికేషన్‌కి ఏమాత్రం తీసిపోని గ్రంధాలు. జమలాపురం వంశానికి చిరస్థాయిగా నిలిచిపోయే కానుకలను అందించిన మా బాబాయి ఈ వంశంలోని భావితరాలవారికి ఆదర్శప్రాయుడు.

ప్రఖ్యాత పండితుడు డా॥ తిరుమల రామచంద్రగారు ఈ జమలాపురాన్వయ దర్శినిని పరిశీలించి ఇది Phd కి తీసిపోని గ్రంధమని అన్నారు.

మా పెద్దనాన్న సత్యనారాయణ శర్మగారు ఆనాటి దక్కన్ హైదరాబాద్ రాష్ట్ర స్వాతంత్ర్యోద్యమంలో గంపెడు సంసారాన్ని తీసుకొని ఎఱ్ఱుపాలెం నుంచి యూనియన్ ప్రాంతమైన మాధవరం కట్టుబట్టలతో పోయి ఎన్నో యిబ్బందులు పడ్డారు. భూమి, పంటలు వదిలి యాభైకి పైగా పశువులను తోలుకపోయి పడ్డయాతనలు కథలు కథలుగా యిప్పటికీ చెప్పకొంటారు. అది మా పెద్దనాన్న ఓర్పుకు నిదర్శనం.

'జన్మస్థలం' అన్న మధురానుభూతి మరవలేము.

+ + +



# 5. An Article on my Grand Father "తాతయ్యా ! You are really great."



- చి॥ బండారు గురునాథ్‌శర్మ,
విజయవాడ

మా తాతయ్య గురించి వ్రాయగలినంత సమర్థుడిని కాకపోయినా, నాకు తెలిసినంత వరకు వ్రాయదలచాను.

మా తాతయ్య అయిదు అడుగుల నాలుగు అంగుళాల ఎత్తు, రింగు రింగుల జుట్టు, ఎప్పుడూ చెరగని దరహాసం, ప్రేమానురాగాల హాసం కలిగినవారు ఆయనే **"శ్రీ జమలాపురపు గోపాల కిషన్‌రావు"** గారు

నాకు ఊహతెలిసినప్పటి నుండి, మా తాతయ్య ఎట్టుపాలెంలోనే ఉండేవారు. చాలా సహృదయులు. చిన్నపిల్లలంటే ఆయనకి అమితమైన ప్రీతి. మా చిన్నతనం నుండి మమ్మల్ని ఎంతో గారాబంతో శ్రద్ధతో పెంచారు. అనేక కథలు చెప్తారు. మాతో కలిసిపోయి ఆడుకుంటారు. తాతయ్య 'షష్టిపూర్తి ఉత్సవ' సభలో కొందరు పెద్దలు మాట్లాడుతూ చెప్పినట్లు, ఇప్పటికీ 60 ఏళ్ళ వయస్సులోను 6 ఏళ్ళ పిల్లతో కలిసి ఆడుకుంటారు.

తాతయ్యకు చదువన్నా, చదువుకునే వారన్నా ఎంతో ఇష్టం. వారి చిన్నతనంలో పెద్ద చదువులు చదివే అవకాశం లేకపోయినా, ఒక ప్రక్క ఉద్యోగం చేస్తూ, మరోప్రక్క M.A.M.Ed. చేశారు. నిజంగా ఆయన చేసిన ఈ పనికి నా హాట్సాఫ్ తెలియజేస్తున్నాను. చాలా మంది చదువు మానేసి ఇంట్లో ఉన్న అమ్మాయిలు తాతయ్య ప్రోత్సాహంతో డిగ్రీ పూర్తి చేశారు. వారికి అప్లికేషన్లు, పుస్తకాలు సమకూర్చి ఎంతో ప్రోత్సహించారు.

మా తాతయ్యకు కోపం అన్నా జూదమన్నా ఇష్టం లేదు. తాతయ్య కోపాన్ని మేమెన్నడు చూడలేదు. ఇక జూదం అంటారా ఆమాటే వినివుండరు.

తాతయ్య అన్నదమ్ములు చాలా ఐకమత్యంగా వుంటారు. చాలా ఆదర్శవంతంగా వుంటారు. వారి ఒక్కగాని ఒక్క అక్క అంటే తాతయ్యకు చాలా ప్రేమ. పచ్చి ఒక్క దగ్గరినుంచి పట్టుబట్టల వరకు ముందు ఆమెకే చూపించేవారు. కుటుంబ సభ్యులతో చాలా ఆనందంగా ఆహ్లాదంగా గడుపుతుంటారు. తాతయ్య తన పిల్లలను ఎన్నడూ శాసించలేదు. అందుకే మా అమ్మకు, మామయ్యలకు తాతయ్య అంటే ఎనలేని గౌరవం. వారు తాతయ్య కనుసన్నలలోనే మెలుగుతారు. ఇక అమ్మమ్మంటారా, ఆమెకు ఆమే సాటి. సార్థక నామధేయురాలు (సీత). కోడళ్ళు (రమ అత్తయ్య, దుర్గ అత్తయ్య) తాతయ్యకు అన్ని విధాలుగా సహకరిస్తారు.

తాతయ్య ఎప్పుడూ ఏదోఒక పనిలో నిమగ్నమై వుంటారు. మొదలు పెట్టిన పని పూర్తయ్యేవరకు వదలరు. ఎంత కష్టమైనా, ఎంత ఖర్చు అయినా ఆ పనిని పూర్తిచేస్తారు. కుటుంబంలోని అందరూ

(భార్య : సీతాకుమారి, కూతురు : వాణిశ్రీ, అల్లుడు : బంగారు నరసింహమూర్తి, కొడుకులు : కమలాకర్, విఠల్, కోడళ్ళు : రమ, దుర్గ, మనువళ్ళు, మనువరాళ్ళు : గాయత్రి, శర్మ, కృష్ణ, శాయి కృష్ణ, సరస్వతి, భారతి, హరికృష్ణ) తమ తమ శక్తిమేరకు తాతయ్యకు సహకరిస్తూ వుంటారు. ఇల్లు ఎప్పుడూ అతిథి అభ్యాగతులతో కళకళలాడుతుంటుంది. బంధువులంటే తాతయ్యకు ఇష్టం. తాతయ్య అంటే బంధువులకిష్టం. అంత మంచి మనస్సుగల తాతయ్యకి మనుమడిగా పుట్టినందుకు ఎంతో గర్విస్తున్నాను.

మా తాతయ్య ప్రస్తుతం ఒక మహత్కార్యాన్ని చేపట్టారు. వారి పూర్వీకులు అసంపూర్ణంగా విడిచిపెట్టిన 'జమలాపుర వంశ వృక్షము' ను సంపూర్ణము చేయదలచారు. ఆయనకు 60 ఏళ్ళు వచ్చినా, ఇంకా చక చకా నడుస్తూ, ఎక్కడెక్కడి వారినో కలుసుకొని వారి గురించి తెలుసుకొని, పుస్తకమును అచ్చు వేయించారు. ఆ పుస్తకము పేరు - **"జమలాపురాన్వయ దర్శిని"**

ఈ పుస్తకము అచ్చు వేయించుటకు, ఆయన పడ్డ కష్టాలు అన్నీ ఇన్నీ కాదు. అయినా సరే వాటన్నిటినీ అధిగమించి ఆయన కార్యాన్ని పూర్తిచేశారు. అందుకే అన్నారు పెద్దలు :

"ధీరుల్ విఘ్ననిహన్య మానులగుచున్ ధృత్యున్నతోత్సాహులై
ప్రారబ్ధార్థము లుజ్ఝగింపరు సుమీ ప్రజ్ఞానిధుల్ గావునన్" అని.

నాకు పదేళ్ళ వయస్సులో (5వ తరగతి చదువుతున్నప్పుడు), మా తాతయ్య మొదటిసారి **"సర్దార్ జమలాపురం కేశవరావు"** గారి జీవిత చరిత్రను రచించారు. ఆ పుస్తకము యొక్క ఆవిష్కరణ మహోత్సవము జరుగు సమయమున తాతయ్యకు జరిగిన సన్మానమును చూచి, ఎంతో సంబర పడ్డాను. ఆ ప్రోగ్రాము ముగిసిన తరువాత తాతయ్య దగ్గరకు వెళ్ళి **"తాతయ్యా ! You are really great"** అని అన్నాను.

అప్పుడలా ఎందుకన్నానో గాని, ఆమాట వెనకాల ఎంత అర్థము వుందో అని ఆలోచిస్తే, ఒక్కోసారి నాకే అర్థము కాదు. అది ఆయనలోని గొప్పదనం.

అది గుర్తుకు వచ్చినప్పుడల్లా, ఇప్పటికీ మళ్ళీ మళ్ళీ అనాలనిపిస్తూ వుంటుంది. **"తాతయ్యా ! you are really so great"** అని

**జి.వి. గురునాథ శర్మ** Ist Inter
చైతన్య కళాశాల, విజయవాడ

## 6. మా పెద్దకిష్టి తాతయ్య



అమ్మ స్కూలు నుండి ఫోన్ చేసింది. వచ్చి తీసుకెళ్లమని. రోజు అమ్మ నాలుగంటలకు ఫోన్ చేసేది. ఈ వేళ ఇంత త్వరగా ఫోన్ చేసిందేమిటా అనుకుంటూ, అప్పడే కాలేజీ నుంచి వచ్చిన నాకు, అమ్మచేత అన్నం కలిపించుకొని తినవచ్చన్న ఆనందంతో స్కూలుకి బండి తీసుకొని బయలుదేరాను. దారిలో మా తాతగారి మాటలు గుర్తుకు వచ్చి నాలో నేనే నవ్వుకొన్నాను.-"ఎం.బి.ఏ చేస్తూ, ఇంకా అమ్మ చేత్తో కలిపించుకొని తినటమేంటని" వెక్కిరించారు. కాని నాకు, చెల్లాయి సంజుకు అమ్మ చేత్తో కలిపించుకొని తింటేనే ఆ రోజు సరిగా భోంచేసినట్టు.

- చి॥ బసవరాజు వెంకటకృష్ణ కిరణ్

స్కూలు ముందు బండి పార్క్ చేసి, లోపలికి వెళ్లాను. అమ్మలోపల "పరీక్షలు దగ్గర పడుతున్నవి. ఇంకా సిలబస్ ఎందుకు పూర్తి చేయలేదని" ఒక టీచర్‌ని సున్నితంగా మందలిస్తున్నారు. ఆ టీచర్ వెళ్లిపోయాక నన్ను చూసి కూర్చోమని, అమ్మ కళ్లతోనే చెప్పింది. కడుపులో ఆకలి పరుగులు తీస్తున్నా, ఇవాళ భోజనం అమ్మ చేత్తో తినవచ్చనే ఆనందంతో అలాగే కూర్చిండిపోయాను.

కాసేపటికి టీచర్‌లందరు వచ్చి వారి వారి పుస్తకాలలో అమ్మచేత సంతకం పెట్టించుకొని వెళ్ళారు. అమ్మ పదిహేనేళ్ల క్రితం స్కూలు టీచర్‌గా చేరి నేడు వైస్ ప్రిన్సిపల్‌గా ఎదిగిన వైనం నాకు ఆదర్శప్రాయం. అమ్మ 'ఇక వెళదాం పదరా!' అంది. నేను నా ఆలోచనల్లోంచి బయటకు వచ్చి బండిమీద అమ్మను ఎక్కించుకొని ఇంటికి బయలుదేరాను.

దారిలో అమ్మను 'త్వరగా రమ్మన్నావెందుకు ?' అన్నాను. "వచ్చే శనివారం మీ పెద్దకిష్టి తాతయ్య షష్టిపూర్తి వుంది. మనము రెండు రోజులు ముందుగానే ఎఱ్ఱుపాలెం వెళ్లాల్సివుంది. ఎఱ్ఱుపాలెం వెళ్తున్నామనగానే నాకు ఎక్కడలేని ఆనందం పుట్టుకు వచ్చింది. అందులో మా పెద్దకిష్టి తాతయ్య షష్టిపూర్తి అనగానే నా ఆనందానికి అవధుల్లేవు.

ఇంటికి వెళ్లేసరికి నాన్నా, చెల్లాయి కూడా ఇంటికి వచ్చేశారు. అందరము భోంచేసి, ఆరోజు మధ్యాహ్నం గొల్కొండ రైలు ఎక్కి ఎఱ్ఱుపాలెం ప్రయాణమైనాము. జమలాపురపు గోపాలకిషన్‌రావు గారు అనగా మా పెద్దకిష్టి తాతయ్య అంటే నాకు చాలా గౌరవం. అంతకన్నా ఎక్కువ ప్రేమ అభిమానం వున్నాయి. చదువుతో పాటు సంస్కారం కూడా అబ్బాలని పెద్దలు చెప్పగా విన్నాను. కాని అది ప్రత్యక్షంగా మా తాతయ్య గోపాలకిషన్‌రావు గారిని చూశాక సంస్కారానికి అర్థం భావం తెలిశాయి.

మానవాళికి ఆదర్శ పురుషుడైన శ్రీరాముడు నా ఇష్టదైవం. నాకు ఆ దైవం పట్ల అమితమైన ప్రేమ భక్తి ప్రపత్తులు వున్నాయి.

మా సొంత తాతగారైన పురుషోత్తమరావు గారు నాకు చిన్నప్పుడు చెప్తుతుండేవారు". శ్రీరాముడు చిటికెల మీద రావణుణ్ని సంహరించి సీతమ్మవారిని తెచ్చుకోలేక కాదు, ఈ భూమి మీద జన్మించిన ప్రతి మనిషికి ఆదర్శం ఆ అవతారం, ప్రతి పురుషుని జీవన విధానాన్ని నిర్దేసించే మార్గదర్శకం ఆ యుగపురుషుని జీవితం. అదే ఆ భగవంతుడి వుద్దేశ్యం. అందుకే ఆ జీవన విధానం అని ఉద్భోదించారు మా తాతగారు.

నేను ఇప్పటికి ప్రతిరోజు మా ఇంట్లో వున్న శ్రీరామచంద్రులవారి ప్రతిమ తెల్లవారి లేచిన తరువాత నమస్కరించి వేడుకొంటాను. "తండ్రి ! నాకు జీవన శైలిని అనుసరించే శక్తిని ప్రసాదించమని కాని". అది ఎంత కఠినమైన కఠోరమైన దీక్షో ప్రతి నిమిషం, ప్రతిక్షణం అనుభవమైతుంది. కాని ఈ కలియుగంలో అలాంటి ఆదర్శంతమైన జీవితం గడిపేవారు నూటికో కోటికో ఒక్కరే వుంటారు.

నా యీ యిరవై మూడేళ్ళ జీవితంలో నేను చూసిన అటువంటి మహోన్నతమైన వ్యక్తి మా తాతయ్య గోపాలకిషన్‌రావు గారు. ఆయన ముక్కుకు సూటిగా పోయే వ్యక్తిత్వం కలవారు. మనసా, వాచాకర్మణ: ఆడిన మాట తప్పని మనిషి, అందుకే కాబోలు మా తాతయ్య ఆ భగవంతుడు సీతమ్మలాంటి మా అమ్మమ్మ సీతమ్మను, రామలక్ష్మణులవంటి ఇద్దరు బిడ్డలను, పేరుకు తగ్గట్లు మా పిన్ని వాణి పిన్నిని ప్రసాదించాడు. అందుకనే నాకు మా తాతయ్య ఆదర్శం. అటువంటి మంచి వ్యక్తి వద్ద నుండి మనము రోజుకొక పాఠం నేర్చుకోవచ్చు. కాని ఆయననుంచి నేను నేర్చుకొన్న మొదటి పాఠం మరపురానిది. మరువలేనిది. ఇక్కడ ప్రస్తావానార్హమైనది.

నాకప్పుడు ఐదారేళ్ళు వుంటాయి. అప్పట్లో పెద్దకిష్టి తాతయ్య హైదరాబాదులో మా ఇంట్లో ఎం.ఏ పరీక్షలు వ్రాయటానికి వచ్చారు. ప్రతిరోజు రాత్రి పైన డాబా మీద లైట్ వేసుకొని దానికింద కూర్చొని చదువుకుంటు వుండేవారు. అది వేసవి కాలం కావటం చేత మేము కూడా పైన డాబా మీద పడుకుంటే వాళ్ళము. ఒకరోజు మా తాతయ్య లైట్ కింద ఎప్పటిలాగే కూర్చొని చదువుకుంటున్నారు. కాని ఆరోజు అటుయిటు నాలుగైదు కంకర రాళ్ళు పెట్టుకొని వాటి మధ్యలో కూర్చొని చదువుకొంటున్నారు. నాకది అర్థంకాక అడుగుదామంటే ధైర్యం చాలక వూరుకుండిపోయాను. ఇంతలో అమ్మ దుప్పట్లు పట్టుకొని పైకి వచ్చింది.

అమ్మ తాతయ్యను చూసి, "ఏంటి బాబాయి ! అలా రాళ్ళు పెట్టుకొన్నావ"ని అడిగింది. దానికి మా తాతయ్య చెప్పిన సమాధానం

"ఏమిలేదే చాలా అలసిపోయాను. నిద్రముంచుకొస్తుంది. కాని రేపటి పరీక్షకు చదువుకోవాలి. పొరపాటున నేను నిద్రపోయి పక్కగా ఒరుగుతే ఆ రాళ్ళు గుచ్చుకొని మళ్ళి లేస్తాను" అన్నారు. మా తాతయ్య అన్న ఆ మాటలు నా వ్యక్తిత్వానికి పునాది యయింది. అటువంటి పట్టుదల, దీక్ష, కర్తవ్య నిర్వహణ, ఆ మనిషిని ఇంతటి మహోన్నత స్థాయికి చేర్చింది. నేను ఇప్పటిదాకా ఆయన వద్ద నేర్చుకొన్న పాఠాలు ఎన్నో ! ఎన్నెన్నో !!

ఆ భగవంతుడు మా తాతయ్యకు ఆయన కుటుంబానికి ఆయురారోగ్య ఐశ్వర్యాలు ప్రసాదించాలని కోరుతూ ...



# 7. 'పెద్దన్న' - కేశవరావుగారు

- శ్రీ కోదాటి నారాయణరావుగారు
హైదరాబాద్

అది 1938వ, సంవత్సరం. హైదరాబాదు స్టేట్ కాంగ్రెస్ పుట్టకముందే నైజాం ప్రభుత్వం వారి ఆగ్రహానికి గురియై నిషేధింపబడిన సంస్థలో తాము సభ్యులమని ప్రకటించుకోవటం నేరం. ఈ శాసనాన్ని ఉల్లంఘించి 'సత్యాగ్రహం' చేశారు. సత్యాగ్రహం నిర్వహించే సంస్థ హైదరాబాదులో రహస్యంగా ఉండేది. దీని శాఖా కార్యాలయం విజయవాడలో నెలకొల్పారు. ఈ శాఖను నిర్వహించే బాధ్యత కీ॥ శే॥ మాడపాటి హనుమంతరావుగారికి అప్పగించారు. హైదరాబాదు స్టేట్ కాంగ్రెస్ పక్షాన కీ॥శే॥ బి.ఎన్. శర్మగారి సంపాదకత్వంలో "ఆంధ్రవాణి" అనే వారపత్రిక వెలువడేది.

ఆ కాలంలో నేను ఖమ్మంమెట్టులో నివాసమేర్పరచుకొన్నాను. ఖమ్మం విజయవాడకి అనతి దూరంలో ఉన్నది. కీ.శే. మాడపాటి రామచంద్రరావుగారు నాకు చిరపరిచితులు. నన్ను తమకు సహాయంగా వుండవలసిందని ఆదేశించారు యువకులను చేరదీసి వారిని సత్యాగ్రహానికి పురికొల్పి హైదరాబాదు పంపటం. ఖమ్మం సూర్యాపేట ప్రాంతాల్లో ప్రభుత్వం చేసే అకృత్యాలను "ఆంధ్రావనికి" పంపుతూ విలేఖరిగా పనిచేయటం, చందా వసూలు చేయటం మొదలైన పనులు నాకప్పగించారు. ఈ పనులన్నీ సక్రమంగా జరగడానికి వారానికి ఒకసారైనా విజయవాడ వెళ్ళవలసి వచ్చేది. పత్రికల్లో వచ్చేవి కాకుండా మిగతా సత్యాగ్రహ వార్తలు విజయవాడ కార్యాలయంలో తెలిసేవి.

ఒకనాడు విజయవాడ కార్యాలయంలో వుండగా కీ.శే. మాడపాటి రామచంద్రరావుగారు నాతో కీ॥శే॥ జమలాపురం కేశవరావుగారు సత్యాగ్రహం చేసి అరెస్టయినారని చెప్పారు. అప్పటివరకు కేశవరావుగారెవరో నాకు తెలియదు. వారిని గురించిన వివరాలన్నీ రామచంద్రరావుగారి వలన తెలుసుకొన్నాను. ఆ విధంగా కేశవరావుగారితో నాకు శృతపరిచయం కలిగింది. గాంధీ మహాత్ముని సలహా ప్రకారం 'హైదరాబాదు స్టేట్ కాంగ్రెస సత్యాగ్రహం' ఆపివేశారు సత్యాగ్రహులందరినీ జైళ్ళనుండి విడుదల చేశారు. అందరితోపాటు కేశవరావుగారిని కూడా వదిలివేశారు. వారు విడుదల కాగానే ఎల్లుపాలెం వెళ్ళి వారిని కలుసుకొని

పరిచయం చేసుకొన్నాను. వయసులో వారు నాకంటే పెద్దవారు. ఆయనను అన్న వరుస చేసుకొని 'పెద్దన్నా'! అని పిలవటం మొదలుపెట్టాను. మాడపాటివారితో మా కుటుంబానికి గల సంబంధం వలన మా వరస సరిఅయిందేనని ధృవపడింది. అప్పటినుండి మేమిద్దరమూ అన్నదమ్ములమైనాము. కేశవరావుగారి నెప్పుడూ 'పెద్దన్న' అని తప్ప పేరుపెట్టి పిలువలేదు. నన్ను ఏకవచనంగా నలుగురే సంబోధించేవారు. మాడపాటి రామచంద్రావు, జమలాపురం కేశవరావు, కాళోజీ, కొమరగిరి నారాయణరావుగారలు. వీరు తప్ప మరెవ్వరైనా గౌరవ వాచకంతో సంబోధించేవారు.

కేశవరావుగారు ఆజానుబాహులు, స్ఫురద్రూపి, బలశాలి, సరళ స్వభావులు, నిగర్వి. ఆయన స్వభావాన్ని తెలిపే ఒకటి రెండు సన్నివేశాలను వ్రాస్తే పాఠకులకు సరిగ్గా అర్థమౌతుంది. కారాగారం నుంచి విడుదల అయిన తరువాత ఆయన్ను 'వరంగల్ జిల్లా ఆంధ్ర మహాసభ' కు అధ్యక్షులుగా ఎన్నుకొన్నారు. జిల్లా మహాసభ ఖమ్మం, ఖమ్మంమెట్టుకు సమీపంలో గల వెంకటాయపాలెంలో జరుపటానికి నిశ్చయించారు. ఆ మహాసభకు ఆయనే అధ్యక్షులు. అధ్యక్షుడంటే ఆ సమయానికి రావడం, సభకు తత్సంబంధిత కార్యకలాపాలకు ఆధిపత్యం వహించటం.

నేను విజయవాడలో వుండగా కేశవరావుగారు కూడా విజయవాడ వచ్చారు. నేను గాంధీనగరంలో ఆంధ్ర ఇన్సూరెన్స్ కంపెనీ గెస్టుహౌస్‌లో వున్నాను. తెల్లవారుతుండగానే కేశవరావుగారు నావద్దకు వచ్చి వెంకటాయపాలెం వెళ్ళుటకు ఖమ్మం వెళ్ళవలెనని ప్రయాణం కమ్మనమని చెప్పారు. అధ్యక్షులైన మీరు ఇంత త్వరగా ఎందుకని అడిగితే "మనం లేనిదే పనులు ఏవిధంగా జరుగుతాయని"? ప్రశ్నించారు. నావద్ద కొనిన క్రొత్త ఖద్దరు బట్టలు నేను మోయలేనంత బరువున్నాయి. సమయానికి గుర్రపు బళ్ళు లేవు. అందుకని నేను తరువాత రైల్లో వస్తానని చెప్పాను. "దీని కొరకై ప్రయాణం ఆపుకొంటావా"? అని బెడ్డింగ్ కట్టి, వద్దని చెప్పినా వినకుండా రైల్వేస్టేషన్‌కు తీసుకొని వచ్చారు. నేను చాలా సిగ్గుపడ్డాను. ఖమ్మం నుండి వెంకటాయపాలెం వెళ్ళాము. అక్కడ అందరికంటే ముందు తానే నిచ్చన ఎక్కి తోరణాలు మొదలైనవి కట్టడం మొదలు పెట్టారు. కార్యకర్తలంతా చాలా ఉత్సాహంతో పనిచేయటం మొదలుపెట్టారు. అధ్యక్షుడు సాధారణంగా పాటించే లాంఛనాలేవి ఆయన పట్టించుకోలేదు. ఇటువంటి సన్నివేశాలు ఎన్నో జరిగినవి.

మాట ఆయన ముందే అన్నారు. వారు అన్నమాటనే ఆయన ఉద్ఘాటించి "నేను చేతగానివాణ్ణే అభ్యర్థిగా నిలబడను" అన్నారు. ఆ తరువాత నేను ఆయనకు ఎంతో నచ్చచెప్పి అభ్యర్థిగా ఉపసంహరించబడ్డాను. అంతేకాదు అమాయకుణ్ణని ప్రచారం చేసుకోవద్దని చెప్పాను. అప్పటి నుండి ఆయన ఆ విధంగా ఇతరులను భ్రమింపచేయటం మానివేశాడు. ఒకసారి ఆంధ్ర జాతీయపక్ష మహాసభ పాలేరు సమీపంలోగల ఒక గ్రామంలో జరిపి ఖమ్మం వస్తున్నాం. తల్లంపాడు పోలీసుస్టేషన్ దగ్గర బస్సుకొరకై నిరీక్షిస్తూ నిలుచున్నాం. అక్కడనుండి విపరీతమైన ఎత్తుగల తాటిచెట్లు కనిపిస్తున్నాయి. వాటిని చూపిస్తూ, "అంత ఎత్తున జాతీయ పతాకం రెపరెపలాడుతుంటే చూడాలని కోరిక వున్నది. అంత ఎత్తున జెండా ఎగురవేసి చచ్చినా ఫరవాలేదు" అన్నాడు. పోలీసు యాక్షన్ తరువాత నేను భువనగిరిలో "ఆల్ హైదరాబాద్ కాంగ్రెస్ కమిటీ సమావేశం" జరిపించాను. అప్పుడు భువనగిరి సమీపంలోని ఒక గుట్టపైన జాతీయ పతాకాన్ని ఎగురవేశాను. అది కేశవరావుగారికి చూపి ఆయన తల్లంపాడులో అన్న మాట గుర్తుకు తెచ్చాను.

రాజకీయాల్లో ఊహించని అనేక సంగతులు జరగటం మామూలే. ఒక కొటిల్య తంత్రం కేశవరావుకి, నాకు గల అప్యాయతో కొంత యెడబాటు కల్పించింది. అయినా ఆయనతో నేను స్నేహం వదులు కోలేదు. పోలీసు చర్య తరువాత అసెంబ్లీ ఉప ఎన్నికలలో కేశవరావుగారికి స్థానం లభించినప్పటికి ఆయనను కొటిల్య తంత్రజ్ఞులే ఓడించారు. అప్పుడాయన వాస్తవాన్ని గ్రహించగలిగారు. హైదరాబాద్ వచ్చిన తరువాత ఆయనను కలుసుకొని మాట్లాడవలెనని వారి యింటికి వెళ్లాను. ఆయనకు నేను వచ్చిన వార్త తెలియగానే ఇవతలికి వచ్చి నన్ను క్షమించమని కోరాడు. "నీవు నాకు అన్నవు. నేను నీకంటే చిన్నవాడ్ని. క్షమించటమేమిటి"? అన్నప్పటికి వదలలేదు. చివరకు ఆయన ఆజ్ఞను పాటించాను. చాలా విషయాలు మాట్లాడుకున్నాము.

నేను ఆరోజులలో అజ్మీర్ ఇంటర్‌కు పరీక్షకు కూర్చున్నాను. పెద్దలు భండారు వీరమల్లు ప్రసాదరావుగారు, ఇంకొక మిత్రుడు కలిసి భోపాల్ వెళ్లాము మేము భోపాల్‌లో వుండగానే కేశవరావుగారి ఆకస్మిక మరణ వార్త తెలిసింది. చాల బాధపడ్డాను. నాటికి నేటికి కేశవరావు గారు నాకు పెద్దన్నయ్యే.



# 8. చరితార్థుడు, శాశ్వతయశఃకాయుడు

- శ్రీ కీ.శే. డోకిపర్తి. రామలింగం

న్యూఢిల్లీ సభ్యుడు తెలుగు సాహిత్య అకాడమి బోర్డు.
హైదరాబాద్.

సర్దార్ జమలాపురం కేశవరావుగారు తెలంగాణాకు చరిత్రను ఇచ్చిన మహాపురుషులు. మహాపురుషులలో కారణజన్ములనేవారు పురాణాలలో, ఇతిహాసాలలో చరిత్రలో ఉన్నారు. అట్టివారిలో కొందరు అవశ్యం జన్మించవలసినవారుగా, ఒక ప్రాంత చరిత్రలో తమ పాత్ర నిర్వహించవలసినవారుగా వుంటారు. అట్టివారు లేకపోతే ఆ చరిత్ర కుండవలసిన వైభవం, ఘనత కొరవడుతాయి. ఆ చరిత్రకు ఆ ఠీవి, ఆ ప్రజామోదం, ఆ రాణింపు ఉండవు. అటువంటి చారిత్రిక మహాపురుషులలో కేశవరావుగారు ఒకరు. వారు జమలాపురం వారి ఇంటిలో జన్మించడం ఆ వంశంవారు చేసుకొన్న పుణ్యం. శ్రీరాముడు 'ఇక్ష్వాకు' వంశంలో పుట్టి, ఆ వంశానికి ఎంతగొప్ప కీర్తిని తెచ్చాడో, కేశవరావుగారు జమలాపురం వారి ఇంటపుట్టి, ఆ వంశాన్ని దేశ రాజకీయ చరిత్రలో చిరస్థాయిగా ఉండేట్టు చేశారు. అంత సుకృతం ఎన్ని వంశాలకు వుంటుంది ?

హైదరాబాదు చరిత్రలో అత్యంత ప్రధానమైన ఘట్టంలో కేశవరావుగారి ఆవిర్భావం జరిగింది. ఏడవ నిజాం చరిత్రలో ఏ రాజూ ప్రవర్తించని విధంగా నిరంకుశంగా వ్యవహరించి తన రాజవంశానికి చరమదశను చేజేతులా తెచ్చుకోబోతున్నాడు. 'ప్రజా ఉద్యమం' మొదలైంది. కాని 'హైదరాబాదు సంస్థానం' కనీవినీ ఎరుగని 'ఫ్యూడల్ వ్యవస్థ'లో బహుకాలంగా మూగపోయి వుంది. ఇక తెలంగాణా ప్రాంతం పరిస్థితి చెప్పనక్కరలేదు. అది 'అంధయుగం'. పాపం, ప్రజలైతే ఉద్యమానికి అనుకూలులే. కాని ఆ దశలో కావలసిన వారు నాయకులు. కేవలం విద్యాధికులైన నాయకులు కాదు. దుస్తులు మాయకుండా, భోగజీవితం గడిపే మేధావులు మాత్రమే కాదు. పెద్ద చదువు లేకపోయినా, సామాన్య వంశంలో జన్మించిన వాడైనా, ధనంలేని వాడైనా, ఆయన అలా కనపడగానే, ఎంత పిరికి ప్రజలకైనా చావుకు సైతం తెగింపువచ్చే ధైర్యం ఆపాదించగల నాయకుడు ఆ దశలో అవసరమయ్యాడు. చిత్రమేమిటంటే, సరిగ్గా అటువంటి వ్యక్తికే ఆభద్రాద్రి సీతారామచంద్రమూర్తి జమలాపురంవారి వంశంలో జన్మింపజేశాడు. ఆయన ఆజానుబాహువు. స్ఫురద్రూపి. కళ్ళెత్తి ఎదుటి మనిషి వంక చూచాడంటే అవతలి మనిషిలో మొక్కవోని ధైర్యం సృష్టింప గలిగినవాడు. అకుంఠిత దీక్ష

పుట్టించగలవాడు. ఎంతటి మహాసమరానికైనా ఆయత్తం చేయగలిగిన వాడు. మట్టిలో నుంచి మాణిక్యాలను పుట్టించ గలిగినవాడు. అటువంటి వ్యక్తులు దేశంలో చరిత్రలో ఒక్కొక్క యుగంలో ఒకరు వుడతారు. వారు తమ సమకాలికులకంటె భిన్నులు. వారికక్కడ ఎందరో ఉండవచ్చుగాక. కాని ఆ ఒక్క వ్యక్తి లేకపోతే ఆవెలితి వెలితిగానే ఉండిపోయేది. భగవంతుడు ఆ వెలితి లేకుండా చేశాడు. కేశవరావుగారు ఏ ఉద్యోగమో చేసుకొని అందరు కుటుంబీకులకు మల్లే జీవితం వెళ్లబుచ్చకుండా, ఆయనను ప్రజాహిత జీవన రంగంలోకి ప్రవేశపెట్టాడు. ఆయనకు అగ్నిగుండంలోనైనా దూకే ధైర్యసాహసాలు ప్రసాదించాడు. ఎంతటి త్యాగానికైనా వెనుదీయని ఒక మహోవ్యక్తిత్వాన్ని ఇచ్చాడు. తన ప్రజలతో కలసిమెలసి వుండే సౌభ్రాతృత్వ భావాన్ని ఆయనకు పుష్కలంగా కలిగించాడు. ఒక గొంగడిపైన వేసుకొని వారిని ముందుకు నడిపించేటటువంటి ఒక విశిష్ట నాయకత్వ లక్షణాన్ని ఆయనకు నిలువెల్లా ఆపాదించాడు. అన్నిటికన్న అపురూపమైన సచ్ఛీలాన్ని ఆయనకు ప్రసాదించాడు. శ్రీరామునిలో ఎన్ని సుగుణాలున్నాయో, రాజకీయ నాయకుని పాత్ర ధరించిన కేశవరావుగారిలో అన్ని విశిష్టమైన గొప్పగుణాలు ఉండేవి. అవి వారి అనుచరులకు ఇట్టే దృగ్గోచరమయ్యేవి. రాముడు ఉన్న అయోధ్య సకల కళాశోభితమై ఉండేదట. అయోధ్యావాసులకు రాముని దర్శనమే ఉత్సాహం జవసత్వాలు కలుగజేసేదట. అలాగే కేశవరావు గారు ఆసీనులై ఉన్న సభ, వారు ముందుండి నడిపించిన ఉద్యమం ప్రజానీకాన్ని అయస్కాంతమువలె ఆకర్షించేది. ప్రజలు సముద్రపు అలలవలె ముందుకు దూసుకువచ్చి బండరాళ్లతోనైనా సరే ఢీకొనేవారు. ఆయన వెంటవెళ్ల నిప్పులో సైతం దూకడానికైనా వెనుదీసేవారు కారు. కందిలో జరిగిన చిట్టచివరి 'ఆంధ్రమహాసభ' జమలాపురం కేశవరావుగారిని అధ్యక్షులుగా పెట్టుకొని ముందు ముందు రాబోయే స్టేట్ కాంగ్రెసు మహోద్యమాన్ని తెలంగాణా నాయకులూ, ప్రజలూ సన్నద్ధులయ్యారు. ఆయన అధ్యక్షులుగా ఉన్న ఆ సభ ఎంత శోభించిందో అలాగే ఆయన 'సత్యాగ్రహియై, నిరంకుశ నిజాం ప్రభుత్వాన్ని సవాలుచేసి, రణరంగంలోకి ప్రవేశించి మహావీరుని వలె నిలబడినప్పుడు, అంధయుగం నుంచి బైటపడుతూవున్న తెలంగాణ సీమలో దిక్కులు తేజోవంతమయ్యాయి. కాంతి కిరణాలు భూమండలంపై ప్రసరించాయి. ప్రజలలో ఒక్కుమ్మడిగా చైతన్యం వెల్లివిరిసింది. దౌర్జన్యం అన్యాయం గుండెలు చాలక వెనుకంజవేశాయి. సామాన్యునికి ఎక్కడలేని ధైర్యం వచ్చింది. స్టేట్ కాంగ్రెస్ మహోద్యమం కార్చిచ్చువలె నిజాం రాష్ట్రమంతటా వ్యాపించి నిరంకుశులనూ, మతోన్మాదులనూ ప్రజావ్యతిరేకులనూ తబ్బిబ్బు చేసింది. నిజాం తాబేదార్లు కేశవరావుగారిని కారాగార నిర్బంధంలో వుంచి, వారిని అనేక ఇక్కట్లకు పాలుచేసి,

ఆయన నిర్భీకతపై దెబ్బతీయాలని చూచారు. కాని ఆ మరుగుజ్జుల ముందు ఆ మహాకాయుడు అచంలుడై నిలిచాడు. కేశవరావుగారి జైలు జీవితం ఒకపెద్ద అగ్నిపరీక్ష. ఆయన ఆ పరీక్షకు తట్టుకొని నిలిచి, తనను నిర్బంధించిన వారిని పిరికిపందలను చేసి, మహాబలుడై, మహావీరునివలె బైటికి వచ్చాడు. మేరునగధీరుడై రాజకీయ రంగంలో నిలిచాడు. స్టేట్ కాంగ్రెసుకు స్వామి రామానంద తీర్థవంటి నాయకుడు దొరకడం, స్వామిరామానంద తీర్థకు తెలంగాణా ప్రాంతంలో జమలాపురం కేశవరావుగారి వంటి మహాస్వాతంత్ర్య సమరయోధుడు లభించడం ఒక చారిత్రక విశేషం. దైవమే వీరిద్దరినీ కలిపి, ఈ సంస్థాన విమోచనానికి మార్గం సుకరం చేశాడు. కాబట్టే జవహరలాల్ నెహ్రూవంటి భారత స్వాతంత్ర్య సమర నాయకుడు కేశవరావుగారిని సరియైన రీతిలో అంచనా కట్టి, ఆయన్ను హృదయ పూర్వకంగా గౌరవించాడు. నెహ్రూ మెప్పును పూర్తిగా పొందిన హైదరాబాదు సంస్థాన కాంగ్రెసు నాయకులలో కేశవరావుగారు అగ్రేసరులని చెప్పడం యధార్థాన్ని వాక్రుచ్చడమే అవుతుంది.

కేశవరావుగారి త్యాగం వల్ల నిజాం రాష్ట్ర ప్రజలకు విమోచనం కలిగింది. కాని ఆయన తన త్యాగానికి తగిన పదవులు అనుభవించకుండానే స్వర్గీయులయ్యారు. కేవలం త్యాగాలతోనే జీవితం సమాప్తి చెందడం ఆయనను ధ్రువతారవలె నిలిపినట్లయింది. ఆయన మరింతగా శాశ్వత యశఃకాయుడయ్యాడు. కేశవరావుగారి తండ్రిగారైన కీ.శే. జమలాపురపు పెద్ద వెంకట్రామారావు గారు కుమారుడు రాజకీయోద్యమంలో కష్టాలను అనుభవించినందుకూ, వారి కుటుంబం ఇబ్బందులు పాలైనందుకూ లోలోపల మనఃక్లేశంతో నిశ్శబ్దంగా బాధపడేవారని చెబుతారు. అయోధ్యా మహారాజు దశరథుని అంతటివాడే శ్రీరామునికి పట్టిన అవస్థను తలచుకొని విలపించాడు. బహుశా వీరిద్దరి స్థితీ ఒకటేనేమో. ఇద్దరూ కుమారుల విషయంలో చివరి దశలో మనోవ్యథ అనుభవించారు. వారిని త్యాగం చేశారు. కోల్పోయారు. కాని తండ్రులు అంత మనోవ్యథకు గురి అవుతున్నారని తెలిసి వుండి కూడా తమ కర్తవ్య నిర్వహణకూ, తమ ధర్మ పరిపాలనకూ దీక్షా బద్ధులైన కుమారులిద్దరూ యహేతిహాసాలకు కారణభూతులైనారు. శ్రీరాముని స్థిరమైన నడవడి వల్ల లోకానికి ఒక ఆదర్శపురుషుడు ప్రాప్తించాడు. జమలాపురం కేశవరావుగారి త్యాగమయ జీవితం వల్ల హైదరాబాదు సంస్థాన ప్రజా ఉద్యమం విజయవంతం కావడమేకాక, ఈ ప్రాంతానికి చిరకాలం గుర్తు పెట్టుకోదగిన మహానాయకుడు లభించాడు. ఆయన అక్షరాలా చరితార్థుడు. శాశ్వత యశఃకాయుడు. ఆయనను దేశానికి ఇచ్చిన వంశం ధన్యతనొందింది. ఈ లోకంలో అంతకన్నా వాంఛనీయమైనది ఏమున్నది?



# 9. తెలంగాణా సర్దార్

- "స్వాతంత్ర్య దేవాలయ గోపురం సర్దార్ జమలాపురం"

- కీ.శే. డా. దాశరథి కృష్ణమాచార్యులుగారు

హైదరాబాద్

8-7-86

కళాప్రపూర్ణ,
కేంద్ర సాహిత్య అకాడమీ సభ్యులు,
ఆకాశవాణి, దూరదర్శిని గౌరవప్రయోక్త,
ఫిలిం సెన్సార్ బోర్డు సభ్యులు,
భారత ప్రభుత్వ సమూహగాన జాతీయోద్యమ కేంద్ర సమితి సభ్యులు.

గర్వంగా చెప్పకోవలసిన విషయాలు కొన్ని వుంటాయి. "నేను గాంధీ మహాత్ముణ్ణి కళ్ళారా చూశాను" అని ఒక వ్యక్తి మురిసిపోతాడు. "అయ్యో ! నేను మహాత్ముణ్ణి చూడలేక పోయానే" అని మరొకడు వాపోతాడు. ఆయన అస్తమించే నాటికి పుట్టనైనా పుట్టనివారూ, కడుబాల్య దశలో వున్న వాళ్ళ సంగతి వదిలివేయండి. నా వరకు నేను, 1945 ప్రాంతంలో మహాత్ముడు ఖమ్మం మీదుగా రైల్లో ప్రయాణం చేస్తూవున్నప్పడు దర్శించుకున్నాను. ఒంటి రెక్కవద్ద ఆయన రెండు పెట్టెల బండి ఆగింది. జైలు నుంచి విడుదలైన తరువాత దక్షిణాది రావడం, ఖమ్మంలో ఆగడం, రాజకీయ ప్రసంగాల మీద నిజాం ప్రభుత్వం నిషేధం పెట్టింది గనుక " సోదర సోదరీ మణులారా! దేశ సమైక్యత కోసం హిందీ నేర్చుకోండి" అని ఏకవాక్యోపన్యాసం చేసి గాంధీజీ తన ప్రసంగాన్ని ముగించడం, మహిళలు బంగారు గాజులు, తుదకు 'తాళి బొట్లు' సైతం ఆయన పాదాల వద్ద వుంచడం కళ్ళారా చూచాను. అప్పడు నావయస్సు చాలా తక్కువే, అయినా ఇవన్నీ జ్ఞాపకం వున్నాయి.

"అలాగే సర్దార్ జమలాపురం కేశవరావుగారితో కలిసి నిజాం వ్యతిరేక స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్నాను". అని గర్వంగా నేను చెప్పకోగలుగుతున్నాను. నా మిత్రులు చెప్పకోగలుగుతున్నారు.

"స్వాతంత్ర్య దేవాలయ
జాజ్వల్యమాన గోపురం
సర్దార్ జమలాపురం"

ఆయన మహావీరుడు. అహింసామూర్తి. గాంధేయవాది. ఆయనతో కూడా అనేక గ్రామాలు పర్యటించగలిగాను. వరంగల్లు సెంట్రల్ జైల్లో వున్నాను.

జమలాపురం కేశవరావుగారి జీవిత చరిత్ర రచించడమేగాక ఆయన ప్రసంగాలను గూడా సేకరించి ప్రచురించాడు నామిత్రుడు. హీరాలాల్ మోరియా. కేశవరావుగారి జీవిత విశేషాలను లోకానికి తెలియజెప్పడానికి ఆయన చేసిన ప్రయత్నం నిరుపమానం.

ఇప్పడు మిత్రులు జమలాపురం గోపాలకిషన్‌రావుగారు మరో దృక్కోణం నుంచి కేశవరావుగారు సమగ్ర జీవిత చరిత్ర రచనకు పూసుకున్నారు. నా అభినందనలు.

సర్దార్ కేశవరావు గారిని గురించి ఎన్ని పుస్తకాలైనా వెలువడవచ్చు. గాంధీజీని గురించి ఎందరు వ్రాయలేదు ?

నిజమైన సర్దార్, మా జమలాపురం కేశవరావుగారు. ఆయన అనుచర వర్గంలో ఎందరో వుండేవారు. ప్రాణాలు ఇవ్వమంటే ఇవ్వగల తెగువ గలవారు.

తెలంగాణాలోని ప్రజలలో స్వాతంత్ర్య చైతన్యం కలిగించిన కొద్ది మందిలో సర్దార్ కేశవరావుగారొకరు.

ఆయన సంతత సమరశీలి. దయాశాలి. పదవులు కాంక్షించని వాడు. పోరాటమే ఆయన ఊపిరి. అటువంటి వ్యక్తులు కోటికి ఒక్కరైనా వుంటారా ? అనుమానమే.

ఆయనకు కవులు, కళాకారులు అంటే చాలా అభిమానం.

"త్యాగానికి ప్రతిరూపం.
సర్దార్ జమలాపురం."



భక్తులు కానీ, శక్తివంతులుకానీ, రక్తులు కానీ,
యుక్తిపరులు కానీ, ముక్తులు కానీ - ఎవ్వరైనా
వారి వారి కర్మలు, వారి వారి విశ్వాసములు
వారికి రక్షగా, శిక్షగా ఉంటాయి.
వారి వారి ప్రార్థనలే వారిని రక్షిస్తాయి.
భగవంతుడు కేవలం సాక్షిభూతుడు.



# 10. "తెలంగాణా స్వాతంత్రోద్యమంలో మన సర్దార్ జమలాపురం"

- కీ.శే. మల్లెం రామారావుగారు
స్వాతంత్ర్య సమరయోధులు, రాయపట్నం,
మధిర మండలం ఖమ్మం జిల్లా ఆంధ్రప్రదేశ్

అది 1939వ, సంవత్సర మనుకుంటాను. 'అఖిల భారత కాంగ్రెసు' బ్రిటీషు ప్రభుత్వమును, దేశ సంపూర్ణ స్వాతంత్ర్యమును అభ్యర్థించుచూ హోరాహోరీ పోరాడుచున్న సమయము. ప్రజల పక్షమున 'హైదరాబాద్ సంస్థాన కాంగ్రెస్' కూడ స్థానిక ప్రభుత్వమును, కనీసము ప్రజా ప్రాతినిధ్యము వహించు 'బాధ్యతాయుత ప్రభుత్వ స్థాపనకైన' అంగీకరించ వలసినదిగా తీర్మాన రూపమున అభ్యర్థించుటయు, ప్రభుత్వము నిర్ద్వందముగా ప్రతిఘటించుటతో 'కాంగ్రెస్ సంస్థనే' నిషేదించుటతో ఆరంభమైనది 'సత్యాగ్రహోద్యమము'.

నిజాం ప్రభుత్వం మహోద్యమములో పరిమిత సంఖ్యలో ప్రముఖులు మాత్రము ముగ్గురు నలుగురు అనుచరులతో జట్లు జట్లుగా తమ తమ తాలుకా జిల్లా కేంద్రాలలో అహింసాయుతముగా, ప్రభుత్వ చర్యకు నిరసనగా 'సత్యాగ్రహము' చేయుటకు ఆదేశింపబడియుండిరి.

ఆ ఆదేశమును అవగాహనచేసుకొనిన మన కేశవరావుగారు తను చేయుచున్న ప్రభుత్వోద్యోగమునకు తిలోదకము లిచ్చి (రాజీనామాచేసి) ఉత్సాహోద్రేకము ముప్పిరి గీన, తాలూకా కేంద్రమైన మధిర ప్రవేశించి, అనుయాయులను సమీకరించుకొని, అధిష్ఠాన వర్గము అనుమతి పొంది ముందుగా తెలియపరచిన గడువు ప్రకారము నిర్ణీత ప్రదేశములో 'సత్యాగ్రము' జరిపి అనుయాయులైన 1) శ్రీ వట్టికొండ రామకోటయ్య, మధిర. 2) శ్రీ వాశిరెడ్డి వెంకటపతి, అల్లీనగరం. 3) శ్రీ వట్టికొండ నాగేశ్వరరావు, అల్లీనగరం యుక్తంగా నిర్బంధించబడిరి. న్యాయస్థానములో ప్రవేశపెట్టబడిరి. విచారణకు వాయిదా నిర్ణయము కాబడినది. కాని ఆ రోజు ప్రజలకు న్యాయస్థానము లోపలికి వెళ్లుటకు అనుమతి లభించలేదు. న్యాయస్థాన తీర్పుల ప్రకారం వారలు సెంట్రల్ జైలుకు పంపబడిరి. సంస్థాన స్థాయి 7 లేక 8 వందలమంది నిర్బందింపబడినదరిమలా పైవారి ఆదేశానుసారము 'సత్యాగ్రహోద్యమము' నిలిపివేయబడినది.

కేవలము పరీక్షార్థము నిర్బంధింపబడిన వెనువెంటనే ఉద్యమ విరమణను ప్రభుత్వము తమ అసాధారణ అణచివేత చర్య ప్రభావమని సంతసించి యుండవచ్చు. కాని ప్రజలు అందు ముఖ్యముగా సాధారణ విద్యా పరిజ్ఞానము యున్న యువకులు ఉద్యమ స్వభావమునందాకర్షితులై తమ భావోద్వేగము ప్రకటించుటకొను సమయమునకై నిరీక్షించుచుండిరి. ఉద్యమము గుప్త మార్గమున గ్రామ గ్రామము, వాడవాడల విస్తరించుటలో అధిక భాగము పోలీసు శాఖయే తోడ్పడినదనిన అతిశయోక్తి కాదేమో. ఏది నిషిద్ధమందురో దానికి అర్రులు చాచి ఆకర్షితులౌట మానవనైజము. అయినను ఆనాడు రాజకీయములలో ప్రవేశమనిన నేటివలె వ్యాపార సరళి కాదు. 'సర్వ సంగ పరిత్యాగము', 'నిష్కామ కర్మ'ల మూలాధారముగా దేశపిత గాంధీజీ మూల సూత్రములలో కొన్నిటినైనను ఆచరణలో పెట్టనిదే కాంగ్రెస్ కార్యకర్తగా గుర్తింపబడువాడు కాదు. ఎందరో మహానుభావులు తమ వేలాది నెలసరి ఆదాయమును కాలదన్ని జైళ్ల పాలగుటయూ, మరికొందరు తమకున్న ఉద్యోగవసతులకు తిలోదకములనిచ్చి భార్యా బిడ్డల గోడులను సరకు చేయక రాజకీయ ప్రవేశమునకు ఉవ్విళ్లూరుచుండిరి. ఇలాంటి క్లిష్ట వాతావరణమును గుర్తించియూ ప్రజానీకము ముందడుగు వేయుచున్నదనిన నైతిక విలువలు కలిగిన సత్యాగ్రహోద్యమ ప్రభావము కాదా ? ప్రజలు తాము గుర్తెరుగని 'ప్రాంతీయ తొలి త్యాగశీలి'ని నాయకునిగా భావించి తమ హృదయ కమలములలో ఆరాధించు చుండెరనిన ఉద్యమ ప్రభావం కాదా? ప్రతి గ్రామములో సహితము ఉద్యమము యొక్క అంతరంగ ప్రేమ, బహిరంగ భయము ద్యోతకమగుచుండెడిది.

శిక్షానంతరము బయటపడిన మన కేశవరావుగారికి రాజకీయమంతయు అగమ్య గోచరముగా కన్పించెను. కాంగ్రెస్ వ్యవస్థ నిషేధావస్థలో నుండెను. కొందరు ప్రముఖులు పూర్వావస్థలోనికి దిగజారి రాజకీయములను [illegible] 'ఆంధ్ర జన సంఘము' పునరుద్ధరణయే ప్రస్తుత కర్తవ్యముగా భావించుచుండిరి. ఇందు రాజకీయములకు తావు లేదు. విద్యా వైద్య సాంఘిక, సంస్కృతి [illegible] విషయముల్లో ప్రజల విజ్ఞప్తులను ప్రభుత్వము పరిశీలించగలదని మాత్రము ప్రభుత్వానుమతి లభింపబడియున్నది. ఏ విధమైన ఫలిత [illegible] యీ సంఘము ద్వారా సాధించగలిగేది ఏమీ యుండదని కొందరు యువక ప్రముఖులు యిది 'తిరోగమన' చర్య కాగలదని నిరసించుచుండిరి.

ఆంధ్ర జన సంఘ అత్యవసర సమావేశము జరుపబడి అందు [illegible] అగ్రశ్రేణి వృద్ధ, యువ నాయకులు సందేహములు [illegible] రాజకీయ

వాతావరణము ననుసరించి ఆంధ్రజన సంఘమే పరమావధిగా ప్రచార రూపమున ప్రజానీకమును చైతన్య ఉత్తేజితుల నొనర్చుటకన్న మార్గాంతరము లేదని నిర్ణయము చేసిరి. ఈ నిర్ణయము మన నాయకాగ్రణి కేశవరావుగారిని విపరీతముగా ఆకర్షించినది.

అగ్రశ్రేణి ప్రముఖ నాయకులు శ్రీ మాడపాటి హనుమంతరావు, శ్రీ కొండా వెంకట రంగారెడ్డి, శ్రీ బూర్గుల రామక్రిష్ణారావు, శ్రీ ముందుముల నరిసింగరావు (రైతు పత్రికాధిపతులు), శ్రీ మందుమూల రామచంద్రరావు, శ్రీ రావినారాయణ రెడ్డి, శ్రీ బద్దం ఎల్లారెడ్డి, శ్రీ మేల్కొటే, శ్రీ బిందు, శ్రీ పూల్‌చంద్ గాంధి మరియు జిల్లా నాయకులు శ్రీ మాదిరాజు రామకోటేశ్వరావు, శ్రీ హయగ్రీవాచారి, శ్రీ కోదాటి నారాయణరావు, శ్రీ ఉమ్మెత్తల కేశవరావు, శ్రీ కొలిపాక కిషన్‌రావు మొదలగు వారు 'ఆంధ్రజన సంఘీయులు'గా ప్రచారోన్ముఖులైరి.

ఈ సందర్భములో మన కేశవరావుగారు కూడా 'ఆంధ్రజన సంఘం' ప్రాథమిక సభ్యత్వ ఫారముల కట్టలతో మధిరకు స్వర్గీయ మిరియాల నారాయణ గుప్తగారి యింటికి విచ్చేసిరి. స్థానిక ప్రముఖులతో పాటు ఆయన గారి రాకకై చకోర పక్షులవలె నిరీక్షించుచున్న చుట్టు ప్రక్కల గ్రామాదులలోని యువకులమైన మేమంతా ఘనంగా స్వాగతమొసంగితిమి. ప్రతి ఒక్కరితో విడివిడిగా పరిచయానంతరము వారి కొరకై ఏర్పరిచిన ఆసనము వదిలి మా ప్రక్కన అసీనులై తమ 'నిరాడంబరత'ను వెల్లడించిరి. పరిచయ భాగ్యము లభించినందున మేమిల్లరు సంతృప్తి జెందుటయేగాక వారిని తమ ఆత్మీయునిగా భావించసాగిరి. అనంతరము సంఘ ఆశయము తద్వారా సాధింపదలిచిన ఫలితములను ఏకరువు పెట్టుచూ "నాపైనున్న యీ బరువు భారమును మోయుటలో భాగస్వాములై మీ గ్రామాదులలో విరివిరిగా ప్రచారము జరిపి ప్రజలను చైతన్యవంతులుగా నొనర్చుటయే మీ కర్తవ్యముగా భావించి సభ్యత్వము పూర్తి చేయండి. నేనునూ తాలూకా స్థాయి గ్రామాదుల ప్రజానీకమును కలియుచు ఆయా ప్రాంత స్థానికులైన మీలాంటి ఉత్సాహవంతులైన యువకుల సమీకరించి నాపై నున్న బరువు బాధ్యతులలో కొంత భాగము వారి పరము జేసి కార్య నిర్వహణను పరిశీలించుచూ ప్రచార పర్యటనను కొనసాగించుచుండగలను. ఈ పరిస్థితులలో ఎవరికి ఎలాంటి సందేహములు, అనుమానములు, ఆటంకములు కలిగినను వాటి నివృత్తికి గాను మనము ప్రతినెలా సమావేశము మధిర కూడలి స్థలముగా నిర్ణయించుకుందాము" అని ముగించిరి.

'తాలూకా పర్యాటకుల'లో నేనొకనిగా వారి వెంట ఉండు భాగ్యము లభించినందున వారి స్వీయ గుణగణములను, నీతి నియమములను, భాషా సరళిని, నిరాడంబరతను కొంతవరకైను అవగాహన చేసుకొనిగలిగితినను నమ్మకమున్నది.

పరిపూర్ణ అంగ సౌష్టవము కలిగిన ఆజాను బాహువిగ్రహుడు. జైలు జీవితానంతరము ఆరోగ్యము, కొంత దెబ్బతిని మల బద్ధక మేర్పడి అధిక ధూమపానములకలవాటు పడినాడు. విద్యార్థి దశ ముగియక పూర్వమే బి.ఏలో యుండగా పెద్దల ప్రయత్నము వలన ప్రభుత్వము కరోడ్గిరి (కస్టమ్స్) శాఖలో ఆడిటర్ ఉద్యోగము లభించుటతో విద్యకు స్వస్తి జరిగినది. అట్టి ఉద్యోగ విరమణయే తండ్రి యొక్క నిరాదరణకు, నిరసనకు కారణభూతమై , అన్ని వసతులు కలిగియు భార్యాబిడ్డల ఉనికికి భంగము వాటిల్లినను సరకు చేయక, తన విద్యుక్తము కనందనురక్తుడై వ్యవహరించినాడు. తన మూలమున ఇతరులు బాధ పడకూడదనే మనస్తత్వము కలవాడు. గాన పర్యటనలో ఉపవాసములు కూడా తటస్థించుచుండెడివి. తన వస్త్రములను తానే శుభ్రపరచుకొనువాడు. తోటి కార్యకర్తలు చొరవ చూపినను ఆమోదించువాడుకాడు. మార్గమధ్యమమున ఏవాగులోనో, ఏ మడుగులోనో బండ్లు దిగబడి ఒడ్డుకు చేరలేని స్థితి కనిపించినా "నోరు లేని ఎడ్లను భాదించవద్దు", అని చెప్పచూ వెంటనే చొక్కావిడిచి, ధోతీని మడిచి, పైకె బిగ కట్టి, తుండుగుడ్డను భుజముపై అమర్చుకొని, చక్రపు ఆకులను మోటించి, 'హుమ్మని' త్రోయుట ఆయనగారికి ఒక సరదాగా యుండెడిది. ఇది సహజ చర్యయే అయినా దీని ప్రభావము మాత్రము వర్ణనాతీతము., ఈ చర్య చుట్టు ప్రక్కల గ్రామాదులలో ప్రాకిపోయి ప్రజల తండోపతండాలుగా విచ్చేసి తమతమ గ్రామాలకు రమ్మని ఆహ్వానింప సాగిరి.

కేశవరావు గారి భాషా సరళిపామరజనావళిని కూడా ఆకర్షితుల చేయుచుండెడిది. విద్యాధికులున్న పట్టణవాసులకు మొరటుగాతో చెడెదనిన ఆయనగారిని కించపరుచుటగా భావించగూడదు. కారణమేమన విద్యాధికులు సహజచైతన్యులు. సాధారణ ప్రజానీకము నుత్తేజితుల నొనర్చుటకు వారికర్థమయ్యే భాషా సరళిని ఉపయోగించుటయే ఉత్తమ మార్గమని ఒప్పకొనక తప్పదు.

నిరాడంబరతను గురించి ఏమని కొనయాడవలయునో, బోధపడదు. నాయకత్వ దర్పమన నేమియో ఆయన గుర్తించినట్లు కూడా తోచదు. లెదర్ బ్యాగులు, లేవు. వైరు బ్యాగులు లేవు, బెడ్డింగులు లేవు. కనీసం మూడవ ధోతీగాని, చొక్కాగాని, తుండు గాని వెంటనుండెడిదికాదు. 'నిజామాబాద్ గొంగళి'మాత్రం

అంటిపెట్టుకొని యుండెడిది. నలుగురిలో తనను గౌరవించుట, సత్కరించుట, పుష్పమాలాలంకృతిని చేయుటను ఏవగించుకొనువాడు. ప్రజలు కలిసిమెలిసి తిరిగి తినుటయే ఆయనగారికి సరదా. తనకై ప్రత్యేకతను ఆమోదించెడివాడు కాడు. అదియుగాక ఆయన పెద్ద మోహమాటి. అభిమాన దురంధరుడు. గాన సన్నిహితులను కూడా ఏ విషయములోను అభ్యర్థించుట అనునది ఎరుగడు.

ఈ ప్రచారోద్యమ ప్రభావము దీని నానుకొన్న బూర్గుంపాడు, పాలవంచ, ఇల్లెందు, ఖమ్మం తాలూకాలకు వ్యాప్తి చెందుటయే కాక పరిసర జిల్లా లోని హుజూర్‌నగర్, సూర్యాపేటలకు కూడా వ్యాపించి జిల్లాల స్థాయికి పరిణతి చెందినది. నాయకత్వ పునాదులు ధృడపడ సాగినవి.

ఇదే సమయులో 'ఆంధ్రజన సంఘము' వార్షికోత్సవములు ఆహ్వానము లందుకొని వెళ్ళి అంతవరకు తాము నిర్వహించిన కార్యక్రమ నివేదిక నందజేసిరి. దీనిని అంతా శ్లాఘించిరి. కార్యదీక్షతను కొనియాడిరి. అందులో సమావేశమునకు విచ్చేసిన నాయకమ్మన్యులలో నాయకత్వ విషయములో భేదాభిప్రాయములు ఏర్పడి అతివాద, మితవాడ వర్గములుగా చీలిపోయిరి. వృద్ధ నాయకులు మితవాదులుగాను, యువనాయకులు అతి వాదులుగాను మారిరి. అపుడే కాంగ్రెస్, కమ్యూనిష్టు పార్టీల అంకుర్వారణ జరిగి ఒకరినొకరు దూషించుకొనుట అరంభమైనది. ఆమితవాదులవైపు నుండి మన యువనాయకుడు కేశవరావు గారికి 'సర్దార్' అనుబిరుదు ప్రదానం చేసి 'ఆంధ్ర మహాసభ'గా సంస్థకు నామకరణమిడి, అధ్యక్షునిగా సర్దార్‌జీని సభాముఖమున ఏకగ్రీవానుమోదము తీర్మానము చేసిరి. అతివాదులు తమ అధ్యక్షునిగా శ్రీవారిని నిర్ణయించుకొని ప్రజాముఖమున ఆమోద తీర్మానము ఏకగ్రీవముగా అంగీకరించిరి. ఉభయ సంఘములు పోటీ పడి తమ విధ్యుక్తములు నిర్వహించసాగిరి. స్వరాజ్య సముపార్జనలో ప్రజల భాగస్వాములు చేసి వారి సహాయ సహకారము లందుకొంచుచూ నిస్వార్థ ప్రజాసేవయే వారి పరమావధిగా వ్యవహరింపసాగిరి. అపుడు మన సర్దార్‌జీకి తెలంగాణా జిల్లా ప్రచార బరువు బాధ్యతలు కూడా శిరోధార్యమయినందున నిర్విరామ, అవిశ్రాంత కృషి అవసరమయినది. ఇది ఆయనగారికి అభిలషణీయమే అయినందున ద్విగుణీకృతోత్సాహముతో విధ్యుక్తము నిర్వహింపసాగిరి. కాలక్రమేణా తెలంగాణా ఏకైకా నాయకుని స్థాయికి ఎదిగి పోయినాడేకాని,, తనను తాను సాధారణ కార్యకర్తగానే భావించుచుండువాడు. ఈ సందర్భములోనే తన స్వగ్రామములో (ఎఱ్ఱుపాలెంలో) నివాసియైన శ్రీ మాడపాటి రామచంద్రరావు గారితో సన్నిహితత్వము సమకూడినది. వీరు శ్రీ

మాడపాటి హనుమంతరావుగారి అగ్రజుడైన శ్రీ మాడపాటి తిరుమల రావుగారి ఏకైక పుత్రుడు, 'బార్‌ఎట్‌లా' పూర్తిచేసి కాంగ్రెస్ అభిమాని, సంస్కరణ వాది బ్రిటిష్ ఆంధ్ర కాంగ్రెస్ నాయకుల సాంగత్యములో పరిపూర్ణ రాజకీయ పరిజ్ఞానము కలిగిన భాషాకోవిదుడు. ఉభయుల మధ్య గురుశిష్యుల భావమలవడినది. శ్రీ బొమ్మకంటి సత్యనారాయణ రావు గారిలాంటి వారెందరో తాము చేయుచున్న ప్రభుత్వోద్యోగములకు తిలోదకములిచ్చి, రాజకీయ రంగములో ప్రవేశించిరి. ఎందరో ప్లీడర్లు, డాక్టర్లు, తదితరులు తమ వృత్తులకు స్వస్తి చెప్పి రంగప్రవేశమయిరి. ప్రభుత్వముతో ఢీకొనుటకు రంగము బలపడి, నాయకులు సమయమునకై వేచియుండిరి. అఖిల భారత కాంగ్రెస్ తన పోరాటమును నిర్విరామము కొనసాగించుచునేయున్నది. 'ఉప్పు సత్యాగ్రహము', 'సహాయ నిరాకరణోద్యమము', పన్నుల నిరాకరణోద్యమము, 'సైమన్ కమీషన్ బహిష్కరణ', 'క్రిప్స్ రాయభార విఫలము', మొదలగు ఉద్యమములలో ప్రజలు శాంతియుతంగా వ్యవహరించినను బార్డోలీలో (చౌరాచోరి) పంజాబులో మాత్రము ప్రభుత్వము 'దమనకాండ' ప్రయోగించి వేలమందిని బలిగొన్నది. దీనితో 'హింసావాదము' ప్రబలినది. కాంగ్రెస్ నుండి అతివాదులనబడే యువకులు కమ్యూనిష్టులుగా, సోషలిస్టులుగా టెర్రరిష్టులుగా మార్పుచెంది వివిధ 'విప్లవ సంస్థలు' ఉత్పన్నమయినవి. 1942 సం॥లో జర్మనీ, ఇటలీ, జపాన్ కూటంగా (నాజీయిజం) ప్రపంచ రాజ్యముల ఆక్రమణకై యుద్ధ మారంభించి యూరప్ ఖండ ఆక్రమణ ఆరంభమైనది.

బ్రిటీషు ప్రభుత్వము భారతదేశము నుండి ఆర్థిక, సైనిక సేకరణ అభిలంషించుచూ యుద్ధానంతరము మీ సమస్య ఆలోచించగలమని కాంగ్రెస్ వారికి హామీ ఇచ్చిరి. దీనిని తర్కించుకొనుటకు సమావేశమైన అగ్రనాయకులందరిని ఒక పర్యాయము నిర్ణందించుటలో 'క్విట్ ఇండియా' తీర్మానము అచరణీయముగా బయటపడినది. అనగా తీర్మానమునకు తుది యిచ్చిన సవరణ జరిగియుండలేదు. శ్వేత జాతీయులు భారత దేశమును వదిలి వెళ్లాలనే సారాంశముగా నిర్వచన జరిగినది. నాయకులు జైలుకు వెళ్లుచూ 'జరుగబోవు ప్రతిఘటనకు ప్రభుత్వమే బాధ్యత వహించవలసియుంటుంది. మీకు గాని సంస్థను గాని ఎలాంటి బాధ్యత ఉండబోదని' నొక్కి వక్కాణించిరి. దీనితో 'విప్లవ' భావోద్వేగములు కలిగిన యువకులకు తమ 'ప్రతీకార వాంఛ' యీడేర్చుకొనుటకు అవకాశమేర్పడి భగత్ సింగ్, సుభాష్ చంద్రబోస్ లాంటి ప్రముఖులు ఆత్మాహుతికి సిద్ధపడి బహిరంగముగా ప్రతిఘటనలు సలిపి తన

అసువులను కోల్పోయిరి. మరెందరో ప్రముఖులు ప్రజల అండదండలతో అజ్ఞాతులుగా యుండి ప్రభుత్వమునకు నష్టదాయకమయిన ప్రతిఘటనోద్యమములు నిర్వహింపసాగిరి. సాముహిక జరీమానాలు, శిక్షలను ప్రజలు సరకుచేయక పోవుటతో ప్రభుత్వము ఎన్నియో అవాంతరములు ప్రతిఘటనలు ఎదుర్కొనవలిసి వచ్చినది. అరాజకము తాండవింపసాగెను. దీనితో ప్రభుత్వము చేసిన పొరపాటును గుర్తించి కాంగ్రెస్ నాయకుల విడుదల చేయుచూ, 'యుద్ధానంతరము మీ అభీష్టము మేరకు ఇండియా మీ పరము చేయగలమని' వాగ్దానము పునరుద్ఘాటించిరి. అనతికాలంలోనే యుద్ధము పరిసమాప్తమైనది. అమెరికా, రష్యా, బ్రిటన్, ఫ్రాన్స్ మిత్ర రాజ్యకూటమిని విజయశ్రీ వరించింది. అసమయమైన 'నాజీ కూటమి' తప్ప మిగతా రాజ్యములన్నియు ప్రపంచ వ్యాప్తముగా విజయోత్సవాలు జరుపు కొనుచున్నవి. కాని బ్రిటీషు ప్రభుత్వము యుద్ధానంతరము విరామము పొందియు, ఎన్నికల సాకు చూపుతూ కాలహరణము చేయసాగిరి. వలసతత్వ వాంఛతను వదలు కొనలేకయు దేశవిచ్ఛితికి అనైక్యతకు కారణభూతములైన హిందూ మహ్మదీయుల అనైక్యతను, హరిజన హరిజనేతరులకు మధ్య విబేధములు, సిక్కులకు ప్రాతినిధ్యము, సంస్థానాధీశుల స్వతంత్ర్య ప్రతిపత్తిలాంటి అనేక సమస్యలకు ప్రేరణ నిచ్చి పరిష్కారమునకు వ్యవధి కోరిరి. కాంగ్రెస్ నాయకులు స్వయముగా నడుము గట్టి 'సంఘ సంస్కరణల' ద్వారా హరిజన సమస్యను కోరికలను ఆమోదించుతూ సిక్కు సమస్య పరిష్కరించుకొనిరి. కాని మహ్మదీయుల మొండి పట్టుదల వల్ల దేశ విచ్ఛితికి ఆమోదించక తప్పలేదు. 1947 ప్రవేశించినది. బ్రిటన్‌లో 'కన్సర్వేటివ్' ఓడిపోయినది. 'లేబర్ పార్టీ' అధికారములోనికి వచ్చినది. అదే సంవత్సరము ఆగస్టు 15వ తేదీన భారతదేశమును రెండు ముక్కలు చేసి మహ్మదీయుల భాగమును మహ్మదాలి జిన్నా నాయకత్వమున 'పాకిస్తాన్' అనియు మిగతా భాగమును 'ఇండియన్ యూనియన్'గా సంపూర్ణ హక్కులతో రాజ్యాధికారము ప్రసాదించి బ్రిటీషు ప్రభుత్వము వైదొలగినది. ఇండియన్ భవితవ్యము 'కాంగ్రెస్ ప్రభుత్వము' పై ఆధారపడియున్నది.

సరిహద్దు తగాదాలను, మత సంఘర్షణను ఎలాగో పరిష్కరించుకొన గలిగినది. దేశ నలుమూలలా వ్యాపించియున్న 500 చిన్న పెద్ద సంస్థానముల సమస్య, కొందరి పెద్ద సంస్థానాధీశుల 'స్వతంత్ర్య ప్రతిపత్తి అధికారము' ప్రభుత్వమునకు కొరకరాని కొయ్యగా తయారైనది. పాలనా దక్షుడైన సర్దార్

వల్లభాయి పటేల్ హోం శాఖామాత్యులు. ఆయనగారు కడు సమర్థతతో చతురోపాయములనుపయోగించి 'రాజభరణముల' పేరట కొందరిని, పదవీ వ్యామోహముతో కొందరిని, వివిధ ఆర్థిక ప్రలోభములను, భయములకు గురి చేసి మరికొందరిని, ఆకట్టుకొని మొత్తము మీద సంస్థానాధీశుల సమస్యను నిశ్శేషమొనర్చిరి. కాని రెండు పెద్ద సంస్థానములు 1. హైదరాబాదు 2. కాశ్మీర్ సంస్థానములు పరస్పర విరుద్ధమైనవిగా మిగిలిపోయినవి. హైదరాబాద్‌లో నూటికి 85 మంది హిందువులు 12 మంది మహ్మదీయులు. రాజు మహ్మదీయుడు కాగా, కాశ్మీరులో 100కి 80 మంది మహ్మదీయులు, 20 మంది మహ్మదీయేతరులు ప్రజలు, రాజు సిక్కు, ప్రస్తుతము మనకు హైదరాబాద్ సంస్థాన భవితవ్యానికి అవసరము గాన దానిని గూర్చియే వివరణకు ప్రయత్నించుదాము.

భారత ప్రభుత్వమునకు దేశ నడిబొడ్డున యున్న హైదరాబాద్ సంస్థాన విలీనీకరణము కొరకరాని కొయ్యగా తయారైంది. సామ, దానము విఫలమైనవి. భేద, దండోపాయములే శరణ్యములై శుభ సమయము కొరకు వేచియున్నవి. 'అఖిల భారత కాంగ్రెస్ సంస్థానాధ్యక్షుడు' శ్రీ భోగరాజు పట్టాభి శీతారామయ్య గారు నిషేధావస్థలో నున్న కాంగ్రెస్‌ను పునరుద్ధరించి 'విలీనోద్యమము' పేర 'అహింసా యుత సత్యాగ్రహమున'కు అనుమతి నొసంగిరి. శ్రీ స్వామి రామానందతీర్థ అధ్యక్షస్థాన మలంకరించుటకు అంగీకరించిరి. మహారాష్ట్రకు చెందిన ఈ కార్యదక్షుడు యం.ఏ. పట్టాపొంది విప్లవ భావములు కలిగిన బ్రహ్మచారి. సర్వసంగ పరిత్యాగియైన త్యాగధనుడు. పూర్వ కాంగ్రెస్ వారలను సమీకరించుకొని ఉద్యమమునకు ఆయత్తపరుచుటను ప్రభుత్వము గుర్తించి ముందు జాగ్రత్త చర్యగా పోలీసుశాఖకు విపరీత, విశేష అధికారముల నొసంగి అప్రమత్తులుగా నొనర్చిరి. ఒక సంస్థానముస్లింలు అధిక సంఖ్యాకులు మతతత్వమును జీర్ణించుకొని 'ఇత్తేహాదుల్ ముసల్మాన్ సంస్థ' అధీనులై పాకిస్తాన్ అధ్యక్షుడు మహ్మదాలీ జిన్నాను సమర్థించుచూ, రాజకీయమునకు బ్రిటీషు ప్రభుత్వము ప్రసాదించిన 'స్వతంత్ర ప్రతిపత్తి' నాధారముగా వ్యవహరించుటకు వీలులేని పరిస్థితిలో పాకిస్తాన్‌లో చేరవలయునే గాని హిందూ రాజ్యమైన భారత యూనియన్‌లో చేరరాదని నిర్ణవాందముగా ప్రకటించిరి. పాకిస్తాన్ నేతతో మంతనము లారంభించిరి. ఈ ఆశయములతో కట్టుబడని తీరుకు హిందువులతో పాటు ప్రభుత్వమును కూడా అంతము చేసి పూర్వ ముస్లిం రాజవైభోగములను ప్రతిష్ఠించగలమని బహిరంగముగా ప్రకటించిరి. ఆశయ సాధనలో భాగంగా

ఖాసిందజ్వే నాయకత్వమున 'రజాకార్ల సంస్థను' స్థాపించి స్థానిక ముస్లిం యువకులకు సైనిక శిక్షణ ఆరంభించిరి. ఈ ఉద్యమము ఆఖరి ముస్లిం జీవించి వున్నంతవరకు ఆగబోదనియు, ముందు సవరణము గాని, రాజీ ప్రయత్నములకు అవకాశము ఉండబోదని నిర్ద్వందంగా ప్రకటించిరి. జాతీయ భావములు కలిగిన దూరాలోచన పరులను 'జాతి మత ద్రోహులు'గా నిందింపసాగిరి.

# సత్యాగ్రహము

అఖిల భారత స్థాయి దేశమంతయు స్వాతంత్ర్య దినోత్సవ వేడుకలు జరుపుకున్నవి. కాని సంస్థాన ప్రజలకు మాత్రము ఆభాగ్యము కరువాయెను. ముఖ్యముగా సరిహద్దు ప్రజలు యీ సంఘటన మూలమున ప్రభావితులై తమ అసమర్థతను నిందించుకొనసాగిరి.

ఇట్టి పరిస్థితులలో సంస్థాన కాంగ్రెసు, ప్రముఖులు దీర్ఘ కాల ఉద్యమ నిర్వహణకు అనువుగా సంస్థాన సరిహద్దులోపల భారత యూనియన్ పట్టణములలో అనగా కర్నూలు, బొంబాయి, విజయవాడ లాంటి పట్టణముల్లో ప్రధాన శిబిరము లేర్పరచుకొని అనుబంధ శిబిరములను సరిహద్దు పొడవున నియమించిరి. కార్యకర్తలందరు మూకుమ్మడిగా ఒక పర్యాయము నిర్బంధింపబడకుండ అంచెలంచెలుగా, నిర్విరామముగా ఉద్యమము కొనసాగించుట వారి ధ్యేయమై యుండెను. కార్యకర్తలు శిబిరములు జేరిరి.

విజయవాడ కేంద్ర శిబిరమునకు 'కార్యాచరణ సమితి సభ్యులు'గా మన సర్దార్ కేశవరావుగారు, మాడపాటి రామచంద్రరావు గారు, హయగ్రీవాచారి గారలను నియమించిరి. అనుబంధ శిబిర పర్యవేక్షకునిగా బొమ్మకంటి సత్యనారాయణ గారిని నియమించిరి.

సంస్థాన కాంగ్రెస్ 1947 ఆగస్ట్, 7వ తేది నుండి 'సత్యాగ్రహ' ఆరంభమని ప్రకటించినది. సందేశ మందుటయే 'తడ'వుగా మన సర్దార్జీ పులకాంకితుడై ఆదర్శవంతముగా తానే 'ప్రథమ సత్యాగ్రహి'గా వెళ్లుటకు సిద్ధపడి మిగతా వారిని సన్నద్ధులై యుండుడని ఆదేశించి ప్రయాణోన్ముఖుడయ్యెను. ప్రభుత్వము కూడా కేంద్రస్థానములో అదనపు పోలీసు మరియు మిలటరీ బలగములను సమీకరించి రైలు మార్గము, రహదారులను అరికట్టియుండెరి. మన సర్దార్జీ బస్సుపై పెనుగంచిప్రోలువరకు, కాలినడకన అల్లినగరము చేరి, విశ్రాంతి తీసుకొని, మధిర పోలీసు హంగామా తెలుసుకొని, వట్టికొండ కాంతయ్య (నాగేశ్వరరావు తమ్ముడు)

యుక్తముగా అరకలు విడుచు సమయమునకు మధిర పొలములో చేరి, జెండా చొక్కా కరపత్రములు తలలో యిముడ్చుకొని, పై కండువాను తలకు చుట్టి, జంఝములోనికి దోపి, ధోవతిని మడిచి కట్టి, ముల్లు కర్రను చేబూని, అరకల వెంట వెళ్లురైతులతో కలిసి మధిరలోని కూడలి స్థలము చేరి, చొక్కాను ధరించి, ముల్లుకర్రకు కాంగ్రెస్‌జెండాను తగిలించి "స్వతంత్ర భారత్‌కీ జై, ప్రభుత్వము భారత యూనియన్‌లో చేరాలి". అని కరపత్రము విసరివేసిరి. పోలీసులు రంగములో ప్రవేశించి నిర్బందించిరి. నిర్ణీత తేదీల ప్రకారము సత్యాగ్రహములు జరుగ సాగినవి. సంస్థాన పరిధిలో వేల సంఖ్యలో ప్రజలు జైళ్ల పాలైనారు. ప్రభుత్వము సత్యాగ్రహుల పట్ల దమన నీతిని ప్రయోగించి హింసింపసాగిరి. ప్రభుత్వ చర్యకు వత్తాసుగా రజాకారులు, పోలీసుల అండదండలతో గ్రామాదులపై దాడులు ఆరంభించి దోపిడీలు చేయసాగిరి. గృహదహనములు, స్త్రీలపై అత్యాచారములు, దొరికిన అమాయకులను నిర్బంధించుట, శిశుహత్యలు సర్వసాధారణమైనవి. ఆత్మరక్షణకు ప్రజానీకము గ్రామాదులు ఖాళీచేసి 'కాందిశీకు'లైరి.

సంస్థాన రాజకీయ పరిస్థితులను భారత ప్రభుత్వపు అగ్రనాయకుల దృష్టికి తేగా, వారు హృదయములేని చోట పరివర్తన సమస్యయే యుండదు. కాన సత్యాగ్రహము నిలుపు చేసి 'ముక్తి వాహినిగా' కార్యకర్తలకు తరిఫీదు యిప్పించి పోలీసు రజాకారుల దురంతములను 'సాయుధులై' ఎదుర్కొనుటకు సంసిద్ధ పరచి ప్రజా సహాయ సహకారములతో తిరుగుబాటును ప్రేరేపింప ఆదేశించిరి. కేంద్ర శిబిరముల ఆదేశానుసారం శిబిరములన్నియు 'సైనిక శిక్షణ కేంద్రము' లైనవి. శక్త్యానుసారము ఆయుధ సేకరణ జరిగినది. కార్యకర్తలు విజృంభించి సరిహద్దులలో నున్న 'కరోడ్ గిరి' శాఖోద్యోగులను పారద్రోలి 'స్వేచ్ఛా విపణికి' అవకాశమేర్పరచి ప్రజా మన్ననలందుకొనిరి. తాటి చెట్లు ధ్వంసం చేసి ముస్తాదురులను పారద్రోలిరి. ముస్తాదురులు పన్నుల చెల్లించజాలమని పారిపోయిరి. గ్రామోద్యోగులను పదవీ విరమణ చేయించిరి. కొద్దిపాటి రక్షక శిబిరములపై దాడులు చేయసాగిరి. రైళ్లు, మోటారు సర్వీసులపై దాడులు కొనసాగించిరి. దాదాపు సరిహద్దు ప్రాంతము అరాచకమును తాండవింపచేసిరి. ప్రజలు పన్నుల నిరాకరణకు సహకరించిరి. ఈ విధంగా 13 మాసములు గడిచినవి. మధ్య కాలములో భారత ప్రభుత్వము వివిధానేక పంధాలలో రాజీపధకముల ద్వారా ప్రయత్నించినను ముస్లిములు తమ మూర్ఖపు పట్టుదలతో ప్రభుత్వమును సామరస్యతకు అవకాశము కలుగ నివ్వలేదు. ఇద్దరు ముగ్గురు

ముస్లింల విప్రధాన మంత్రులు, ముస్లిం తండ ప్రవర్తనకు విసుగెత్తియు, ఒత్తిడులకు తట్టుకొనలేకయు రాజీనామాలను సమర్పించి పదవీ విరమణ చేసిరి. నవాబు తటస్థముగా యుండి పాకిస్తాన్ అధ్యక్షుడు జిన్నా సాహెబ్‌తో మంతనాలు కొనసాగించుచూ రహస్య మార్గమున 'ఆయుధ సేకరణ'కు పూనుకొనుటయు గుర్తించిన భారత ప్రభుత్వము 1948 సెప్టెంబర్ 17వ, తేదీన సంస్థానమున నలుమూలల నుండియు సైనములు నడిపించిరి. సైన్యములు చెదురుమదురుగా ఎదురు దాడులనెదుర్కొనుచు నాల్గు రోజులలో అనగా సెప్టెంబర్ 21వ, తేదీకి హైద్రాబాద్ చేరినవి. నవాబు పరిస్థితి క్లిష్టముగా నుండెను. సలహాదారు జిన్నా సాహెబ్ ఇదే సమయములో మరణించెను. దూరదృష్టితో నవాబు సైన్యమును యుద్ధవిరమణ చేయగా తెల్లజెండా 'ఎగుర వేయ' ఆదేశించిరి. కథ సుఖాంతమయినది. 'భారత ప్రభుత్వపు' జెండా ఎగురవేయబడినది. 'సైనిక పాలన' విధింపబడి విద్వేషితులను, అనుమానితులను నిర్బంధించి శాంతి భద్రతలను పునరుద్ధరించిరి. న్యాయముగా సంస్థాన ప్రజలకు 1948 సెప్టెంబర్, 21న తేదీయే స్వాతంత్ర్య దినము. సత్యాగ్రహులను జైళ్లనుండి విడుదల గావించిరి. ఈ సందర్భములోనే మన సర్దార్‌జీ ని.జామాబాద్ సెంట్రల్ జైలు నుండి విడుదలైరి. భారత ప్రభుత్వ అగ్ర నాయకులు ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూ, హోంశాఖామాత్యులు సర్దార్ వల్లభ భాయపటేల్ హైద్రాబాద్‌ను, నవాబును పరిశీలించిరి. మేజర్ జనరల్ చౌదరిని సైనిక పాలకునిగాను, కె. యం. మున్షీని పౌరపాలన, శాంతిభద్రతలు, రక్షణ ఇత్యాది సమస్త హక్కులతో నియమించిరి. వేరే వేరే పోరాట కాలములో ఒకే త్రాటిపై నడచిన అగ్రనాయకులు ప్రతి పలోన్ముఖుమై చేతి కందనున్న సమయమునకు 'స్వార్థ కాంక్ష'కు బలియై అభిప్రాయ బేధముల ప్రేరేపించి ముఠాతత్వమునకు అంకురార్పణ జేసిరి పరస్పర నిందారోహణలకు సంసిద్ధులైరి. క్రమేణా కాంగ్రెస్ రెండు వర్గాలుగా చీలిపోయి ఒక వర్గమునకు స్వామిజీ, రెండవ వర్గమునకు బూర్గుల రామకృష్ణారావు, కొండా వెంకట రంగా రెడ్డి గారలు నాయకులుగా చెలామణి కాసాగిరి. ఉభయులు తమ తమ బలాధిక్యతను చాటుకొన సాగిరి.

ఇక కమ్యూనిష్టులు, నిజాం పోలీసు, రజాకార్ల దౌష్టముల నెదుర్కొను నెపముతో ఆరంభింపబడిన 'సాయుధ పోరాటము'లో భాగస్వాములమని చెప్పకొనుచూ, గ్రామాదులలో నివసించుచున్న జాగీర్దార్లు, జమీందార్లు, మక్తేదార్లు, పెద్ద భూస్వాములు మొదలగు వారిపై సాయుధ దాడులు జరుపుచూ ఇండ్లు

కొల్లగొట్టి విలువైన నగలు, నగదు పార్టీ పరమునియు, ధాన్యము యితర చరాస్థులు ప్రాంతీయ అభిమానుల పరమాచేయు చుండటలో తాత్కాలికముగా పార్టీ అభిమానము కొంత పెరిగినదనుట నిర్వివాదాంశము. కాని అశాంతి అరాచకములు తాండవించసాగెను. పై వర్గముల ప్రభుత్వ పునాదులుగాక, పునాదుల పెకలించిగాని ప్రభుత్వ సౌధము కూలదు అని రాజకీయము జోడించి "బూర్జువా వర్గము అంతము చేయాలి" అనే నినాదాలతో పోరాటము సాగింపసాగిరి.

భారత ప్రభుత్వము సంస్థానముపై సైనిక చర్య అనంతరము కాంగ్రెస్ వాదులు తమ వద్ద గల ఆయుధములను సైనికాధికార్ల పరముచేసి ఉద్యమమును విరమించిరి. కాని 'కమ్యూనిస్టులు' ప్రభుత్వ ఆజ్ఞలను పాటించక పోవుటయు అశాంతి, అరాచక ప్రేరేపితుల వాడిలో సుస్థిర శాంతి భద్రతల సంరక్షణ భారము వహించియున్న సైనిక ప్రభుత్వమునకు కమ్యూనిస్టుల అణచివేత ఒక సమస్యగా పరిణమించినది. కాంగ్రెసు వాదులలో చీలిక, కమ్యూనిస్టుల అరాచక చర్యల మూలమున ప్రభుత్వమునకు సైనిక పాలన పొడిగించక తప్పలేదు. పండిట్ నెహ్రూ హైదరాబాద్ రాక సందర్భములో నిజాం నవాబు కార్యకర్తలు సమావేశమునకు విచ్చేయగా అచ్చట వున్న ప్రముఖులతో పాటు కేశవరావు గారిని తెలంగాణా జిల్లాల మేలైన నాయకునిగాను, రామచంద్రరావుగారిని విజయవాడ 'ఉద్యమ శిబిర నిర్వహకుని' గాను పరిచయ మొనర్చబడెరి. వీరు వీరుభయుల నిరాడంబరత ఆయనను ఆకర్షించినవి కాబోలు, రెండు మూడు పర్యాయములు వారిని తిరిగిచూచుచు ముందుకు సాగిరి. ఉద్యోగ వర్గములలో కూడా వీరి యడల అసాధారణ ఆదరాభిమానాలు వ్యక్తమగు చుండెడివి. కాని కేశవరావుగారు ఆత్మాభిమానము అడ్డురాగ యే విషయములోను స్వయముగా చొరవ గైకొనలేకపోయెను. ఇది అదనుగా భావించి అనుమాయులు. ఆయనగారి యిష్టా, యిష్టములతో నిమిత్తము లేకయే ఆయన పనుపున వచ్చినట్లు చెప్పకొనుచు, తమ సమస్యలను, ప్రాంతీయ సమస్యలను అనుకూలముగా పరిష్కారము చేయించుకొని ప్రజలలో నాయకులుగా చలామణి కాసాగిరి. ఇది ఆయనలోని గొప్ప బలహీనతయని వప్పకొనక తప్పదు.

రాజకీయాలలో కుళ్లు ఆవహించినది. స్వార్థచింతన, పదవీ వ్యామోహము వీటిని సాధించుటకు అవకాశ వాదములాంటి వివిధ కృత్యములు ఆరంభమైనవి. కాని మన కేశవరావుగారు వీటికి అతీతుడనుటకు నిదర్శనముగా 'రాష్ట్ర స్థాయి ప్రత్యర్థి వర్గము' బలపడుచున్నదని గుర్తించియూ వారి ఆహ్వానమును, యెరలను కాలదన్ని నిజాయితికె దర్పముగా స్వామిజీ పక్షమునే నిలిచియుండెరి. గురు

శిష్యులు శ్రీ మాడపాటి రామచంద్రరావుగారు, కేశవరావుగార్ల సంఘీభావము సహించలేక సహించలేని అనుయాయులు విభేదములను సృష్టింప బూనుకొనుటలో కారణము లేకపోలేదు. ఒకరు అత్యున్నత మేధావి. అయితే రెండవవారు ప్రజారంజకుడైన నాయకుడు. 'ఇక తమ స్థాన మెక్కడ' ? అను అపరిష్కృత సమస్యను సాధించు కొనవలసిన బాధ్యత వారిపై నున్నదనుట నిర్వివాదాంశము. సమావేశములలో సంఖ్యాబలములో రామచంద్రరావును, బహిరంగముగా అవమానించుచున్నను కేశవరావులో వారిని అదుపు చేయుశక్తి, సామర్థ్యములు సన్నగిల్లిన వనిన విధిప్రేరిత బలహీనత గాక, మరే మనవలెనో బోధపడదు.

స్వయం ప్రకాశకుడైన రామచంద్రరావు తన స్థానమును పదిలపరచు కొనుటకు ప్రయత్నించుట అభావ్యమనుటకు అస్కారముండ కూడదు గదా ! స్వామిజీ, కాంగ్రెసు'కు 'ప్రధాన కార్యదర్శి' పదవి నలంకరించెను. 'దేశపిత'యని బిరుదు వహించిన మహాత్మాగాంధియే సర్వజనానుకూలుడు కానప్పుడు రామచంద్రరావును గురించి ఆలోచించుట వృధా ప్రయాసయే గదా !

ఎట్టకేలకు భారత ప్రభుత్వము దేశములో శాంతి భద్రతలు సుస్థిర మొనర్చి, ప్రజాస్వామ్య పరిరక్షణార్థము ఎన్నికలకు ప్రజల నాయత్త పరచి విధి నిర్వహణకు పూనుకొను సమయమునకు 1952 సంవత్సరములో ప్రవేసించినాము. కాని సంస్థాన కాంగ్రెస్, చీలికవలన అధ్వాన్న స్థితిలో వుండెను. భారత ప్రభుత్వము, తమచే 'సివిల్ పరిపాలనా నిర్వాహకుని'గా నియమితుడైయున్న K.M. మున్షీ గారిని ఉభయ వర్గముల తారతమ్యములను ప్రశ్నించగా ఆయనగారు స్వామీజీని (సోషలిస్టు) తీవ్రవాదిగాను, రామకృష్ణారావును జాతీయవాదిగాను, బలాధిక్యునిగాను నిరూపించెను. తద్వారా రామకృష్ణారావుగారి ప్రాబల్యము పెరిగిపోయి స్వామీజీ బలహీనుడయ్యెను. రెండు వర్గములు ఎన్నికలకు సిద్ధమైనవి.

కాంగ్రెస్ చీలిక కమ్యూనిష్టులకు లాభదాయకమైనది. అదియునుగాక గత నాలుగు సంవత్సరముల సైనిక పాలనలో అరాచక చర్యల అణచివేత సందర్భములో సామాన్య ప్రజానీకము కొన్ని యిబ్బందులను ఎదుర్కొనక తప్పలేదు. తన్మూలమున కాంగ్రెస్ యెడల విముఖత ఏర్పడుట అసహజము కాజాలదు. మరియు కమ్యూనిష్టులు నాటిన 'వర్గ ద్వేష బీజము' వృధాగా పోలేదు. బీద, ధనిక వర్గ తారతమ్యములు, దైనందిన జీవితములో తామనుభవించుచున్నవే

అయినందున అసహనము, అసూయలు పెచ్చు పెరిగి పరస్పర ద్వేషములకు తావు కల్పింపసాగెను. 'వర్గతత్వము'ను తమకు తామై గ్రిర్మూలింపజాలమని గుర్తింపజాలని పామర జనావళి ప్రచార వ్యామోహమునకు గురియై అనేక యిబ్బందులకు గురికాసాగిరి.

ఎన్నికల తతంగ మారంభమైనది. ఎన్నికల కమిటీల నియామకము జరిగినది. రామచంద్రరావు, కమిటీల వారిచే ఆకర్షింపబడి కాంగ్రెస్ కంచుకోటయైన మధిర నియోజకవర్గమునకు కాంగ్రెస్ అభ్యర్థిగా నియామకము జరుపబడెను. ఈ సందర్భములో కేశవరావుగారి అభ్యంతరమును త్రోసి పుచ్చిన దనవలెను. ఈయన గారికి పాఖాల, పాల్వంచ నియోజక వర్గము కేటాయించిరి. కేశవరావులో అభిమానము దెబ్బతిని నిరుత్సాహ మావరించినది. అనుయాయులు రామచంద్రరావుతో ప్రత్యక్ష ప్రతిఘటనకు సిద్ధమై ఒక స్వతంత్ర్య అభ్యర్థిని పోటీకి నిలిపి ఓట్ల చీలికకు వివిధ కుతంత్రములను సలిపి 'ప్రథమ కబలే మక్షికా పాత' మన్నట్లు, ప్రథమ యెన్నికలలోనే కాంగ్రెస్ వాదులు కాంగ్రెస్ ఆదేశములు పాటించని ఖ్యాతి మన మధిర నియోజక వర్గమునకే దక్కులాగ జేసిరి. వీరు వర్గ నాయకుని విజయమునకు నిర్వహించవల్సిన కృషిని విస్మరించి ప్రత్యర్థి నాయకుని విజయమునకు ఎక్కువగా కృషి సలిపిరనిన అతిశయోక్తి కాదేమో. పర్యవసానముగా ఉభయ నాయకులకును అపజయమే వరించినది. ఇది 'సంస్థ' వూహించని విషపరిణామమైనది. రాష్ట్ర పరిధిలో కాంగ్రెస్ శాసన సభ్యులు అధిక సంఖ్యాకులైనందున పార్టీ అధ్యక్షునిగా బూర్గుల రామకృష్ణారావును ఎన్నుకొని ముఖ్యమంత్రి పదవి నలంకరింపచేసిరి.

ఎన్నికలలో విజయ సాధనకు ప్రయోగించిన కుల, మత, వర్గ ప్రచార ఫలితమో యన ఎందరో నిరక్షరకుక్షులు శాసన సభా స్థానముల నలంకరించిరి. మరెందరో పాలనా దక్షత వున్న అత్యున్నత మేధావులు అడుగంటి పోయిరి. అయిననూ ముఖ్యమంత్రి తన అసాధారణ ప్రజ్ఞా సామర్థ్యములతో విద్యుక్త నిర్వహణ కొనసాగించుచూ అధిష్టాన వర్గ దృష్టి నాకర్షింపగలిగెను.

భారత ప్రభుత్వము లోకసభ ఎన్నికలను ప్రకటించెను. కాని రాష్ట్ర వాతావరణమును గుర్తించిన కేంద్రము లోక్‌సభ సభ్యులను ఎన్నిక ద్వారా కాక రాష్ట్ర ప్రభుత్వ నియామకమునకు అవకాశమిచ్చి రాయితీ ప్రకటించినది. ఆ సందర్భంలోనే మన కేశవరావుగారిని లోక్‌సభ సభ్యునిగా (ఎమ్.పి.) నియమించుట జరిగినది. ఈ పదవియు ఆయనను ఆకర్షించినట్లు తోచదు. ఆయన ఎప్పుడూ 'గ్రామీణా ప్రజా జీవిత సమస్యలలో' భాగస్వామియై పరిష్కార సాధనలో శ్రమింప

గోరుచుండెడివాడు. ఈ అయాచిత పదవి నియామకము గూడా కుట్రలోని భాగమేనాయను సందియమునకు అస్కారము లేకపోలేదు. సామాన్యముగా యిలాంటి ప్రజాభిమానిని రాజకీయాలకు దూరంచేసి భవిష్యత్‌లో కూడా తమ విరోధము తొలగించుకొనుటకు ఎత్తుగడగా భావించవచ్చు. న్యాయముగా వీరి సేవలనందుకొనుటయే వారి ధ్యేయమైన ఖాళి అయిన నియోజక వర్గమునుండి ఎన్నిక జరిపించి ప్రభుత్వములో భాగస్వామిని జేయవచ్చు గదా ? అర్హుడైన రామచంద్రరావు గారు ఎమ్.పిగా ఏల నియమింపలేక పోయినాడు అనునది ప్రశ్నార్ధకముగా మిగిలియే వున్నది.

మొత్తము మీద రాజకీయములలో ప్రవేశించి కుటిలత ఉభయుల భవిష్యత్తున్నతిని బలిగొన్నదనిన అతిశయోక్తి కానేరదు. రాజకీయములలో నీతి, నిజాయితీకి తావులేదని నిరూపించినది. వీరి 'జీవిత చరిత్ర' భవన నిర్మాణ సమయమున అందరి దృష్టి పునాదులలో వుండదు. అందులోని అందచందములను ప్రశంశింతురు. తప్ప, పునాది రాళ్లపై భవనమును పటుత్వమును స్మరించువారుండరు. అలాగే మన నాయకులు 'రాజ్యాంగ భవన నిర్మాణము'లో పునాదివతు. ఎవరి ఆదరణను, అభిమానమునకు నోచుకొనక మరుగున పడి చరిత్రకందని అభాగ్యులయినారు. ఎన్నోవ్యయ ప్రయాసల భరించి వృక్షము నాటి పెంచి పోషించు వారొకరు. దాని ఫలితమును అనుభవించువారొకరు అనునది యదార్ధమని వీరి జీవిత చరిత్ర చాటుతున్నది.

కేశవరావు గారు 'విశాలాంధ్ర ఉద్యమము'లో ప్రముఖ పాత్ర నిర్వహించి ఖ్యాతి గడించి యుండెను.

---

ప్రేమే నా స్వరూపం
సత్యం నా శ్వాస
ఆనందం నా ఆహారం
అనంతం నా జీవితం
నా జీవితమే నా సందేశం
ప్రేమకు కాలం లేదు కారణం లేదు
చావు లేదు పుట్టుక లేదు.

- సత్యసాయి బాబా



ధీరోదాత్తుడు, శాంతమూర్తి, మా శ్రీవారు

# 11. సర్దార్ జమలాపురం కేశవరావుగారు

- కీ.శే. దేశభక్త మిరియాల నారాయణ గుప్తాగారు, మధిర

శ్రీ అయ్యదేవర పురుషోత్తమరావుగారు ఖమ్మంజిల్లా 'పబ్లిక్ రిలేషన్ ఆఫీసరు' గారు శ్రీ భండారు పర్వతాలరావుగారి ద్వారా వంపిన కరపత్రమును చదివించుకొంటిని. తెలంగాణాలో స్వచ్ఛమైన జాతీయవాది అయిన నాయకులలో అగ్రగామియై నిరంతరము దేశసేవ చేసి, 'తెలంగాణా'లో ప్రతిజిల్లాలో, ప్రతిగ్రామము తిరిగి, ప్రతి కష్ట నిష్టురములను సేకరించి, 'పాదచారి'యై రైతుల, కూలీల, అన్ని వర్గముల వారిని కలుసుకొని, తన భావమును ప్రదర్శించిన 'అధీరోధాత్తు'డు 'శాంతమూర్తి'ని 'జీవిత చరిత్ర' వ్రాయుచున్నారని వినినంతనే ఆనంద పరవశుడనైతిని. 'సర్దార్' చరిత్రను తెలిసినంతవరకు వ్రాయమని కోరితిరి. వారి భావములు కొన్ని సమకూర్చుకొనుటకు ప్రయత్నింతును. నేను నేత్రములు పోవుటచేత 16 సంవత్సరముల నుండి ఇంటివద్దనే కాలము గడుపుచున్నాను. ఈ దిగువ, వారి చరిత్ర వ్రాయుచున్నాను.

1. సర్దార్ జమలాపురం కేశవరావుగారు మధిర తాలూకా, ఎఱ్ఱుపాలెం గ్రామములో జన్మించిరి.
2. తండ్రి వెంకట్రామారావుగారు
3. తల్లి వెంకటనర్సమ్మగారు
4. భార్య - అన్నపూర్ణమ్మగారు
5. పిల్లలు - ఇద్దరు కుమార్తెలు : 1) వెంకటనర్సమ్మ, 2) కుసుమకుమారి. కుమారుడు హరగోపాల్.
6. సోదరులు : కేశవరావుగారు, నారాయణరావుగారు, మాధవరావుగారు.
7. విద్యాభ్యాసము : స్వగ్రామములో నాల్గవ తరగతి వరకు చదివిరి. ఖమ్మంలో మెట్రిక్ చదివిరి. హైదరాబాద్‌లో B.A. కొంతవరకు చదివిరి.
8. ఖమ్మంలో జరిగిన 'తృతీయ ఆంధ్ర మహాసభ'కు వాలంటీరుగా చేరి, మహాసభకు వచ్చిన అతిథులకు భోజనములు ఏర్పాటు చేయుటలో అందరి మెప్పుబడసిరి.
9. ఖమ్మంలో న్యాయవాదులు, పూర్వాచార పరాయణులు సభ జరుపుటకు, ఎన్నో ఆటంకములు జరిపించినను, 'విధవా వివాహ' 'అస్పృశ్యతా నివారణ'

తీర్మానము మహాసభలో తెత్తురని శంకించి మహాసభను, చెల్లాచెదరు చేయుటకు ఎన్నో పుకారులు పుట్టించే సమయములో ధైర్యసహాసములతో రాత్రింబవళ్ళు మహాసభ చుట్టు జాగరూకతో వుండి సభను జయప్రదం గావించిరి.

(2, 3 పేజీలు పోయినవి)

మహాసభలు జరుగుచుండెడివి. అప్పడు వాలంటీరులు నిదురించు చుండగా చలికి కష్టపడెదరని దుప్పట్లు తెప్పించి కప్పటయేగాక తన శాలువను కూడా కప్పేవారు.

20. 'ఆంధ్ర మహాసభ' సమయములో మధిర తాలూకా మొత్తం 205 గ్రామాదులను పర్యటను చేయుటకు నిశ్చయింపబడి వారి నాయకత్వములో ఏడుగురు కార్యకర్తలు మొత్తము గ్రామాదులు పర్యటించిరి. ప్రతి గ్రామము యొక్క రికార్డు తయారుచేసిరి. 1) పాఠశాల వున్నదా లేదా ? 2) మంచినీళ్ల భావి, 3) ఒక వూరినుంచి మరియొక వూరికి త్రోవలు, 4) టప్పాఖానాలు ఉన్నవా లేదా ? 5) జాతీయ వాదుల పేర్లు, 6) ఎప్పడైనా ఉద్యమం జరిగిన యెడల సహాయపడువారు వున్నారా ? మొదలగు విషయాలు సేకరించి ప్లానును తయారుచేసిరి. దానిలో వ్యవసాయ భూములు పంటలు వగైరాలు చేర్చిరి. ఆ రోజులలో పోలీసు దౌర్జన్యము విరివిగా ఉండేది. ఏడుగురు కార్యకర్తలు ఏ గ్రామము పోయినా వెంట, ఒక పోలీసు C.I.D. ఉండేది. 'ఆంధ్ర మహాసభకు ఒక అణా సభ్యత్వమనే నెపముతో ప్రాధమిక సభ్యులను చేర్పించిరి. ఒక్కొక్క గ్రామములో పోలీసు వెంట వుండుట చేత వీరికి అన్నపానాదులు కూడా దొరకక పోయేవి. పెట్టేవారు కూడా లేకపోయిరి. శనగపప్ప తిని గడిపిన రోజులు కూడ గలవు. ఏడుగురు సభ్యులు ఏడు సైకిళ్లను తీసుకపోయిరి. అవి చెడిపోవుటచే అడవి గ్రామాదులలో ....... కాలినడకతో నేమి గతా గ్రామాదులు పర్యటించిరి. రిపోర్టు ప్లానులు, తాలూకా కార్యదర్శికి ఒప్పగించిరి. కాని 'ఆంధ్ర మహాసభ' రికార్డును కమ్యూనిష్టు భావాలు కల ఆంద్ర మహాసభ సభ్యులైన శ్రీ రావినారాయణ రెడ్డికి, శ్రీ రంగారెడ్డి ఒప్పగించుటకు తీర్మానించినందున తాలూకా రికార్డును కూడా ఒప్పగించినైనది. కాని ఈ పర్యటనలో గూఢముగా ఏడుగురు సభ్యులలో కమ్యూనిష్టు భావాలు కల్గిన ఇద్దరు వ్యక్తులు శ్రీవారితో విభేదించి తుది సమయములో జాతీయతకు భిన్నముగా ప్రచారము సాగించి వర్గబేధము కల్పించిరి. దానికి శ్రీ కేశవరావుగారు చాల చింతించిరి.

21. ఆంధ్ర మహాసభ కమ్యూనిష్టులచే అభివృద్ధి కాముకులమనే ముసుగుతో ఆక్రమించబడిన తరువాత వారు చేసే ప్రచారమంతయు 'కమ్యూనిజం' ప్రచారమని గుర్తించి 'జాతీయ ఆంధ్ర మహాసభ' అనే పేరుతో శ్రీ మందుముల నరసింహారావుగారి అధ్యక్షతన మడికొండలో మహాసభ చేయుటకు నిశ్చయింపబడెను. ఆ మహాసభను జయప్రదము చేయుటకు శ్రీ కేశవరావు గారికి పెండాల్ వగైరా కార్యక్రమములు జరిపించుటకు అధికారమివ్వబడినది. ఎల్లుపాలెం, మధిర, తల్లాడ శిరిపురం, వగైరా ప్రదేశముల నుంచి కేశవరావుగారి పిలుపునందుకొని కార్యకర్తలు వందలాది మహాసభ పందిళ్ల వేయుటకు చేరిరి. కాని అచ్చట విరాళాలు పోగుచేసిన వారెవరూలేరు. శ్రీవారు జాబునందుకొని మధిరలో విరాళములు ప్రోగుచేసి రు 300/- లు మిరియాల నారాయణ గుప్తాచే పంపబడెను. అప్పటికి ఒక్కపూట తిని భోజనము చేయుచున్న కార్యకర్తలు పనిప్రారంభింపగానే శ్రీ మాదిరాజు రామికోటేశ్వరరావు పంతులుగారు చూచుటకు వచ్చి అచ్చటి వారు డబ్బు ఇవ్వక పోయినను ఎట్లు పనులు సాగుచున్నవని శ్రీ కేశవరావుగారిని ప్రశ్నించిరి. దానిపై "మీ యట్టి మహానాయకులు ఉండగా పనులెందుకు సాగనని విసుగుతో అనగానే చిన్న బుచ్చుకొని రెండు రోజులలో కావలసిన సాదన, సామగ్రిని పంపుతూ క్షమించమని కోరిరి. ఆయనగారు ఎప్పుడును ఎవరిని కఠినమైన మాటలతో నొప్పించువారు కారు. ఆ విధముగా శ్రీ రామకోటేశ్వరరావు గారిని నొప్పించనందుకు చాల విచారపడిరి. ఆ సమయము ఐరోపా యుద్ధసమయము. తీర్మానములు బహు జాగరూకతలో నడిపించవలసి యుండెను. కాని కేశవరావు గారిని తోడ్పడమని కోరినను, ఆ పని నాయకులది నాపని కాదు. నేను కార్యకర్తను" అని వాలంటీర్లతో పనిచేయించుచూ భోజన సదుపాయములు మొదలగు కార్యకలాపములను చేపట్టెను. ఆ మహాసభకు అనుభవముగల కార్యకర్తలందరూ కమ్యూనిజం భావముతో రాకపోవుటచేత ఎక్కడ ఏమి తప్పు జరుగునో అని శంకించుతూ తనే స్వయంగా పనులు నెరవేర్చుచు చిరవకు పాకీదొడ్లలో కూడ తనే నీళ్లు పోయుచూ ప్రతివిషయములో జాగ్రత్తను తీసుకొనేవారు.

22. మెదక్ జిల్లా కందిలో మహాసభ జరుపుటకు నిశ్చయింపబడెను. యువకులంతా శ్రీ కేశవరావుగారిని అధ్యక్షుని చేయాలని కోరుచుండిరి. వృద్ధనాయకులు వారిని తప్పించి ఇంకొక వృద్ధుని నాయకుని

చేయవలయునని అనుకొనుచుండిరి. ఎందుకనగా యువనాయకుడైన శ్రీ కేశవరావుగారి అధ్యక్షతతో జరుగు తీర్మానములు తీవ్ర రూపముతో ఎదిరించే లాగుండునని వృద్ధ నాయకులు భయపడిరి. కాని తుట్ట తుదకు శ్రీ కేశవరావుగారినే అధ్యక్షులుగా చేయుటకు మెజారిటీ తీర్మానమైనందున, 'కంది' గ్రామములో జరుగు మహాసభకు శ్రీ కేశవరావుగారే అధ్యక్షులయిరి. యువక రక్తము పొంగి పొరలి వచ్చుచున్నదా యని అనుకొనునట్లు దూర దూరములనుండి యువకులు తండోప తండాలుగా వచ్చి పడుచుండిరి. ఇంతకు ముందెన్నడునూ ఏ మహాసభలోను అంత అందముగా మహాసభ అలంకారముగాని అంతమంది యువకులు గాని వచ్చియుండలేదు. గవర్నమెంటు C.I.D. లు ఉద్యోగులు చాలమంది అరుదెంచిరి. శ్రీవారిని స్వాగతమిచ్చి తీసుకొని వచ్చుటకు ప్రజలు తండోపతండములుగా మూగిరి. జాతీయ ఝండాలతో రథమును నిర్మించిరి. ఆ రథముపై శ్రీ కేశవరావుగారిని కూర్చుండబెట్టిరి. జయ జయధ్వనులతో ఊరేగింపు కనుల పండువగా జరిగెను. మొదటినాడు వారి అధ్యక్షోపన్యాసము జరిగెను. దానిలోని భావాలను మితవాద నాయకులు హర్షింప లేకపోయిరి. యువనాయక మితవాద నాయకులకు వాగ్యుద్ధములు జరిగినను, రెండవరోజు శాంతి పరిస్థితులు సభా తీర్మానములు దిగ్విజయముగా యువకులే నెగ్గుచూ వచ్చెను. ఆ కంది మహాసభ శ్రీ కేశవరావుగారిని మహానాయకునిగా గుర్తించి సర్దార్ కేశవరావు అను నినాదములు ఉచ్చరింపజేసెను.

23. ఖమ్మం జిల్లా (అప్పటి వరంగల్ జిల్లా) జుఝావు పేటలో జరిగిన 'స్టాడింగు కమిటీని' చాలమంది యువకులు వచ్చి యుండిరి. సభా ప్రారంభ సమయమున కాంగ్రెస్ ఝండా ఎత్తుటకు ఎవరును సాహసించరైరి. కాని శ్రీ కేశవరావుగారు తన సహజ ధైర్య సాహసములతో నవ్వుతూ వచ్చి పతాకమెత్తి ప్రజల భయ సందేహముల తీర్చిరి. పోలీసులు వచ్చిరి కాని ఎవ్వరిని ఏమియు మందలింపలేక వెళ్లిపోయిరి.

24. ఇల్లెందు తాలూకాలో జిల్లా మహాసభలు జరిగెను. దానిని అధ్యక్షులుగా శ్రీ కేశవరావుగారే యుండిరి. నలుమూలల నుంచి యువకులంతా బహుళ సంఖ్యలో వచ్చిరి. ప్రభుత్వమునకు కన్నుకుట్టి శ్రీ కేశవరావుగారిని మహాసభలో పాల్గొను చుండు సమయములో పోలీసులు కచ్చేరికి తీసుకపోయిరి. కేశవరావు గారిని అరెస్టు చేసిరని ప్రజలలో అలజడి

ఎక్కువ అయ్యెను. వెయ్యిమంది ప్రజలు పోలీసు స్టేషన్‌కు వెళ్లి కేశవరావుగార్ని విడుదల చేయమని కోరుచూ తమనాయకుని చూపించమని ఆందోళన చేయుచుండిరి. ఇంతలో మహాసభకు వచ్చిన యువనాయకులు కూడ ఆ స్థలములలో ప్రభుత్వ నిరంకుశమును తీవ్రముగా ఖండించుచూ ప్రజలను ఉత్తేజపరచిరి. ఇదంతయూ చూచి ప్రభుత్వము ప్రజలలో కేశవరావుగారిపై ప్రేమానురాగములకు భయపడి శ్రీవారిని వదలి పెట్టిరి. శ్రీవారు చిరునవ్వుతో మందహాసము చేయుచూ ప్రజలతో గూడి మహాసభ వేదిక వద్దకు వచ్చిరి. ఆ సమయములో ఆ వేదికపై వారిచ్చిన ఉపన్యాసము ప్రభుత్వ సభ్యులను C.I.D. వారి హృదయములకు భయంకరమై ప్రజలను మిగుల ఉత్తేజింపజేసెను.

25. మరొకమారు మహబూబాబాద్‌లో స్టాడింగ్ కమిటీ జరిగెను. అప్పడు కూడ యూరపు యుద్ధము తీవ్రరూపము దాల్చియుండెను. కమ్యూనిష్టులు ఇది 'మతయుద్ధమ'ని ప్రజలలో రేకెత్తించు చుండిరి. అట్టి సమయములో శ్రీవారి ఉపన్యాసము గం $1^1/_2$ సమయము 'మతయుద్ధము' కాదనియు సామ్రాజ్య వాదుల యుద్ధమనియు, కమ్యూనిష్టుల నినాదములకు ప్రజలు మోసపోవద్దనియు, గాంధీమహాత్ముని ఆదేశమని గంభీరోపన్యాస మొసంగిరి. ఆ ఉపన్యాసము విన్నవారంతాయు ముగ్ధులైరి. మరల కాంగ్రెసుపై ప్రఖ్యాత్య నిషేధము తొలగుటయు, జాతీయ భావములు కల యువకులందరు కాంగ్రెసులో చేరి ప్రజలలో జాతీయ తత్వము మేలుకొలిపి ప్రచారము చేయుటయు, అచ్చటచ్చట ప్రభుత్వము దీనిని గ్రహించి దుండగములు చేయుటయు ప్రజలలో జాతీయ తత్వము ప్రచారము చేయుటకు కేశవరావుగారు నడుము కట్టుటయు, ప్రతి జిల్లాలో రాత్రింబవళ్లు తెలియక శ్రీవారు తిరిగి కాంగ్రెసు ప్రచారము చేయుటయు, ఎక్కడ చూచినా కాంగ్రెసు తత్వము ప్రజలలో ప్రకోపించుటయు, అటు కమ్యూనిష్టులకు ఇటు ప్రభుత్వమునకు కళ్లు కుట్టెను. దిన దిన ప్రవర్ధమాన మగుచున్న కాంగ్రెసు తత్వము, కేశవరావుగారి పలుకుబడి రాష్ట్రమును దద్దరిల్లి చేయుచుండెను. ప్రభుత్వము భయపడి అనేక 'పిచ్చి శాసనములు' చేయుచుండెను. 'సమావేశ స్వాతంత్ర్యము' ప్రభుత్వ ఆర్డరు లేనిదే సభలు జరుపగూడదని శాసించెను. కాని అన్ని శాసనములను శ్రీ కేశవరావుగారు ధిక్కరించిరి. కాని వారిని ఏమిచేయుటకు ప్రభుత్వమునకు ధైర్యము చాలదయ్యెను.

27. కేశవరావుగారు జన్మించినది మధిర తాలూకా ఎఱ్ఱుపాలెం 'స్వాతంత్ర్య ద్వారము' ఎఱ్ఱుపాలెమని నిర్ణయించాం. వారికి తోడు రాజకీయవేత్తయైన శ్రీ మాడపాటి రామచంద్రరావుగారు కూడ అచ్చటనే జన్మించిరి. దేశములో స్వాతంత్ర్య హక్కులకై పోరాడుటకు ఆ గ్రామములోనే పునాదులు వేయబడినవి. కేశవరావుగారు గ్రామములోనికి ప్రచారమునకు పోవ నిశ్చయించుకొని మధిరకు వచ్చేవారు. ఆర్థిక పరిస్థితులు వారికెప్పుడునూ దూరముగనే వుంటూ వుండేవి. ఇంటి నుండి ఒకకాని గూడ లభించేది కాదు. ఇచ్చట వారికి అంతరంగికుడై ఆంధ్ర మహాసభ పుట్టిన నాటినుంచి ఏ గృహము రాజకీయాలకు కేంద్రమో, అట్టి వారింటికి తప్పక వచ్చుచుండెడి వాడు. నలువైపుల నుంచి వచ్చే వార్తలను, జాబులను చూచుకొనేవారు. ప్రభుత్వము కూడ ఆ గృహమును సోదా చేయుచుండెడివారు. కారణము, శ్రీ కేశవరావుగారు ఆ ఇంటికి తరచుగా వచ్చుచుండుట మరియు నిషేధ రాజకీయ లిటరేచర ఏమైనా దొరుకునేమోయని ఈ గృహస్థు మిరియాల నారాయణ గుప్తయే.

28. శ్రీవారు ఏ గ్రామమైన బయలుదేరి వెళ్లునప్పుడు రైలు స్టేషన్‌కు వెళ్లేవారు. మూడు అణాలుంటే బోనకల్లు, అర్ధరూపాయి వుంటే ఖమ్మం, రూపాయి వుంటే డోర్నకల్, రెండు రూపాయలుంటే వరంగల్, నాలుగు రూపాయిలుంటే హైదరాబాద్. సర్వకాలము ప్రజలలో 'సేవా ధర్మము' నేర్పుటకు 'నిర్మాణ కార్యక్రమములు' బోధించుటకు ఏ గ్రామమైతే ఏమని వారి ఊహ మిత్రులెవరైనా దొరికినచో వారు వారి గ్రామము రమ్మనమని కోరినచో ఏ జిల్లాకైన పోయి నెలల పర్యంతము జాతీయ ప్రచారము చేయు చుండెడివాడు. వీరి ప్రయాణములు గూడ పై విధముగనే జరుగుచుండెడివి. కాలినడక కంటే వారికి చాల సరదా. ఉడుపులు రెండుకన్నా ఎక్కువ వుండేవికావు. స్వయముగా వస్త్ర పరిశుభ్రము చేసుకొనేవారు.

29. శ్రీవారి భోజనము, ప్రచారములో ఎవరైనా పిలిస్తేనే వారికా భోజనము, లేనిచో మరుసటి దినమే ? పోలీసువారు వెంటయున్న యెడల ఆ ప్రజలు భోజనమునకు పిలుచుటకు కూడ భయపడేవారు. కాని ఎవరైన భోజనములు తినమన్నచో వీరు, వారను బేధము లేక అచ్చటనే సంతోషముతో భోజనము చేసెడివారు. భోజన మెట్టున్ననూ సంతుష్టులయ్యేవారు. మధిర యందు పై రాజకీయ గృహమునందే తరచుగా జరుగుచుండెడిది.

30. శ్రీవారికి సిగరెట్ కాల్చుట మహాసరదా. టీ యిచ్చినచో సేవించేవారు. రోజుల తరబడి భోజనము లేకపోయిననూ వారి జాతీయ ప్రచారమునకు భంగము రానిచ్చేవారు కాదు.

31. ప్రభుత్వము కాంగ్రెసుపై నిషేధము తొలగించినది. అప్పటి కాంగ్రెసుకు శ్రీ స్వామిజీ అధ్యక్షులుగా వుండేను. వారికి కుడి భుజముగా శ్రీ కేశవరావుగారుండిరి. స్టాండింగ్ కమిటీ బీదరులో జరిగినపుడు, మహారాష్ట్ర కర్నాటక ఆంధ్రులు సమావేశమయిరి. అందరికి కాంగ్రెసు సంస్థ ఒక్కటే అయియుండెను. ఆ కమిటీలో భిన్నమైన భావాలు మహారాష్ట్రులు తెచ్చుటచేత ఆ భిన్న భావములను ఆంధ్ర కర్నాటకులు ఖండించుట చేత మహారాష్ట్రల పక్షము వహించిన శ్రీరామానంద తీర్థ (స్వామిజీ) అధ్యక్ష పదవికి రాజీనామ నొసంగెను. అపుడు శ్రీ కేశవరావుగారు ధైర్య స్థైర్యములు వహించి కర్నాట కాంధ్రను ఒకటిచేసి ఓటింగులో మహారాష్ట్రుల నోడించినందుకు కినుకవహించి స్వామిజీ రాజీనామనొసంగిరి. మూట ముల్లె కట్టుకొని బీదరు నుంచి బయలు దేరుచుండగా ఏ తీర్మానములు జరుగునోయని ప్రభుత్వము భయపడి రెండువందల పోలీసులను బీదరుకు పంపిరి. వీరందరూ స్టేషనుకు ప్రయాణమై పోవుచుండగా జరిగిన సంఘటనకు పోలీసువారు ప్రభుత్వము ఆనందముతో మునిగిపోయిరి. హైదరాబాద్ చేరిన తరువాత శ్రీ రామాచారిగారి యింట్లో సమావేశము జరిపి ఏ పద్ధతిలో కాంగ్రెసును ముందుకు నడిపించుటకు వీలున్నదో తగు కార్యక్రమమును రూపొందించుటకు శ్రీ కేశవరావుగారు ఎంతో సహకరించిరి.

32. పై సంఘటన నుంచి ఒక సంవత్సరము వరకు నాయకులందరు నిస్తబ్ధతతో వున్న టయములో శ్రీ కేశవరావుగారు బుఱ్ఱకథకులను తీసుకొని మెదకు, మహబూబ్‌నగర్ కరీంనగర్, వరంగల్ నల్లగొండ జిల్లాలను పర్యటించి కాంగ్రెసు ప్రచారమును ప్రజలలో విరివిగా చేయుచుండెడివారు.

33. ఒక సంవత్సరము పిదప మరల హైదరాబాద్‌లో కమ్యూనిష్టు భావములు కల మహారాష్ట్రులు వేరుపడగా మిగతా మహారాష్ట్రులు, కర్నాట కాంధ్రులతో కలసి శ్రీరామానంద తీర్థగారి అధ్యక్షతతోనే సమైక్యమై 'కాంగ్రెసు సమైక్యసభ' అను సమావేశము జరిపించుటకు శ్రీ కేశవరావుగారు ఎంతో దోహదము చేసిరి. ఈ సమైక్య సభలోనే మూడు ప్రాంతాల సభలు కూడ ఒకే నాయకత్వము క్రిందకు రాబడినవి.

34. 'జిల్లా కాంగ్రెసు' సభలు తరచుగా జరుగుచుండెడివి. అప్పుడు శ్రీ కేశవరావుగారు తప్పకుండా వచ్చి అన్ని కార్యక్రమములు చేపట్టేవారు. కాంగ్రెసు ప్రభుత్వముతో పలుమారులు సంస్కరణ విషయాన్ని చర్చించినను ప్రభుత్వము లెక్కచేయక పోవుటయేకాక ఇంకనూ మిక్కిలి కఠిన శాసనములు చేయుచుండెడిది. దానికితోడు రజాకారుల ఉద్యమము కూడా ప్రారంభమైనది. ముస్లింలు ఇది 'ముస్లిం రాజ్యమ'ని, ప్రచారము చేయుచుండెడివారు. కాంగ్రెసువారు – ఈ రాజ్యము ప్రజలది అని ప్రాచరము చేయుచుండెడివారు. ఈ సమయములో బ్రిటీషువారు భారతదేశమును వదలిపోవుటకు నిశ్చయించుకొని దేశమును భారత, పాకిస్తాన్ అను రెండు ఖండములుగా విభజించి స్వాతంత్ర్యమిచ్చిరి. విభజనకు కారణము హిందూ, ముస్లింల మధ్య విరోధము కల్పించుటయే. దీని మూలకముగా నిజాం రాష్ట్రములో కూడా హిందూ, మహ్మదీయులకు బద్ధవైరము ప్రభుత్వము వల్ల కలిగెను. ఇచ్చటి ముసల్మాన్ నాయకులు నిజాం ప్రభుత్వాన్ని దక్షిణ పాకిస్తాన్ చేయుటకు తలవడి రజ్వీ నాయకత్వములో 'రజాకారుద్యమము'ను ప్రభలము చేసి ఇతర దేశములనుంచి రహస్యముగా అనేక రకములైన తుపాకులను సిడ్నీ కాటక సహాయముతో ప్రభుత్వము తెప్పించెను. రాష్ట్రములోని ప్రజలు ఆంధ్ర దేశమునకు భయభ్రాంతులై వలసపోవు చుండిరి. దినదినమునకు పోలీసులు, సైన్యము, రజాకారులు ఒక వైపు నుంచి యింకొక వైపునకు ప్రజలను భయభ్రాంతులను చేయుటకు తిరుగుచుండిరి. సమయము బెడిసినదని కాంగ్రెసు నాయకులు గుర్తించి 'సత్యాగ్రహయోద్యమము' కొనసాగించుటకు వర్కింగ్ కమిటీ నిశ్చయించెను. యాక్షన్ కమిటీలో రాష్ట్రమునకు 'మొదటి సత్యాగ్రహి'గా శ్రీ కేశవరావుగారిని మధిరలో 'సత్యాగ్రహము' చేయుటకు 1947 ఆగష్టు, 7వ తేదీన నిశ్చయించబడెను. ఆ రోజులలో మధిర యందలి ఫిరంగులు చేర్చబడి యుండెను. వందల కొలది పోలీసులను తుపాకులతో ప్రభుత్వము నియమించింది. ఆగష్టు 6వ తేదీన సత్యాగ్రహమునకు విజయవాడ నుంచి బయలుదేరు సమయమున వారి మిత్రుడైన మిరియాల నారాయణ గుప్తాతో గృహ సంబంధమైన విషయములను చర్చించుచూ "నా భార్య గర్భవతి. ఇది ఎట్లు పరిణమించునో జాగ్రత్తగా కనిపెట్టు చుండవలయున"ని చెప్పి మారు మాటాడక వెడలిపోయిరి. ఆగష్టు 7వ తేదీన సత్యాగ్రహము శ్రీ కేశవరావు గారిచే మధిరలో జరుపబడునని పోలీసు బందోబస్తు గ్రామము చుట్టూ చేయబడెను. ప్రజలు తండోప తండాలుగా చుట్టుపట్ల గ్రామాదుల

నుంచి మధిరలో జొరబడెరి. ఎటునుంచి శ్రీ కేశవరావుగారు వచ్చునోయని ప్రభుత్వము ప్రజలు చూచుచుండిరి. ఎవరికంట పడకుండా ఎట్లు వచ్చిరో కాని సత్యాగ్రహ కరపత్రములు సెంటరులో పంచిపెట్టువరకు పోలీసులుగాని, ప్రజలుగాని, గుర్తించలేకపోయిరి. సత్యాగ్రహము జరిగెను. పోలీసులు వచ్చి సంకెళ్లు వైచి పోలీసు స్టేషనుకు ..... సహ సత్యాగ్రహిగా వచ్చిన శ్రీ వెంకట రాజుతో సహ తీసుకపోయిరి. ఆ మరునాడే శిక్షవిధించి సెంకండ్ క్లాసు ఖైదీగా సౌకర్యమిచ్చి వరంగల్ జైలుకు పంపిరి.

36. కాంగ్రెసు పై నిషేధము తొలగించిన పిదప కేశవరావుగారి ప్రతిభ గ్రామాదులలో హెచ్చిపోసాగింది. వారి శిష్యులలోనే కొంతమందికి కంటకముగా నుండెను. అప్పడు మార్గములు అన్వేషించి 'యువజన కాంగ్రెసును' స్థాపించిరి. శ్రీవారికి విరుద్ధముగా కూడ ప్రచారము చేయసాగిరి. ముసలి కాంగ్రెసని, మితవాదులని అచ్చటచ్చట వ్యంగ్యముగా విమర్శించు చుండిరి. అట్టి యువజన సంఘం స్థాపించిన వారిలో శ్రీ రాజలింగం, శ్రీ కోదాటి, శ్రీ పట్టాభి, శ్రీ ఆదిరాజు మొదలగువారు కృషిచేయుచుండిరి. ఇట్టి సమయములో 1947 జూన్‌లో ఆంధ్ర కేసరి శ్రీ టంగుటూరు ప్రకాశం పంతులు గారిని పిలిపించి మధిరలో శ్రీ కేవవరావుగారి అధ్యక్షతన సభజరుపుటకు తాలూకా కాంగ్రెసు వారిచే ఏర్పాటు చేయబడెను. ఆ అదును చూచి 'యువజన సంఘ సభ్యుడని' శ్రీ టంగుటూరిని తీసుకువచ్చుటకు పంపగా పోయిన సభ్యుడు ఇదంతయూ యువజన కాంగ్రెసు తరపున జరుగుచుండెనని వారికి వ్రాసి యిచ్చి తీసుక వచ్చిరి. శ్రీ సర్దార్ కేశవరావుగార్ని వారిప్రక్కన రధములో కూర్చుండమని కోరగా, అంతగొప్పవారి సరసన కూర్చుండే హక్కు నాకు లేదని కోరిన వారిని నిరాకరించిరి. ఆ మాటన్న ఆంధ్రకేసరి విని, ఇదివరలోనే వారి సేవను విన్న శ్రీ ప్రకాశంగారు "అరె సర్దార్ ! రా !! నా సరసన కూర్చో. ఈ తెలంగాణా నాయకుడవు నీవేరా ! ఇంకెవరు రా!" అని పిలిచిరి. అట్టి సమయములో ఆహ్వాన సంఘ అధ్యక్షుడుగా శ్రీ కోనా విశ్వనాధంగారు ఆ రధం పైనే యుండిరి. ఆ మహాసభ (అప్పటి రోజులలోనే) ఇరువది వేలమంది వచ్చి ఆంధ్రకేసరి జాతీయ ప్రభోధములకు ఉత్తేజ — శ్రీ కేశవరావుగారి అధ్యక్షోపన్యాసము తెలంగాణా ఉద్యమ చరిత్రను, భావి పురోగమ గురించి ఉపన్యసించిరి. ప్రజలను ప్రకోపింపచేసిరి. ప్రతి ఇంట తోరణములు కట్టిరి. నివాళులెత్తిరి. గ్రామమంతయు కాంగ్రెసు ఝండాలతో నిండియుండెను. ఆ సమయములో ఆ ఆహ్వాన సంఘం వారు శ్రీ కేశవరావుగార్కి యిచ్చిన సన్మాన పంచరత్నములు.

శ్రీ యుత సర్దార్ జమలాపురం కేశవరావుగారికి మధిర తాలూకా
కాంగ్రెసు సభ్యులు సమర్పించిన

## సన్మాన పంచ రత్నములు

కానీ యాంధ్ర ధరిత్రి చెక్కయు తెలంగాణంబు తాసై యశో
వ్యానర్ఘంబు పొనర్చు క్రేశవుడు సర్వాంధ్ర ప్రభావంతుడై
ప్రానుల్గట్టు స్వతంత్ర తాఖనియు సమ్మాన్యుండు మాత్రార్థ సే
వానీతాఖిల జీవితుండు సుభట వ్రాతాఖిల జ్యేష్ఠుడున్

సరదార్ ! ప్రాణివి నీవు ప్రాణమునకున్ సంబంధమే లేని య
ట్లురకన్ నారక వహ్నిలో దుముక పెల్లూరింతువేలా ? యెదన్
పెరిమన్ దేశ విముక్తి కింత వడియున్, వేలాతిగానంద ఘం
భరితాత్మన్ త్యజియింతువో ? జనని సత్వాదాబ్జమందిమ్మెయిన్

ఆరని జోతులీయుభయమందు ప్రకాశమునందు నీవు సం
ధారు బరుల్ త్రిలింగ మహిదంత యుగంబున బట్టు స్వర్గజి
శ్రీరుచిరా కృతిం బోలిచి శ్రేయము లిత్తురు మాకు, మీ మహే
చ్ఛారుచిరంబె యాంధ్ర జన సంఘము త్రొక్కిన వెల్గుత్రోవయున్

చీకటి ముమ్మరంబగుచు జెందిన దాస్యమహాంధకూప మం
దాకలు లేని బంటువయి యారనిజ్యోతి స్వతంత్రతావద
వ్యాక్రియ మారారోచిర మలాకృతిగా వెలుగింతు వీవు, నీ
పోకలు, పూర్వభారత విభూతికి నెత్తిన వెల్గు దీపికల్

యీా వద్భారత మౌళిమండన గుణ వ్యాకీర్ణ డార్శర్ని, స
ద్భావుండ జమలాపురాన్వయ మణిన్, భావింతుయ్ భారత
భ్యావిష్టా కృతి దాస్యరాక్షస నిరస్తన్, ధాత్రి గొమ్మితుగో
జేవన్ జేసిన "యజ్ఞపోత్రి" యన భాషింపంగ తథ్యంబగున్

ఇట్లు

మధిర — చెరుకుమల్లి హనుమయ్య చౌదరి

3-4-1947 — తాలూకా కాంగ్రెసు అధ్యక్షుడు

(ఈ పై పద్యములు కవిసామ్రాట్ విశ్వనాధ సత్యనారాయణ గారిచే
రచింప జేసినవి)

36. మహాసభలలో ఫోటో తీసుకొనే అలవాటు సహజముగా యున్నది. అందరు నాయకులు ఫోటో తీసుకొనుటకు తయారైతే శ్రీ సర్దార్‌గారు ఆ సమయములో కనుపించకుండా పోయేవారు. అందువలన గ్రూపు ఫోటోలుగాగాని, ప్రత్యేక ఫోటోలుగా గాని వారివి చాల అరుదుగా యుంటవి. ప్రత్యేకముగా తీసుకుందామన్నను ఒప్పకునేవారు కారు.

37. కాంగ్రెసు మీద నిషేధము తొలగించిన తరువాత మధిరకు ఏడు మైళ్లల్లో ఉన్న నందిగామ తాలూకా వీరుళ్లపాడులో వేసంగి రైతాంగ విద్యాలయమని నెపముతో కమ్యూనిస్టులు అంతరంగిక విషయమును బయలుపెట్టక మిత్రులైన శ్రీరావి నారాయణరెడ్డి, శ్రీ కేశవరావుగారలు మెంబరుగా జేరి కొన్ని దినములుండిరి. జాతీయ భావములు గల కేశవరావుగారు అచ్చటి ఉపన్యాసములు తనకు విరుద్ధముగా తోచి తన హృదయాన్ని వెల్లడిపరచి మధిరకు చేరిరి. రావి నారాయణరెడ్డిగారు అల్లినరము మిత్రులతో చేరి దానిలో లీనమైపోయిరి. శ్రీ కేశవరావుగారు మధిర మిత్రులతో పై విషయములను అందరకును నచ్చజెప్పి రైతాంగ విద్యాలయమునకు పోకుండా ___ ప్రోత్సహించిరి. పై విద్యాలయమును స్థాపించువారు శ్రీ పాట్లూరి సుందరంగారు.

38. ఇదే సమయములో మధిర తాలూకా కల్లూరులో శ్రీవారు అధ్యక్షతతో వరంగల్ జిల్లా మహాసభ జరుపబడెను. అప్పటి రైతుల హక్కులు కాంగ్రెసు విధానము ప్రభుత్వ నిరంకుశపు నిర్బంధ చట్టాలు మొదలగు వాటిని విమర్శించుతూ తీర్మానాలు చేయబడెను. అతి రమణీయముగా అలంకరింపబడిన బండిపై ఊరేగింపు చేయబడెను. ఆ గ్రామములో ముసల్మానులు ప్రభుత్వమును విమర్శించు చున్నారనే నెపముతో ఆహ్వానించిననూ సభకు రాకుండిరి. ప్రతి ముసల్మానుకు తానే రాజుననే ఉద్దేశ్యముండెను. సాహసోపేతమైన ఉపన్యాసములు జరిగిననూ C.I.D లు వచ్చిననూ ఎట్టి ఆటంకములు సభకు జరుగలేదు.

39. 1948 సెప్టెంబరులో కేంద్ర ప్రభుత్వము వారు నిజాం రాష్ట్రముపై పోలీసు చర్య జరుపుట, నిజాం లొంగుబాటు జైళ్లల్లో వున్న రాజకీయ బృందాల విడుదల, శ్రీ కేశవరావు గార్ని సెప్టెంబరు ఆఖరు అదే సంవత్సరమున విడుదల చేయుట, పునరావాసముగా ప్రజలు రాష్ట్రములోనికి వచ్చుట, రాష్ట్రమంతటి యూనియన్ ఉద్యోగులు ప్రభుత్వ ఆఫీసులను వశపరచుకొనుట జరిగెను. రాష్ట్రములో 'కాంగ్రెసు ఉద్యమము'

పునరుజ్జీవింప చేయుటకు గ్రామ, తాలూకా, జిల్లా, రాష్ట్ర సంఘాలు స్థాపించబడినాయి. అప్పటి రాష్ట్ర సంఘమునకు శ్రీవారిని 'రాష్ట్ర అధ్యక్షులు' గా ప్రజలు ఎన్నుకొనిరి. అప్పటి లగాయతు కాంగ్రెసు నలువైపుల విజృంభించి ప్రజలకు 'సేవాధర్మము' ఆచరించుచుండిరి. అప్పుడు కమ్యూనిస్టులు దేశములో ఈ విషయము సహించలేక గెరిల్లా పోరాటము సాగించిరి. అనేక మంది కాంగ్రెసు వారిని వంటరిగా చూచి చంపుచుండిరి. పల్లె గ్రామములలో రాత్రిళ్లు దోపిడె మొదలగు దుష్ట కార్యములు చేయుచుండిరి. రాష్ట్ర పరిపాలన 'కేంద్రము' వారిచే నిర్వహింప బడుచుండెను. మేజర్ జనరల్ చౌదరి గౌర్నరుగా కేంద్ర పరిపాలకుడుగా వెల్లోడిగారిని నియమించిరి. వారి పరిపాలనలో రాష్ట్రములో 'కమ్యూనిష్టు ఉద్యమము' మరీ ప్రబలమయ్యెను. ఇదంతయు కేంద్ర ప్రభుత్వము విచారణ చేసి కమ్యూనిష్టులను అణచివేయుటకు సైన్యాలను పంపబడెను. కమ్యూనిష్టులు కూడ లొంగుబాటు చూపిరి. అట్టి సమయములో శ్రీ సర్దార్ కేసవరావుగారు చూపిన ధైర్య సాహసములు ప్రతి గ్రామములో కనబడెను. రాష్ట్రములో 'వయోజన వోటింగు' లెక్కలు తయారు చేయబడెను. 'ఓటర్లు జాబితాలు' కూడ తయారు అయ్యెను. శాసన సభా స్థానములు కేటాయించుటలో 'గూడుపుఠాణి' జరిగెను. అడవి తాలూకాయైం కమ్యూనిష్టులు ఎక్కువవున్నచోట చూచి నర్సంపేట తాలూకాలో శ్రీవారికి స్థానం యిచ్చిరి. వారు తమ తాలూకాలో స్థానమిప్పించమని కోరిరి. కాని నిరాకరించబడెను. ఎన్నికలలో దౌర్భాగ్యవశాత్తు, కాంగ్రెసు వారే శ్రీవారిని ఓడించుటకు లోలోపల కుట్రచేసి ఆస్థానము కమ్యూనిష్టులకు అప్పగించిరి. ఓడిపోయి మధిరకు వచ్చుచుండగా 'మధిర తాలూక ఎన్నికల' ప్రచారం సాగుచుండెను. కొంతమంది కార్యకర్తలతో హైద్రాబాదునుంచి ఒక ముస్లిం వనిత ప్రచారమునకు అప్పనగుర్తి పోయెను. ఆ విషయము వైరాలలో కేశవరావుగారు తెల్సుకొని అప్పనగుర్తి ప్రచారము నిమిత్తము వచ్చిరి. ఘనమగు స్వాగతములు యివ్వబడెను. కాని వారు తన ఓటమిని నవ్వుతూ ప్రజలకు ఎరుకపరచి, "మన రామచంద్రరావుగారినైనా గెలిపించమని" ప్రజలకు ప్రబోధము చేసిరి. వారి హృదయములో విచారము అసూయ లేక ఆనందముతో కాంగ్రెసు సిద్ధాంతమును తెల్పిరి. అక్కడి వారంతా ఎక్కువ కమ్యూనిష్టులే.

41. శ్రీ కేశవరావుగారు మాడపాటి వారిని గెలిపించుటకు గ్రామ, గ్రామం తిరిగి ప్రచారం చేసిరి. కాని 'కమ్యూనిష్టు ఉద్యమం' అప్పటికి కొద్దిరోజుల్లో ఆగిపోవుట చేతను ఎవరిని ఎంత ప్రయత్నించిననూ రామచంద్రరావుగారు ఓడిపోవుట తప్పలేదు. కాంగ్రెసు వారిలో కొంతమంది వ్యతిరేక ప్రచారం బహిరంగంగా జేయుట కూడ ఒకకారణము. ఎఱ్ఱుపాలెం యిద్దరు నాయకులలో కూడ అభిప్రాయ బేధము కూడ కలిగింప చేసిరి. రాష్ట్రములో జిల్లాలో కాంగ్రెసు వారు కాంగ్రెసు వారి మీదనే దుమ్ము ఎత్తి పోసుకొనిరి. కాంగ్రెసులో కల్లోలములు కూడ విజృంభించబడెను.

42. మరల 'రాష్ట్ర కాంగ్రెసు అధ్యక్ష ఎన్నికలు' వచ్చెను. కేశవరావుగార్ని నిలుపుటకు కొంతమంది సమకట్టిరి. రంగారెడ్డిగారు వుండవలయునని కొందరు సమకట్టిరి. రెడ్డి, రావు పార్టీలు కూడ ప్రబలముగా ప్రజలలో విజృంభించెను. కాని ఎన్నికలలో కేశవరావుగారు ఓడిపోయిరి.

43. ఆ దినములలోనే 'ఢిల్లీ పార్లమెంటు సభ్యులు'గా నామినేటు చేసుకొనిరి. ఢిల్లీలో పార్లమెంటు సాంప్రదాయాల ప్రకారం అచ్చటి చర్చలలో పాల్గొని దేశమునకు ఎంతయో సేవచేసిరి. వారికి యిచ్చే 'ఎలవెన్సు' వగైరాలు తన జీవితమునకు ఎక్కువే కొన్ని వున్ని వస్త్రములు కొని తన క్రింద తయారయిన వాలంటీర్లకు పంపుచుండెడివారు. పార్లమెంటు సమావేశము లేనప్పడు మధిరలో ఒక గొప్ప బహిరంగ సభ జరిగెను. ఆ సమయములో శ్రీ బూర్గుల వారు కూడ యుండిరి. శ్రీ కేశవరావుగారు ఆ సభలో ఉపన్యసించు చుండగా ఒక వ్యక్తి శ్రీవారిని ఢిల్లీలో మీ అనుభవాలను స్పష్టీకరించవలసిందిగా కోరిరి. దానికి నవ్వుతూ "అన్ని విషయాలు చెప్పాలంటే చాల టయము పడుతుంది. ఒక విషయము మాత్రము చెప్పతా"నని సెలవిచ్చినారు. "నాకు ఇచ్చే పంచదార కూపన్ ద్వారా దొరికేది, చాలక పోయేది. ఆ పార్లమెంటు (ఇతర) తోటి సభ్యులు కొదువలేకుండా పంచదార ఉపయోగించుట చూచి వారితో తాను పంచదార నాకు చాలుట లేదు మీకు ఎట్లు సరిపోవుచున్నది ? అని అడుగగా వారు వెంటనే నవ్వుచూ "పంచదార కేమి కొరత సవాశేరు ఒకరూపాయి చొప్పున మన పార్లమెంటు సభ్యుల నివాస సమీపముననే దొరుకుచున్నది" అనిరి. "కాని నాకు అంటుల బ్లాకులో పంచదార సేకరించుట కిష్టము లేకపోయెను. బ్లాకు మార్కెట్ ఢిల్లీలోనేకాక పార్లమెంటు సభ్యుల నివాసముచుట్టు కూడ ఎట్లు జరుగుచున్నదో తెలియకున్నది.

పార్లమెంటులో కొందరు సభ్యులు బ్లాకు మార్కెటుతోనే వారి జీవితం గడపాలి" అనగానే శ్రీ బూర్గులవారు వారించిరి. కాని శ్రీవారు అంతతో ఆగక "ఉన్న విషయమును చెప్పటకు నేనెందుకు భయపడవలెను"? అని వారి వుపన్యాసము సాగించిరి. అచ్చట ప్రజలందరు శ్రీవారి నిర్దుష్ఠతను కొనియాడుచూ ఢిల్లీ విషయమునకు విస్తుపోయిరి.

44. వరంగల్ జిల్లాలో ఉపఎన్నికలు వచ్చెను. రెండు స్థానములలో శ్రీవారిని కాంగ్రెసువారు నిలబెట్టిరి. ముఠాతత్వముతో, గ్రూపులతో కుమిలిపోతున్న సమయమిది. కొంతమంది కాంగ్రెసువారు నిలబెట్టుట, మరికొందరు కాంగ్రెసు వాదులు రహస్యముగా వేలకు వేలు ఖర్చుపెట్టి కమ్యూనిష్టులతో చేతులు కలిపి రెండు స్థానములలో కూడ ఓడించిరి. ఈ విషయములన్నియు కొద్దిరోజులలోనే వెల్లడి అయ్యెను. దానికి శ్రీవారు చకితులైరి. ఇంతలోనే వారి శరీరారోగ్యము కూడ చెడిపోయెను. ఒకవైపు విచారము రెండవవైపు రాజకీయ ప్రవర్తనలో నాయకుల నైతిక పతనము కుట్రలు ఒక్కొక్కటి బయటపడుచుండగా ఎంతవారైనా ఏమిచేయగలరు. దానితోనే 'రక్తపోటు' వచ్చి హైదరాబాద్‌లో దివంగతులైరి.

(మరచిన విషయములు చివరగా పొందుపరచుచున్నాము)

1. శ్రీ మందుముల రామచంద్రరావుగారు 'ఆంధ్ర మహాసభ అధ్యక్షు'లైన సమయములో మధిరకు విచ్చేసిరి. నిషేదమున్న బహిరంగ సభ జరిగెను. దానికి నాయకత్వము శ్రీవారు వహించిరి. మధిరకు రెండుమైళ్ల దూరములో యున్న రాయపట్నం గ్రామానికి అధ్యక్షుల వారిని తీసుకపోవుటకు అచటి విషయములను తెలుపుటకు అనుమతి కోరిరి. అధ్యక్షులు 'సరే' అనిరి. మధిరకు రాయపట్నంకు మధ్య ఏరుకలదు. రాయపట్నం నుంచి రెండు బండ్లు వచ్చినవి. వారిని అలంకరించబడిన ఒక బండిపై కూర్చుండబెట్టి శ్రీవారును కూర్చొనిరి. రెండవ బండిపై కార్యకర్తలు కూర్చొనిరి. మైలు దాటినది. రాత్రి సమయము మరియొక మైలు వెళ్లవలసియున్నది. అక్కడ నుంచే బురదలో బండ్లు దిగవలసి వచ్చినది. ఒక ఫర్లాంగు ఎటులో నెట్టుక పోయిరి. అటు తరువాత రెండు బండ్లును బురదలో కూరుకొనినవి. బండ్లు నడచుటకు వీలులేకపోయినది. దిగి నడకబాటకు మోకావరకు బురద. వాలంటీర్లు అందరూ త్రోసుకొనుచూ ఒకగంట పైదప బురదనే గండమును గడచిరి. అందరి వస్త్రములు

బురదలో పాడైనవి. ఒడ్డుకు చేరిన తరువాత "ఏమి కేశవరాయుడా! లేనిపోనిది ఎందుకు రాయపట్నం తీసుకవస్తివి" అని శ్రీరామచంద్రరావు గారు అనిరి. వెంటనే శ్రీ కేశవరావుగారు "హైదరాబాద్‌లో సిమెంటురోడ్డుపై కార్లతో పయనించేవారికి నిజాం పరిపాలనలోని గ్రామాల పరిస్థితిని చూపించుటకే తీసుకవచ్చితి"ననిరి. ఆ గ్రామస్తులు గ్రామవెలుపలనే స్వాగతమిచ్చిరి. ఊరేగింపు గ్రామమంతటను జరిగెను. సభకూడ జరిగెను.

2. శ్రీవారు ఎప్పుడు ఎవరిని తనకొరకు ధనము కావలయునని కోరియుండలేదు. కాని ఒకమారు తన పార్లమెంటుకు ఢిల్లీకి సభ్యుడుగా ప్రప్రధమముగా పోవలసి వచ్చినపుడు మాయింటి వద్దనే కూర్చొని, "ఢిల్లీకి ఈ రాత్రికి పోవలయును. నావద్ద ఒకపైస అయిననూ లేదు. ఏమియుతోచటము లేదు. ఎప్పుడూ నాకొరకు నేను ఎవరిని అడిగియుండ లేదు. ఏమి చేయవలయునని" సలహా యడిగెను. ఈ విషయము మాటలాడుచుండగనే శ్రీ పుల్లఖండం వెంకట పురుషోత్తంగారు వగైరాలు మాయింటికి వచ్చిరి. ఈ ఉదంతము వారికి చెప్పితిని. చెప్పినదే తడవుగా ఉదార హృదయులైన శ్రీ పురుషోత్తంగారు "శ్రీవారికి మేముండగా డబ్బు కొరత ఏమిటి ? తప్పకుండా మీ కార్యక్రమము ప్రకారము ఈ రాత్రికే బయలుదేరండి. కావలసిన ధనము నేనుయిచ్చెద"నని శ్రీ వెంకట పురుషోత్తంగారు అప్పటికప్పడే రు. 200 శ్రీవారికి అందించి ఏనాడును ధనమడుగని మహానాయకునికి యివ్వగల అవకాశము భగవంతుడు కలిగించినందుకు ధన్యుడనైతినని ఆనందించిరి.

3. 'రజాకార్ యుద్ధమము'నకు పూర్వము శ్రీవారి యింటి పరిస్తితులు సరిగా లేనందున తనపై ఆధారపడిన తన అర్ధాంగిని, ఇద్దరు కుమార్తులను తీసుకొని వచ్చి మధిరలో కాపురము పెట్టిరి. అద్దెకు యిల్లు తీసుకొనిరి. కాని అన్ని జిల్లాలనుంచి రాబడే వార్తలను బట్టి ఒక నివాసమైన యింటివద్ద నిలిచే వీలుకలిగేదికాదు. ఒక దుకాణముపై చిట్టి వ్రాసి సరుకులు తీసుకోమని వెళ్లేవారు. నెలయిన పిదప కూడ ఇంటికి వచ్చే వీలుకలుగక పోయేది. కరీంనగరం నుంచో, మహబూబ్‌నగర్ నుంచి కాని మెదక్ జిల్లానుంచి కాని త్వరలో వస్తూ వున్నానని జాబులు వస్తూవుండేవి. కాని దుకాణదారువల్ల, అద్దెయింటివారివల్ల కష్టములు కలుగు చుండెడివి. రెండు మాసములు పిదప అమెగారికి ఆ యిల్లు ఖాళీచేసి మధిరకు దగ్గరలో వున్న రాయపట్నం గ్రామములో శ్రీ మల్లెం రామారావుగారి

యింటికి వెళ్లవలసినదని జాబు వ్రాసిరి. వెంటనే ఆమెగారు అద్దెయిల్లు ఖాళీచేసి రాయపట్నం వెళ్లినది. ఆ రోజులలో ఆ మహాసాధ్విపడిన కష్టములు వర్ణనాతీతము. మధిరకు వచ్చి జొన్నలు సేకరించుకొని ఎటులనో మధ్యాహ్నం వేళకు రాయపట్నం వెళ్లి ఎంతో పొదుపుతో కొన్ని సమయములందు ఒక పూట భోజనముతో గడుపుచుండెడివారు. కాని భర్తనుగాని, తన కష్టములనుగాని ఎప్పడూ నిందించేవారు కారు. ఆ మహాసాధ్వి పై పెచ్చు భర్తను వొక్క మాట అనక పోగా, "శ్రీవారు ఎచ్చట యుండిరో ? ఎటు కష్టపడుచున్నారో ? శ్రీవారికి సేవచేయ భాగ్యము నాకు ఎల్లప్పడూ కలుగకుండెనే ?" యని మాత్రము పరితపించు చుండెడివారు. పేరుకు మాత్రము అన్నపూర్ణమ్మగారు కాని 'అన్నపూర్ణ యింటిలోనే అన్నము కరువాయె'నను సామెత అక్షరాల ఈ మహాపతివ్రత పట్ల నిజమాయెను. ఇన్ని కష్టములు పడుచున్ననూ శ్రీవారు కాని, ఆ మహాసాధ్వికాని 70 ఎకరముల భూమి వుంచుకొని పైసా యివ్వని శ్రీవారి పితృపాదులను ఒక్కమాటయైననూ అనెడివారు కాదు. శ్రీవారి పితృభక్తికి ఇది ఒక్కటే ఒక్క నిదర్శనము. ఈ సమయములోనే మధిర తాలూకా తక్కెళ్లపాడులో బహిరంగసభ జరుపమని ప్రజలు కోరిరి. శ్రీ రామానందతీర్థగారు హైదరాబాద్ 'రాష్ట్ర కాంగ్రెసుకు అధ్యక్షుల'గుటచే తారీఖు నిర్ణయించి పిలిపించిరి. ఎఱ్ఱుపాలెం నుంచి శ్రీ తీర్థగారు శ్రీ కేశవరావుగారు కొందరు కాంగ్రెసువారు కలసి బనింగ్ల పాడు వరకు వెళ్లగా అచ్చటి ప్రజలు అలంకరించిన రథముతో సహా ఊరి ప్రాంగణము ఇరువురి నాయకులకు స్వాగతమిచ్చి పై రథము పై ఆసీనుల చేసి గ్రామమంతయు ప్రజలంతా జయ జయ ధ్వానులతో వెంటరాగ ప్రతి యింటను దరహసిత వదనములలో, మహిళలు తమ నాయక ద్వయమునకు మంగళ హారతులిచ్చి, నారికేళములు కొట్టుచుండ మహదానందముగా కన్నుల పండుగగా ఊరేగింపు జరిగెను. అచ్చటి నుంచి తక్కెళ్ల పాడువెళ్లి అచ్చట కూడ ఇటులనే ఊరేగింపు జరిపి బహిరంగ సభ జయప్రదముగ జరిపిరి. ఆనాటి శ్రీవారి ప్రసంగము బహు వుత్తేజకరముగా యుండెను. ఆనాటి ఊరేగింపు చూచినవారి కన్నులే సార్థకము. ఆ ప్రసంగము విన్నవారి చెవులు పవిత్రములు.

5. శ్రీవారికి ఎప్పడునూ 'కోపము' వచ్చెడిదికాదు. కాని మూడు సంఘటనలందు మాత్రము నాకు తెలిసినవి. i) వరంగల్ జిల్లాలో 'యువజన

కాంగ్రెసు సంఘాలు' స్థాపించుట. అటులనే మధిరలో ఒక సంఘము స్థాపించబడెను. శ్రీ మిరియాల జనార్ధన గుప్తగారు దానికి అధ్యక్షులుగా ఉండెడివారు. ఆ సమయములో శ్రీ కేశవరావుగారి పలుకుబడిని తగ్గించుటకు ఆ సంఘములోని సభ్యులచే చర్చకు రాబడెను. దానికిష్టములేని శ్రీ జనార్ధన గుప్త (అధ్యక్షులు) రాజీనామా పెట్టిరి. తరువాత శ్రీ మేళ్ల చెర్వు శోభనాద్రి గార్ని అధ్యక్షులుగా ఎన్నుకొనిరి. దినదినమునకు జిల్లానుంచి ఆదేశములు వచ్చు చుండెడివి. ఆ సమయమున నేను కూడ 'తాలూకా కాంగ్రెసు కార్యదర్శిని', యువజన సంఘమువారు సమాలోచనకు మా యింటికి వస్తూ వుండెడివారు. అప్పడు ఒక జిల్లా నాయకులు కూడా మాయింటికి వచ్చిరి. శ్రీ కేశవరావుగారు మా ఇంటి లోపల యున్నది వారెగరు. జిల్లా యువజన సంఘమువారితో, యువజన సంఘ కార్యదర్శి మమ్ములను ముందుకు పోనిచ్చుట లేదు. శాంతిగ పనిచేయవలసినదని ఇచ్చటి కాంగ్రెసు కార్యదర్శి ఆదేశిస్తూ వుంటారు. శ్రీ కేశవరావుగారు మాటలకు విలువ ఎక్కువిస్తారు. మన మాటలు లెక్కచేయరని" చెప్పచుండెను. ఇది అంతయు కేశవరావుగారు వింటూనే వున్నారు. ఆ జిల్లా నాయకుడు "వారి ఆదేశములు ఈ చెవితో విని ఆ చెవితో వదలి వేయమనియు, వారి ఆదేశములు మీరు లెక్కచేయవద్దు" అని సంస్థకు విరుద్ధమైన బోధలు చేసెను. దానికి శ్రీవారికి ఎంత కోపము వచ్చినదో నేను మాత్రము వర్ణింపజాలను. అది సంఘర్షణకు దారితీయునేమోయని భయపడి వారిని పంపించి వీరిని శాంత చిత్తుల చేయుటకు నాతల ప్రాణము తోకకు వచ్చెను.

ii) 'ఆంధ్ర మహాసభ తాలూకా అధ్యక్షుడు'గా ఒక వకీలు నియమింపబడిరి. ఆరు మాసములువారు అధ్యక్ష పదవిలో వుండి ఒక గుమాస్తాను పెట్టుకొనిరి. విరాళములు వారే వసూలు చేసిరి. లెక్కలు అడుగగా దానికి సరియైన జవాబు చెప్పకపోవుటచే వ్రాయబడెను. విచారణకు కేశవరావుగారు వచ్చిరి. లెక్కలు చూచుటకు వచ్చిననూ రెండు మాసముల వరకు లెక్కలను చూచి కేశవరావుగారు మరల జాబు వ్రాసిరని చెప్పబడెను. శ్రీ వకీలుగారు "నాకాలిబూటు దారము విలువ చేయని కేశవరావుగారు నన్ను తనిఖీచేయటయా ?" అనిరి. ఆ విషయము శ్రీవారు తెలుసుకొని మధిరకు వచ్చిన వారిని నిగ్గచేసి అడిగిన రోజు కోపము చెప్పనలవికాదు.

iii) స్వతంత్రము రాగానే మేజర్ జనరల్ చౌదరి 'రాష్ట్రమిలటరీ గవర్నరు'గా ఏతెంచిరి. వారి పరిపాలనపై పత్రికలతో దుష్ప్రచారము జరిగెననియు,

ఇది అప్పటి తెలంగాణా కాంగ్రెసువారే చేయుచున్నారని, అప్పటి తెలంగాణా కాంగ్రెసు అధ్యక్షుడైన, శ్రీ సర్దార్ కేశవరావుగారిపై నిందారోపణ చేసి అరెస్టు చేయుటకై ప్రయత్నము జరిగెను. ఆ విషయము తెలుసుకొని శ్రీ సర్దార్ "రాష్ట్రము వెలుపలనుంచి వచ్చిన వారికేమి తెలుసు యిచ్చటి విషయము ? అరెస్టు చేసేయడల సిద్ధముగా వున్నాను. నా ప్రజల తరపున నేనెప్పడును వెనుకాడను" అని యెనలేని కోపముతో వారెవరు నా కాంగ్రెసును నిందించుటకు ? తాను చేతనయిన పనిని చేసుకోవచ్చుననిరి.

6. రజాకార్ల అనంతరము శ్రీ కేశవరావుగార్కి పాలవంచ తాలూకా వారు అశ్వారావు పేటకు వారిని ఆహ్వానించి, అశ్వారావు పేట బాబుగారు మొదలగువారు సన్మానించి పదివేల రూపాయల విలువ గల కొత్త కారును కొని శ్రీవారు ప్రచారము చేయుటకు వినియోగించుటకు బహుకరించిరి. దాని సహాయముతో అన్ని జిల్లాలు పర్యటనచేసిరి.

7. 'మొదటి తెలంగాణా శాసనసభ ఎన్నికలలో' శ్రీవారిని మధిర నియోజక వర్గములో సీటు యివ్వవలయునని ఒక మారు, (కాంగ్రెసు) శ్రీ మాడపాటి రామచంద్రరావుగారికి ఇవ్వవలయుననియు మరియొక మారు, అప్పటి రోజులలో శ్రీరామచంద్రరావుగారు P.C.C. జనరల్ సెక్రటరీగా కూడ యుండిరి. శ్రీరామచంద్రరావుగారిని మెజారిటీ కాంగ్రెసువారికి విరుద్ధంగా మధిర నియోజక వర్గమునకు నియమించిరి. ఏ తత్కారణమున కొందరు కాంగ్రెసు వాదులు స్వతంత్ర పక్షమును బలపరచినందున రామచంద్రరావుగారు ఓడిపోయిరి. అట్టి ఆప్రచార సమయములో శ్రీ కేశవరావుగారు వచ్చి కాంగ్రెసును గెలిపించవలయునని ఎన్నో కష్టములకోర్చి మధిర నియోజక వర్గములో ప్రచారము చేసిరి. అయిననూ కాంగ్రెసు ఓటమి చెందెను. పై కారణములవలన స్వతంత్రమునకై పలు బాధలకులోనై అనేక కష్టముల నెదుర్కొన్న ఇరువురు నాయకులు ఓటమి పొందిరి.

8. తెలంగాణాకు స్వాతంత్ర్యము వచ్చిన పిదప హైదరాబాద్‌లో 'అఖిల భారత కాంగ్రెసు మహాసభ' శ్రీ శంకరరావు దేవ్‌గారి అధ్యక్షతన జరుపబడెను. లక్షలాది ప్రజలు వచ్చిరి. సభా సమావేశమునకు అర్హతల ప్రకారము సీటింగ్ అరెంజ్‌మెంటు చేయబడెను. అట్టి సమయములో శ్రీ సర్దార్ గారికి ధనములేనందున సమావేశములో పాల్గొనుటకు టిక్కటు (అర్హత పత్రము) లభించలేదు. కాంగ్రెసు అంటే ఎరుగనివారికి పదవులు గదా !

ఏమీ తోచక గుడారము బయట తిరుగుచున్న శ్రీవారిని టిక్కట్లు కొరకై ఆశ్రయించుటకు మరియొక పరిచితుడు వచ్చెను. ఏమి చేయుదుమా అని ఆలోచించుచుండ మధిర తాలూకా వాసులైన పరిచితులు కనిపించగా వారిని శ్రీవారు పిలచి "మీకు టిక్కట్లు సమావేశమునకు లభించినవా ?" యని అడుగగా మాకు దొరకక పోవుట యేమి ? అదనముగా కూడా కలవని" చెప్పిరి. అంతట శ్రీవారు ఒక టిక్కట్లు యిమ్మని అడుగగా వారు "మీకు దొరకక పోవటమో" అని ఆశ్చర్యము పొందుచూ, 'మా బోటి నాయకులకు కొల్లలు కొల్లలుగా దొరుకుచుండ' అని అనుచూ ఒక టిక్కట్లు యిచ్చిరి. ఇచ్చినదే తడవుగా మహదానందముతో ఆ టిక్కట్లును స్వీకరించి ప్రక్క స్నేహితునికిచ్చి వారిని లోపలకు పంపితాను తరువాత వస్తానని పంపగా మధిర వారు చూచి, "యిదేమిటండీ మీకు అవసరములేదా ?" అని అడిగి, "మావద్ద యింకను కలవు. మరియొకటి తీసుకొమ్మ"నిరి. అందుకు శ్రీవారు, "ఇప్పటి కాంగ్రెసువారి దృష్టిలో నేను సమావేశమునకు హాజరు కాగల అర్హతకలవాడను కానని యున్నది. అట్టి తరి నేను ప్రవేశించుట యుక్తముకా"దని నగరము వైపు వెళ్లిరి. అట్టి మహానాయకులు అడుగు పెట్టజాలని కాంగ్రెసు అగుటచేతనేమో ఇప్పుడు ఆ సంస్థకు పునరుజ్జీవింప చేసుకొనుగతిపట్టినది.

9. అది 'ఆంధ్ర మహాసభ' సమయము. తొమ్మిదవ ఆంధ్ర మహాసభకు శ్రీ మాదిరాజు కోటేశ్వరరావు అడ్వికేట్ అధ్యక్షులవారి సభానంతరము మధిర తాలూకా పర్యటనకు వచ్చి మధిర తాలూకా కార్యదర్శి శ్రీ మిరియాల నారాయణ గుప్తని సహాయముగా తీసుకొని లంకపల్లి, వెంనూరు వగైరా గ్రామాదులు సంచరించి తల్లాడను వచ్చునంతలో శ్రీ కేశవరావుగారి ఆధ్వర్యమున వేమిశెట్టి అనంత రామయ్యగుప్తా సహకారముతో కాంగ్రెసు ఝుండాలతో అలంకరించి అధ్యక్షులను గ్రామములో ఊరేగించుటకై ప్రజాసందోహముతో తయారుగా వుండెరి. శ్రీ అనంత రామయ్యగారు అధ్యక్షులైన శ్రీ రామకోటేశ్వరరావుగారిని 'రధారోహణ' చేయుమని కోరగా రధము కాంగ్రెసు ఝుండాలతో అలంకరించుటచే ఎక్కుటకు సాహసించక తిరిగి ప్రార్థించగా "శ్రీ కేశవరావుగారు మునుముందు అధిరోహించిన నేను అధిరోహించెద"నని చెప్ప అత్యుత్సాహముతో పొంగులు వారు యువ్వనులైన శ్రీవారు అధిరోహించగా అధ్యక్షులవారు కోటేశ్వరావుగారు అసీనులైరి. అప్పడు మిగుల అనందముగా ఊరేగింపు జరిగెను.

10. శ్రీవారు తన పెద్దకుమార్తె వివాహము చేయవలయుననని ఉత్సుకతతో యుండిరి. సంబంధము మంచిదిగా యుండవలెనని వెదకుచూ ధనము కొరకై ఆలోచించు చుండెడివారు. ఈ విషయము తండ్రిగారికి చెప్పుటకు వెనుకాడు చుండగా ఎఱ్ఱుపాలెంలోనే వరుడు దొరికెను. అమితానందము పొందెను. వివాహము నిశ్చయింపబడెను. సంభారములు వాటంతట అవే రాదొడగెను. అది చూచి తండ్రిగారికి కూడా ఆనందము పొంగి యధోచితముగా ధనమును కూడ వివాహమునకు ఖర్చుపెట్ట దొడగెను. వందలాది మంది ఆహ్వానించి వారందరిని సముచితముగా గౌరవించిరి.

11. శ్రీసర్దార్‌కు కుడిభుజముగా ఎప్పడునూ శ్రీ బొమ్మకంటి సత్యనారాయణ గారుండేవారు. శ్రీవారి సత్యసంపద న్యాయ మార్గమునకు ముగ్ధులయ్యేవారు. వారు ఎచ్చటుంటే అచ్చటకు వెళ్లి కార్యక్రమము లెలుసుకొని జిల్లా కార్యక్రమము వారితో చెప్పచుండెడివారు. అట్టి సమయములోనే వరంగల్ జిల్లాలో ఉపఎన్నికలు వచ్చినది. అట్టి పరిస్థితులలో కాంగ్రెసు కులమత బేధములతో లోలోపల కుమిలి పోవుచుండెను. నాయకులు వరంగల్‌లో సమావేశమయిరి. "ఈ ఉప ఎన్నికలకు మీరు నిలుచుట కూడదు. ఒకరు నిలబెట్టుటకు మరియొకరు పడగొట్టుటకు సిద్ధముగా వున్నారని" శ్రీ బొమ్మకంటి అనగా, "అట్టి అన్యాయము జరుగదు. నన్ను పెద్దమీరే ! నిలుచొమ్మని బలవంత పెట్టుచున్నారు లేకపోతే క్రమశిక్షణ చర్య తీసుకొంటామని అంటున్నారు. కనుక నిలుచుంటా"నన్నారు. దానితో వుభయులకు అభిప్రాయ బేధాలు కలిగెను. ఎన్నికలలో జయముపై నమ్మకము లేని బొమ్మకంటి యింటికి మరల వచ్చిరి. ఆ ఎన్నికలలో ప్రచార నిమిత్తము శ్రీవారి జాబు రాగానే వర్కర్లను ...... యాభై మందిని వరంగల్‌కు పంపబడెను.

12 పోలీసు యాక్షను అయిన తరువాత కాంగ్రెసు పునర్నించుటకు 'రాష్ట్ర కాంగ్రెసు' స్థాపించవలసి యుండెను. ఆ అధికారము కొరకై కీచులాట జరుగుచుండెను. కాని తుదకు శ్రీ కేవవరావుగారినే 'ప్రప్రధమముగా కాంగ్రెసు' అధ్యక్షునిగా నియమించిరి. పరిపాలన ................................ నీవా ? నేనా ? అనికూడ కుమ్ములాటలు జరుగుచుండెను. ఆ సమయములో రాష్ట్రమందంతట 'ప్రాధమిక సభ్యత్వము' జరుపవలసియుండెను. దానికి కావలసిన హంగులన్నియు తయారు కాబడెను. అధికారము కోసమై ఢిల్లీకి, 'అతివాదులు', 'మితవాదులు' అనే

పేరుతో తిరుగుచుండిరి. ఉభయ గ్రూపులకు రాజీకుదరకపోయెను. ఢిల్లీలో ఒక గ్రూపు వారి ఆదేశానుసారము మితవాదులనబడేవారు. 'పోటీ కాంగ్రెసునే' స్థాపించిరి. గ్రామ తాలూకా, జిల్లా కాంగ్రెసులన్నియు రెండుగా విభజింపబడెను. విభేదములు నాయకులలో ప్రజలలో తర్కవితర్కములతో ఏర్పడ నారంభించెను. అట్టి సమయములలో ఉభయ నాయకులు మరల పోయి కేంద్ర నాయకులు, శ్రీ కేశవరావుగారు, శ్రీ మాడపాటి రామచంద్రరావుగారు రాజీ జరిపి పోటీ సంఘములను రద్దుచేయుటకు, కాంగ్రెసు సభ్యత్వము సంపూర్తి చేసి ఎన్నికలు జరిపి ఎన్నికలలో వచ్చువారే అధికారమునకు రావలయునని తీర్మానింపబడెను. ఆ ఎన్నికలలో డెలిగేటుగా శ్రీ కేశవరావుగారు మధిరలో నిలబడెను. కాని లోలోపల అభిప్రాయములు పెచ్చు పెరిగి డెలిగేటుగా రాకుండుటకు సర్వ విధముల ప్రయత్నములు జరిగెను. కాని శ్రీ కేశవరావు గారినే ప్రజలు ఎన్నుకొనిరి. స్టేటు కాంగ్రెసుకు కూడ ఎన్నికలు జరిగి తెలంగాణా అధ్యక్షుడుగా శ్రీ రంగారెడ్డిగారు ఎన్నుకోబడిరి. రావు, రెడ్డి గ్రూపులు అనేవాటికి అప్పడే పునాదులు పడెను.

13. 'రజాకారుల పీరియడ్' అయిన పిదప స్టాంటింగు కమిటీ సమావేశమయ్యెను. శ్రీవారి అధ్యక్షతతో సమావేశము రెండు రోజులు జరిగెను. కాని అధికారము కొరకై తీర్మానములలో విభేదములు ప్రారంభమయ్యెను. ఎట్టకేలకు అభిప్రాయ భేదములలోనే సభ ముగింపబడెను.

14. శ్రీవారు గతించిన పిదప తండ్రికూడ వారి పన్నెండవరోజునే గుండెపోటు వలన మృత్యువాతపడెను. తన కుమారుని గొప్పతనాన్ని రాష్ట్ర నాయకులందరు వచ్చి పరామర్శించుట మొదలగునవి చూచి నా కుమారుడు ఎంత పెద్దవాడయిననూ నేను గుర్తించకపోతినని విచారముతో .........



# 12. నా రాజకీయ జీవితములో సర్దార్‌జీతో నాకు గల పరిచయం

- శ్రీవేమశెట్టి అనంత రామయ్య గుప్తా గారు
స్వాతంత్ర్య సమరయోధుడు, తల్లాడ

వరంగల్ జిల్లా ఖమ్మం పట్టణంలో 1934 సంవత్సరంలో కీ.శే. పులిజాల వెంకట రంగారావు గారి అధ్యక్షతన జరిగిన 'తృతీయాంధ్ర మహాసభ' సందర్భంలో వారిని సందర్శించు భాగ్యం నాకు కల్గింది. సర్దార్జీ వయస్సు అందాజా 27 సం॥ వుండవచ్చు. ఆయన ఆజాను బాహువు. మనిషి బలిష్టుడు. స్ఫురద్రూపి. ఆయన చిరునవ్వు ఎప్పుడూ పెదవులపై తాండవిస్తూ వుండెడిది. కాఫీ సిగరెట్ మాత్రం ఎక్కువగా వాడుతుండే వాడు. ఆయన నిరాండంబర జీవి. ఖద్దరు దారి. బొత్తము లేని లాల్చి ధరించెడివారు. ఆయనతో కలసి నేను, మా సహచర బృందము మహాసభ కార్యక్రమం పూర్తి అగువరకు రాత్రింబవళ్ళు అనక పనిచేసెడివారము. ఒకచోటనే పరుండి ఒక చోటనే వుండేవారము. ఈ కారణము వలన వారితో మాకు ఎక్కువ సన్నిహిత సంబంధము ఏర్పడినది. వారిని మా సహచర బృందము ఎక్కువగా గౌరవించెడివారము. వారే మన భావి కార్యక్రమమునకు నాయకులు కావలెనని కాంక్షించెడివారము. వారి జన్మస్థానము రాజకీయ దురంధరులకు నిలయమైన ఎఱ్ఱుపాలెం గ్రామం. ఇది మధిర తాలూకాకు చెందినది. వారి తండ్రి గారు అక్కడ గ్రామ పట్వారి. ఒక ఆచార కుటుంబమునకు చెందినవారు. వారి భార్య వెంకట నర్సమ్మగారు మహాసాధ్వి. వారికి మన కేసవ రావు గారు జ్యేష్ఠ పుత్రులు. వారిని అతి గారాబముగా సాకినారు. వారిలో ఎన్నో ఆశలు పెట్టుకొని విద్యాబుద్ధులు జరిపించి, కరోడ్గిరి శాఖలో అమీన్ (ఇన్స్పెక్టర్)గా ఉద్యోగము యిప్పించినారు. ఆనాటి నిరంకుశ నిజాంపరిపాలనలో అంతటా అవినీతి అక్రమాలు పెచ్చు పెరుగుటలో సహించలేక కొంతకాలమునకు వుద్యోగ విరమణ చేయవలసి వచ్చింది. తదాది ప్రజా శ్రేయస్సు దృష్ట్యా జాతీయ భావాలు గల మన సర్దార్ కేశవరావుగారు రంగములో ప్రవేశించవలసి వచ్చినది. ఆనాడు సర్దార్జీ త్యాగనిరతిని, కార్య

దీక్షతను గమనించిన పితామహులు కీ.శే. మాడపాటి హనుమంతరావు గారు మొదలైన వారు గ్రంథాలయోద్యమము 'సంఘ సంస్కరణల పేరిట' సాగించబడు రాజకీయ ప్రచారము తెలంగాణా ప్రజల్లో నిద్రాణమైయున్న శక్తిని మేల్కొలిపి చైతన్య వంతముగా చేయు సమయము ఆసన్నమైందని భావించినారు. వారి వ్యక్తిగత భావము సర్దార్జీ మీద ఎంతగానో పడింది. మేము సర్దార్జీని మాప్రాంతమునకు నాయకత్వము వహించవలసినదిగా కోరినాము. వారు మా కోరికను త్రోసి పుచ్చక, నవ్వి అందులకు వారు మనస్ఫూర్తిగా మా ప్రాంత నాయకత్వమును స్వీకరించుటకు సంతోషముగా అంగీకరించినారు. అప్పటి నుండి, వారి దృష్టిని మా ప్రాంతపు గ్రామాదులపై ప్రసరింపచేసి, రంగమున ప్రవేశించినారు.

'స్వాతంత్ర్య సముపార్జన'కు పూర్వము గ్రామముల పరిస్థితులు మిక్కిలి అధ్వాన్నముగా యుండెడివి. తెలంగాణా జిల్లాలో జమిందారులు, జాగిర్దారులు, దేశ ముఖులు, దేశపాండ్యాలు, మక్తెదారులతో నిండియున్నది. ప్రజలు వారి ఆగడములను తట్టుకొనలేని పరిస్థితులలో మసలు తుండెడివారు. గ్రామాదులలో త్రాగుటకు నీరు లేక, వ్యవసాయమునకు వనరులు లేక, చదువుటకు పాఠశాలలు గ్రంథాలయములు లేకవుండెడివి. పోస్టాఫీసులు, విద్యుత్‌శక్తి మున్నగు సదుపాయములు కూడా ఏమి లేకుండెడివి. కరువు కాటకములలో పన్నులు చెల్లించుకోలేక నిరక్షరాసులై అంధకార బంధురములో మ్రగ్గుతు అల్లాడుతున్న రోజులవి. ఆనాడు దేశములో రాజకీయ ప్రచారమునకు తావు వుండెడిది కాదు. బహిరంగ సభలు, సమావేశములు నిషేదింపబడినవి. 'సంఘ సంస్కరణలు', 'గ్రంథాలయోద్యమము' పేరిట మాత్రమే రాజకీయ ప్రచారము చేసుకొనుటకు అవకాశముండెడిది.

మా ప్రచార కార్యక్రమములో పాల్గొని మాముందుండి ఉద్యమమును నడిపించ వలసిందిగా సర్దార్జీని కోరినాము. అప్పుడు వారు మాగ్రామము (తల్లాడ) ను కేంద్రముగా తీసుకొని మా వద్ద నెలల పర్యంతరము వుండె పనిచేసెడివారు. వారి నాయకత్వములో మేము అందాజా 25 మంది సుశిక్షితులమైన కార్యకర్తలము రాత్రింబవళ్లు అనక పనిచేయుటకు సిద్ధముగా వున్నాము. వారిలో ముఖ్యమైన వారలపేర్లు ఇక్కడ వుదహరించుట ముఖ్యమని భావించి తెల్పుగొనుచున్నాము.

1. సర్వశ్రీ గువ్వల నర్సింహారెడ్డి
2. సర్వశ్రీ ప్రత్తిగడప రామరాజు
3. „ తోక చిచ్చు చింపలరాజు
4. „ వేణుగోపాల గుప్త

5. సర్వశ్రీ వీర నాగభూషణం 6. సర్వశ్రీ శంకర శాస్త్రి
7. „ కోనా రామచంద్రయ్య 8. „ కొత్తగుడ్ల సుబ్బారావు
9. „ కొసరి రంగారెడ్డి 10. „ మోటమర్రి కుమారస్వామి
11. „ పింగళి తిరుమలరావు 12. „ గుంటుపల్లి కోటయ్య చౌదరి
13. „ గుంటుపల్లి రామచంద్రయ్య

మున్నగు వారము వారి ఆదేశాను సారము ప్రోగ్రాంననుసరించి నిర్దుష్టమైన కార్యక్రమములను నిర్వహించెడివారము. మా గృహము ఎల్లప్పడు వచ్చి పోయెడి కార్యకర్తలతో కిటకిటలాడుచుండెడిది. ఈ పరిస్థితిలో మా శ్రీమతి రుక్మిణమ్మ నాకు చాలచేదోడు వాడోడుగా వుండెడిది. వచ్చి పోయెడి రాజకీయ అతిధులందరికి ఆదర పూర్వకముగా వంట చేసి పెట్టేది. ఇంటిలో ఒక్కర్తె అయిన కారణంగా సర్దార్జీ కూడా కొన్ని సందర్భములో వడ్డన చేసెడివాడు. కార్యకర్తలందరూ యించుమించు ఆమెకు తోడ్పడుతూ వుండెవారు.

1930 సం॥ ఆ ప్రాంతములో ఖమ్మం తాలూకా కీదుమూరు గ్రామ వాస్తవ్యులు శ్రీ ఊటుకూరు వెంకట రామారావు గారు, మండవ వాస్తవ్యులు శ్రీ జిడికంటి అయిత రాజు రామారావు గారు, శ్రీ కోదాటి నారాయణరావుగారు మున్నగు ప్రముఖులు మా గ్రామము విచ్చేసి 'స్వాతంత్ర్య సమితి ఆంధ్ర గ్రంథాలయము' అను పేరుతో వొక గ్రంథాలయమును స్థాపించి వెళ్ళినారు. అనంతరము పోలీసు, రెవెన్యూ అధికారులు ఆగ్రహమునకు గురికావలసి వచ్చింది. వారు పర్మీషన్ లేకుండా గ్రంథాలయమును స్థాపించినారు. పర్మీషన్ వచ్చు వరకు గ్రంథాలయమును మూసి వేయవలసిందిగా ఆజ్ఞాపించినారు. దానిపై పోలీసు వారి తళ్ళకు తట్టుకొనలేక శ్రీయుత పూజ్యులైన మాడపాటి హనుమంతరావు గారికి మా స్థానికాధికారుల దౌర్జన్యము, ఆగడముల గురించి వ్రాసుకొనగా వారు మమ్ములను భయపడవద్దని మాకు లేఖవ్రాస్తూ అక్కడ హైదరాబాద్ పట్టణంలో గల ఉన్నతాధికారులతో సంప్రదించి, ఇక్కడ అధికారులు, మమ్ముల మందలించకుండా గ్రంథాలయమునడుపుకొనుటకు అవకాశము కల్పించినారు. ఈప్రకారము ఎన్నియో సందర్భములలో ఆంధ్రపితామహులు మాకు తోడ్పడుతూ వచ్చినారు. తరువాత కొన్ని గ్రంథాలయములు మరియు సంఘ సంస్కరణల గురించి గ్రామాలలో విస్తృతంగా ప్రచారము చేయగలిగినాము. అప్పటికి అధికారులు, పోలీసులు, మమ్ము వెన్నంటియే వుండెడివారు. అక్కడక్కడ జరుపబడు సమావేశములకు సర్దార్జీ, శ్రీయుత బొమ్మకంటి సత్యనారాయణ రావు గారు శ్రీ కొలిపాక రామకిషన్‌రావు గారు మధిర పితామహులు అయిన కీ.శే. మిరియాల

నారాయణ గుప్తా గారు కూడా మా ఆహ్వానాన్ని పురస్కరించుకొని వచ్చి తమ సందేశములను ఉపన్యాసముల ద్వారా వెలిబుచ్చిడివారు. సంఘ సంస్కరణల గురించి మేము చేయు పలుచోట్ల ప్రచారములలో శ్రీ కోదాటి నారాయణ రావుగారు, శ్రీ మండ్రాజు వెంకటేశ్వరరావుగారు, ఎన్నో పర్యాయములు మా ప్రాంతములనకు వచ్చి సనాతన బ్రాహ్మణ అడ్డంకులను వీరేశలింగం పంతులు గారి ఏడవ సంపుటం యొక్క ఆధారములతో వారిని ఎదుర్కొని వారే సహాయపడుచుండెడివాడు. తరువాత సర్దార్జీ నాయకత్వమున జరుపబడిన మా అనేక కార్యక్రమములలో కూడా గౌరవనీయులైన హయగ్రీవాచారిగారు మరియు ఆనాటి 1942 సం॥ ఆంధ్ర మహాసభ అధ్యక్షులైన కీ.శే. మాదిరాజుఉ రామకోటేశ్వరావు గారు, శ్రీ రాజలింగం గారు, భండారు చంద్ర మౌళిగారు మున్నగు నాయకులు కూడా మా ఆహ్వానమును పురస్కరించుకొని, వచ్చి, ప్రజలకు తమ సందేశము నొసంగెడివారు. సర్దార్జీ ప్రతి చిన్న గ్రామములలో కూడా సమావేశములు ఏర్పరచి ప్రజలను ఉర్రూత లూగెంచెడివారు. ఉపన్యాసములను ఇచ్చి ప్రజలను చైతన్య వంతులుగా చేయ గలిగాము. అంతయే గాక సమావేవములకు పట్టణ, జిల్లా, తాలూకా, గ్రామాదుల నాయకలును కూడా ఆహ్వానించి ప్రజలకు ధైర్యమును నెలకొలిపెడివారు. అప్పడు ప్రచార సందర్భములలో పనిచేయుటకు మా వద్ద మూడు 'బుఱ్ఱ కథలు' దళములు పనిచేయుచుండెడివి. (1) శ్రీ కూరపాటి వెంకట్రాజు (2) శ్రీ గుడ్ల సత్యం (3) శ్రీ పింగళి తిరుమలరావు. దళములు పని చేయుచెండెడివి. సర్దార్జీ ఈ మూడు దళములలో ప్రోగ్రాం ఏర్పాటు చేసి గ్రామ గ్రామములలో విధి విరామము లేకుండా ప్రచారము చేయుచుండెడివాడు.

## స్టేట్ కాంగ్రెస్ అవతరణ :

ఆనాడు నిజాం నిరంకుశ ప్రభావము ప్రజలలో వ్యతిరేకముగా బ్రహ్మాండమైన కుట్ర ప్రారంభింప తలపెట్టెరి. ఆకుట్రను వమ్ము చేసేందుకు కార్యచరణ సమితి ఒకటి ఏర్పడి తన సర్వశక్తులును సమీకరించి ఉద్యమాన్ని సమాయత్తం చేయటంలో దానిపై గ్రామాదులలో ఒక విధమైన విప్లవ భావం ఏర్పడింది. స్టేట్ కాంగ్రెస్ ఆవిర్భావమునకు మన రాష్ట్ర నాయకులు కృషి ఫలితంగానే ఆంధ్ర, మహారాష్ట్ర, కర్ణాటక సమ్మేళన ఫలితంగా స్టేట్ కాంగ్రెస్ ఆవిర్భవించింది. ఒక వైపు రజాకార్ల వుద్యమం ప్రారంభమై రాష్ట్రమంతట శాకోపశాఖలుగా విస్తరించి మతోన్మాద శక్తిగా వ్యాపించినది. కాంగ్రెస్ కార్యకర్తలు నాడు బాహాటంగానే ప్రచార సన్నాహాలను ఉధృతం చేయక తప్పింది కాదు. దీని

ఫలితంగా ఈ రెండు పార్టీలు గ్రామాదులలో అక్కడక్కడ ముఖాముఖి, ఎదుర్కొనవలసి వచ్చింది. ప్రజలలో ఉద్రిక్తతలు పెరిగి రజాకార్ల వలన కలిగిన విషమ పరిస్థితులను ఎదుర్కొనక తప్పింది కాదు. ఈ కారుణ్యం తో రజాకార్లు పలుచోట్ల గృహదహనాలు, మానభంగాలు, దోపిడి వగైరా క్రూరకృత్యాలు ప్రభుత్వం అండదండలతో 'రజాకారుల ఉద్యమం' మితిమీరిపోయింది. అప్పుడు మన సర్దార్జీ కూడా ఈ అదను చూచుకొని స్టేట్ కాంగ్రెస్ ఉద్యమాన్ని తీవ్రతరం చేయక తలపెట్టారు. ప్రజలలో ఏర్పడిన భయభీతులను తొలగించుటకు రాష్ట్ర నాయకులైన స్వామి రామానంద తీర్థ, శ్రీ వల్లూరి బసవరాజు, శ్రీ మందుముల నరసింగరావు, మహర్షి బద్దాలి శ్రీ మాడపాటి రామచంద్రరావు గారు మున్నగు నాయకులను ఆహ్వానించి అక్కడక్కడ బహిరంగ సభలు ఏర్పాటు చేయడమైనది. ఈ మహానాయకులంతా ఆనాడు మాకు రాజకీయ అతిధులుగా వుండి సంఘ సమావేశములలో తమ దివ్య సందేశముల ద్వారా అనతి దూరములో వున్న స్వాతంత్ర్య సముపార్జనకు నడుము కట్టవలసిందిగా విజయ శంఖారావమును పూరించి నారు. దానిపై ప్రజలలో నిక్షిప్తమై యున్న 'స్వాతంత్ర పిపాశావేశాలు' పెల్లుబుకి మండే గుండెలలో అగ్ని జ్వాలల్లా ప్రకోపింప జేసినవి. ప్రజల హృదయాలు అదనుకై అర్రులు చాచినవి. అలాంటి మహత్తర పరిణామములు ఎప్పుడు వచ్చునాయని ఆవేదన పడిన మన సర్దార్జీ గారు ప్రజల మన స్థత్వాలను గుర్తించి అదను పురస్కరించుకొనిన వారై మారుమూల గ్రామాదులకు సహితము మా అనుచర బృందముతో పర్యటించి రాత్రింబవళ్ళు అనక శ్రమించి ఉదృత ప్రచారము చేసి విప్లవ జ్వాలలను ప్రకోపించ చేయగలిగారు. ఈ పరిస్థితులను గమనించిన నిజాం ప్రభుత్వం దద్దరిల్లి పోయి ప్రజలకు వ్యతిరేకంగా బ్రహ్మాండమైన ఒక కుట్రను పన్నవలసివచ్చింది. అందుకే 'స్టేట్ కాంగ్రెస్' ప్రజల యీతిబాధలను గమనించి, 'కార్యాచరణ సమితి' నిర్ణయ ప్రకారము 'సహాయ నిరాకరణ ఉద్యమము', 'సత్యాగ్రహములు' జరిపి అవసరమైతే జైళ్లకు కూడా వెళ్లవలసినదిగా ఆదేశాలు పంపబడినవి. ముఖ్యకార్యకర్తలు ధైర్యముతో జైళ్లకు వెళ్లదలచినవారు గ్రూపులుగా ఏర్పడి 'సత్యాగ్రహమును' చేయుటకు 1947 ఆగస్టు 7,8 తారీఖుల నుండి ప్రారంభించబడినది. అప్పట్లో మా గ్రామము తల్లాడ నుండి అఖండ ప్రజానీకము మధ్యన ఆరుగురు కార్యకర్తలను దఫాల వారిగా 'సత్యాగ్రహము' చేసి జై జై ధ్వానాలు మధ్య ఆగస్టు 11, 12 తారీఖులలో వరంగల్ జైలుకు తరలింపబడినారు. జైళ్లకు వెళ్లినవారిలో నేను (వేమిశెట్టి అనంతరామయ్య గుప్తా) (2) శ్రీ జి. నరసింహారెడ్డి (3) శ్రీ కె. రామచంద్రం (4) శ్రీ కె. సుబ్బారావు (5) శ్రీ కుమారస్వామి (6) శ్రీ కె. శంకర శాస్త్రి గారలు కలరు.

## జైళ్ల పరిస్థితి :

ఆనాడు జైళ్ళ పరిస్థితి గురించి నా స్వానుభవముతో క్లుప్తముగా కొన్ని సంఘటనలను మాత్రమే ఇక్కడ వుటంకించుచున్నాము. సర్దార్ కేశవరావు గారు మరియు వారి అనుచరులు మాకంటే రెండు రోజులు ముందుగానే మధిరలో సత్యాగ్రహము చేసి అరెస్టు అయి వరంగల్ సెంట్రల్ జైలుకు 'బి' క్లాసుకు పంపబడినాము. మా అందరికి 'సి' క్లాసు ఇచ్చి ఖమ్మం, మధిర సత్యాగ్రహులు వున్న బ్యారక్‌లో ప్రవేశ పెట్టినారు. మా కంటే ముందుగా కొద్దిమంది మాత్రమే జైల్లో బంధింపబడియున్నారు. మేము వెళ్లిన తరువాత దిన క్రమేణా తండోపతండాలుగా గ్రామాదుల నుండి కార్యకర్తలను అరెస్టు చేసి తీసుకు రాబడినారు. వారందరిని ఉద్యమ తీవ్రతననుసరించి పెక్కు బాధలకు గురిచేసి నానా చిత్ర హింసలతో పట్టుకు రాబడినారు. అప్పటికి రెండు మాసముల ఉద్యమము నడిచినది. అందాజా పదిహేను వేలమంది రాజకీయ ఖైదీలను జైళ్లోలో నిలిపినారు. ఒక్కొక్క బ్యారక్‌లో 60, 70 మంది కార్యకర్తలను వుంచినారు. వారందరికి మరుగు దొడ్లు, నీటి కుళాయిలు అందులోనే వుండెడివి. ఉదయం, సాయంత్రమే అందరినీ బయటకు తీసి 'బాట్నీ' ఇచ్చెడివారు. ఇక 'బాట్నీ' విషయానికొస్తే ఒక్కొక్కరికి రెండు రొట్టెలు, రెండు లోటాలు వెల్లి పాయ చారు మాత్రమే యిచ్చెడివారు. వారు రొట్టెలను జొన్న, సజ్జ, మొక్కజొన్న, తైద పిండ్లతో చేసేవారు. ఇవి పుచ్చినవి, రాళ్లు మున్నగు వాటితో తయారుచేసి ఉదయం, సాయంత్రం ఇచ్చెడివారు. ఈప్రకారం ఈ ఆహారమును తీసుకోలేక నానా ఇబ్బందులు పడి రోగములకు గురి కావలసి వచ్చినది. జబ్బు పడినవారికి 'జైలు డాక్టర్' పరీక్ష జేసి వారి సర్టిఫికేట్‌పై రెండు పూటలకు చాలి, చాలని అన్నము మాత్రము ఇచ్చెడివారు. అది కూడా రాళ్లు, మెరిగలతో కూడా వుండెది. ఈ తిండి తినలేక జైల్లోకి రాజకీయ ఖైదీలందరము అపుడపుడు నిరాహార దీక్ష చేయవలసి వచ్చేది. విప్లవ భావాలు గలవారిని వెలుతురు, గాలి, నీరు లేని చీకటి గదులలోనికి తీసుకు వెళ్లి బంధించెడివారు. వారు మారుమూల ప్రదేశములలో నిర్మింపబడిన ఆ గదులలో వుండలేక బెంబేలు పడి పోయెడి వారు. మేము ప్రతిదినము మా దినచర్యలు రాజకీయ ఖైదీలందరము కాలకృత్యముల తీర్చుకొని ప్రతి ఉదయము సెన్సారు చేయబడి రాబడిన పత్రికలను క్షుణ్ణముగా చదివి బయటి విషయములను తెలిసి కొనెడివారము. జైల్లో మాకు జరుగు ఇబ్బందులను వివరముగా వ్రాసి ' పాకెపని' వారి ద్వారా బయట వున్న కార్యకర్తలకు అందజేసెడివారము. ఎవరి బ్యారక్‌లోని వారు, వారి భవిష్యత్ కార్యక్రమం గురించి మాట్లాడుకొనెడివారము. మా బ్యారక్‌లోని ముఖ్యకార్యకర్తలు

గెల్లా కేశవరావు గారు, పెరవల్లి వెంకట రమణయ్య గార్లు ఎక్కువగా రాజకీయ గోష్టి జరుపు చుండెడివారు. మా అందరిలో చిన్నవాడైన దాశరధిగారు కూడా మా బ్యారక్‌లోనే వుండెడివారు. అప్పటికే వారు కవిగా పద్యములు వ్రాయుచుండెడివారు. జైల్లో నిందితులుగా శిక్షబడివున్న ఖైదీల ద్వారా మా నిత్య కార్యక్రమమును తెలుసుకొని జైలు అధికారులు మా పట్ల దురుసుగా ప్రవర్తించెడివారు. ఎక్కువగా ఖమ్మం, మధిర తాలూకా వారే జైల్లో విప్లవ భావాలు రేకెత్తించుచున్నారని తలవని తలంపుగా ఒకరోజు అర్ధరాత్రి సమయములో నిజామాబాద్ సెంట్రల్‌జైలుకు పంపబడుట జరిగినది. అప్పటికి మూడు మాసముల కాలము వరంగల్ జైల్లో గడచిపోయినది. ఇరవై వేలమంది సత్యాగ్రహులతో జైలు కిక్కిరిసిపోయినది. రాను రాను సాహసోపేతమైన 'కాంగ్రెస్ వుద్యమం' తీవ్రతను దాల్చింది. మరొక వైపు 'రజాకార్లు వుద్యమం' కూడా విస్తరించి రాష్ట్రము అరాచకములకు కారణమైంది. నిజామాబాద్ ప్రాంతము ఎక్కువగా రజాకారులకు ఆటపట్టైంది. ఖద్దరు ధరించిన ప్రతి వానిని తమ శత్రువులుగానే భావించెడివారు. జైల్లోని పరిస్థితులు వరంగల్ జైలుకన్నా ఎన్నో రెట్లు అధ్వాన్నముగా వుండెడిది. జైలు అధికారులందరూ ఇంచుమించు రజాకార్ల అభిమానులేనని చెప్పవచ్చును. జైలు ప్రవర్తనలో మేము ఎంత క్రమ శిక్షణగా నున్ననూ జైలు అధికారులు, వార్డెనులు మా పట్ల ఎంతో హీనముగా వుండెడివారు. జైలు ఒక పద్ధతి ప్రకారముగా నిర్మించినది కాదు. ఒకప్పుడు 'గుట్టబోటి' పై నిర్మింపబడిన దేవాలయమని తలంవచ్చును. అందు త్రిమూర్తుల విగ్రహములు, వాటి చిహ్నములు అప్పటికినీ కనపడుతునే వుండేవి. జైలు సిబ్బంది మా పట్ల ఆహార విహారములందు కటువుగానే వ్యవహరించెడివారు. నెలలు గడచి పోతునే వున్నాయి. ఒక రోజు సాయంత్రం 7,8 గంటల సమయంలో అసంఖ్యాకమైన రజాకార్లు జైలు సిబ్బందితో కుమ్మక్కై జైలు చుట్టుముట్టి గేటు తాళములు తీసుకొని లోపలికి ప్రవేశించినారు. ఆ సమయం మేమంతా 'బాట్నీ' తీసుకొని బ్యారక్లలోకి ప్రవేశిస్తున్నాము. మిగిలిన వారు తింటూ వుండగానే గొడ్డళ్లు, బరిసెలు, కర్రలు, నీటి పైపులు తీసుకొని జైలుపై వీరవిహారము జరిపినారు. ఆ రాత్రి రాజకీయ ఖైదీలందరిలో కొంతమందికి కాళ్లు విరిగి, తలలు పగిలి నానా భీబత్సముతో క్రిందపడి నెత్తురు మడుగులలో విలపించుచున్నారు. ఏడ్పులు, పెడబొబ్బలతో జైలు దద్దరిల్లి పోయినది. ఈవిషయమును తెలుసుకొనిన అక్కడ జిల్లా కలెక్టర్‌గారు తమ రిజర్వ్‌డ్ పోలీసును వెంట తీసుకొని హుటాహుటీగా ప్రవేశించానారు. నెత్తురు మడుగులలో పడివున్న వారిని చూచి దిగ్భ్రాంతి చెంది ముందుగా జైలు అధికారులను, రజాకారులను అరెస్టు చేసి, తమ వెంట తీసుకొని వచ్చిన డాక్టర్లతో అంగ విహీనులైన

అభాగ్యులకు కట్లు కట్టించి ఆదరభావముతో అందరిని మందలించి, ధైర్యము చెప్పి తెల్లవార్లు 4,5 గంటల సమయము వరకు వుండి వెళ్లిపోయారు. డాక్టర్ గారు కూడా దయార్ద్ర హృదయముతో ప్రతి రోజు కట్టుకట్టి వెళ్లుచుండెడివారు. ఆనాటి నుండె జైలు అధికారలు, సిబ్బందిని తొలగించి కొత్తవారిని నియమించటమైనది. మరుసటి రోజున వార్తా పత్రికల్లో పెద్ద పెద్ద అక్షరాలతో నిజామాబాద్ సెంట్రల్ జైలుపై రజాకార్ల వీరవిహారము, దండయాత్రయని రాయబడినది. ఆ దుర్ఘటనను గురించి తెలుసుకొన్న స్వాతంత్ర్య సమర యోధుల తల్లిదండ్రులు, సంబంధీకులు గ్రామాదులలో ఎట్లు విలపించినది ఆనాటి వారికే విదితము. అనంతరము జైలులో జరిగిన పరిస్థితులను తెలుసుకొనుటకు మంత్రులు, సామంత్రులు, నాయకులు మున్నగు వారు ఒకరి తరువాత ఒకరు వచ్చివెళ్లు చుండెడివారు. తరవాత జైలు పరిస్థితిలో కొంచెము సవరణ మాత్రము రాబడినది. ఇంతకు పూర్వము రాజకీయ ఖైదీలకు ఇవ్వబడు 'రేషన్' ను వారికే ఇచ్చెడివారు. ఇచ్చిన బియ్యం, పప్పు, కూరగాయలు, వగైరాలతో బాగు చేసుకొని మేమే తగిన రీతిలో అనుకూలమైన వంటలు చేసుకొని భుజించెడివారము. కొంతకాలము గడిచే సరికి హఠాత్తుగా 'మహాత్మాగాంధీ హత్య' గురియైనట్లుగా వార్తవచ్చినది. దానితో జైలు మొత్తము విషాదచ్ఛాయల్తో కారు చీకట్లు క్రమ్ముకొనినవి. జైలు వాసులందరూ ఎక్కడివారు అక్కడ స్థంభించి పోయినారు. రెండు మూడు రోజుల వరకు విచార సముద్రంలో మునిగి పోయినారు. మహాత్మా గాంధీజీ 'ఆత్మ' శాంతి కొరకు ప్రార్థనలు, స్తోత్రములు జరుపబడినవి. ఈ ప్రకారము నెలలు గడిచినవి. రాష్ట్రంలోని అశాంతి అరాచకములు ప్రబలిపోవటంతో ఢిల్లీ ప్రభుత్వ ఆదేశానుసారము 1948 సెప్టెంబర్ 13వ తేదీ అర్ధరాత్రి సమయము లో జె.ఎన్. చౌదరి నాయకత్వంలో ఒక్కుమ్మడి సైన్యాలు నలువైపుల నుండి రాష్ట్రములో ప్రవేశించినవి. ఆనాడు 'బందరు రేవులో కత్తులు కడిగెదనని' ప్రగల్భాలు పలికిన రజాకార్ల నాయకుడు ఖాసింరజ్వీ మరియు ప్రభుత్వ సేనలు తోకముడిచినవి. నిజాం సైన్యాధికారి తెల్లజెండా ఎత్తేసారు. అంతటితో నైజాంనవాబు 'నిరంకుశ రాజరిక పాలన' అంతమొందింది. ఎక్కడ చూచినా దేశ మంతటా మూడు రంగులు జెండాలు రెపరెపలాడినవి. ఎక్కడ చూచిన ఉత్సవములు, వేడుకలు ప్రజలు జరుపుకొన్నారు. అనంతరం స్వాతంత్ర్య సమరయోధులనందరిని జైలు నుండి విడుదల జేసినారు. మన సర్దార్జీ విజయభేరి మ్రోగించి విజయశంఖారావమును పూరించినారు. ప్రజలకు శాంతి సందేశములనిచ్చి గతాన్ని పీడకలగా భావించవలసినదని ప్రజలను కోరినారు.





# 13. సర్దార్జీ తో జైల్లో నా జ్ఞాపకాలు

కీ.శే. శ్రీ మైలవరపు సత్యనారాయణ రావు
మధిర.

1935 వ సం॥ కార్యకర్తల సమావేశం జరిగినది. వారి భావములు, నాటి రాజకీయ వుద్దేశ్యాలు మాకు సర్దార్ జమలాపురం కేశవరావు గారు చెప్పియున్నారు. బాపూజీ సూత్రాలు వినిపించినారు. మాకు కార్యకర్తలకు ఉపదేశములు చేసినారు. అంతలో తెలంగాణా మూమెంటు వచ్చినది. కేశవరావు గారు 'ప్రతినిధి'గా వార్ధాకు బాపూజీ ఆశ్రమమునకు వెల్లినారు. వారితో కలిసి తెలంగాణా రాజకీయ విషయాలు సంప్రదించి తిరిగి వచ్చి సమావేశములు జరిపించినారు. జైలుకు వెళ్లేవారిలో ప్రముఖులలో పొకరుగా తెలంగాణా నుండి సర్దార్ జమలాపురం కేశవరావుగార్ని నిర్ణయించి పంపినారు. జైలులో వారితో 'అంపపుకోత' కోయించి నారు. చాల కష్ట పెట్టినారు. తిరిగి కొతకాలానికి గాంధీ గారి సలహామీద విడుదల చేసినారు. రాయపట్నంలో కేశవరావు గారి భార్య పిల్లలు కీ. శే. మల్లెం రామారావు గారి ఇంట్లో తలదాచుకున్నారు. ఎన్నో ఆర్థిక ఇబ్బందులకు గురయ్యైనారు. ఒక్కొక్క రోజు జొన్నలు త్రొక్కు కొని అన్నం వండుక్కు రోజులు వున్నాయి.

కేశవరావు గారు జైలు నించి వచ్చిన తర్వాత ఊళ్ల ప్రచారములో తిరిగినారు. అంతలో 'తెలంగాణా కాంగ్రెస్ మహాసభ' మధిర తాలుకా తక్కెళ్ల పాడు గ్రామములో జరుపుటకు నిశ్చయించినారు. ఈ మహాసభకు ప్రదేశ్ కాంగ్రెస్ ప్రెసిడెంటు శ్రీ రామానంద తీర్థ గారు యీ మహాసభ ప్రెసిడెంటుగా నిర్ణయించినారు. సర్దార్ కేశవరావు గార్ని 'ప్రతినిధి'గా నిర్ణయించినారు. గ్రామాలలో ప్రచారం చేసేందుకు సర్దార్ జమలాపురం కేశవరావు గారు, కాంగ్రెస్ కార్యకర్తలము కాలినడకతో గ్రామాలకు వెళ్లి బుఱ్ఱకథలు చెప్పకుంటు, ప్రచారం చేస్తూ తిరిగే వారము. ముందు కార్యకర్తలు భోజనం చేసిన తరువాతనే వారు భోజనం చేసేవారు. అటువంటి హృదయం కలవారు.

మధిరకు వస్తే కార్యకర్తలు వీరి వెంట 4,5 గురు వుండేవారు. వాళ్లకు మధిరలో కీ.శే. మిరియాల నారాయణ గుప్తా గారి ఇంట్లో భోజనం చెప్పేవారు. వారు వంట తయారైన తరువాత వారిని "భోజనానికి లేవండి" అని పిలచేవారు. వారు వెంట వున్నవారిని భోజనానికి వెళ్లమనేవారుకాని, "నాకు భోజనం వద్దు.

కార్యకర్తలకు భోజనం పెడితే చాలు" అని చెప్పేవారు. కార్యకర్తలు భోజనం చేసిన తరువాత వారు గ్రామములోనికి వెళ్ల బోయెవారు. అప్పుడు రావమ్మగారు (నారాయణ గారి భార్య) "మీకు కూడ భోజనం చేసామ"ని చెప్పేవారు. అటువంటి నాయకులు ఇప్పుడు ఏరి ?

రాత్రి పూట పడుకోటానికి కొన్ని ఊళ్లల్లో కేసవరావు గారికి మంచం యిస్తే వారు కార్యకర్తలమైన మా వద్దకు వచ్చి తన భుజం మీద వున్న గొంగళి పరచుకొని మావద్దనే పడుకునేవారు. ఆ విధంగా ప్రచారాలు జరిగేవి. కార్యకర్తల మీద ప్రజల మీద దయాదాక్షిణ్యాలు చూపేవారు. కాలినడకతో తిరిగే వారు. కాళ్లకు చెప్పలు కూడ వుండేవి కావు. అట్లా కష్టపడి తిరిగే నాయకులలో నాకు ఎవరూ కనిపించలేదు.

1947 లో 'ప్రథమ సత్యాగ్రహం' చేయుటకు కాంగ్రెస్ వారు సర్క్యులర్ పేరు యిచ్చినారు. ఆగస్టు 8వ. తారీఖున 'సత్యాగ్రహం' చేయుటకు ఆంధ్రా నుండి మధ్యాహ్నము 12 గంటలకు మధిర చేరుకున్నారు. గ్రామం చుట్టూ యెటునుండి వచ్చినా అరెస్టు చేయమని మిలట్రీ 'బందోబస్తు' పెట్టినారు. సైన్యమును మధిర నిండా వుంచినారు. వారు యట్లా వచ్చినది ఎవరికి తెలియదు. వారు రాగానే ఉపన్యాసం మొదలు పెట్టి చెపుతుండగానే పోలీసులు వచ్చి "మిమ్మల్ని అరెస్టు చేస్తున్నాం" అన్నారు. వారు ఉపన్యాసం క్లుప్తంగా ముగించి పోలీసు వారికంటే ముందుగానే పోలీసు స్టేషన్ వైపు నడిచారు. వారిని వారి వెంట వున్న కార్యకర్తలను అరెస్టు చేసి వరంగల్ సెంట్రల్ జైలులో వుంచారు. నేను కార్యకర్తగా జైలుకు బోయిన వాళ్లల్లో వొకడ్ని. వారికి ఫస్టు క్లాసులో ఇస్తామన్నా మా అందరితో థర్డు క్లాసులోనే వున్నారు. థర్డుక్లాసులో మాతో పాటు రెండు రొట్టెలు ఉదయం, రెండు రొట్టెలు సాయంత్రం తీసుకునేవారు. అవి ముక్కిపోయిన జొన్నలతో చేసిన రొట్టెలు. వాసన వచ్చేవి. అయినా తప్పదు. రెండు వేలమందిని వుంచినారు. మమ్మల్ని కేసవరావుగారితో కొంతమందిని ఫస్టు క్లాసులో వుండమన్నా వుండక పోవటంతో మా అందరికి ఇక్కడే కొన్ని సౌకర్యములు చేసినారు.

అక్కడ నుంచి కొంత కాలానికి కేసవరావుగారితో పాటు మమ్మల్ని నిజామాబాద్ జైలుకు తరలించారు. నిజామాబాద్‌లో ఒక గుట్ట మీద వున్న రామాలయంను జైలుగా చేశారు. విగ్రహాలను ఒక గదిలో వుంచి తాళం వేసారు అక్కడ నీళ్లకు చాలా ఇబ్బందిగా వుండేది. కేసవరావు జైలు ఆఫీసర్‌ను కలిసి మాట్లాడారు. అప్పటి నుండి స్నానాలు చేయటానికి గుట్టదిగి దగ్గరలో వున్న చెఱువులో స్నానాలు చేసి వచ్చేవారము.

ఒక రోజున పది ఇరవై గ్రామాలనుండి ఆడవాళ్లు యాభై మంది ఉదయం 7 గంటలకు వచ్చి వాళ్లవాళ్లను జైలులో వున్న వాళ్ల 'ములాఖత్' (మాట్లాడటానికి) అవకాశం ఇవ్వమని అడిగారు. సాయంత్రం 6 గంటలైన వాళ్ల మొర ఆలకించిన వారు లేరు. వాళ్లు చీకటి పడటంతో అంతా ఒక్కమారు 'ఘొల్లున' యేడ్చి గోలపెట్టారు. మేమంతా పైనించి చూసి చేసేది లేక మేమూ 'ఏడ్చాము'. సర్దార్‌జీ బయటకు వచ్చి ఈ దృశ్యము చూసారు. వారికే కళ్లల్లో నీరు తిరిగినాయి. వెంటనే గుట్ట దిగి ఆఫీసులోకి వెళ్లి ఆఫీసర్ గార్ని పిలవమని ఆదేసించారు. అక్కడ వున్న వారంతా భయబ్రాంతులై వారిని పట్టుకొని కుర్చీలో కూర్చోబెట్టినారు. వారు కుర్చీలో బలవంతంగా కూర్చుంటే ఆకుర్చీ 'పట్టు'మని ఇరిగిపోయింది. ఒక లెటర్ వ్రాసి ఇచ్చి పైకి వచ్చి రూములో పండుకున్నారు. అప్పుడు ఆఫీసరుగారు వచ్చి వారికి అభయమిచ్చి రేపు ఉదయము ఆరు గంటలకు 'ములాఖత్' ఇప్పిస్తానని చెప్పినారు. రాత్రి అందరకూ రక్షణ ఇస్తామని చెప్పి వాడ్లను దేవాలయములో విశ్రాంతి తీసుకోమని, వారికి భోజనాదులు ఏర్పాటుచేసి పదిమంది సెంట్రీ పోలీసులను రక్షణగా వుంచారు. తిరిగి తెల్లవారి వుదయం అన్న ప్రకారం ఆరు గంటలకే వాళ్ల వాళ్లకు 'ములాఖత్' ఇప్పించినారు. శ్రీ జమలాపురం కేసవరావు గారిని ఆఫీసుకు పిలిచి, వారికి మన స్ఫూర్తిగా సమాధానం చెప్పి, వారిని క్షమాపణ కోరినారు. అప్పటి నుండి జైలులో వున్నవారిని అందరిని క్షేమము గా చూచినారు. మాకు డ్యూటీలు కూడ విరమింపచేసి మమ్మల్ని గౌరవంగా చూడటం మొదలపెట్టినారు.

ఒక రోజున సర్దార్ కేశవరావు గారికి 'మగపిల్లవాడు' పుట్టినారని విజయవాడ నుండి టెలిగ్రాం వచ్చినది. కేశవరావు గార్ని పిలిపించి, "మీకు మగపిల్ల వాడు పుట్టాడని టెలిగ్రాం వచ్చింది. మీరు విజయవాడ వెళ్లి చూచిరాగలరు." అని పర్మీషన్ ఇచ్చినారు. కేశవరావుగారు, "నేను వెళ్లను. నాకు ధర్మం కాదు. మేము జైలు శిక్షలో వున్నాము. మీరు పర్మీషన్ ఇచ్చినా, మా బాపూజీ గారు మాకు పర్మీషన్ ఇస్తే వెళ్తాము". అని చెప్పి నమస్కారము చేసి తిరిగి వచ్చినారు. ఇది జరిగిన నెల రోజులకు జైలు నుంచి విడుదల చేయమని ఆర్డర్ వచ్చినది.



# 14. 'ఎంత మెతకదనమో అంతటి కరుకుదనం' మన కేశవరావుగారు

కీ.శే. అయితరాజు రామారావు గారు,
స్వతంత్ర్య సమరయోధుడు, వల్లభి, ఖమ్మం జిల్లా.

ఆంగ్లేయులు భారతదేశానికి 'స్వతంత్ర్య ప్రతిపత్తి' ఇవ్వటానికి నిర్ణయం తీసుకున్నట్లు ప్రకటించిన రోజులవి. మౌంట్ బాటన్, వైస్రాయ్ ఆధ్వర్యంలో భారతదేశంలో తాత్కాలిక మిశ్రమ ప్రభుత్వం ఏర్పడింది. హైదరాబాద్‌లో అంతకు పూర్వమే స్టేట్ కాంగ్రెస్ ఆంక్ష తొలగించబడింది. నాకు తేదీ, నెల జ్ఞాపకం లేదు. శ్రీమతి అరుణ ఆసఫ్ అలీగారు హైదరాబాదులో పర్యటించుటకు అంగీకరించారు. హైదరాబాదు స్టేట్ కాంగ్రెస్ వారు వారి రాక సందర్భముగా కొన్ని ప్రదేశాలతో పాటు ఖమ్మంలో కూడ ఒక బహిరంగ సభ ఏర్పాటు చేసారు.

కరపత్రం ఇలా ఉంది : స్టేట్ కాంగ్రెస్ ఆధ్వర్యంలో గొప్ప బహిరంగ సభ స్థలము :- వెంకటగిరి రైల్వే గేటు సమీపంలో

సమయం :- ఈ రోజు సాయంత్రం 4 గంటలకు

సభాధ్యక్షులు :- సర్దార్ జమలాపురం కేశవరావు గారు

ఉపన్యాసకులు :- శ్రీమతి అరుణ ఆసఫ్ అలీ, భారతదేశ ప్రముఖ నాయకురాలు

నోటు :- మున్నేరు బ్రిడ్జి వద్ద స్వాగతం జరుగును.

నేను కూడా ఆ రోజు ఒక 'కార్యకర్త'గా ఆ బహిరంగ సభ ఏర్పాట్లల్లో పాల్గొన్నారు. అశేష ప్రజానీకం సాయంత్రం 3.00 గంటలకు ఖమ్మం 'మున్నేరు బ్రిడ్జి' వద్దకు చేరుకున్నారు. సరిగ్గా 3.30 నిముషములకు అరుణ ఆసఫ్ అలీగారు కారులో దయచేసారు. వి.బి. రాజుగారు కూడా వెంట దయచేసారు. హైదరాబాదు నుండి మార్గమధ్యంలో ఏర్పాటు చేసిన అనేక బహిరంగ సభల్లో మాట్లాడుతూ ఖమ్మం వచ్చారు. స్టేట్ కాంగ్రెస్ రాష్ట్ర, జిల్లా నాయకలు, పురప్రముఖులు అరుణ ఆసఫ్ అలీగారిని పూల మాలలతో ముంచెత్తారు. జనవాహిని బహిరంగ సభా స్థలానికి ఊరేగింపుగా బయలు దేరింది. సర్దార్ జమలాపురం కేశవరావు గారు శ్రీమతి అరుణ అసఫ్ అలీ గారితో కారులో ఆసీనులైనారు. 4.00 గంటల వరకు సభాస్థలమునకు చేరుకున్నారు.

సభాకార్యక్రమం ఆరంభమైంది. సర్దార్ జమలాపురం కేశవరావు గారు అధ్యక్ష స్థానం అలంకరించారు. తొలుత శ్రీ కేశవరావుగారు శ్రీమతి అరుణ ఆసఫ్

అలీగారిని సభకు పరిచయం చేసారు. తిరిగి వారు అధ్యక్ష స్థానంలో కూర్చున్నారు. శ్రీమతి అరుణ ఆసఫ్ అలీ గారి ఉపన్యాసం మొదలైనది. అంతా నిశ్శబ్దంగా ఉన్నారు.

ఇంతలో అప్పటి దువ్వం తాలూకుదారు (సబ్‌కలెక్టర్) గారు కారులో నలుగురు రజాకారులను వెంట వేసుకొని వచ్చి సభస్థలానికి పది గజాల దూరంలో కారును ఆపేసారు. అరుణ ఆసఫ్ అలీ గారి ఉపన్యాసం జోరుగా సాగిపోతుంది. దువ్వం తాలూకాదారుగారు అధికారిక గర్వంతో తన వెంట వచ్చిన రజాకార్లతో మంతనాలు, విమర్శలు, వేళాకోళాలు చేయటం మొదలు పెట్టారు. ఇది సర్దార్ జీ కనిపెట్టారు. లేచి, అరుణ ఆసఫ్ అలీ గారిని సమీపించి క్షమించమని కోరి మైకు తీసుకొని ఈ విధంగా శెలవు ఇచ్చారు. "ఇది బహిరంగ సభ. ఎవరైనా పాల్గొనవచ్చుకాని సభామర్యాదలను, గౌరవాన్ని పాటించటం ప్రతిపౌరుని విద్యుక్తధర్మం. పక్కవారికి ఏ విధమైన అసౌకర్యం కలిగించకుండా ప్రవర్తించటం ఉత్తమ పౌరుని లక్షణం. సభకి వచ్చిన వారు పక్కవారితో మాటలు, ముచ్చట్లు, నవ్వులాటలు, విమర్శలు చేయకూడదు. ఇది నచ్చని వారు సభలో నుంచి నిశ్శబ్దంగా వెళ్లి పోవచ్చు". వెంటనే సభ అంతా నిశ్శబ్దం అయింది.

తిరిగి సభాకార్యక్రమం ఆరంభమైంది. శ్రీమతి అరుణ ఆసఫ్ అలీ గారి ఉపన్యాసం మంచి రసపట్టులో ఉంది. డయాస్ వెనుక కారులో ఉన్న దువ్వం తాలూకుదారుగారు సభలో ఏదైనా అల్లరి సృష్టించి సభను భగ్నపరచి తాను ఘనత సంపాదించవలెననే ఉద్దేశ్యంతో యధాప్రకారం పాతధోరణిలో పెద్దగా మాట్లాడుతూ, నవ్వటం, విమర్శించటం, కేరింతలు కొట్టటం మొదలు పెట్టారు.

ఇదంతా సర్దార్ జీ చూచారు, విన్నారు. వేటకై పొదలో నుంచి బయటకు వచ్చిన బెబ్బులి వలె ఒక్క వుదుటున అరుణ ఆసఫ్ అలీ గారి చెంతకు వెళ్లి మైకు తన ముందుకు లాక్కుని ఈ విధంగా గర్జన చేసారు. "మై దేఖ్ రహా హూంజారు సున్ రహాహూ" నేను చూస్తున్నాను. మరియు వింటున్నాను. ఇస్కె కబల్ ఎక్ బార్ అర్జ్ కర్ చుకా విరుంజారు మొకర్రర్ ఉస్ గుండోసే అర్జ్ కర్నా చాహతాహూం. ఇంతకు పూర్వం నేను ఒక పర్యాయం మనవి చేసాను. మళ్ళీ ఆ గుండాలతో మనవి చేయుచున్నాను. చంద్ గుండే హమారే పీఛే జమా హోకర్ ఛీఖ్ పుకార్ కర్ రహే హైం. కొందరు గుండాలు డయాస్ వెనుకాల పోగై కేకలు బొబ్బలు పెట్టుతున్నారు. పెద్దగా మాట్లాడుతున్నారు. అరుస్తున్నారు. మై ముకరర్ర్ అర్జ్‌కర్తాహూ వహ సున్‌సాన్ హోకర్ తఖ్‌రీర్ సునే వరాకె మరొక సారి మనవి చేయుచున్నాను. వారు నిశ్శబ్దంగా ఉండి ఉపన్యాసాన్ని వినతలుచుకుంటే వినండి. తోటి వారిని

వినినివ్వండి. మై పోలీస్ సేభీ అర్జ్ కర్తాహూంకే ఐసే గూండే అనాసిర్ కూజల్సేసే బాహర్ భేజే. నేను పోలీసువారికి కూడ మనవి చేయుచున్నాను. సభలో ఉండి అల్లరి చేయుచున్న వ్యక్తులను బయటకు పంపించండి. అగర్ పోలీస్ జాన్ భూజ్‌కర్ అన్‌జాన్ హోతేహై తో, ఒకవేళ పోలీసువారు గూడ తెలిసి తెలియనట్లు ఊరుకుంటే, మై ఇస్ కుర్సీ పర్ సే అప్నే వాలంటీర్స్ హుకుం దేతాహూంకే వహో గడ్‌బడ్ కర్నే వాలోంకో కాన్ పకడ్‌కర్ జల్సేసే బాహర్ భేజేం. నేను ఈ కుర్చీ నుండి మా వాలంటీర్లకు ఆర్డరు ఇస్తున్నాను; వారు సభలో అల్లరి చేసే వ్యక్తులను చెవులు పట్టుకొని బైటకు పంపించండి. దువ్వం తాలూకుదారు ఖిన్నుడయ్యాడు. తన వెంట ఉన్న రజాకర్లను వెంట పెట్టుకొని వెళ్లిపోయాడు. సభ సాఫీగా జరిగిపోయింది. ధన్యవాదాలతో సభాకార్యక్రమం ముగిసిపోయింది.

సర్దార్ కేశవరావు గారు ఎంతటి మెతకగా కనిపించే వాడో అవసరమైనప్పుడు అంత కరుకుదనం చూపించేవారు. చాలా జాలి గుండె, వెన్నపూసలాంటి హృదయం కలవారు, మితభాషి, రాజకీయ జిత్తులు, ఎత్తులు బొత్తిగా ఎరుగని వారు, దేశం, ప్రజలపై అమితమైన ప్రేమ గలిగినవారు. రెండు పర్యాయములు మధిర నుండి 'సత్యాగ్రహం' చేసి కారాగారమునకు వెళ్ళారు. జైలులో ఎప్పటికప్పుడు తన తోటి కార్యకర్తల బాగోగులు తెలుసుకుంటూ ఉండేవారు. 'నిస్వార్థ దేశ సేవాపరాయణుడు'. ఆయనకు ఆయనే సాటి, సమావేశాలనంతరం కార్యకర్తలు భోజనాలు చేసిన ఇస్తరాకులు తాను స్వయంగా తీసి శుభ్ర పరిచేవారు.

మృత్యుదేవత చిన్న వయస్సున్నే వారిని కాటువేసింది. వారి అనుచరులు అనేకమంది తెలంగాణా ప్రాంతంలో వారి కార్యకర్తలు ఈనాటికి చెలామణి అవుతున్నారు. పరమాత్ముడు వారి ఆత్మకు శాంతి చేకూర్చుగాక —



K తనయందున్న దోషమును, ఇతరులయందున్న మంచిని గుర్తించి వర్తించినవాడే పరిశుద్ధ హృదయుడు.

K తనలోని దోషాలను గుర్తించి మార్చుకోలేనివాడు, నరుడుకాడు, వానరుడు.

- సత్యసాయి బాబా



15

ముదిగొండ
13-10-89

- శ్రీ రావుల పాటి సత్యనారాయణ గారు
ఖమ్మం.

శ్రీ జమలాపురపు గోపాలకిషన్ రావు (జమలాపురపు వారి వంశ వివరణ గ్రంథ సేకరణ మరియు ప్రచురణకర్త) గారికి,

నమస్కారములు. మీ ఉత్తరం అందినది. కానీ వెంటనే సమాధానం వ్రాసి పంపలేకపోయినాను.

చాలా సంతోషం, శ్రీ సర్దార్ జమలాపురం కేశవరావు గారి గురించి, వారితో పరిచయమున్న పెద్దల అనుభవాలను సేకరించి ప్రచురించదలచినందుకు. ఇది చాలా పెద్ద విషయం. అందరికీ లభ్యమయ్యేదికాదు. ఈ బాధ్యతను మీరు స్వీకరించటం చాలా విశేషం. ఇందుకు మీకు మిమ్మల్ని ప్రోత్సహించిన ఇతర పెద్దలకు ఈ నా అభినందనలు.

దేశం కోసం, జాతికోసం ఎందరో మహానుభావులు త్యాగం చేసిన ఫలితంగానే దేశ వ్యవస్థ మరియు జాతిపురోభివృద్ధి నిలబడి ఉంటుంది. కానీ త్యాగం చేసిన మహామహుల జీవిత విశేషాలను, త్యాగ వివరాలను దేశానికి ముఖ్యంగా ప్రస్తుత సమాజమునకు వెలుగునిచ్చేది. తెలియచెప్పటం అవసరం కదా ! అది అందరికీ సాధ్యమయ్యేది కూడా కాదు. ఇది ఒక బృహత్తర కార్యం. ఈ బాధ్యత మీరు స్వీకరించినందుకు ధన్యులు. ఈ సందర్భంగా వారి జీవిత విశేషాలను తెలియపర్చవలసినదిగా నన్ను కోరినారు. వారితో పరిచయం కొద్దికాలం మాత్రమే. అయిననూ ఆ కొద్ది అనుభవం శాశ్వతమైనది. జీవితాంతం మరపురానిది. ఇది ఒక చెరగని ముద్ర, హృదయ ఫలకంలో, నిజాంకు వ్యతిరేక పోరాట కాలంలో వారితో కల్సి పనిచేసే అదృష్టం నేను కల్గియుండటమే కాక, వారికి ఎంతో ఋణపడి యున్నాను. వారు ఇప్పడు భౌతికంగా మన మధ్యన లేరు. నా ఋణం తీర్చుకొనుటకు మీరు ఇచ్చిన ఈ సదవకాశము పురస్కరించుకొని ఈ విధంగా కొద్దో, గొప్పో, ఉడతా భక్తితో ఋణం తీర్చుకొంటున్నందుకు ధన్యుణ్ణి. కావున నా ఈ లేఖను యదాతథంగా ప్రచురించగలరని నా మనవి.

ఒకనాటి మాట. బహుశా అది 1945 లేక 46 కావచ్చు. మా గ్రామమైన ముదిగొండలో ఒకనాడు ఉదయం 8.9 గంటల సమయంలో మా యింటి ముందు బజారులో నిలబడిఉన్నాను. ఒక ఆజానుబాహు మనిషి, ధృఢకాయుడు ముతక లాల్చీ ధరించి, చేతిలో ఒక సంచీ, భుజంపై ఒక నల్లటి శాలువా వేసికొని

నా ముందునుంచి పోతూ ఉన్నాడు. నాకు ఒక కొత్తమనిషిగా, లోగడ పరిచయం లేనందున, వారి ఉనికిని చూసిన తర్వాత పరిచయం చేసుకోవాలనే కుతూలహం కల్గి వారిని పలకరించాను. "మీది ఏ గ్రామం"? అని. మరొక విధంగా భావించవలదని కోరుతూ. "మాది 'ఎఱ్ఱుపాలెం', నేను కేశవరావుని" అని చెప్పినారు. వెంటనే మీరు "జమలాపురం కేశవరావు గారా" అని అడగడం ఆయన చిరునవ్వుతో అవునని సమాధానం చెప్పటం జరిగింది. తర్వాత వారిని లోపలికి ఆహ్వానించటం, వారు మా యింటికి రావటం జరిగినది. అప్పుడు మా మధ్యన అప్యాయతతో పరస్పరం మాట్లాడుకొనటం జరిగినది. అది యిప్పటికీ నాకు జ్ఞాపకం. ఆయన ఒక పెద్దమనిషి. అప్పటికే రాజకీయంగా వారి శారీరక ఉనికికి తగ్గట్టుగా చాలా పెద్దయెత్తు ఎదిగారు. నిజాం రాష్ట్రంలో ముఖ్యంగా తెలంగాణా ప్రాంతంలో వారి పేరు మారుమూల గ్రామాదులలో సైతం వ్యాపించినది. అందువలన వారితో ముఖపరిచయం లేనప్పటికీ వారితో అప్పటి ఆ కొద్ది పరిచయం వారి మరణాంతం వరకు వారితో వారి నాయకత్వం క్రింద వారి అడుగుజాడలలో, నిజాం వ్యతిరేక పోరాట సమయంలో వారితో కలసి పనిచేసే అవకాశం, వారి తదనంతరం కూడా వారితో కల్గియున్న అనుభవం ఈనాటి వరకు చిరస్మరణీయం వారి నాయకత్వంలో నేను ఒక కార్యకర్తగా ధన్యజీవిని.

శ్రీ జమలాపురం కేశవరావు గారు నిరాడంబరుడుగా, గంభీరమూర్తిగా తన రాజకీయ జీవితమును సాగిస్తు నాయకుడుగా పెద్ద స్థాయికి ఎదిగినప్పటికినీ, కార్యకర్తలతో, ఆయన అనుచరులుగా నున్న వారితోనే కాకుండా, క్రింది స్థాయి వారితో కూడా ఎంతో సరళంగా, అప్యాయతగా వ్యవహరించేవారు. నిజంగా మా గ్రామం ముదిగొండకు నాయకుడుగా ఉండి వచ్చిననూ నాతో మాట్లాడిన తీరు, ఎంతో ఆకర్షణీయంగా ఉండి ఆనాటి నుంచే ఆయన అనుచరుడిగా ఉండే అవకాశం కల్గినది. ఆయన కార్యక్రమాలు నిర్వహించేటప్పుడు ఇది చిన్నది. పెద్దది అన్న తారతమ్యం లేకుండా కార్యక్రమ సాఫల్యతే ప్రధానంగా తీసికొని వ్యవహరించేవారు. కాబట్టే ఒక కార్యకర్తగానే 'ఆంధ్రమహాసభ' సభ్యత్వం చేర్పించుటకు మా గ్రామం వచ్చినారు. మొదటి నుంచీ అచంచలమైన విశ్వాసంతో, నిశ్చలమైన దేశభక్తితో భారత జాతీయ పోరాటంలో, తదుపరి భారత స్వాతంత్ర్యం 1947లో వచ్చింతర్వాత హైదరాబాద్ స్టేట్ నందు నిజాంకు వ్యతిరేక పోరాటంలో తెలంగాణా అంతటకు నాయకత్వం వహించి సత్యాగ్రహులుగా జైలుకు వెళ్లటం జరిగినది. హైదరాబాద్ స్టేట్ కాంగ్రెస్‌కు స్వామి రామానందతీర్థ నాయకత్వంలో తెలంగాణాకు ప్రాతినిధ్యం వహిస్తూ ఆయన కుడిభుజంగా పనిచేసేవారు. తెలంగాణా లో ఆయన పాత్ర ఎందరినో ఉత్తేజపరచి రాజకీయాలలో ప్రవేశించే అవకాశం కల్గింది. ఆయన అనుచరులలో శ్రీ బొమ్మకంటి సత్యనారాయణరావు

గారు, హయగ్రీవాచారిగారు, శ్రీ కొలిపాక వెంకట కిషన్‌రావుగారు విషద్ గ్రామ హీరాలాల్ మోరియాగారు, పింగళి తిరుమలరావుగారు, అయితరాజు రాంరావుగారు, కొలిపాక రామచంద్రరావు గారు, మరి ఎందరో ముఖ్యులున్నారు. ముఖ్యంగా శ్రీ కేశవరావు గార్కి హయగ్రీవాచారి గారు, బొమ్మకంటి సత్యనారాయణరావు గారు కుడి, ఎడమ భుజాలుగా పనిచేశారు. 1946లో గాంధీజీ ఆంధ్రరాష్ట్ర పర్యటన చేసినపుడు వారు ఖమ్మం మెట్టు రావటం, అప్పుడు శ్రీ కేశవరావు గారు నిర్వహించిన పాత్ర చాలా ప్రశంసమైనది. అందుకు గాంధీజీ మన్ననలను పొందటయే కాకుండా రాజకీయ భవిష్యత్తులో జరుపబోయే కార్యక్రమాలకు ఆశీస్సులను పొందటం కూడా జరిగింది.

స్వాతంత్ర్యం రాక ముందు టంగుటూరు ప్రకాశం పంతులుగారు మధిర వచ్చినపుడు ఆయన నిర్వహించిన పాత్ర కూడా ఎంతో శాఘనీయమైనది. ఆ రోజులలో గాంధీటోపీ పెట్టుకొన్నవారు. ఖద్దరు చొక్కా ధరించినవారు నిజాం ప్రభుత్వ దృష్టిలో పడకుండా ఉండేవారు కారు. ప్రభుత్వం కన్ను వారిమీద ఎప్పుడు ఉండేది. అయినప్పటికీ శ్రీ కేశవరావు గారి నాయకత్వం చాలా నిర్భయత్వంతో, నిరాఘాటంగా సాగేది. 1947కి పూర్వం స్టేట్ కాంగ్రెస్ పై నిషేదం ఉండటం వల్ల రాజకీయ కలాపాలు, కార్యక్రమాలు యావత్తు 'ఆంధ్రమహాసభ' పేరుతో జరుగుతూ ఉండేవి. అప్పటి వరకూ ఉన్న ఆంధ్రమహాసభలోని కాంగ్రెస్ వాదులకు కమ్యూనిష్టులకు భిన్నాభిప్రాయాలు కలుగుట వలన వీరు భయులు చీలిపోవటం తదుపరి మడికొండలో జాతీయ వాదులంతా వేరుగా 'జాతీయ ఆంధ్రమహాసభ'గా ప్రత్యేకించి, శ్రీ నరసింగరావు గారి అధ్యక్షతన ఏర్పాటు చేసికొనుట జరిగినది. ముఖ్యంగా ఈ వ్యవస్థ ఏర్పడుటకు శ్రీ కేశవరావు గారు చేసిన కృషి ఫలితమే. ఆ మడికొండ మహాసభనందు శ్రీ కేశవరావుగారు నిర్వహించిన పాత్ర, వారి సేవలు చాలా విలువైనవి, ప్రశంసనీయమైనవి. ఒక సామాన్య కార్యకర్తగా చిన్న పని దగ్గర నుంచి ఒక పెద్ద రాజకీయమైన పాలసీ వ్యవహారం నిర్ణయించుట వరకు స్వయంగా నిర్వహించెడివారు. ఇవి వాస్తవంగా నేను వారితో కలిసి పనిచేసి పంచుకొన్న అనుభవాలు.

1947లో భారతదేశం స్వాతంత్ర్యం పొందిన తర్వాత హైదరాబాద్ రాష్ట్రం ప్రత్యేక సంస్థానంగా ఉండుట చేత దానిని పరిపాలించే నిజాం నవాబు, ఈ సంస్థానాన్ని 'ఇండియన్ యూనియన్' లో అంతర్భాగంగా చేర్చుటకు ఇష్టపడక తన రాష్ట్రం ప్రత్యేకంగా ఉండాలనే కోరికతో ఉండటం, అంతేకాకుండా, ఆ సమయంలో రజాకార్లు ఉద్యమానికి నాయకుడైన 'ఖాసింరజ్వీ' నాయకత్వ ప్రభావం నిజాం నవాబుపై ఉండటం, అందుచే ఈ రాష్ట్రం ప్రత్యేకంగా ఉండాలనే

కోరకికకు బలాన్ని చేకూర్చింది. ఆ సమయంలో ఇందుకు భిన్నంగా ప్రజా ఉద్యమం పెల్లుబికి, స్టేట్ కాంగ్రెస్ స్వామిజీ నాయకత్వంలో ఎందరో సత్యాగ్రహులుగా జైలుకి వెళ్లటం జరిగింది. తెలంగాణాలో కేశవరావు గారి నాయకత్వంలో ప్రతీ జిల్లాలో శ్రీ కేశవరావు గారితో పాటు ఎంతోమంది జైళ్లకి వెళ్లారు. అక్కడ సత్యాగ్రహులంతా నానా ఈతి బాధలకు గురికావడం జరిగింది. శ్రీ కేశవరావు అప్పుడు వారికి మనోబలం తగ్గకుండా ధైర్యాన్ని కల్గించే వారు.

'పోలీసు చర్య' తదుపరి 'రాజ్యాంగ పరిషత్తు'లో వారిని తెలంగాణా ప్రాంతం నుంచి సభ్యులుగా ఏర్పాటు చేయడం జరిగింది. రాజ్యాంగ పరిషత్తు సభ్యుడిగా ఆయన నిర్వహించిన పాత్ర మరువరానిది. ఇది నాకు బాగా జ్ఞాపకం. పండిట్ నెహ్రూ ప్రధాన మంత్రిగా ప్రప్రథమంగా హైదరాబాద్ పర్యటన చేసినపుడు 'బొల్లారం రెసిడెన్సీ' ఆవరణలో కాంగ్రెస్ కార్యకర్తల మీటింగ్ నందు పండిట్‌జీ ఇచ్చిన ఉపన్యాసంలో ప్రత్యేకంగా శ్రీ కేశవరావు గారు 'తెలంగాణా విమోచన ఉద్యమం'లో వారు నిర్వహించిన పాత్రను ప్రశంసించడం గమనార్హం.

పోలీసు చర్య తదుపరి నల్గొండ, వరంగల్ జిల్లాలో కమ్యూనిష్టుల ఉద్యమం ఉధృతంగా నున్న కారణం చేత ఈ రెండు జిల్లాలకు ప్రత్యేకంగా 'శ్రీ నంజప్ప' ను ఒక ప్రత్యేకాధికారిగా నియమించబడినందువల్ల ఆయన నిరంకుశ పరిపాలనా తత్వాన్నీ నిరశిస్తూ, జంకూ, గొంకూ లేకుండా ఆనాటి హోమ్ మంత్రిగా నున్న శ్రీ గోపాలస్వామి అయ్యంగార్కి నివేదించడం కొనియాడదగినది.

శ్రీ కేశవరావు గారు వాస్తవంగా ఒక కర్మిష్టి, త్యాగశీలి. ఆయన రాజకీయ జీవితంలో కష్టించి ఒక ప్రత్యేకమైన దీక్షతో, అకుంఠితమైన దేశభక్తితో నిరంకుశ ప్రభుత్వానికి వ్యతిరేకంగా పోరాడిన మహాయోధుడు, ధీశాలి, మరువరానివాడు. ఆయన సేవాభావంతో దేశానికి అంకితమైనారు. స్వాతంత్ర్య ఫలితాలను గానీ, వ్యక్తిగతమైన పదవులను గానీ పొందలేదు. ఆశించనూ కూడా లేదు. రెండుమార్లు నర్సంపేట, వర్ధన్న పేట అసెంబ్లీ నియోజక వర్గాలకు కాంగ్రెస్ అభ్యర్థిగా పోటీ చేశారు. కానీ ఫలితం పొదలేదు. అయిననూ ఏ మాత్రం చలించకుండా దేశసేవయే. ప్రధానంగా భావించి, కృషిచేసిన 'మహా వ్యక్తిగా' 'సర్దార్' గా దేశ ప్రజలలో ముఖ్యంగా ఆయన నాయకత్వం క్రింద పనిచేసిన కార్యకర్తల హృదయాలలో నిరంతరంగా 'మరపురాని మహామనిషి'గా నిలిచి పోయారు. ఇటువంటి మహావ్యక్తికి అనుచరుడిగా, కార్యకర్తగా వుండి వారి రాజకీయ జీవితరంగంలో, వారితో కలసి పనిచేసే అవకాశం వల్ల కలిగిన అనుభవాలని మీ కోరిక ప్రకారం మీకు అందించటం నా బాధ్యతగా తలుస్తున్నాను.

# 16. హైద్రాబాద్ స్వాతంత్రోద్యమ పరిమాణ క్రమం మరియు కమ్యూనిష్టు సాయుధ పోరాటం - ఒక సంక్షిప్త సమాధానం



- కీ.శే. దేవులపల్లి గోపాల్‌రావుగారు

కుర్లవల్లి, ఖమ్మం జిల్లా.

## నిజాం పాలన ఆవిర్భావము

భారతదేశాన్ని పాలించిన 'మొగలు చక్రవర్తుల' లో ఔరంగజేబు మరణించిన తరువాత వారసత్వ విషయంలో అంత: కలహాలు చెలరేగినవి. చివరకు మహమ్మద్‌షా ఢిల్లీ సుల్తాన్ అయినాడు. కాని రాజకీయంగా గంద్రగోళ పరిస్థితులు ఏర్పడినవి. మహ్మమద్‌షా అసమర్థతను ఆసరాగా తీసుకొని దక్కన్‌లో సుబేదారుగా ఉన్న 'నిజాము' స్వాతంత్ర్యాన్ని ప్రకటించుకున్నాడు 1724లో హైదరాబాద్‌లో ఈ విధంగా 'ఆసఫియా రాజ్య' స్థాపన జరిగింది. అంటే దేశ కాలపరిస్థితులను బట్టి - నిజాం స్వతంతృడైనాడే గాని. ఢిల్లీ సుల్తానులు అతనికి ఈ రాష్ట్రాన్ని 'దత్తం' చేయలేదు. ' హైదరాబాద్ సంస్థానా'న్ని పాలించిన మూల పురుషుడు. (నిజాముల్‌ముల్కు అసఫ్ జాహి) 'నిజాం' అనేది ఆయనకు ఔరంగజేబు ఇచ్చిన బిరుదు. మొగల్ చక్రవర్తుల పతనానంతరం ఏర్పడిన రాజకీయ సంక్షోభ సమయంలోనే బ్రిటిష్ వారు మనదేశాన్ని ఆక్రమించారన్న సంగతి ఈ సందర్భంలో గమనార్హం.

**హైదరాబాద్ రాష్ట్ర భౌగోళిక స్వరూపం - పాలనా విభజన :**

ఇది భారతదేశానికి నడిబొడ్డున ఉన్న ప్రాంతం. హైద్రాబాద్ రాష్ట్రంలో తెలంగాణా, మరాఠ్వాడ అనేవి రెండు ముఖ్యప్రాంతాలుగా విభజించి తెలంగాణా ప్రాంతంలో (1) మెదక్ (2) వరంగల్ సుబాలుగా అట్లే మరాఠ్వాడా ప్రాంతంలో (1) ఔరంగాబాద్ (2) గుల్బర్గా అనే భాగాలు ఏర్పాటు చేయటం జరిగింది. మెదక్ సుబాలో మెదక్, నల్గొండ, మహబూబ్‌గనర్, నిజామాబాద్‌లు 'బాగాత్' అనే (5) జిల్లాలున్నాయి. వరంగల్ సుబాలో వరంగల్, కరీంనగర్, ఆదిలాబాద్ అని మూడు జిల్లాలున్నాయి. ఔరంగాబాద్ లో ఔరంగాబాద్, బీడ్, పర్భణి, నాందేడ్ అనే నాల్గు జిల్లాలున్నాయి. గుల్బర్గా సుబాలో గుల్బర్గా జిల్లాలోని బీదం పాయూచూర్, ఉస్మానాబాద్, భీర్ రామచూర్ అనే నాల్గుజిల్లాలున్నాయి. ఈ పదహారు జిల్లాలు గాక నిజాం స్వంత జాగీరు అయిన ఆత్రాఫ్ బల్దా, జిల్లా ఒకటున్నది. అయితే రాష్ట్రంలోని ఈ మొత్తం ప్రాంతం నేరుగా ప్రభుత్వయంత్రాంగం క్రింద లేదు.




మూడింటి రెండు వంతులు. మాత్రమే ఖాల్స ప్రభుత్వం పాంతం - ఒకవంతు జాగీర్లు, సంస్థానాలు - ఈ జాగీర్లు నాల్గురకాలుగా ఉన్నాయి. (1) సర్ఫ్‌ఖాస్ ఇది నిజాం స్వంత జాగీరు (2) పాయగ ఇది నిజాం రాజబంధువుల జాగీరు (3) ముస్తఫా జాగీర్లు (4) సాధారణ జాగీర్లు అంటే నిజాం సంస్థానాధిపతే గాక ఒక స్వంత 'జాగీర్దారు'గా కూడా ఉండేవాడు. ఇది ఆనాడు హైద్రాబాద్ రాష్ట్ర పరిస్థితి.

## నిజాం దేశద్రోహి :

మొగల్ సామ్రాజ్య పతనాంతరం బ్రిటీష్ వారు 'ఈస్టిండియా కంపెనీ' పేరిట వ్యాపారం నిమిత్తం వచ్చి, భారతదేశాన్ని ఆక్రమించి 'రాజకీయాధి పత్యం' వహించినప్పటి నుండి దేశంలో ఏదో రూపంలో తిరుగుబాట్లు లేస్తూనే ఉన్నాయి. అయితే 1857లో 'దేశీయ సంస్థానాధిపతులు' చేసిన తిరుగుబాటు మొదట 'స్వాతంత్ర్య సంగ్రామం'గా వాసికెక్కింది. ఇదే 'సిపాయిల తిరుగుబాటు'గా కూడా పేర్కొనబడింది. ఈ సందర్భంలో నిజాం వ్యవహరించిన తీరు వింత గొల్పుతుంది. ఎందుకటే ఈ సమయంలో నిజాం బ్రిటిష్ వాండ్లకు తొత్తుగా వ్యవహరించుటే గాక ప్రక్కనే 'మైసూరు రాష్ట్రా'న్ని పాలించే మహమ్మదీయ రాజైన టిప్పు సుల్తాన్ పై బ్రిటిష్ దండెత్తినప్పుడు వారికి సహాయ పడుటయే గాక చివరకు 'హత్య'

చేయించి 'దేశ ద్రోహాని'కి తలపడ్డాడు. ఈ సందర్భంలోనే అనేక చోట్ల దేశంలోని వివిధ ప్రాంతాలలో 'తిరుగుబాటు' నడుచుట, అనేక మంది మహోత్తరమైన 'త్యాగాలు' చేశినారు.

**ఏడవ నిజాం పాలన స్వభావం :**

1911లో 'ఆరవ నిజాం' మరణానంతరం 'ఏడవ నిజాం'గా అతని కుమార్డు 'మీర ఉస్మాన్ అలీఖాన్' పట్టాభిషిక్తుడైనాడు. నిజాం నవాబులలో ఆఖరివాడైన ఇతడు మొగల్ చక్రవర్తులో 'ఔరంగ్‌జేబు'ను పోలినాడు. ఔరంగజేబ్ వలె 'మతదురభిమాని', ఈ సందర్భంలో ఇతని కాలంలో పరిపాలన తీరు ప్రజల జీవన విధానం స్థితి గతులు పరిసీలించటం అవసరం. ఇతడు 'నజరానా'ల పేరుతూ ప్రజలను పీడించి కోట్లు గడించినాడు. పూర్తిగా మత పాక్షిక వైఖరినవలంభించినాడు. జనాభాలో 12 శాతం మాత్రమే ఉన్న ముస్లింలు. పరిపాలనా యంత్రాంగంలో 90 శాతం వరుకు వున్నారు. 'ఉర్దూ భాష'నే బోధనా భాషగా చేయటం జరిగింది. 'ప్రయివేటు విద్యాలయాలు' పెట్టుకొనటానికి అనుమతి నిచ్చేవారు కారు. ప్రభుత్వ ధనాన్ని ముస్లిం సంస్థలకే ఖర్చు చేసేవారు. 'భూస్వామి వ్యవస్థ' అమలులో ఉన్నది. భూములను కౌలుకు చేసే రైతాంగం వ్యవసాయ కార్మికులు. దుర్భర దారిద్ర్య జీవనాన్ని గడిపేవారు. పేదలకు ఏ మాత్రం హక్కులుండేవికావు. ప్రపంచంలోని పేదలకన్నా 'బ్రిటిష్ ఇండియా' పేరుట పౌరహక్కులు లేక నికృష్ట జీవితాన్ని గడుపుతుండే నిజాం పాలనలో సంస్థాన ప్రజలు అతిహేయమైన జీవనాన్ని నడపాల్సివచ్చేది. వ్యక్తులకు సాంఘిక భద్రత అసలే లేదు. రాజకీయ పౌరహక్కులు అంతకన్నాలేవు. ఒక విధంగా చెప్పాలంటే నిజాం 'మధ్యయుగపు ఫ్యూడల్ ప్రభువు' లాంటివాడు. పచ్చిమతోన్మాది.

**హైద్రాబాద్ స్వాతంత్ర్యోద్యమం - దాని పరిణామం :**

ఈ పరిస్థితులలోనే 20వ, శతాబ్ది ప్రారంభంలో హైద్రాబాద్ రాష్ట్రంలో 'గ్రంథాలయోద్యమం' ప్రారంభమైంది. తరువాత 1921లో 'ఆంధ్ర జనకేంద్ర సంఘం'. అనునొక దానిని స్థాపించుట జరిగింది. 1922 ఫిబ్రవరిలో మొదటి సభ జరుగుట సంభవించినది. ఈమహాసభలోనే ఆర్. గోపాలరెడ్డి అధ్యక్షుడుగా శ్రీ మాడపాటి హనుమంతరావుగారు కార్యదర్శిగా ఎన్నుకోబడ్డారు. అయితే ఇది ఒక పరిమితమైన సంస్థగానే కార్యక్రమాలు నిర్వహించసాగింది. కారణం నిజాం సంస్థానంలోని ప్రజలకు, బ్రిటిష్ ఇండియాలోని ప్రజలకు హక్కులు లేకుండుటయే బ్రిటిష్ ఇండియాలోని 'జాతీయోద్యమ భావం' హైద్రాబాద్ రాష్ట్రం పై కూడా

పడింది. ఇక్కడి నాయకులు కూడా 'రాజకీయ మహాసభలు' జరపాలని రాజకీయ కార్యక్రమాలు నిర్వహించాలని కోరుకోవటం సహజం. నిజాం ప్రభుత్వ నిర్బంధ విధానం వల్ల సాధ్యపడుట లేదు. అందువల్లనే హైద్రాబాద్ రాష్ట్ర రాజకీయ మహాసభలు రాష్ట్ర వెలుపలే 1926 లోను, 1928లోను జరిగాయి. శ్రీ మాడపాటి హనుమంతరావుగారు మొదలగు అనేక మంది ప్రముఖుల కృషియో, నిజాం రాష్ట్ర ఆంధ్రుల రాజకీయ ఆర్థిక సాంస్కృతిక వికాసానికి ఒక విశాలవేదికను నిర్మించే ఉద్దేశ్యంమో ఆంధ్రజనకేంద్ర సంఘాన్ని 'ఆంధ్ర మహాసభ' గా మార్చటానికి నిశ్చయించినారు. ఈ ఆంధ్రమహాసభ మెదక్ జిల్లా జోగిపేటలో 1930లో శ్రీసురవరం ప్రతాపరెడ్డి గారి ఆధ్యక్షతన. మొదటి సమావేశం జరుపుకున్నది. నిజాం రాష్ట్ర ఆంధ్ర మహాసభలు జరుపుకోటానికి గాని, దాని కార్యక్రమాలు కొనసాగటానికి గాని నిజాం ప్రభుత్వం అనేక అవరోధాలు కల్గిస్తూనే ఉన్నది. అయినప్పటికి అవరోధాలను ఎదుర్కొంటూ వివిధ ప్రాంతాలలో సమావేశాలు జరుపుకుంటూ దీన్ని ఒక మహోద్యమంగా ముందుకు తీసుకు పోయినారు. 1936లో నిజామాబాద్‌లో 'ఆరవ ఆంధ్ర మహాసభ' జరుగుటకు పూర్వము దీనిని రాజకీయేతర సంస్థ గానే చెప్పబడుతూ వచ్చింది. కాని ఈ సమావేశములో 'బాధ్యతా యుత ప్రభుత్వమే' మాధ్యేయమని అర్థమిచ్చేట్లుగా తీర్మానాన్ని అంగీకరించుట ద్వారా ఇది రాజకీయ సంస్థగా రూపుదిద్దుకోవటం ప్రారంభించింది. 1939లో 'రాజ్యాంగ సంస్కరణలు' ప్రవేశ పెట్టినారు. (నిజాం) దీనివలన ఆంధ్ర మహాసభ నాయకత్వంలో బేధాభిప్రాయాలు వచ్చినవి. కారణమేమంటే సంస్కరణలతో సర్దుబాటు చేసుకొని రాజీ పడదామని ఒక వర్గం భావించగా లోప భూయిష్టమైన ఈ సంస్కరణలకు వ్యతిరేకించాలని లక్ష్యసాధనకు ఎంతటి త్యాగం చేయటానికైనా వేరు తీసేది లేదని మరొక వర్గం భావించింది. వీరే మితవాద, అతివాద వర్గాలుగా చెలామణి అయినారు. ఒకవైపున ఆంధ్రమహాసభలు ఉత్తేజంతో జరుగుచుండుట చూచి ప్రభావితులై 1935లో మహారాష్ట్రులు. మహారాష్ట్ర పరిధిలో ఏర్పాటు చేయటం జరిగింది. దీనికి శ్రీ మాడపాటి హనుమంతరావు మొదలగు ఆంధ్రమహాసభ నాయకులు చేయూత నిచ్చినారు. 1937లో 'కర్నాటక పరిషత్' కూడా ఏర్పాటైనది. స్వామి రామానందతీర్థ దిగంబర్ దేశాయ్ లాంటి మహోన్నత వ్యక్తులు మహారాష్ట్ర కర్నాటక ప్రాంత పరిషత్తులకు నాయకత్వం వహించి ఉద్యమాన్ని ముందుకు తీసుకుపోయినారు. ఇవన్నీ విలీనమై చివరకు 'హైదరాబాద్ స్టేట్ కాంగ్రెస్' లో కలిసి పోయినవి హైద్రాబాద్ స్టేట్ కాంగ్రెస్ 1938లో హైద్రాబాద్‌లో స్థాపించబడి 13 మంగ

తాత్కాలిక కార్యవర్గాన్ని ఎన్నుకున్నది. అందులో శ్రీ బూర్గుల రామకృష్ణారావు, శ్రీ రావినారాయరెడ్డి, శ్రీ హరిశ్చంద్ర హెగ్డే, శ్రీ ఆర్.యస్. నాయక్, జి. రామాచారి, శ్రీ జనార్ధనరావు దేశాయ్, శ్రీ ఆర్. తిమ్మాజీ, శ్రీ పాండురంగ జోషి వున్నారు. ఈ తాత్కాలిక కార్యవర్గం స్థానంలో 'కార్యాచరణ సమితి' సమావేశమై, 1938 అక్టోబరు 24న స్టేటు కాంగ్రెస్ స్థాపించబడినదని తీర్మానించి జాతీయ కాంగ్రెస్ అనుమతితో, శ్రీ గోవిందరావు నానక్ నాయకత్వంలో 'సత్యాగ్రహాని'కి సన్నాహాలు చేసినారు. అదేరోజు శ్రీ గోవిందరావు నానక్ శ్రీ రాంకిషన్ దూత్ శ్రీ రావి నారాయణ రెడ్డి, శ్రీ జనార్ధనరావు దేశాయ్ మొదలగు వారు హైద్రాబాద్‌లో 'సత్యాగ్రహం' చేసి జైలుకు వెళ్లినారు. (ఈ సందర్భంలో స్టేటు కాంగ్రెస్ ఆవిర్భవించకముందే సెప్టెంబరు 7నే నిజాం ప్రభుత్వం నిషేదించిందన్న వాస్తవాన్ని గుర్తించాలి.) ఇదే రోజున అనగా సెప్టెంబరు 24న తెలంగాణాలో శ్రీ సర్దార్ జమలాపురం కేశవరావు గారు వరంగల్ జిల్లా మధిరలో వేలాదిమంది హాజరైన బహిరంగ సభలో "నిజాం ప్రభుత్వాన్ని కాంగ్రెస్ పుట్టుక ముందే నిషేదించిన ప్రభుత్వాన్ని విమర్శిస్తూ స్టేట్ కాంగ్రెస్ తరపున తెలంగాణా ప్రాంతపు సత్యాగ్రహానికి నాంది ప్రస్థావన జరుపుతున్నాన"ని హర్షద్వానాల మధ్య ప్రకటించానారు. తరువాత ప్రభుత్వం శ్రీ సర్దార్ జీని అరష్టు చేసినారు. ఈ విధంగా హైద్రాబాద్ రాష్ట్రం మొత్తం మీద సత్యాగ్రహం చేసినది. సుమారు 400 మంది జైలుకు వెళ్లినారు. తరువాత శ్రీ గాంధీ గారు ఆదేశం మేరకు డిశంబరులో ఉద్యమం ఆపివేయబడినది. కాంగ్రెస్ రాజకీయ దృక్పథంలో బాధ్యతాయుతంగా ప్రభుత్వం మేరకు సత్యాగ్రహం జరిపితే 'ఆర్య సమాజం మత స్వాతంత్ర్యం' సంపాదించటానికి అట్లే 'హిందూ మహాసభ'. పేదహక్కులమేరకు సత్యాగ్రహాలకి కూడా పూనుకోవటం జరిగింది. వారు కూడా ఎంతోమంది జైలుకు వెళ్లినారు. గాంధీజీ నిజాం ప్రభుత్వంలోని హైదారాబాద్ రాష్ట్ర ప్రధాన మంత్రి అక్బర్ హైదరతో ఉత్తరప్రత్యుత్తరాలు నడిపినప్పటికి ఫలితం లేకపోయింది. స్టేట్ కాంగ్రెస్ పై నిషేదం తొలగలేదు. మళ్లా యధావిధిగా ఆంధ్ర మహాసభల ద్వారా ఆంధ్ర ప్రాంతం లోను మహారాష్ట్ర, కర్నాటక ప్రాంతంలో పరిషత్తుల ద్వారా ఆయా ప్రాంతాలలోను రాజకీయ కార్యకలాపాలు నడిచాయి. 'ఏడవ ఆంధ్ర మహాసభ' 1910లో మందుముల రామచంద్రరావు గారి అధ్యక్షతన బాగాయతు జిల్లాలో జరిగింది. ఈ మహాసభ నాటికి చాలా మార్పు వచ్చింది. బ్రిటిష్ ఇండియాలో మాదిరిగా 'కార్మికులవేతన చట్టాన్ని' తీసుకొని రావాలని తీర్మాన రూపంలో కోరినారు. కార్మికుల సమస్యపై తీర్మానం చేయుటం అదే ప్రథమం 'ఎనిమిదవ ఆంధ్ర మహాసభ' 1941లో రావినారాయణరెడ్డి గారి

అధ్యక్షతన నల్గొండలో జరిగింది. ఈ మహాసభలో పాత పద్ధతులకు విరుద్ధంగా అంతర్జాతీయ విషయాలు, ప్రపంచ యుద్ధం దాని ప్రభావం, 'పెట్టుబడిదారీ విధానము' మరియు దాని దుష్పరిణామాలు, దీనికి ప్రత్యామ్నాయంగా రావలసిన కొత్త విధానము, స్త్రీ స్వాతంత్ర్యము, ఆర్థిక స్వావలంబనము మొదలగు అనేక విషయాలు ప్రస్తావించబడ్డాయి.

1942లో 'పదవ ఆంధ్ర మహాసభ' ఆహ్వాన సంఘానికి డా॥జయసూర్య (సరోజిని నాయుడు కుమార్డు) అధ్యక్షుడుగా ఎన్నుకోబడ్డాడు. 'పదవ ఆంధ్ర మహాసభ'కు చాలా తీవ్రమైన పోటీ జరిగింది. మాడపాటి హనుమంతరావు గారి వర్గం కుండా వెంకట రంగారెడ్డి గార్ని బలపరచగా నారాయణ రెడ్డి గారి వర్గం బద్దం యల్లారెడ్డి గార్ని బలపరిచింది. చివరకు పాతనాయకుడు రంగా రెడ్డి గారే ఎన్నుకోబడ్డాడు. సభలు ప్రశాంతంగానే జరిగినప్పటికి రెండు విభిన్న దృక్పథాలు గల వర్గాలు స్పష్టంగా ఏర్పడ్డాయి. 'పదకొండవ ఆంధ్ర మహాసభ' 1944లో రావి నారాయణ రెడ్డిగారి అధ్యక్షతన చివరిలో జరిగింది. ఈ సభల నాటికి నాయకత్వం కమూనిష్టులచేతికి చిక్కింది. ఆచారం ప్రకారం మాజీ అధ్యక్షుతలో పదవీ బాధ్యతలు వహించి సభాకార్యక్రమాలలో పాల్గొనకుండానే వెళ్లినారు తరువాత ఆంధ్ర మహాసభకు విడిగా కాంగ్రెస్ వారు 1945లో వరంగల్ జిల్లా మడికుండలో మందుముల నరసింగరావు గారి అధ్యక్షతన జరుపుకొనుట జరిగినది 1946లో చివరిగా సర్దార్ జమలాపురం కేశవరావు గారి అధ్యక్షతన మెదక్ జిల్లాలోని 'కంది' గ్రామంలో జరిగినది.

1946 జూన్‌లో స్టేట్ కాంగ్రెస్ పై ఆంక్షలు తొలగి పోవుటమో ఆంధ్రసభ కర్నాటక, మహారాష్ట్ర పరిషత్తులు కలిసిన సందర్భంగా 'స్టేట్ కాంగ్రెస్ అధ్యక్ష పదవికి జరిగిన ఎన్నికలలో శ్రీ స్వామి రామానంద తీర్థ, శ్రీ బూర్గుల రామకృష్ణారావు గార్ల మధ్య తీవ్రంగా పోటీ జరిగింది. చివరకు స్వామీజీ యే స్వల్ప మెజార్టీతో అధ్యక్షుడుగా ఎన్నుకోబడ్డాడు. జూన్ 17, 18, 19 తేదీలలో మహాసభ జరిగింది హైదరాబాద్ సంస్థానం భారత యూనియన్‌లో విలీనం కావాలనే నినాదాలతో సభలు ముగిసాయి.

## అజాద్ హైద్రాబాద్ ప్రకటన - నిజాంతో భారత ప్రభుత్వ ఒడంబడిక :

1947 ఆగస్టు, 15న భారత స్వాతంత్ర్య ప్రకటన వెలువడింది నిజాం 'ఆజాద్ హైదరాబాద్ ప్రకటించినాడు. భారత జాతీయ ఝుండాను స్టేట్ కాంగ్రెస్ ఝుండాలను హైద్రాబాద్ రాష్ట్రంలో ఎగురవేయుటకు నిషేధించినారు దేశమంతట స్వాతంత్ర్య వేడుకలు ప్రజలు జరుపుకుంటూంటే స్వేచ్ఛావాయువులు పీల్చుతుంటే

హైద్రాబాద్ సంస్థాన ప్రజలు మాత్రం 'మధ్యయుగపు ఫ్యూడల్ దోపిడి' క్రింద ఏ మాత్రం పౌరహక్కులు లేక అతి హేయమైన బానిస జీవనాన్ని గడపాల్సివస్తున్నది. ఇట్టి స్థితిలో 1947 ఆగస్టు, 7వ తేదీన స్టేట్ కాంగ్రెస్ సత్యాగ్రహం చేయుటకు పిలుపు ఇవ్వటం జరిగింది. స్టేట్ కాంగ్రెస్ వారు జట్లు జట్లుగా మొత్తం రాష్ట్రంలో అనేక చోట్ల సత్యాగ్రహాలు చేసి జైల్లకు వెళ్లినారు. ఇదే సందర్భంలో కమ్యూనిష్టులు, సోషలిస్టులు ఆర్య సమాజపు వారు, హిందూ మహాసభ వారు కూడా పాల్గొని వారు శ్రీ రామానంద తీర్థ, సర్దార్‌జీలు 1947లో జైళ్లకు వెళ్లినారు. సత్యాగ్రహం ఉధృతంగా జరుగుతున్న సమయంలో భారత ప్రభుత్వం ఒక సంవత్సర కాలానికి తాత్కాలిక ఒడంబడిక కుదుర్చుకున్నది. దీని ప్రకారం 47 ఆగస్టు 15కు పూర్వపు బ్రిటిష్ ప్రభుత్వానికి ఉండినట్టి పాలనా వ్యవస్థ విదేశీ వ్యవహారములు, రక్షణ, రవాణాకు సంబంధించినవన్నీ ఒడంబడికలో ఉన్నాయి. నిజాంకు సాయపడటానికి సైన్యం పంపాలి. లోగడ బ్రిటిష్ వారు చేసుకునిన ఒడంబడిక ప్రకారం అక్కడున్న సైన్యాలను ఉపసంహరించుకోవాలి. యుద్ధ కాలంలో తప్ప హైద్రాబాద్ లో సైన్యాన్ని ఉంచరాదు. ఉభయ ప్రభుత్వాల తరపున ఢిల్లీలోను, హైద్రాబాద్‌లోను ఏజంట్లు ఉంటారు. ఇదీ ఒడంబడిక సారాంశం.

**నిజాం ప్రభుత్వ ఆదాయ వివరాలు - రజాకార్ల ఆగడాలు :**

ఇది ఇట్లుండగా నిజాం ప్రభుత్వం రైతులు చెమటోడ్చి పండించిన ధాన్యం పై 'లేవి' విపరీతంగా వేసినారు. యూనియన్ ప్రాంతం నుండి నిజాం సరిహద్దులు దాటి వచ్చే వినియోగ సామాగ్రిపై 'కరోడ్గిరి'. పన్నులు వేసి వసూలు చేసేవారు. రైలు స్టేషన్‌ల వద్ద సరిహద్దు గ్రామాలలో కరోడ్గిరి. ఆఫీసులు పెట్టి ఉంచబడినాయి. యూనియన్ నుండి నిజాం రాజ్యంలోకి వచ్చే వస్తువుల మొదలగు వాటిపై మరియు ఇక్కడుండి అక్కడికి వెళ్లే సరుకు పై సుంకం భారీగా వసూలు చేయుచుండెడివారు. వారు ప్రతివ్యక్తిని తనిఖీచేసి నూతన వస్తువులేమైన ఉన్నయో 'అపరాద పన్ను' వేసి వసూలు చేసేవారు. ఈ విధంగా కోట్ల రుపాయాల ఆదాయం. ప్రభుత్వానికి వచ్చేది. అందుకే దీనికి కరోడ్గిరి శాఖ' అని నామకరణం చేసినారు. ప్రభుత్వం ఇదిగాక ఈత చెట్లు తాటి చెట్లు, విప్ప పువ్వు చెట్లు పై అధికారము ప్రభుత్వానికే వుండేది. వీటి ద్వారా ఆదాయం వచ్చేది. ఈ విధంగా వచ్చే ఆదాయం రజాకార్లకు, పోలీసులకు, మస్లిన్ సంస్థకు ఖర్చు పెట్టేది. రజాకార్లు ఆగడాలు చెప్పనలవిగావు. గ్రామాలపై బడి దోపిడీలు చేసేవారు స్త్రీలను సామూహిక మానభంగం చేసేవారు వాళ్ల అరాచకానికి అంతులేదు. హత్యలు, దోపిడీలు, గృహదహనాలు, మానభంగాలు, నిత్య కృత్యమైనాయి. ప్రజలు సరిహద్దులు దాటి

హైద్రాబాద్ సంస్థాన ప్రజలు మాత్రం 'మధ్యయుగపు ఫ్యూడల్ దోపిడి' క్రింద ఏ మాత్రం పౌరహక్కులు లేక అతి హేయమైన బానిస జీవనాన్ని గడపాల్సివస్తున్నది. ఇట్టి స్థితిలో 1947 ఆగస్టు, 7వ తేదీన స్టేట్ కాంగ్రెస్ సత్యాగ్రహం చేయుటకు పిలుపు ఇవ్వటం జరిగింది. స్టేట్ కాంగ్రెస్ వారు జట్లు జట్లుగా మొత్తం రాష్ట్రంలో అనేక చోట్ల సత్యాగ్రహాలు చేసి జైల్లకు వెళ్లినారు. ఇదే సందర్భంలో కమ్యూనిష్టులు, సోషలిస్టులు ఆర్య సమాజపు వారు, హిందూ మహాసభ వారు కూడా పాల్గొని వారు శ్రీ రామానంద తీర్థ, సర్దార్‌జీలు 1947లో జైళ్లకు వెళ్లినారు. సత్యాగ్రహం ఉధృతంగా జరుగుతున్న సమయంలో భారత ప్రభుత్వం ఒక సంవత్సర కాలానికి తాత్కాలిక ఒడంబడిక కుదుర్చుకున్నది. దీని ప్రకారం 47 ఆగస్టు 15కు పూర్వపు బ్రిటిష్ ప్రభుత్వానికి ఉండినట్టి పాలనా వ్యవస్థ విదేశీ వ్యవహారములు, రక్షణ, రవాణాకు సంబంధించినవన్ని ఒడంబడికలో ఉన్నాయి. నిజాంకు సాయపడటానికి సైన్యం పంపాలి. లోగడ బ్రిటిష్ వారు చేసుకునిన ఒడంబడిక ప్రకారం అక్కడున్న సైన్యాలను ఉపసంహరించుకోవాలి. యుద్ధ కాలంలో తప్ప హైద్రాబాద్ లో సైన్యాన్ని ఉంచరాదు. ఉభయ ప్రభుత్వాల తరపున ఢిల్లిలోను, హైద్రాబాద్‌లోను ఏజంట్లు ఉంటారు. ఇదీ ఒడంబడిక సారాంశం.

**నిజాం ప్రభుత్వ ఆదాయ వివరాలు - రజాకార్ల ఆగడాలు :**

ఇది ఇట్లుండగా నిజాం ప్రభుత్వం రైతులు చెమటోడ్చి పండించిన ధాన్యం పై 'లేవి' విపరీతంగా వేసినారు. యూనియన్ ప్రాంతం నుండి నిజాం సరిహద్దులు దాటి వచ్చే వినియోగ సామాగ్రిపై 'కరోడ్గిరి'. పన్నులు వేసి వసూలు చేసేవారు. రైలు స్టేషన్‌ల వద్ద సరిహద్దు గ్రామాలలో కరోడ్గిరి. ఆఫీసులు పెట్టి ఉంచబడినాయి. యూనియన్ నుండి నిజాం రాజ్యంలోకి వచ్చే వస్తువుల మొదలగు వాటిపై మరియు ఇక్కడుండి అక్కడికి వెళ్లే సరుకు పై సుంకం భారీగా వసూలు చేయుచుండెడివారు. వారు ప్రతివ్యక్తిని తనిఖీచేసి నూతన వస్తువులేమైన ఉన్నయో 'అపరాద పన్ను' వేసి వసూలు చేసేవారు. ఈ విధంగా కోట్ల రుపాయాల ఆదాయం. ప్రభుత్వానికి వచ్చేది. అందుకే దీనికి కరోడ్గిరి శాఖ' అని నామకరణం చేసినారు. ప్రభుత్వం ఇదిగాక ఈత చెట్లు తాటి చెట్లు, విప్ప పువ్వు చెట్లు పై అధికారము ప్రభుత్వానికే వుండేది. వీటి ద్వారా ఆదాయం వచ్చేది. ఈ విధంగా వచ్చే ఆదాయం రజాకార్లకు, పోలీసులకు, మస్లిన్ సంస్థకు ఖర్చు పెట్టేది. రజాకార్ల ఆగడాలు చెప్పనలవిగావు. గ్రామాలపై బడి దోపిడీలు చేసేవారు స్త్రీలను సాముహిక మానభంగం చేసేవారు వాళ్ల అరాచకానికి అంతులేదు. హత్యలు, దోపిడీలు, గృహదహనాలు, మానభంగాలు, నిత్య కృత్యమైనాయి. ప్రజలు సరిహద్దులు దాటి

'పోలీసు చర్య'కు కొద్ది రోజులముందే శ్రీ జయప్రకాశ్ భారతదేశంలో 'సంస్థానాధీశుల' కు స్థానంలేదు, నిజాం పోవాలి. అతని సంస్థానం ముక్కలు చేయబడి ఆయా భాషా ప్రాంతాలలో కలపబడాలని నిర్ద్వంద్వంగా ప్రకటించినారు. చివరకు అదే జరిగింది.

## పోలీసు చర్య నిజాం లొంగుబాటు :

స్టేట్ కాంగ్రెస్ ఆధ్వర్యంలో నడిచే 'క్యాంపుల నిర్వహణ' చూడటానికి శ్రీ బొమ్మకంటి సత్యనారాయణ రావు గార్ని నియమించినారు. సరిహద్దులలోని కార్యకర్తలు - టెలిగ్రాం ద్వారా రజాకార్ల దురంతరాలను ఎరుక పరిచినారు. రజాకార్ల దురంతాల్ని ప్రత్యక్షంగా నైజాంలో పర్యటించి, చూచి 'ఆమరణాంతర నిరాహార దీక్ష' బూని శ్రీ బన్సాలీగారికి వల్లబాయ్ పటేల్ గారు హామీ యిచ్చి దీక్ష విరమింపచేశారు. చివరకు 1948 సెప్టెంబరు 13న భారత సైన్యం రంగ ప్రవేశం చేసింది. 17వ తేది కల్లా నిజాం లొంగిపోయినాడు. రజాకార్లు అయుధాలు విడిచి పెట్టి పారిపోయినారు. సర్దార్ పటేల్ జె.యన్. చౌదరిని 'మిలటరీ గవర్నరు'గా, నియమించినారు. 1949 సెప్టెంబరు ____తేదీన భారతప్రభుత్వం జె.యన్.చౌదరిని తొలగించి భారతప్రభుత్వ స్టేట్సు డిపార్టుమెంటు కార్యదర్శి వెల్లోడిని నియమించటం జరిగింది. వెల్లోడి అధిపతిగా 1952 సాధారణ ఎన్నికల వరకు పరిపాలన అమలులో ఉన్నది.

## కమ్యూనిష్టులు సాయుధ పోరాటం మిల్టరీ పాలన ప్రజల పరిస్థితి :

1943 లో హైద్రాబాద్ లో జరిగిన పదవ ఆంధ్ర మహాసభలోనే భేదాభిప్రాయాలు వచ్చినవి. అప్పటికే కమ్యూనిష్టులు గణనీయమైన శక్తిగా ముందుకు వచ్చినారు. 1944 భువనగిరిలో జరిగిన 'పదకొండవ ఆంధ్రమహాసభ' లో నాయకత్వం కమ్యూనిష్టుల చేతికి వచ్చింది. అప్పటి నుండి కమ్యూనిష్టుల పాత్ర చురుకైన పాత్ర వహించిందని చెప్పవచ్చు. ముఖ్యంగా 1945 - 1946 ప్రాంతం నుండి రైతాంగ పోరాటాన్ని ఉధృతం చేసింది. వేళ్లపై లెక్కపెట్ట తగిన కొద్దిమంది భూస్వాములు వేల ఎకరాల భూమిని కల్గి ఉండేవారు. భూములకు కౌలుకు తీసుకొని చేసే పేదరైతాంగము మరియు వ్యవసాయ కార్మికుల సమాజంలో అత్యధిక శాతంలో వుండేవారు. ఈ విధానంలో రైతాంగము ఫ్యూడల్ దోపిడికి గురైనారంటే ఏమాత్రం ఆశ్చర్యం లేదు. తరతరాలుగా ఫ్యూడల్ దోపిడికి గురిచేయబడుతూ ఉన్న పేద ప్రజలు భూస్వామ్య విధానానికి, వెట్టిచాకిరికి వ్యతిరేకంగానే రైతాంగవ్యవసాయ కార్మికుల సమస్య పోరాడుచున్న కమ్యూనిస్టు పార్టీ పట్ల ఆకర్షితులు కావటం అత్యంత సహజమైన విషయాలు. ఆ రకంగా

కమ్యూనిస్టుల పోరాటం ఉధృతంగా నడిచింది. 1947 ఆగస్టు, 15 తరువాత అదివొకవైపు 'నిజాం వ్యతిరేక పోరాటం'గానూ, మరొక వైపు 'భూస్వామ్య' వ్యతిరేక పోరాటంగానూ నడిచింది. ఈ దశలో 'విశాలాంధ్రలో ప్రజారాజ్యం' అన్న నినాదంతో 'భాషా ప్రయుక్త రాష్ట్రం' కావాలని ఎలుగెత్తి చాటింది. నిజాం ప్రభుత్వం మరియు రజాకార్ల దాడులను ఎదుర్కొంటూనే 'పోలీసు చర్య' జరిగేంతవరకు పోరాటంనడిచింది. నిజాంలొంగిపోయిన తరువాత 'సాయుధ పోరాటాన్ని' కొనసాగించాలనే నిశ్చయయానికి వచ్చారు. భారత ప్రభుత్వం నిజాంను కొనసాగించాలనే నిశ్చయానికే వచ్చారు. భారత ప్రభుత్వం నిజాంతో ఒక సంవత్సరం ఒప్పందం కుదుర్చుకోవటం, భూస్వామ్య విధానానికి స్వస్తి పలుకకపోవటం నిజాంకు గూడా మిగితా సంస్థానాధీశుల వలె రాజభరణాలు ఇవ్వటం, 1950న నిజాంకు 'రాజప్రముఖు'గా నియమించటం, ఇవన్నీ వారి సాయుధ పోరాటం కొనసాగించటానికి కారణాలు అయివుంటాయి. అంతేగాక ఈ సాయుధ పోరాటం "జాతీయ విమోచన పోరాటం"గా భావించిన వారి సైద్ధాంతిక అవగాహన లోపం గూడా పోరాటం అతీరుగా జరగటానికి ప్రధాన కారణం. ఈ విషయాన్ని శ్రీ పుచ్చలపల్లి సుందరయ్య గారు వ్రాసిన 'వీర తెలంగాణా విప్లవ పోరాటం గుణపాఠాలు'అన్న గ్రంధంలో విశదీకరించినారు కూడా.

## నిస్వార్థ నిష్కంకదేశభక్తులు సర్దార్ జమలాపురం కేశవరావు గారు

సుమారు 200 సం॥లు పాలించిన బ్రిటిష్ వాండ్లకు దేశం నుంచి వెళ్లగొట్టడానికి, భారతదేశం స్వాతంత్ర్యం పొందటానికి జరిగిన జాతీయోద్యమం మహోన్నతమైనది. వివిధ స్వాభావాలు కల్గిన వివిధ రకాలైన చిన్న పెద్ద ఉద్యమాలలు కల్సి 'జాతీయోద్యమం' మహోద్యమంగా అభివృద్ధి చెంది 1947 ఆగస్టు 15న భారత స్వాతంత్ర్య ప్రకటన వెలువడానికి కారణమైంది. స్వాతంత్ర్యం వచ్చేనాటికి భారతదేశంలో 565 సంస్థానాలు వున్నాయి. వీటన్నింటిని 'ఇండియన్ యూనియను' లో విలీనం చేసి తద్వారా భారత ప్రజానీకాన్నందర్ని రాచరిక వ్యవస్థ యొక్క పరిపాలన నుండి విముక్తి కావటానికి జరిగిన ప్రయత్నము కూడా మన చరిత్రలో చిరస్మరణీయమైన ఘట్టం. అందులో ముఖ్యంగా హైద్రాబాద్ రాష్ట్రం. 'ఇండియన్ యూనియన్'లో విలీనం కావటానికి జరిగిన ఉద్యమం 'భారత జాతీయోద్యమ' చరిత్రలోనే ఒక ప్రత్యేకతకు సంతరించుకున్నాయి. 1947 ఆగస్టు 15న భారతస్వాతంత్ర్య ప్రకటన వెలువడిన తరువాత 1948 సెప్టెంబరులో 'సైనిక చర్య అనంతరం' నిజాం నవాబు లొంగి పోయేంత వరకు హైద్రాబాద్ రాష్ట్రంలో జరిగిన పరిణామాలు, ఇక్కడి ప్రజలు జరిపిన నిజాం వ్యతిరేక ఉద్యమం ఇవన్నీ కూడా

భారతదేశంలో మరెక్కడా లేనివొక ప్రత్యేకతను కల్గి ఉన్నట్టి ఘట్టాయి. భారత జాతి సమైక్యంగా ఉండాలని, భారత జాతీయులంతా ఒకే జాతీయ రాష్ట్రం క్రింద ఉండాలని, భారతీయులంతా సమైక్యం కావాలని, కాంక్షించి హైద్రాబాద్ రాష్ట్రంలో అనేకమంది తమ ప్రాణాల్ని కూడా లెక్క చేయకుండా నిజాంకు, ఆయన పరిపాలనకు వ్యతిరేకంగానే వారికి అనుబంధంగా ఖాసింరజ్వీ నాయకత్వాన రజాకార్ల ఆగడాలకు వ్యతిరేకంగాను నడిపిన మహోద్యమం మరువరానిది - అట్టి వుద్యమాన్ని నడిపిన మహానీయులలో సర్దార్ జమలాపురం కేశవరావు గారు ఆదర్శ పురుషుడు - 1945 సం॥లో మధిరలో కీ.శే. మిరియాల నారాయణ గుప్తా గారింట్లో శ్రీ కేశవరావు గారితో నాకు తొలిసారిగా పరిచయం ఏర్పడింది. తొలి పరిచయంలోనే శ్రీ కేశవరావు గారి మహోన్నత ఆశయాలు ప్రజల సమస్యల పట్ల వారికున్న అవగాహన. ఆతృత జాతీయోద్యమం పట్ల వారివైఖరి. నన్నెంతో ఆకర్షించాయి. అంతేగాక నిస్వార్ధంగా దేశం కోసం తన సర్వస్వాన్ని త్యాగం చేసిన ఆమహానీయుని ఆదర్శాలనుండి నేను పొందిన స్ఫూర్తి. చిరస్మరణీయ మైనది. ఆనాటి తొలిపరిచయం నుండి మేము చాలా మంది మీ కార్యకర్తలము. వారి నాయకత్వంలో దేశం కోసం మాకు చాతనైంది మేం చేశాము. 1946 సం॥లో కాంగ్రెస్ పై ఉన్న ఆంక్ష తొలిగించుటయు మరియు ఆనాడు నైజాం ప్రవేశ పెట్టిన లోపభూయిష్టమైన భూసంస్కరణలు మొదలగు వాటికి వ్యతిరేకంగాను మరియు నిజాం ఛత్ర చ్ఛాయాల క్రిందనే 'భాధ్యతా యుత ప్రభుత్వం' ఏర్పాటు చేయాలని, వయోజన ఓటింగు హక్కు ప్రవేశ పెట్టవలెనని, ఓటింటు ద్వారా వచ్చిన ప్రతినిధులచే భాధ్యతాయుత ప్రభుత్వం ఏర్పరచవలెనని, ఉద్యమించటం జరిగింది. స్టేట్ కాంగ్రెస్ తీర్మానం ప్రకారం మధిర ప్రాంతంలో శ్రీ జమలాపురం కేశవరావు గారి నాయకత్వంలో దీనికి అణుగుణంగానే (1) వట్టికొండ రామకోటయ్య (2) శెట్టిపెల్లి వెంగళరావు (3) అవధానుల రామకోటయ్య శాస్త్రి (4) పొరంకి వెంకట్రాజు (5) గుడ్ల సత్యం మొదలగు వారలతో బుర్రకథ దళాలు. ఏర్పాటు చేసి గ్రామాల్లో ప్రచారం చెయ్యటం జరిగింది. మరికొంతమంది ఉపన్యాసాల ద్వారాను గ్రామాల్లో తిరిగి ప్రజల్ని చైతన్యంవంతులుగా చేయటం కోసం ప్రచారం చేయటం జరిగింది. ఇదే సందర్భంలోనే 1946లో అరెస్టుచేయబడ్డాను ఆనాడు జైలుకు వెళ్లబడినవారు మాఫీనామా (క్షమించమనికోరటం) దాఖలే చేస్తే విడిచి పెట్టటం జరిగింది. కాని అప్పడు శ్రీ జమలాపురం కేశవరావుగారు 'మాఫీనామా' దాఖలుచేయవద్దని నాకు ఎంతో ధైర్యాన్ని చెప్పి నాకు కావలసిన అన్ని సదుపాయాలు పట్టణ కాంగ్రెస్ ద్వారా చేయించి శ్రీ అన్నసముద్రం జగన్నాధ రావు గార్ని వకీలుగా పెట్టి బెయిల్ పై విడిపించటానికి ప్రయత్నించినారు.

1947 ఆగస్టులో స్వాతంత్ర్య ప్రకటన వెలువడగానే నిజాం 'ఆజాద్ హైద్రాబాద్' అని ప్రకటించుకున్నాడు. అప్పుడు హైద్రాబాద్ రాష్ట్రం ఇండియన్ యూనియన్‌లో కలవాలని స్టేట్ కాంగ్రెస్ అధ్యక్షుడు శ్రీ స్వామి రామానంద తీర్థ నాయకత్వంలో తీర్మానం చేయుట జరిగినది. అంతే కాకుండా రాష్ట్రం మొత్తం మీద 'సత్యాగ్రహాలు' నడపాలని కూడా నిర్ణయించటం జరిగింది. మొదటిగా శ్రీ స్వామి రామానంద తీర్థ సత్యాగ్రహం జరుపుతారని అందువలన శ్రీ జమలాపురం కేశవరావు గారి తెలంగాణా ప్రాంతపు బాధ్యత ఒప్పగించటం జరిగినది. అప్పుడు కేశవరావు గారు నాయకత్వాన జరిగిన 'సత్యాగ్రహ మహోద్యమం' ఈ ప్రాంతం ప్రజల్ని ఎంతో ఉత్తేజుల్ని చేశింది. జట్లు జట్లుగా సత్యాగ్రహం జరిపినాము. శ్రీ కేశవరావు గారు గ్రామగ్రామాన మారువేషంలో తిరిగి కార్యకర్తలకు ఉద్యమ స్వభావాన్ని తెలుపుతూ ఉత్తేజమైన ఉపన్యాసాల ద్వారా నిజాం వ్యతిరేక ఉద్యమాన్ని ముందుకు తీసుకొనిపోయినారు. తనువేదిక వద్దకు వచ్చేంతవరకు తన ఉనికిని ప్రభుత్వానికి తెలియకుండా మారువేషంతో వచ్చి ఉపన్యాసాలిచ్చేవారు. ఇదే సందర్భంలో శ్రీ కేశవరావు గారు 1947 ఆగస్టు 7వ తేదీన మధిరలో సత్యాగ్రహం చేసి జైలుకు వెళ్లినారు. తరువాత కార్యక్రమం ఎట్లా ఉండాలి అనే నిర్ణయం చేయుటకు గాను శ్రీ దిగంబర్‌రావు బిందూ గారి అధ్యక్షతన షోలాపుర్‌లో సమావేశం జరిపి 'కార్యాచరణ సమితి'ని ఏర్పాటు చేయుటం జరిగింది. అందులో శ్రీ హయగ్రీవాచారి, శ్రీ బొమ్మకంటి సత్యనారాయణరావు గారి ఆధ్వర్యంలో తెలంగాణాలో ఉద్యమనిర్వహణకు విజయవాడకు హెడ్డాఫీసు ఏర్పాటు చేయటయున్నూ తదుపరి శ్రీ బిందూగారి ఆద్వర్యంలో మద్రాసులో ఆఫీసు ఏర్పాటు చేయుట జరిగింది.

1948 సం॥ సెప్టెంబర్‌లో పోలీసు చర్య జరిపి నిజాం లొంగిపోయిన తరువాత జె.ఎన్. చౌదరి నాయకత్వాన నిజాం స్టేటులో మిలటరీ ప్రభుత్వము ఏర్పడిన తరువాత కూడా మిల్టరీ ప్రభుత్వ దుశ్చర్యలకు గూడా వ్యతిరేకించినారు. ప్రభుత్వమనేది ప్రజల క్షేమానికి గాని ప్రజాప్రయోజనాలకు వ్యతిరేకంగా ఉండకూడదనేది ఆయన అభిప్రాయం. అందుకే ఆనాడు కూడా చౌదరి ప్రభుత్వానికి సహితం వ్యతిరేకంగా ఉద్యమిస్తూ హెచ్చరించినారు. మిల్టరీ ప్రభుత్వాన్ని హెచ్చరించిన యోధుడు జమలాపురం కేశవరావు గారొక్కరే. పాలనా యంత్రాంగంలో ఉన్న అవకతవక లన్నింటిని ఎత్తి చూపినాడు. సాహసవంతంగా ప్రాణానికి సహితం లెక్క చేయకుండా పోరాడిన మహామనిషి జమలాపురకేశవరావు గారు అప్పడే శ్రీ జవహర్ లాల్ నెహ్రూ చేత 'సర్దార్' అని అనిపించుకున్నారు.

కమ్యూనిస్టులు సాయుధ పోరాటం సల్పుచుండురో జులలో గూడా ధైర్యంగా వారికి వ్యతిరేకంగా పోరాటం జరిపి ధీరుడిననిపించుకున్న వ్యక్తి శ్రీ కేశవరావు గారు.



# 17. ఆచార్య బన్నాలిజీ

- శ్రీమాన్ వేదాంతం రాఘవాచార్యులు గారు
మామునురు

శ్రీ బన్నాలి గారి జన్మస్థానం ఉత్తర హిందూస్థాన్. బెనారస్ విశ్వవిద్యాలయంలో వారు సంస్కృతాన్ని అభ్యసించి, జర్మనీలో ఉన్నత విద్యాభ్యాసం చేసినారు. తరువాత బెనారస్ విశ్వవిద్యాలయంలో ప్రవేశించారు.

కొంత కాలానికి వారు సన్యసించారు. హిమాలయంలో తపస్సు చేశారు. గాంధీ పిలుపు మేరకు దేశసేవకొరకు 'కాంగ్రెస్ ఉద్యమం'లో ప్రవేసించినారు. వారి ఆహారం 'కందమూలాలు', 'వేపాకు' తీసుకొనేవారు. తరువాత మినప గుగ్గిళ్లు, పాలు కూడ కొంతకాలం తీసుకునేవారు.

ఉత్తర హిందూస్థానంలో అరువది గ్రామాలు వారు ప్రభుత్వానికి పంటలు పండక 'శిస్తు' కట్టలేక పోవుటచేత ఆంగ్లేయ ప్రభుత్వము ఆగ్రహించి సైన్యాన్ని వినియోగించి గ్రామాలలోని ప్రజలను వెళ్లగొట్టి సైన్యం ఆక్రమణ జరిపించింది. ప్రజలు గాంధీ గార్కి మొరపెట్టుకోగా గాంధీగారు "ఆచార్య బన్యాలిజీ హిమాలయంలో వున్నారు. వారిని తీసుకొని వస్తే మీ కష్టాలు తీరగలవని" వారు ఒక లేఖవ్రాసి బన్యాలిగారి దగ్గరకు పంపారు. ఆ లేఖను కాంగ్రెస్ నాయకులు తీసుకొని ఆచార్య బన్యాలి గారికి అందజేసారు. గాంధీగారి పిలుపుమేరకు ఆ గ్రామాలు సందర్శించి అరువది గ్రామాల మధ్య వున్నటువంటి ఒక గ్రామంలో 'సత్యాగ్రహం' చేయ నిశ్చయించి పద్మాసనాసీనుడై ఒక డాక్టర్‌ను పిలిపించి తన పెదవులు రెంటిని కలిపి కుట్టించుకొనుట జరిగినది. వారు పెట్టిన షరతులు ముఖ్యంగా "మిలటరీ వైదొలగి ఆ గ్రామాలలో ప్రజలు తిరిగి చేరువరకు ఇప్పటినుండి నిద్రాహారములను విసర్జించుచున్నాని" వారు ఎఱుకపరచినారు. ఆ విధంగా 'అరువది' రోజులు 'నిరాహారదీక్ష' చేసి వారి కోర్కెను సాధించుకున్నారు. ఆ 'దీక్షా' సమయంలో విదేశీయులు విమానాలలో వచ్చి వారిని సందర్శించి ఫోటోలు తీసుకొని పుష్ప గుచ్ఛాలు వారి వద్ద వుంచి సేవించుకొని వెళ్లుచుండెడివారు. అరువది రోజుల అనంతరం ప్రభుత్వ సైన్యాన్ని ఉపసంహరించుకొని ప్రజలకు ఆ గ్రామములను యిచ్చి వేశారు.

ఆ సత్యాగ్రహం విరమణ అనంతరం వారు గాంధీ గారి ఆశ్రమంలోనే (వార్ధాలో) ఆ వాసమే ఏర్పరచుకొనుట జరిగినది.

తరువాత 1947 సం॥లో ఆచార్య బన్సాలిజీని గోసవీడు ప్రాంతానికి తీసుకు రావటం జరిగింది. ప్రయాణంలో వుండగా ఒక ప్రాంతంలో పెద్దగాలి, వాన వస్తుండగా వారు ప్రయాణం చేస్తున్న కారు మీద ఒక చెట్టు విరిగి పడుతుండగా బన్సాలిగారు సమయస్ఫూర్తితో కారు యొక్క బ్రేకునొక్కి ఆపుచేసినారు. అప్పడు విరిగిన చెట్టు కారు ముందు భాగంలో పడి పెద్ద ప్రమాదం తప్పింది.

తరువాతఒకసారిమద్రాసులోనితిరువళ్ళిక్కేణిలోనిపార్థసారథిస్వామిఆలయంలోస్వామిని చూస్తూకొంతసేపుసమాధిస్థితిపొందినారు.

వారియొక్క స్థిరాస్తిని పేదలకు వంచి, ఇంటిని తల్లిదండ్రులకు ఇవ్వవలసిందిగా వారి సోదరులకు లేఖద్వారా గోసవీడు నుంచి తెలియపరచి వారి యొక్క త్యాగశీలాన్ని ఎఱుకపరచినారు.

వారివద్ద అన్ని సమయాలలోను 'నూలువడికే రాట్నము', 'భగవద్గీత' తప్పనిసరిగా వుంచుకొనేవారు.

ఒకసారి విజయవాడ హిందూ కాలేజీలో బసచేసివుండగా అక్కడికి వచ్చిన స్థానిక ప్రజలు ఒకరితోఒకరు తమ పేటలలో (బజారులలో) వున్నటువంటి 'పాయిఖానా' దొడ్డులను ఉద్యోగస్థులు సమ్మెచేస్తున్నందున మున్సిపాలిటీ వారే శుభ్రము చేయాలని అనుకొనుచుండగా బన్సాలీగారు విని వెంటనే వాలంట్రీలతో కలిసి శుభ్రపరచి వచ్చినారు. ఆ తరువాత రోజు రోడ్లను ఊడ్వడం జరిగింది. ఇది చూసి అప్పటి మున్సిపల్ చైర్మన్ కలక్టర్‌వారు అంతా వచ్చి విషయం తెలుసుకొని సమ్మె చేస్తున్న ఉద్యోగస్తులను విధులకు రప్పించి విధిగా విధులను నిర్వహింపచేసారు. తరువాత బన్సాలిగారు చైర్మన్, కలక్టర్ సాష్టాంగ నమస్కారము చేశారు. ఆశ్చర్యకరమైన విషయం ఒకటివుంది. శ్రీ గోపరాజు రామచంద్ర రావుగారు కూడ సాష్టాంగ నమస్కారం చేశారు. (హేతువాదులలో ఈ ప్రధానుడు)

ఒకమారు బన్సాలిగారు ఊటుకూరు నరసింహారావు గారితో కలసి విజయవాడ నుండి తిరుగూరు వెళ్లగా అక్కడ రెండు మైళ్లదూరంలో నైజాం సరిహద్దులో 'రజాకారం' ఇండ్లను తగులపెడుతున్నారని తెలిసి అక్కడకు వెళ్లాలని బన్సాలీగారు ఉద్యుక్తులై వెళ్లటం జరిగింది. బన్సాలీగారు, కాంగ్రెస్ కార్యకర్తలు వస్తున్నట్లు విషయం గ్రహించిన 'రజాకార్లు' పలాయన మంత్రం పఠించారు.




శ్రీ M.S. రాజలింగంగారు

(18)

# ఓం

శ్రీ యుతులు కిషన్‌రావు గార్కి

నమస్కారములు. మిమ్ములను కాదనలేక, దీర్ఘంగా ఆలోచించి నా వయస్సును కూడా దృష్టి యందుంచుకొని కేశవరావుగారి జీవితాన్ని గూర్చి వ్రాయటం జరిగింది. వారికి వారి అనుయాయులు అన్యాయం చేసి వుండవచ్చు. కాని వారు మాత్రం వారి అనుయాయులకు అన్యాయం చేయలేదు. అది కూడా వారి జీవనంలో ఒక ఘనత అని చెప్పవచ్చు.

దీనికి భిన్నమైన దుర్దశకు గురిఅయిన వారు కూడ లేకపోలేదు. అది మహాబాధ. షేక్సిపియర్, సీజర్ ద్వారా "Yet you too Brutus" అన్న వాక్యాలు రాజకీయ జీవనంలో మరువక పోవటం కొంత వేదాంతాన్ని, వైరాగ్యాన్ని అలవర్చుకోవటం మనశ్శాంతికి దారి తీస్తుంది. ఇట్టి అనుభూతి కొంత కేశవరావుగారు కూడా పొందారు.

సర్దార్ జమలాపురం కేశవరావుగారి గురించి ఒక వ్యాసం వ్రాసి పంపాల్సిందని ఆ కిషన్‌రావుగారు చాల పట్టుపట్టారు. వారిని గురించి నాకు గల అభిప్రాయాలు సత్యమైనా, కొందరికి రుచికరంగా వుండవని భయంతో చాలసార్లు యీ బాధ్యత తప్పించుకున్నారు. కాని వయస్సు డెబ్బైలో వున్న నేను కేశవరావుగారి జీవనం లోని యీ కొద్దిపాటి సత్యాలు, అనుభవాలు కూడా ప్రజావళి తెలుసుకొని వుంటే నిర్మాణాత్మక రాజకీయాల కది కొంత తోడ్పడుతుందని చివరకు భావించాను. సూర్యాస్తమాల మధ్య కన్పించని వివిధ ఛాయాలరీతి అందరికి తెలిసిందే. అలాగే అందరి జీవనంలో వివిధ ఛాయలు కనిపిస్తునే వుంటాయి. కేశవరావుగారు కూడా దేనికి మినహాయింపు కారు.

శ్రీ కేశవరావుగారు వస్తుత: నైతిక విలువలకు ప్రాధాన్యతనిచ్చిన మహామనిషి. ఆయన ధైర్య స్థైర్యాలలో ఆయనకు ఆయనే సాటి. విప్లవ తత్వము, పోలీసు వ్యతిరేకత, ఆయనలో నిబడీకృతమైంది.

మాడపాటి హనుమంతరావు గారు కేసవరావుగారికి రాజకీయాలలో తగు ప్రోత్సాహం యిచ్చారు.

'ఆంధ్ర జనసంఘం' 1921లో ప్రారంభమై 1930 'నిజాం రాష్ట్ర ఆంధ్ర మహాసభగా మారింది'. అట్టి మహాసభ ప్రాధమిక సభ్యత్వం ఊరూరా తిరిగి చేర్పించటం కేసవరావుగారి జీవనంలో అతిముఖ్యమైన ఘటము అని చెప్పవచ్చు. కేసవరావుగారి వ్యక్తిత్వం, ఆరోగ్యం ఊరూరా అతను కాలినడకన తదితర విధంగా

అతని ప్రచారానికి అవకాశం కల్పించింది. ఈ విధంగా ప్రజలతో సన్నిహిత సంబంధం. తెలంగాణాలో రాజకీయ ఉద్యమానికి తగు Man contact పెంపొందించ గలిగాడు. ఇది జరిగి వుండకపోతే తెలంగాణాలోని ఏ రాజకీయ ఉద్యమం కూడా అంత విజృంభించేది కాదు. ఈ మహాసభ తెలంగాణా ప్రాంతంలోని ఆంధ్రుల సర్వతోముఖాభి వృద్ధికై పనిచేసింది. వారి నాయకత్వం సాధారణ ప్రజలను ఆకర్షించింది. అతను ప్రజానాయకుడుగా రాణించాడు.

ప్రజా సమస్యలలో 'వెట్టిచాకిరి నిర్మూలన' ప్రముఖపాత్ర వహించింది. దానికై ఇటు దొరలతోను అటు ప్రభుత్వంలోను అడుగడుగునా ఘర్షణపడవలసి వచ్చింది. ఆయన అజానుబాహు వ్యక్తిత్వం. ఉర్దూభాషలో అధికారులతో వ్యవహరించుట, పోలీసులను ధైర్యస్థైర్యములతో వారిని ఎదురించుట, తెలంగాణా ప్రజలు ఎన్నడూ మరువలేదు.

1939లో 'అయ్యంగార్ కమిటీ' రాజ్యాంగ సంస్కరణలను సిఫారసు చేసింది. వాటిని 'నిజాం ప్రభువు' దేశంలోని రాజకీయ పరిస్థితులను బట్టి కాదన లేకపోయాడు. ఈ సంస్కరణల వల్ల శాసన సభలలో 132 స్థానాలు వుండేట్లు దానిలో సగం వంతు ఎన్నుకొనబడేట్లు మిగతాస్థానాలు Functional Representation అంటే వృత్తి ప్రాతినిధ్యం యివ్వబడింది. ఈ సంస్కరణలకు ప్రజాదరణ లేకపోయింది. మితవాదులు 1942లో ధర్మవరంలో జరిగిన మహాసభలో ఈ సంస్కరణలను బహిష్కరించాల్సిందగా తీర్మానం ప్రవేశపెట్టారు. అది వీగిపోయింది. దానిపై ముప్పైమంది మితవాదులు. స్థాయి సంఘానికి రాజీనామా చేశారు. ఈ విధంగా మొట్టమొదటిసారిగా జాతీయవాదులు, కమ్యూనిష్టులు అనే చీలికలు బహిర్గతంగా కనపడసాగాయి. బూర్గుల రామకిషన్‌రావుగారు ప్రవేశపెట్టిన సంస్కరణల వ్యతిరేక తీర్మానం ఓడిపోయింది. కాని మాదిరాజు రామకోటేశ్వరరావుగారు రాజీనామా చేసిన వారిని తిరిగి రాజీనామాను ఉపసంహరింప చేయగలిగారు. ఈ సందర్భంలో శ్రీ కేసవరావుగారు మితవాదులను ఎక్కువగా అంటిపెట్టుకొని తిరగటం వారి ప్రభావం సంపూర్ణంగా వారి పై వుండటం జరిగింది.

ఆంధ్ర మహాసభలోని జాతీయ వాదులు మేము 'ఆంధ్ర మహాసభ' వాదులమని అనే వారు. ధర్మవరం, హైదరాబాద్ మహాసభల తరువాత ఆంధ్ర మహాసభలోని కమ్యూనిష్టులు, తాము కమ్యూనిష్టులమని చెప్పకోసాగారు. వారి విశ్వాసం 'ప్రజాయుద్ధ నినాదం'లో వుందన్నారు. ఈ కారణంగా ఆంధ్ర మహాసభలోని జాతీయ యువకర్తలు తాము కాంగ్రెస్ వాదులమని చెప్పకోసాగారు.

ఈ కారణంగా మితవాదులు ప్రభుత్వానికి కొంత దగ్గరయ్యారు. కాని మితవాద నాయకులకు Field మీద పనిచేసే కార్యకర్తలు లేకపోయారు. అందువల్ల వారు జాతీయవాదులైన యువకులపై ఆధారపడవలసి వచ్చింది. దీనిని అదనుగా తీసుకొని యువకులంతా 'ఆంధ్ర జాతీయపక్షము' పేరిట కాంగ్రెస్ పాలసీలు కార్యక్రమాలు మితవాదులకు డిక్టేట్ చేయగలిగారు.

ఈ సందర్భంలో కేసవరావుగారు అటు మితవాదులకు, ఇటు అతివాదులైన యువకులలకు మధ్యన సంధానకర్తగా వుండిపోయారు. ఆందోళన కార్యక్రమాలలో అతివాదులతో వున్న ' రాజ్యాధికార సేకరణ' విషయంలో ఆయన మితవాదులతో వుండిపోయారు.

ఈ విషయాన్ని అర్థం చేసుకున్న వారందరూ కేసవరావు గారికి తదితర యువకులకు వచ్చిన భేదాభిప్రాయాలు వ్యక్తిగతమైనవి కావని, సైద్ధాంతిక సమస్యలేనని అర్థం చేసుకోవాలి. ఇది చాల అవసరం. ఈ మౌలికమైన విషయం గుర్తిస్తే గాని తెలంగాణా రాజకీయాలు, వాటి పోకడ, పరిణామాలు సరిగా అంచనా వేయలేరని చెప్పవచ్చు.

1943 లో హైదరాబాద్‌లో జరిగిన 'దశమాంధ్ర మహాసభ'కు రంగారెడ్డిగారు అధ్యక్షులుగా ఎన్నుకోబడ్డారు. ఈ మహాసభకు ఏర్పడిన ఆహ్వానిత సంఘం కమ్యూనిష్టు ప్రభావంలో వుంది. దశమాంధ్ర మహాసభ హైదరాబాద్‌లో జరిగింది. తీర్మానములు పెట్టబడి చర్చకు వచ్చినవి. ఆ తీర్మాణములపై కమ్యూనిష్టు వ్యతిరేక ప్రభావములు ఉపన్యాసములలోను 'ఓటింగు' దశలోను స్పష్టంగా కనిపించసాగింది. ఓటింగు సందర్భంలో కమ్యూనిష్టు వాలంటీర్లు కమ్యూనిష్టు పార్టీ నాయకులకు ఓటు చేయమని బహిరంగంగా చెప్ప సాగిరి. కమ్యూనిష్టేతరులందరూ రాజకీయ దృష్టి వదలి 'ఆంధ్రోద్యమ సత్సంప్రదాయా'లను బట్టి వ్యవహరించుట లౌకికమని భావించిరి. కాని అలా జరుగలేదు. శ్రీరంగారెడ్డిగారు ఈ వాలంటీర్ల స్థాయి సంఘ సభ్యులకై ఒత్తిడి తెచ్చుట మంచిదికాదని హెచ్చరించాం. దానిపై వారు ఆగ్రహించి వాలంటీర్ల బాడ్జీల అధ్యక్షుల వారికి అప్పజెప్పి వెళ్లిపోయారు. ఈ పరిస్థితిలో మాదిరాజు రామకోటేశ్వరరావుగారు వాలంటీర్లు కావాలని కోరిరి. అట్టి లోటు తీర్చుటకై ఒక లిస్టు తయారు చేయబడెను. ఆ సందర్భంలో జమలాపురపు కేసవరావుగారి కృషి వల్ల జాతీయ వాదులైన యువకులు మితవాద అతివాద ధోరణులను మరచి వాలంటీర్ల లిస్టు ఒకటి తయారుచేసి అట్టి లిస్టు రంగారెడ్డిగారికి అందజేయబడింది. మితవాదులు కమ్యూనిష్టు బెదిరింపులకు లొంగలేదు. సభ దిగ్విజయముగా జరుగ గలదనే విశ్వాసము కమ్యూనిష్టులకు కలిగింది. అదిగాక

కమ్యూనిష్టు సానుభూతి పరుడైన డా॥ జయసూర్య చాలా పెద్దమనిషి. క్రమశిక్షణకు విరుద్ధముగా ఏది జరిగినా సహించటం అతని వల్ల కానిది. అందువల్ల అతను 'ఆహ్వాన సంఘం అధ్యక్ష' హోదాలో వాలంటీర్లను తిరిగి పనిలో చేరవలసిందిగా వారు విజ్ఞప్తి చేశారు. అది మన్నించి వారంతా పనిలో చేరారు.

1945లో మడికొండ మహాసభకి శ్రీ మందుముల నరసింగరావుగారు (మితవాద నాయకులలో ఒకరు) అధ్యక్షులుగా ఎన్నుకోబడ్డారు. మహాసభ అంతా కాంగ్రెస్ ఝుండాలమయం అయింది. విప్లవాత్మక తీర్మానాలు చేయటం జరిగింది. ఒడంబడిక ప్రకారం యువనాయకులలో ఒకరైన కేసవరావుగారిని కార్యదర్శిగా మందుమాల నరసింగరావుగారు నియమించారు. యువకులంతా సంతోషించారు. కేసవరావుగారి వ్యక్తిత్వం ఈ మహాసభతో జిల్లా స్థాయి నుంచి రాష్ట్ర స్థాయికి ఎదిగింది.

మడికొండ మహాసభ తరువాత 1946లో 'కంది' మహాసభ జరిగింది. అధ్యక్ష పదవి సమస్య వచ్చింది. యువకులను పోగొట్టుకోలేని మితవాద నాయకత్వం యువ నాయకులలో ఒకరైన కేసవరావు గారికి కంది మహాసభకు అధ్యక్షులుగా అంగీకరించారు. కేసవరావుగారిని మితవాదులు తమ మనిషిగా లెక్కించుకొని కార్యక్రమాలు జరిపేవారు. కేసవరావుగారు శ్రీ మందుముల నరసింగరావుగారిని ఆంధ్ర మహాసభకు కార్యదర్శిగా నియమించారు. దురదృష్టవశాత్తు వామ పక్షీయ యువనాయకుడు అనుకున్న కేశవరావుగారు మితవాద నాయకుడైన నరసింగరావుగారు ఒకటయ్యారు. ఈ కారణంగా కేశవరావు వర్గము, నరసింగరావుగారి వర్గము ఒకటైంది. కాంగ్రెస్ వర్గములో రెండు చీలికలు వచ్చాయి. యువ నాయకులలోని రెండవ వర్గానికి కోదాటి నారాయణరావు, రచయిత రాజలింగం నాయకత్వం వహించారు. కేసవరావుగారు శ్రీ బొమ్మకంటి సత్యనారాయణగారు, హయగ్రీవాచారిగారు వారి వర్గానికి నాయకత్వం వహించారు.

మితవాదులు చాకచక్యంతో వామపక్షీయులైన యువకుల ఉద్యమాన్ని దెబ్బతీశారు. శ్రీ కేశవరావుగారికి మితవాదులతో కలిసి పనిచేయటం తప్పలేదు.

రాజకీయాలు ఏ విధంగా వున్నా ప్రతిమనిషి యొక్క వ్యక్తిత్వం దాని ప్రభావం పరిసరాలపై సమాజం పై పడుతూనే వుంటుంది. అది కూడ ఉద్యమాలకు చాల తోడ్పడుతుంది.

మితవాదులు కేసవరావుగారితో సహా పోయి స్టేట్ కాంగ్రెస్ నాయకులుగా తామే స్టేట్ కాంగ్రెస్ అన్నట్టు ఒక 'మెమోరాండం' 1వ ఫిబ్రవరి 1946న సారన్‌సన్‌కి

యిచ్చారు. పాపమది స్వామిజీకి తెలియదు. అన్నిచోట్ల జరిగినట్లు బ్రిటీషు ప్రభుత్వము పాలసీ ప్రకారం తనకు పిలుపు వస్తుందని స్వామిజీ అనుకున్నారు. తుదకు పిలుపు రాలేదు. స్వామిజీ తుట్టతుదకు ఒక 'మెమోరాండం' స్టేట్ కాంగ్రెస్ తరపున యిచ్చారు. సొరన్‌సన్ ఆశ్చర్యపడి "మీ కాంగ్రెస్‌వారు ఇదివరకే వచ్చి పోయినా" రన్నాడట. స్వామిజీ తాను కాంగ్రెస్ అధ్యక్షుడని చెప్పాడు. ఈ విధంగా కేసవరావుగారు మితవాద నాయకులలో ఒక కొలికిపూస అని బయటపడింది.

శ్రీ కేసవరావుగారు వరంగల్ జైలులో నిర్బంధింపబడ్డారు. వారితో రచయిత (M.S. రాజలింగం) డా. ఉపేంద్రరావు, శ్రీగెల్లా కేశవరావు, శ్రీ మిరియాల జనార్ధన గుప్తా, ఇత్యాదులంతా వున్నారు. వీరుగాక దాదాపు స్వాతంత్ర్య సమరంలో పాల్గొని ఇండియన్ యూనియన్‌లో హైదరాబాద్ లీనం కావాలనే ఉద్దేశ్యంతో ప్రభుత్వాన్ని ఎదిరించి యిదే జైలుకు వచ్చిన వారి సంఖ్య దాదాపు 3,000 మంది వున్నారు. వారు అనేక బాధలు పడివచ్చారు. నిరుత్సాహ పడ్డవారున్నారు. జైలులో బాధలకు గురైనవారున్నారు. వీరందరికీ కేసవరావుగారు వారితో వున్నారనేది యెంతో ధైర్యాన్ని, స్థైర్యాన్ని కల్పించింది. ఇంతలో 1945లో కాబోలు సొరన్‌సన్ హైదరాబాద్ వచ్చారు. బ్రిటీషు ప్రభుత్వం తన సార్వభౌమాధికారాన్ని వదలుకోబోదన్నది స్పష్టమయింది. అట్టి మార్పులలో కాంగ్రెస్ మాత్రమే రాజ్యానికి రాగలుగుతుంది. సంస్థానాధీశులు కూడా యిది గుర్తించారు. కాలప్రవాహానికి ఎదురీదే అలవాటు లేని మితవాదులు అకస్మికంగా తామే కాంగ్రెస్ వాదులమని చెప్పకోసాగారు. సొరన్‌సన్ వచ్చునంత వరకు తాము ఆంధ్ర మహాసభ వాదులమని చెప్పకునేవారు. సొరన్‌సన్ రాగానే కాంగ్రెస్‌కు అధ్యక్షులుగా వుండి కాంగ్రెస్ ప్రతినిధిగా వున్న స్వామిజీ కన్న ముందుగా శ్రీ మందుముల నరసింగరావు గారు, కాశీనాధరావు వైద్యా, రామాచారి, జనార్ధనరావు, దేశాయి.

కేసవరావుగారు తుది ఘడియలు హైద్రాబాద్‌లోనే గడిచాయి. ఒక విధంగా ఆయన చాలా సునాయసంగా మరణించాడని చెప్పవచ్చు. ఆయన బర్కత్‌పురాలో బ్లాక్ నెం. 3 వెనుక వున్న క్వార్టర్స్‌లో వుండేవారు. వారు అకస్మాత్‌గా ఇంట్లోనే క్రిందపడి పోయారు. అప్పడు వారి వద్దు అతని భార్య అన్నపూర్ణమ్మగారు, మేనత్తగారు తప్ప మరెవరూలేరు. కేసవరావుగారి బావమరిది బుచ్చి శేషయ్య గారి కుమారుడైన చింతలపాటి రామమోహన్‌రావుగారు ఆ తుదిఘడియల్లో అక్కడ వున్నారు. వెంటనే రామమోహన్‌రావు రావులపాటి మధుసూధన్‌రావుగారి వద్దకు వెళ్లి డాక్టర్‌ను తీసుకొచ్చారు. ఉస్మానియా హాస్పిటల్‌లో చేర్చారు. బూర్గుల రామక్రిష్ణారావుగారు, ఇల్లెందుల రామచంద్రరావుగారు, శ్రీ స్వామిజీ, శ్రీ బొమ్మకంటి,

శ్రీ హయగ్రీవాచారి. వీరిని తరచు చూడటం జరిగింది. రామమోహన్‌రావుగారికి బంధుత్వాన్ని బట్టి రాజకీయ వాసనను బట్టి, కేసవరావుగార్కి అంతిమ ఘడియలలోను వారికి సేవచేసే భాగ్యం నాకు లభించింది. ఇలాంటి దశలలో అనుకోని అనూహ్యమైన వారి సహాయం లభించే ఘట్టాలు అనేకం వున్నాయి. బ్రెయిన్ హెమరేజ్‌తో వారు మరణించారు. ఎంత గొప్పవారికైనా మోసేందుకు నలుగురు కావాలని సామెత. కేసవరావుగారి తండ్రి రామారావుగారు వచ్చిన మీదట అంత్య క్రియలకై శవాన్ని కదిలించటం జరిగింది. M.S. రాజలింగం, (నేను) శ్రీ చింతలపాటి రామమోహన్‌రావు, శ్రీ రావులపాటమధుసూధనరావు ఈ మృత దేహాన్ని పాడిపైకి తీసుకురావటం జరిగింది. మిత్రుల సాయంతో హైదరాబాద్‌లోనే వారి అంత్యక్రియలు జరిగాయి. కనీసం నలుగురి నన్నా మిగుల్చుకోగలిగిన సంసారిక, రాజకీయ జీవితంలో ధన్యుడవుతాడు.



## 19. సత్యాగ్రహి - అగ్నిపరీక్ష

**- కీ.శే. స్వామిరామానంద తీర్థ**

1940 ఆగష్టు నెలలో సుమారు రెండు డజన్ల మందిమి సేవాగ్రాంలో మహాత్మాజీ కుటీరం ముందు గుంపుగా కూర్చున్నాము. ఆయనకు మా అభిప్రాయాలన్నీ చెప్పి తిరిగి పోరాటాన్ని ప్రారంభించేటందుకు అనుజ్ఞ ఇమ్మని కోరాము. మా మాటలన్నీ ఆయన ఎంతో ఓర్పుతో విని ఆలోచనల్లో మునిగినట్లు తోచింది. ఆయన మా అందరికి ఏదో కొత్త విషయం చెప్పదలచుకొన్నట్లుగా కన్పించారు. "హైదరాబాద్ స్టేట్ కాంగ్రెస్ సజీవంగా వున్నదని నిరూపించేందుకు పోరాటాన్ని తిరిగి ప్రారంభించటం మినహా మరోదారి మనకు లేదని" ఆయన అన్నారు. అట్లా చేసేందుకు మేము ముందు 'స్టేట్ కాంగ్రెస్ సభ్యుల'మని ప్రకటించు కోవాలన్నారు. కాని ఈసారి జరిగే పోరాటం ఆషామాషీ పోరాటంగా వుండదని చావో బ్రతుకో తేల్చేటటువంటిదవుతుందని అన్నారు. అది ఎంత కాలం కొనసాగుతుందో ఎవరు చెప్పలేరన్నారు. ఉన్నదతంతా త్యాగం చేయవలసి అవసరం ఏర్పడుతుందని అన్నారు. దాని ఫలితంగా ప్రాణత్యాగాలు కూడ చేయవలసి వస్తుందేమోనన్నారు. "మీలో కొందరి తలలె తెగవచ్చు, ఎందరో వురి శిక్షలకు, తుపాకి ఫిరంగి గుండె బారికి గురికావలసిన అవసరం వస్తుంది" అని వివరించి "మీలో ఎందరు, ఎవరెవరు దేనికి సిద్ధంగా వున్నారో చెప్పండి ?" అంటూ ప్రశ్నించారు. మేమందరమూ 'స్వాతంత్ర్య సాధన'కు మూల్యం చెల్లించడానికి సంసిద్ధులమే అన్నాము. కా

మహాత్మాజీకి మేము చేసిన వాగ్దానం వల్ల తృప్తి కలుగలేదు. ఆయన మనస్సుల్లో దాని అంతరాంతరాల్లో చాల లోతున ఏదో మరో ఆలోచనలు మెదులుతూ వున్నాయి. ఆ ఆలోచనలు అన్నీ ఒక రూపం ధరించేందుకు కొట్టు మిట్టాడుతున్నాయి. అందుచేత ఆయన "కాదు ! అట్లాకాదు. మీరు ఆత్మాహుతికి సిద్ధంగా వున్నారా ! నేను మిమ్మల్ని క్షమించండని, విడుదల చెయ్యండని ప్రభుత్వానికి నివేదిస్తూ వ్రాయను. ప్రభుత్వంతో రాయబారాలు జరుపను. మీకు ఈ లోకంతో సంబంధం వుండదు. మిమ్మల్ని పూర్తిగా ఖర్చువ్రాసి కొట్టి పారెయ్యవచ్చు. మీకు దానికి తగిన ఆత్మబలం వుందా ?" అని అడిగి మాకు కొంత వ్యవధి యిచ్చి ఆఖరి ప్రశ్న అడిగారు. "మీకు అహింసలో సంపూర్ణ విశ్వాసము, మతాభినివేశము ఉన్నాయా ?"

మహాత్మాజీ వేసిన ఈ ప్రశ్నలన్నీ మమ్మల్ని నిశ్చేష్టులుగా చేశాయి. మాకందరికి సత్యాగ్రహంలో వున్న ప్రవేశం స్వల్పం. మేమెవ్వరము దానితత్వము పూర్తిగా తెలిసిన వాళ్లము కాదు. అట్లాంటి మమ్మల్ని మహాత్మాజీ విశేషానుభవం కలవారిని అడగతగిన ఈ ప్రశ్నలడగటం ఎంతో ఆశ్చర్యం కలిగించింది. మాలో చాలమందికి అహింసా విధానం ప్రస్తుత రాజకీయ పరిష్కారానికి ఒక అనుసరణీయ పద్ధతి మాత్రమే అని తెలుసు. అందుచేత, భారతదేశంలో మిగిలిన కార్యకర్తల ఎన్నిక విషయంలో ఏయే పరీక్షలు జరుపుతున్నారో మాపట్ల కూడ వాటినే అమలు చేయవలసిందని, యింత కఠిన పరీక్ష వలదని మహాత్మాజీని అభ్యర్థిస్తూ ఎంతో సేపు చెప్పాము. ఆయన మా అభ్యర్థనను మన్నించలేదు. మావాదన నిష్ఫలమైంది.

మహాత్మాజీ ఎంత మాత్రము తనమెట్టునుంచి దిగలేదు. "నిషేదాజ్ఞను వుల్లంఘించేటందుకు 'అహింసాత్మక విధానం'లో సంపూర్ణ విశ్వాసం కలవారికే నేను అనుమతి యిస్తాను". మిగిలిన - వారందరూ 'నిర్మాణాత్మక కార్యక్రమాల' నిర్వహణలో మాత్రమే నిమగ్నులు కావాలి. మీ కాంగ్రెస్ సంఘంలో రెండు భాగాలు ఏర్పాటు చేసుకోండి. ఒక వర్గం నిర్మాణాత్మక కార్యక్రమాలు చేపట్టి నిర్వహించండి. రెండోది హైదరాబాద్ స్టేట్ కాంగ్రెస్ ప్రతిష్ఠ నిలబెట్టేందుకు నిషేధాజ్ఞలు ధిక్కరించి ఉద్యమం నిర్వహించండి". ఇలా చెప్పి తాను సంఖ్యాబలానికి ప్రాధాన్యం యివ్వనని విస్పష్టం చేసారు. తన గీటురాయి పరీక్షకు నిలబడగలిగినవారు ఒక్కరున్నా చాలునన్నారు. తన నియమాన్ని దిగజారే ఆలోచన లేదన్నారు. ఈ నిర్ణయం మమ్మల్ని విషాదంలో ముంచింది. మాలో కొందరికి ఆవేశం కలిగింది. మహాత్మాజీ మా అందరి హృదయాల్లోను వున్న ఆవేదనకు అర్థంచేసుకున్నారు. ఆయన తాను నిర్ణయించిన మార్గం ఒక్కటే వుద్యమ నిర్వహణకు సరియైన విధానం అన్నారు. ఆయన మమ్మల్ని బాగ ఆలోచన చేసుకొని మా నిశ్చయాన్ని మరునాటి సాయంకాలము తెలియచేయవలసిందని చెప్పిపంపించారు.

వార్ధాలో వున్న ప్రయాణీకుల వసతి గృహం ఆవరణ ముందు భాగంలో వున్న పచ్చిక బయలులో కూర్చొని మేమంతా ఎట్లా చర్చించామో, ఎట్లా వాదించమో నాకు యిప్పడు కూడా కళ్లకు కట్టినట్టు వుంది. పోరాటానికి సుముఖంగా లేనివారు సహజంగా తాము హాయిగా ఊపిరి తీసుకోవచ్చని తృప్తిచెందారు. పోరాటానికి ముందుకు వురకలు పెడుతూ దూకుతున్న వారిలో జంకు వచ్చింది. నాకు రోషము కలిగింది. నిర్మాణాత్మక కార్యక్రమాలు పోరాటం నుంచి తప్పించుకొనేటందుకు మార్గమా? నామనస్సుకలతచెందింది. కలతచెందినమనస్సుఎట్లాపనిచెయ్యగలుగుతుంది. నేను తగ్గాను. ఒకమూలకూర్చొని నిదానంగా మహాత్మాజీ చెప్పిన మాటలోప్రతిమాట వరుసగా జ్ఞాపకం తెచ్చుకుంటూ నిదానంగా ఆలోచన చెయ్యటం సాగించాను. ఎంతఆలోచించినా అహింసఅనేది నాతత్వం.

ఆరాత్రంతా మనశ్శాంతి లేకుండా గాంధీజీ నిర్ణయించిన పరీక్ష గురించి ఆలోచనలు చేస్తూ గడిపాను. చివరకు తెల్లవారుఝామున మనస్సు దృఢము చేసుకొని ఏంచెయ్యాలో నిశ్చయించుకొన్నాను. నేను మహాత్మాజీ కుటీరం చేరుకున్నటప్పటికి మధ్యాహ్నం దాటింది. నేను మహాత్మాజీతో, "ఇప్పడు నేను అహింసాతత్వాన్ని పూర్తిగా అలవర్చుకున్న వాడ్ని కాకపోయినప్పటికి క్రమంగా మనోబలం సంపాదించుకొని యావజ్జీవం దాని సాధనలో గడపాలని నిశ్చయించుకున్నాను" అని చెప్పాను. ఆ మాటలు వింటూ ఆయన సూటిగా నా కళ్లలోనికి చూశాడు. ఆ చూపునన్ను అంతటా అంతరాంతరాల్లోకి పరిశీలిస్తూ చూసినట్లు అనిపించింది. ఆయన చిరునవ్వు నవ్వుతూ, "హైదరాబాద్ స్టేట్ కాంగ్రెస్‌పై వున్న నిషేధాజ్ఞను ఉల్లంఘించేటందుకు నీకు అనుమతి ఇస్తున్నా" నన్నారు. అది వ్యక్తి సత్యాగ్రహంగా ఉండాలనీ నన్ను మరెవరైనా అనుసరించదలచుకుంటే వారు తనను ముందు కలుసుకోవాలని తనకు వారిపట్ల సంతృప్తి కలిగి అనుమతి యిచ్చిన తరువాతనే వారు సత్యాగ్రహం చెయ్యవలసి వుంటుందని అన్నారు.

ఇది **"హైదరాబాద్ స్వాతంత్ర్య పోరాటం అనుభవాలు"** గ్రంధం నుంచి గ్రహింపబడినది.

ఆంగ్లమూలము స్వామి రామానందతీర్థ తెలుగు సేత హరి. ఆది శేషువు ప్రచురణ స్వామి రామానంద తీర్థ స్మారక సంఘం ప్రభుత్వ ప్రచురణ సమితి 1984 పేజి నెం. 190 నుండి





# 20. సర్దారు జమలాపురం కేశవరావుగారితో నా పరిచయ విశేషాలు.

- కీ.శే పర్సాకిషన్‌రావుగారు, హైదరాబాద్

పర్సాకిషన్‌రావుగారు జమలాపురం కేశవరావుగారు నాకు బాల్యమిత్రులు. వారి జన్మస్థలం ఖమ్మంజిల్లా ఎఱ్ఱుపాలెం. వారి తండ్రి శ్రీ జమలాపురం రామారావుగారు తల్లి శ్రీమతి వెంకట నరసమ్మగారు. శ్రీ కేశవరావుగారు ఏడు సంవత్సరములకే తమ తల్లిని కోల్పోయినారు. ఈ పూజ్యదంపతులకు ముగ్గురు కుమారులు. సత్సాంప్రదాయపరులైన వీరి తల్లిదండ్రులు యీ ముగ్గురికి భగవన్నామములు కేశవ, నారాయణ, మాధవ అని నామకరణము చేశారు. జ్యేష్టుడగు శ్రీ కేశవరావుగారు తమ నామమును విశేషముగా సార్ధకపరుచుకొని సత్‌శీలము సత్‌బుద్ధి, సత్‌భావము కలిగి దేశస్వాతంత్రము కొరకు పోరాడి తన జీవితాన్ని ధారపోసిన త్యాగమూర్తి.

శ్రీ కేశవరావుగారి భార్య శ్రీమతి అన్నపూర్ణమ్మ. ఆమెగారు కేవలము అన్నపూర్ణాదేవియే. తనకు కలిగిన దానిలో అన్నదానము చేసెడిది. పూజ పునస్కారములో యెల్లప్పడు నిమగ్నులై వుండేవారు.

వీరికి ఇద్దరు కుమార్తెలు. 1. వెంకటనరసమ్మ, 2. కుసుమ కుమారి మరియు ఒక కుమారుడు డాక్టరు హరిగోపాల్, కోడలు డా॥ సాంబ్రారాజ్యం. యీ ఇద్దరు డాక్టర్లు లండన్‌లో ప్రముఖ వైద్యులుగా చాలాకాలము నుండి పనిచేయుచున్నారు.

శ్రీ కేశవరావుగారు బి.ఏ. వరకు చదివి డిగ్రీ పొందకుండానే చదువు చాలించి రాష్ట్ర స్వాతంత్ర్య ఉద్యమంలో దూకారు. ప్రధమములో కొద్ది కాలము కరోడ్గిరి, రెవిన్యూ డిపార్టుమెంటులలో చిన్న ఉద్యోగములు చేసి వెంటనే ఆ వుద్యోగములను వదలి పూజ్యగాంధిజీ ఆదేశాలననుసరించి దేశ స్వాతంత్ర్య పోరాటంలో చేరినారు. ధైర్యసాహసములతో పూజ్యస్వామి రామానందతీర్థ నాయకత్వంలో తెలంగాణాలో ప్రధమ శ్రేణి కార్యకర్తగా ఖమ్మంజిల్లా గ్రామాలలో పర్యటించి స్వాతంత్ర్యోద్యమ శంఖారావాన్ని పూరించారు. ఆ జిల్లా ప్రజలను ఉత్తేజపరచి జిల్లాలో వందలాది ప్రధమశ్రేణి కార్యకర్తలను తయారుచేశారు.

అప్పటి రజాకారు నాయకుడైన ఖాసింరజ్వీ అనుయాయి అయిన మరొక దుర్మార్గుడు మధిర తాలూకా తహశీల్దారుగా పనిచేయుచుండేవాడు. అతడు వందలాది రజాకార్లతో ఆ తాలూకా ప్రజలను హింసించుటను శ్రీ కేశవరావుగారు సహించలేకపోయారు. 1935 సం॥లో మధిర తహసీలు ఆఫీసుకు ఎదురుగా ఉన్నసెంటర్‌లో సత్యాగ్రహము చేసి బహిరంగ సభలో ఉపన్యసించెదనని, తహసీలు ఆఫీసుపై త్రివర్ణ పతాకము ఎగురవేయగలనని ప్రకటన చేశారు. కాని తహసీలుదారు అట్లు జరగనీయకుండా వందలాది రజాకార్లతో వీధి, వీధికి గట్టి బందోబస్తు చేశాడు. అయినను శ్రీ కేశవరావు గారు వారి అందరి కండ్లలో మట్టికొట్టి మారు వేషముతో నిర్ణీతకాలమునకే నిర్ణీత ప్రదేశానికి, అకస్మాతుగా, మెరుపు మాదిరి, ప్రత్యక్షమైనారు. అప్పటికే అమర్చబడిన వేదిక మీదికి పోయి ఉపన్యసించి, తాను తలపెట్టిన 'సత్యాగ్రహాన్ని' చేయగలిగినారు. మరియు తహసీలు ఆఫీసుపై స్వాతంత్ర్య జెండా కట్టగలిగినారు. ఆ తహసీల్దారుకు, అక్కడ కాపలా ఉన్న వందలాది రజాకార్లకు, ఆయన విస్మయము కల్గించారు. వారికి 'సర్దార్' బిరుదు వచ్చుటకు ఈ సంఘటనయే బహుశ నాంది. వీరికి మరియొక బిరుదు 'అపర సరిహద్దు గాంధీ', 'తెలంగాణా కేసరి' అని కూడ ఉండేది.

మెదక్ జిల్లా కందిలో జరిగిన ఆంధ్రమహాసభలో వీరికి ఈ బిరుదు ప్రధానము చేశారు.

ఖాన్ అబ్దుల్ గఫూర్ ఖాన్‌కు 'సరిహద్దు గాంధి' అని పేరు ఉన్నది. వారిలో శాంతము, నిరాడంబరత్వము, స్వార్థ రాహిత్యము, ధైర్య సాహసాలు మొదలగు అనేక సద్గుణములతో పాటు, ఆజాను బాహు ఆకారము (నాల్గు మూరలు, సుమారు 72 అంగుళములు ఎత్తు) ఉన్నందు వలనను, తెలంగాణాలో ఎఱ్ఱుపాలెం గ్రామము సరిహద్దు అయినందునను వీరిని "అపర సరిహద్దు గాంధి" అని బహుశః ఉత్తర హిందూస్తాన్ రాజకీయ నాయకులు, వీరిని సంబోధించే వారని చెప్పకునె వారు. అప్పటి పార్లమెంటు సభ్యులు. అనంతరము వీరిని అరెస్టు చేసి 18 నెలలు కఠిన కారాగార శిక్ష విధించారు. కాని 6 నెలల శిక్ష మాత్రమే అనుభవించిన తరువాత నిజాం గవర్నమెంటు, రాజకీయ కారణాల వల్ల వీరికి విడుదల చేసింది.

మరల 1947 ఆగస్టులో వీరిని అరెస్టు చేసి, 14 నెలల కఠిన శిక్ష విధించింది. పోలీసు యాక్షన్ 1948లో జరిగిన తదుపరి వీరు విడుదల అయినారు. శ్రీ కేశవరావు గారికంటె ఎక్కువ కాలము జైలుశిక్ష అనుభవించిన వారు చాలా అరుదు.

# అజాత శత్రువు

శ్రీ రావి నారాయణరెడ్డి గారు శ్రీ ఆరుట్ల రామచంద్రారెడ్డి గారు శ్రీమతి అరుట్ల కమలాదేవి గారు మొదలగు ప్రముఖ కమ్యూనిస్టు నాయకులతో నేను భువనగిరిలో నాలుగు సంవత్సరములు నా ఉద్యోగ కాలములో ఉన్నప్పడు వారిని కలిసి మాట్లాడినప్పడల్లా, నేను ఖమ్మం జిల్లా వాసిని అయినందున శ్రీ కేశవరావు గారిని వలు విధముల ప్రశంసించుతూ ఉండేవారు. అంతే కాకుండా వీరిని "అజాత శత్రువు" అని కూడా అంటుండేవారు.

ఇంకొక విచిత్ర మేమంటె కేశవరావు గారు ప్రధమములో ఉద్యమము జరిపే రోజులలో, మధిరలో కమ్యూనిస్టు పార్టీకి పునాదిగా ఉన్న శ్రీయుతులు పట్టి కొండ నాగేశ్వరావు, మరియు వెంకటపతి గారలు వీరికి అప్తమిత్రులు.

ప్రజాపార్టి నాయకులు డా॥ గెంటెల ఉపేంద్రరావు, సోషలిస్టు పార్టీ నాయకులు శ్రీ మాదిరాజ రామకిషన్ రావు గారలు కూడ శ్రీ కేశవరావుగారిపై భక్తి విశ్వాసాలు ఉంచుచూ శ్లాఘించె వారు.

శ్రీ రావాడ సత్యానారాయణ (వైస్ చాన్సలర్) గారు వీరి బాల్యమిత్రులు. శ్రీ కేశవరావుగారు విద్యార్థి దశ నుండే ప్రజల నాడిని కరెక్టుగా తెలుసుకోగలిగిన ప్రతిభావంతుడని అనేక సంఘటనలలో ఋజువైనట్లు వారు చెప్పేవారు.

ఇదే అభిప్రాయాన్ని సర్దార్ పటేల్ కూడ పోలీసు యాక్షన్ తరువాత ప్రముఖ మిలటరీ ఆఫీసర్లకు, సివిల్ అడ్మినిస్టేటర్లకు చెప్పినట్టు తెలుస్తున్నది. ఖమ్మం జిల్లా డోర్నకల్ సమీప అడవి గ్రామల ప్రజలు మిలటరి ఆఫీసర్లను వ్యతిరేకించి అశాంతి జరిపినపుడు అడవి ప్రజల నాడి బాగా తెలిసిన సర్దార్ జమలాపురం కేశవరావు గారి సహకారము వారి ఉపన్యాసముల ద్వారా ఆ వ్యతిరేక శక్తుల విశ్వాసాన్ని పొంది అక్కడ శాంతి స్థాపించుటకు గాను సర్దార్ పటేల్ ఆఫీసర్లను ఆదేసించారు. శ్రీ కేశవరావుగారు సర్దార్ పటేల్ ఆదేశానుసారము ఆ గ్రామాలకు వెళ్ళి, ఆ ప్రజలకు నచ్చచెప్పి, శాంతి స్థాపనకు గాను గవర్నమెంటుకు తోడ్పడినారు.

శ్రీ కేశవరావు గారు తమ కుటుంబ సభ్యులలో అభిప్రాయ బేధాలు వచ్చునపుడు వాటిని యుక్తిగా తొలగించెవారు. ఒక పర్యాయము 1936లో శ్రీ కేశవరావు గారి తండ్రి గారికి, శ్రీ కేశవరావు గారి సతీమణికి కొద్ది అభిప్రాయ బేధాలు వచ్చినపుడు వారు ఎవ్వరికి చెప్పకుండా ఇంటి నుండి బయలుదేరి మిత్రుల వద్దకు కొద్ది రోజులపాటు ఔరంగబాద్ వెళ్లినారు. తదుపరి మహారాష్ట్రలోని

నాందెడు జిల్లా బిలోలి తాలుకాలో నేను ఉద్యోగము చేయునపుడు మా ఇంటికి వచ్చినారు. వారి ఆరాకకు పూర్వమే హైదరాబాద్ నుండి వారి మిత్రులు శ్రీ గంధము మాణిక్యరావు గారు నాకు ఈ విషయాన్ని టెలిగ్రాము ద్వారా తెలిపి శ్రీ కేశవరావుగారు నావద్దకు వస్తే వారిని ఆపి హైదరాబాద్‌కు. వారి తండ్రి గారికి తెలియపరచమని నాకు తెలిపినారు. ఈ విషయము వారికి చెప్పకుండా వారిని నావద్ద రెండు రోజులు ఉంచుకొని వారి తండ్రి గారికి టెలిగ్రాము ద్వారా తెలిపినాను. వారి తండ్రిగారు మరియు శ్రీ గంధము మాణిక్యరావు గారు, నావద్దకు బిలోలికి వచ్చి వారిని హైదరాబాద్ తీసుకొని వెళ్ళినారు. తదుపరి అటువంటి బేధాభిప్రాయాలు వారి కుటుంబములో కలుగలేదు.

రంగారెడ్డి జిల్లాలో వారు, నేను, మా ఫోర్డు కారులో ప్రయాణము చేయుచుండగా మా డ్రైవర్ "రాములు" వడిగా కారు నడుపుచుండగా కారు నెమ్మదిగా నడపమని పదే పదే డ్రైవరుకు చెప్పినను వినకుండా అతను వేగంగానే కారు నడపుచుండెను. అప్పుడు వారు మూత్రమునకు పోతాననే మిషత కారు ఆపమనెను. కారు ఆగింది. వారు క్రిందికి దిగి, నేలపై కూర్చుండి "కారును పోనివు బాబు నీకారును ఎక్కను" అన్నారు. ఆ డ్రైవరు నిలువునా నీరై, ఏడ్చి, వారిని కాళ్ళవేళ్ళ పడి, అరగంట సేపు బ్రతిమిలాడి "ఇప్పటినుండి మెల్లగా కారు నడపతానని వాగ్దానము చేసి, వారిని తిరిగి కారులో కూర్చున పెట్టుకొని కారును మెల్లగా నడిపినాడు. అప్పటి నుండి ఆ డ్రైవరు మెల్లగా కారు నడపుటకు, అలవాటు పడినాడు. ఇది వారు డ్రైవరును యుక్తిగా స్లో డ్రైవరును (slow driver) చేసిన సంఘటన.

శ్రీ కేశవరావు గారు స్వాతంత్ర్య ఉద్యమాన్ని నడిపే రోజులలో కాలినడకన గాని, సైకిలుపై గాని ప్రయాణించేవారు. కొత్తగూడెం నుంచి పాల్వంచ మరియు బూర్గంపాడుకు మట్టి రోడ్డు ఉన్నందున సైకిలుపై వెళ్ళేవారు. శ్రీ పానుగంటి పిచ్చయ్య శ్రీ బుల్లెయ్య గార్లతో కలసి రోడ్లులేని గ్రామాలకు నడచి వెళ్ళేవారు.

శ్రీ కేశవరావు గారు తమ పర్యటనలో తనకు సన్మానము చేసి బహూకరించిన వస్త్రములను, ఇతర వస్తువులను తోటి బీద కార్యకర్తలకు అప్పటికప్పడే ఇచ్చివేసెడివారు. కార్యకర్తలపై తమకున్న ఆప్యాయతకు ఇదొక తార్కాణము.

1953 సంIIము మార్చి నెలలో వారు సిద్దిపేట తాలూకాలో పర్యటించి తిరిగి హైదరాబాద్ వెళ్ళుటకు మా కారులో (అనగా వారికి కూడ ఈ కారులో

హక్కు ఉన్నది. వారి సొంతకారు ఫోర్డు చెడిపోగా దానిని కార్ఖానలో రిపేరు కొరకు పడవేసి. నాకును వారి మరియొక బాల్య స్నేహితుడైన శ్రీ అల్లూరి లక్ష్మీకాంతరావు గారికి వప్పగించగా. మేము కారును పూర్తిగా బాగుచేయించి ముగ్గురము వాడకునేవారము) వారిని ఎక్కించి హైదరాబాద్‌కు పంపనైనది. ఆ కారు సిద్దిపేటకు తిరిగి వచ్చిన రెండు మూడు రోజులకే వారు బ్రైన్‌హెమరేజ్ అయినందున ఉస్మానియా ఆస్పత్రిలో జాయిను అయినట్లు నాకు సిద్దిపేటకు టెలిగ్రాము వచ్చింది. ఆస్పత్రిలో నాలుగు రోజుల చికిత్స తరువాత ది. 29.3.53న స్వర్గస్థులైనారు. 45 సం॥ల వయస్సుకే వారి జీవితము పూర్తి అయింది.

వీరు మరణించిన పన్నెండవరోజు (ది 9.4.53) న బంధు వర్గము. స్నేహితులు శ్రీ కేశవరావుగారి స్వగృహమునకు వచ్చినారు. కేశవరావు గారి తండ్రి గారైన శ్రీ రామారావు గారు 'కర్మకాండలు' పన్నెండు రోజులు చేసి ముగించగా ఆచారము ప్రకారము శ్రీ రామారావు గారిని పెద్దలు ఆశీర్వదించారు. తదనంతరము కేశవరావు గారిని ప్రశంసించుచూ రామారావు గారిని విమర్శించుట జరిగింది. ఈ విమర్శలు రామారావుగారిని కొంత బాధించినవి. అపుడు శ్రీ రామారావుగారు లేచి నిల్చోని ఈ విధముగా చెప్పినారు. "ఇంతమంది ప్రముఖుల ప్రశంసలు పొందిన నా కుమారుని పై నాకు ప్రేమ లేదని చాలామంది భావించారు" కుమారునిపై తనకు ఉన్న ప్రేమను బహిర్గరుచుచూ దీర్ఘ ఉపన్యాసాన్ని చేసారు. ఆయన గారి ఆ ఉపన్యాసముతో ఆవిమర్శలు వట్టి అపోహలేనని ఋజువు చేసుకోగలిగారు. శ్రీ రామారావు గారు అంతటి గొప్ప మేధావి. మహోను భావుడని అప్పటివరకు ఎవరు ఊహించలేదు. ఈ కార్యక్రమము తరువాత కొద్ది సేపటికే శ్రీ రామారావుగారు హఠాత్తుగా స్వర్గస్థులైనారు. కుమారునిపై ఆయనకున్న నిఘూడ. అవ్యాజమైన మమకారానికి కట్ట తెగింది. భరించలేని బాధ ఫలితం వల్ల ఆయన గుండె ఆగిపోయింది.

**నా స్వవిషయము :**

1948 సం॥ ప్రారంభములో శ్రీ రామానందతీర్థ అదేశానుసారము. నిజాం నిరంకుశ పరిపాలనకు వ్యతిరేకంగా నా ఉద్యోగానికి రాజీనామా చేసి, 'బాధ్యతాయుత ప్రభుత్వ స్థాపన' జరిగేవరకు తిరిగి ఉద్యోగములో చేరనని ప్రభుత్వానికి తెలిపాను. రాజీనామాను మంజూరు చేయకపోగా నా అరెస్టుకు ప్రభుత్వం ఆర్డరు జారీచేసింది. అపుడు నిజాం రాష్ట్ర సరిహద్దులో ఉన్న 'క్రిష్ణా జిల్లా కాంగ్రెసు ఉద్యము'లో చేరాను. కొంతకాలము సరిహద్దు గ్రామ క్యాంపులలో ఉన్న

కాందిశీకుల సౌకర్యముల ఏర్పాటుకు గాను అధిష్ఠాన వర్గము నన్ను నియమించింది. తదుపరి 'రిపబ్లిక్' స్థాపించబడిన పరిటాల జాగిరులో ఉన్న పరిటాలతో సహా ఏడు గ్రామములకు సివిల్ అడ్మినిస్త్రేటర్‌గా నేను నియమింపబడినాను. తరువాత పరిటాల బార్డర్ క్యాంపు ఇన్‌చార్జిగా కూడ అదనపు బాధ్యత నాకు అప్పగింపబడినది.

సెప్టెంబర్ 1948లో పోలీసు యాక్షన్ కాగానే నేను పరిటాల జాగిరు ఏడు గ్రామములలో నిర్వహించిన పరిపాలనకు సంబంధించిన అన్ని ఫైల్స్‌ను మరియు వసూలు చేసిన పన్ను మొత్తాన్ని ఖమ్మం జిల్లా అప్పటి సివిల్ అడ్మినిస్ట్రేటర్ శ్రీ పళనియప్పన్ ఐ పి యస్ గారికి అప్పజెప్పి తిరగి స్టేట్ కాంగ్రెస్ ఉద్యమములో ప్రవేశించాను. అప్పట్లో రాజీనామా చేసిన అందురు ఉద్యోగులను తిరిగి ఉద్యోగములో చేరగలందులకు 1949 సం॥లో ఏర్పడిన కాంగ్రెస్ ప్రభుత్వము ఆర్డర్ జారిచేసింది. నేను తిరిగి ఉద్యోగములో చేరవలెనని అనుకోలేదు. కాని శ్రీ కేశవరావుగారు నాకు హితవు చేసి పదే పదే ఒత్తిడి చేయగా తిరిగి ఉద్యోగములో చేరాను.

ఇట్లు

**పర్సా కిషన్‌రావు** ఫ్రిడంఫైటర్

రిటైర్డ్ యక్సైజ్ సూపరిన్‌టెండెంట్



**ఈనాటి మానవునికి సర్వసంపదలున్నాయి. కానీ, రెండు మాత్రం లేవు. ఏమిటా రెండు ? ఒకటి శాంతి, రెండవది ఆనందము. ఈ రెండూ కేవలం భగవంతుని దగ్గర మాత్రమే ఉన్నాయి. ఈ రెండింటి కోసమే మీరు భగవంతుణ్ణి ప్రార్థించాలి.**

సనాతన సారధి, ఆగష్టు 1999



# 21. ఎన్ని ఇబ్బందులనైనా 'స్పోర్టివ్'గా చూసే సర్దార్!

- శ్రీ కొలుపూలు బుచ్చిరామయ్యగారు Rtd. R.D.O
హనుమకొండ

శ్రీ సర్దార్ జమలాపురం కేశవరావుగారిని నేను నా బాల్యం నుండి ఎరుగుదును. నేను పుట్టి పెరిగినది, నా మేనమామల గోవిరాజులవారి స్వగ్రామమైన ఎఱ్ఱుపాలెంలో. ఆదే వారి స్వగ్రామం కూడ. 1944లో జాతీయ పక్షము యొక్క ప్రధమ సమావేశము నుండి వారు నన్ను బాగుగా ఎరుగుదురు. వారు గ్రామాలలో పర్యటించిన సందర్భంలో కొన్ని పర్యాయములు వారి వెంటయున్నాను.

వారి నిరాడంబర జీవితము, కార్యకర్తలతో వారి సన్నిహితత్వము, అరమరికలేని ప్రవర్తన, పై నాయకులతో వారి మర్యాద పూర్వకమైన నడవడి, అటు నాయకులను, ఇటు కార్యకర్తలను ఎంతగానో ప్రభావితం చేసి ఆకట్టుకొన్నవి.

ఒక పర్యాయము నలుగురైదురము కార్యకర్తలము వారి వెంట హైదరాబాదులో యున్నప్పడు, ఆర్థిక యిబ్బందివల్ల, మొక్కజొన్న కంకులు తిని, టీ మాత్రం త్రాగి ఆ పూట గడిపినాము. దేశసేవ చేయదలచుకొన్నవారు యిటువంటి యిబ్బందులకు ఏ మాత్రం బాధపడకుండా 'స్పోర్టివ్' గా తీసుకోవాలని, నవ్వుతూ, తుళ్లుతూ ఉద్బోధించారు.

ఒక సంవత్సరం గాంధీ జయంత్యుత్సవాలు 2వ అక్టోబరు నుండి 31వ అక్టోబరు వరకు నిర్వహిస్తూ గ్రామాలలో పర్యటించాము. వారితో - ఒక గ్రామంలో మాకందరకూ భోజనము ఏర్పాటుచేసారు. ఇతర కులస్థులు బ్రాహ్మణ పంక్తిలో మాతోబాటు భోజనం చేస్తున్నందుకు కించిత్ గర్వపడ్డారు. శ్రీ కేశవరావుగారు హఠాత్తుగా లేచివెళ్లి, ఆయింటి యజమాని దగ్గర పనిచేస్తున్న ఒక హరిజన వ్యవసాయ కార్మికుని తీసుకొని వచ్చి తమ ప్రక్కనే కూర్చుండబెట్టుకొన్నారు. హరిజనుడున్న పంక్తిలో కూర్చుండి భోజనం చేయడానికి, అంతకుముందు గర్వించిన ప్రముఖులలో విపరీతమైన సంచలనం కలిగించింది. అవమానంగా భావించినా, దిగమ్రింగి, మొత్తం మీద మాతోబాటు భోజనములు పూర్తిగావించినారు. (కొందరికి యిబ్బంది కల్గించుతుందని గ్రామం పేరు ఉదహరించలేదు).

వారు ఆంధ్ర మహాసభాధ్యక్షులుగా యున్నప్పుడు ఖమ్మంలో మామిళ్ల గూడెంలో కార్యకర్తల సమావేశం ఒకటి జరిగింది. సమావేశానంతరం భోజనాలైనవి. భోజనం పూర్తి కాగానే కార్యకర్తలు ఎవరిదారిన వారు బయటపడ్డారు. ఎవరికీ ఎంగిలి విస్తళ్లు తీయాలన్న ఆలోచన లేకపోయింది. అది గమనించి శ్రీ కేశవరావుగారే, తాము అధ్యక్షులైన ఏ మాత్రం సంకోచించకుండా ఎంగిలి విస్తళ్లు ప్రోగుచేయుట మొదలెట్టారు. వెంటనే కార్యకర్తలు వారిని వారించి, విస్తళ్లు తీసి స్థలం శుభ్రపరచారు.

ఏ కార్యకర్త నుండి ఎట్టిపని తీసుకోవాలో క్షణంలో నిర్ణయం చేసే వారి నిర్ణయం ఎన్నడూ వమ్ముకాలేదు. ముఖ్యంగా 1947లో హైదరాబాదు సంస్థాన ఉద్యమంలో వారప్పగించిన బాధ్యతలు కార్యకర్తలు ఎంతో సమర్థతతో నిర్వహించి, ఉద్యమాన్ని విజయవంతం గావించుటయే దానికి నిదర్శనము.

ఇంతటి మహానాయకుడు గూడ, రాజకీయాలలోని కుటిల నీతివలన 1952 ఎన్నికలో విఫలత చెందినందులకు కార్యకర్తలమంతా ఎంతో బాధపడినాము. వారీ సంఘటనను కూడ స్పోర్టివ్‌గానే తీసుకున్నారు.

---

* *దినమునకు ఒక పర్యాయము భుజించువాడు యోగి.*
* *దినమునకు రెండు పర్యాయములు భుజించువాడు భోగి.*
* *దినమునకు మూడు పర్యాయములు భుజించువాడు రోగి.*
* *దినమునకు నాలుగు పర్యాయములు భుజించువాడు బ్రతికి చచ్చిన వానితో సమానుడు.*

వాక్య విభూతి



# 22. త్యాగశీలి! సర్దార్ జమలాపురం కేశవరావు !!

- కీ.శే. వట్టికొండ నాగేశ్వరరావుగారు,
అల్లీనగరం బ్రాంచి

ఆనాటి వరంగల్ జిల్లా మధిర తాలూకాలోని ఒక చిన్న గ్రామం ఎఱ్ఱుపాలెం ఆంధ్ర ప్రజల రాజకీయ, సాంస్కృతిక కేంద్రమైన విజయవాడకు అతి సమీపంలోనే ఈ గ్రామం ఉన్నందున, ఆంధ్ర ప్రాంతంలో జరిగే రాజకీయ కార్యకలాపాల ప్రభావం సహజంగానే ఎఱ్ఱుపాలెం గ్రామంపై పడటం జరిగింది. మధిర తాలూకాలో నిరంకుశ నైజాంకు వ్యతిరేకంగా పోరాడిన ముఖ్యమైన గ్రామాలలో ఇదొకటి. భూమికోసం, భుక్తికోసం, నేలతల్లి విముక్తికోసం 1948 నుండి 51 వరకు నాలుగు సంగలు పాటు సాగిన 'వీర తెలంగాణా రైతాంగ సాయుధ పోరాటానికి' మధిర తాలూకా పట్టుగొమ్మగా నిలిచింది. ఈ ఉద్యమంలో దాదాపు నాలుగు వేలమంది వీరులు అమరులైనారు. మరెందరో నైజాం ముష్కర సైన్యం క్రూర నిర్బంధాలకు గురై ఎన్నో కష్ట, నష్టాలు అనుభవించారు. ఈ పోరాటం యావద్భారత దేశ చరిత్రలోనే సువర్ణాక్షరాలతో లిఖించదగినట్టిది. భారతదేశ చరిత్ర గతినే ఒక మలుపు తిప్పింది. ఉత్సాహం ఉరకలువేసే ఎందరో యువ కిశోరాలు ఇంతటి మహత్తర పోరాటంలో మధిర తాలూకా నుండి పాల్గొన్నారు.

విద్యావంతులు, దేశభక్తిపరులు ప్రముఖ నాయకులు ఎఱ్ఱుపాలెం గ్రామంలో జన్మించారు. అశేష ఆంధ్ర ప్రజల ఆదరాభిమానాలను చూరగొన్న ప్రజా నాయకుడు, త్యాగశీలి సర్దార్ జమలాపురం కేశవరావుగారు. ఈ గ్రామంలోనే ఉదయించారు. ఆంధ్ర పితామహ, ఆంధ్ర మహాసభ వ్యవస్థాపకులు శ్రీ మాడపాటి హనుమంతరావుగారు మరియు స్టేట్ కాంగ్రెస్‌లో ప్రముఖపాత్రవహించిన శ్రీ మాడపాటి రామచందర్‌రావుగారు ఈ గ్రామంలోనే జన్మించారు.

నాది అల్లీనగరం గ్రామం. భారతదేశ స్వాతంత్ర్య సాధనకై ఎల్లెడలా పోరాటాలు సాగుతూన్న కాలంలో, 1930లో నా 16వ. ఏట స్వాతంత్ర్య సమరంలో పాల్గొనాలన్న తలంపుతో గుంటూరు జిల్లాకు వెళ్ళాను. నాటికి నైజాం స్టేట్‌లో ఏ ఉద్యమమూ లేదు. గుంటూరు, తెనాలిలో కాంగ్రెస్ స్థాపించిన శిబిరాలలో పనిచేసి 'విదేశీ వస్తు బహిష్కరణ' కార్యక్రమంలో పని చేస్తుండగా పోలీసులు లాఠీ చార్జి చేసి, అరెస్టు చేయటం జరిగింది. ఇలా పోరాటాలలో పాల్గొంటున్నప్పటికీ,

ఏదో అసంతృప్తి వెంటాడుతూ ఉండేది. నా సహచరులతో జరిగే చర్చలలో, ఈ మార్గం ద్వారా స్వాతంత్ర్యాన్ని పొందటం సాధ్యపడదనే అభిప్రాయం వెల్లడవుతూ ఉండేది. ఆనాడు కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ అనుకునే శ్రీ కె. సంపత్ కుమారాచార్యులు గారి నాయకత్వాన చీరాలలో నిర్మించిన శిక్షణా శిబిరంలో చేరాను. ఒక రకంగా జైలు వాతావరణానికి అలవాటుపడే విధంగా, ఆహారంలో, పర్యటనలో, డ్రిల్లులో, గ్రామాలను పరిశుద్ధం చేయటం ఈ శిక్షణ నడచింది. బ్రిటిష్ సామ్రాజ్యవాద ప్రభుత్వం మా శిబిరం వద్ద 144 సెక్షన్ జారీ చేసి, శిబిరంపై దాడి జరిపి, మమ్ములను అరెస్టు చేయాలన్వేయత్నంతో ఉన్నది. మా శిబిరాధిపతి ఆదేశం మేరకు, మేము ప్రభుత్వానికి దొరకకుండా, తప్పించుకున్నా నేను రహస్యంగా తెనాలి తాలూకా వడ్లమూడి గ్రామం చేరాను. అక్కడి మిత్రుల ప్రోత్సాహంతో ఒక ఇంటిపై కాంగ్రెస్ పతాకాన్ని ఎగురవేయటంతో, నాపై అరెస్టు వారెంటు జారీ అయినది. మా కమాండర్ ఆదేశం మేరకు నేను నైజాం స్టేట్‌లో ఉన్నా మా స్వగ్రామమైన అల్లీనగరం చేరుకున్నాను. అనంతరం వడ్లమూడిలోని నాతోటి మిత్రులను అరెస్టుచేసి 18 మాసాలు కఠిన కారాగార శిక్ష విధించారు.

నైజాం స్టేట్‌లోని ప్రజలలో అప్పటికి రాజకీయ సంచలనం ఉన్నా, ఏ రాజకీయ సంస్థ పనిచేయటం లేదు. రాజకీయాలలో పాల్గొనాలన్న ఉత్సాహం కొద్ది నేను అనేక గ్రామాలు తిరిగి, యువకులతో సంబంధాలు పెట్టుకోవటం ప్రారంభించాను. సాహిత్యం చదవటం, మిత్రులతో చదివించటం, కాంగ్రెస్ సోషలిస్టు పత్రికలు, పుస్తకాలు, అతివాద సాహిత్యం చదివి, ప్రచారం చేయటం దినచర్యగా ఉండేది. భారతదేశంలోని సంస్థానాలన్నింటా ప్రజాపోరాటాలు చెలరేగుతున్న సమయములో 1938లో నైజాం స్టేట్‌లో కూడా ఆర్య సమాజం, స్టేట్ కాంగ్రెస్ సత్యాగ్రహోద్యమాలు ప్రారంభించాయి. నిజాం స్టేటుకు చుట్టూ పట్టణాలలో కాంగ్రెస్ శిబిరాలను నిర్వహిస్తున్న దశలో నేను విజయవాడలో స్థాపించబడిన శిబిరానికి వెళ్ళి 'సత్యాగ్రహకుడి'గా నా పేరు ఇచ్చాను. శ్రీ మాడపాటి రామచంద్రరావు గారు నా పేరు, ఊరు మొదలైన వివరాలు తెలుసుకొని పిలుపుకై నిరీక్షించమని అన్నారు. తరువాత కొద్ది రోజులకు నాకు పిలుపు రావటంతో నేను శిబిరానికి వెళ్ళాను. ఆ సందర్భంగా అక్కడ శ్రీ జమలాపురం కేశవరావు గారిని కలుసుకొనటం జరిగింది. ఆయనే మా దళ నాయకుడిగా నియమితులైనట్లు తెలుసుకున్న నాకు ఎంతో ఉత్సాహం కలిగింది. 1938 నవంబర్ 6న శ్రీ కేశవరావు గారితోపాటు నేను మరియు శ్రీ వాసిరెడ్డి వెంకటపతి గారు సత్యాగ్రహం జరిపేందుకు మధిర చేరుకున్నాము. వరంగల్ జిల్లాలో సత్యాగ్రహం మొట్టమొదట జరిపిన దళం బహుశా మాదే అనుకుంటాను.

నైజాం ఏలుబడిలో ప్రజలకు ఎటువంటి పౌరహక్కులు లేకుండా, దుర్మార్గం, దౌర్జన్యాలే అధికారమై ప్రజల అమాయకత్వాన్ని ఆసరాగా చేసుకొని వారిని పీడించాయి. నాడు సత్యాగ్రహం జరపటం ఎంతో సాహసంతో కూడినటువంటిది.

ఆనాడు నైజాం స్టేట్‌లో అత్యంత భయంకరమైన పరిస్థితులు నెలకొని ఉన్నాయి. గ్రామాలలో భూస్వాములు, పటేలు, పట్వారీలు అత్యంత క్రూరమైన దమనకాండ సాగించారు. సమాజంలో అత్యంత హీనంగా బ్రతుకులు వెళ్ళదీస్తున్న వ్యవసాయ కార్మికులు అంతులేని బాధలకు, ఫ్యూడల్ ప్రభువుల వేదనకు, దోపిడీకి గురైనారు. చాకలి, మంగలి తలారులకు కేవలం వెట్టి చాకిరీ చేయటమే నిత్యకృత్యంగా ఉండేది. వ్యాపారులు, భూస్వాములకు, అధికారులకు సరుకులు ఉచితంగా సరఫరా చేయాలి. అధికారులు గ్రామాలకు వస్తే అడవి మృగాలను చూసి తప్పించుకున్నట్లుగా పేదప్రజలు, రైతులు గ్రామాల నుండి వెళ్ళిపోయేవారు. బస్సులలో, రైళ్లలో ఖద్దరు బట్టలతో ప్రయాణించటం ఎంతో దుర్భరంగా ఉండేది. సమావేశం జరపాలన్నా, ఊరేగింపు నిర్వహించాలన్నా ముందుగా అనుమతి పొందాలి. ఉద్యోగులలో ముస్లింలు కాని వారిపై నిరంతరం దాడులు జరపటమే కాకుండా వారిని కేవలం కట్టుబానిసలుగా చూశారు. హరిజనుల బాధలు వర్ణనాతీతం. ప్రొద్దుననే దొరల ఇంటిముందు ఊడ్చి, కలాపి చల్లటం నుండి అన్నిపనులూ చేయాలి. దొరల పిలుపుకోసం వారి ఇంటి ముంగట సిద్ధంగా ఉండాలి.రైతులు దారుణ దుస్థితిలోనికి నెట్టబడినారు. వారికి స్వంత భూములుండేవి కావు. మొదటిసారిగా దొరల భూములలో అరక దున్నాలి. మొదటి కూరగాయలు వారికే ఇవ్వాలి. ఆవు, గేదె ఈనితే జున్నుపాలు వారికే ఇవ్వాలి. దొరల ప్రయాణాలకు, వారి ఇండ్లలో పెండ్లి జరిగిన సందర్భంలోనూ ఎడ్ల బండ్లు కట్టి వారిని సాగనంపాలి. తలారులు బండ్ల వెనుక పరుగెత్తాలి. అధికారాలన్నీ భూస్వాములు, పటేలు, పట్వారీల చేతులలోనే ఉండేవి. గ్రామంలో ఏ చిన్న తగాదా జరిగినా ఇరుపక్షాలవారూ సర్వనాశనం అయ్యేవారు. లంచాలు, జరిమానాలకు అంతం ఉండేది కాదు. మానవత్వం మచ్చుకైనా కానరాని నిజాం పోలీసులు, మిలిటరీ రజాకార్లు ప్రజలపై అనునిత్యం విచ్చలవిడిగా సాయుధదాడులు జరుపుతూ భీతావహం సృష్టించేవారు. అటవీ ప్రాంతాలలో అత్యంత క్రూర మృగాలను పోలిన అటవీశాఖాధికారులు ఉన్నారు. అబ్కారీ, కరోడ్‌గిరి వారు ప్రజానీకాన్ని ఎన్నో కష్ట, నష్టాలకు గురిచేసేవారు. ప్రభుత్వం పాఠశాలలు లేవు. ఎక్కడైనా ప్రయివేటుగా పాఠశాలలు నిర్వహిస్తే, అవి ప్రభుత్వాధికారుల, భూస్వాముల దాడులకు గురయ్యేవి. ఉన్న పాఠశాలల్లో సైతం మాతృ భాషకు స్థానం లేకుండా ఉర్దూను బలవంతంగా బోధనా భాషగా రుద్దారు. తెలుగు భాష ఉర్దూ భాషతో మిళితమైపోయింది. ఉర్దూ మాట్లాడటమే గౌరవ

కునేవారం. వార్డును కూడా మేమే శుభ్రం చేయాలి. గడగడ వణికించే చలిలో కూడా చల్లటి నీటితోనే స్నానం చేయాలి. అదికూడా కేవలం వారానికి ఒక్కసారి మాత్రమే చేయాలి. అయితే దీనిని మేము ప్రతిఘటించి ప్రతిరోజూ స్నానం చేశాము. మంగలి బాధను తట్టుకొనలేక గడ్డం చేయించటం మాని వేశాము. జైలులో పెరేడ్‌కు వచ్చిన అధికారులవంక కన్నెత్తి చూసేందుకు కూడా మాకు అవకాశం లేదు. ఆనాడు జైళ్లలో ఏ విధంగా దమనకాండ సాగేదో, ఈనాడు ఊహించటం కష్టం. శ్రీ కేశవరావుగారు ఎంతో ఓర్పు, సహనంతో జైలులో మాతోపాటు అతి నికృష్టమైన, బాధాకరమైన జీవితాన్ని గడిపారు. మేము జరిమానా చెల్లించ లేకపోవటం వలన తరువాత మా ఆస్తులు జప్తు చేయబడినాయి.

మా తరువాత మధిరలో శ్రీ పైడితల్లి లింగయ్య చౌదరి, శ్రీ వట్టికొండ లక్ష్మీకాంతయ్య, శ్రీ రామకోటేశ్వర రావుగార్లు రెండవ బ్యాచిలో సత్యాగ్రహం జరిపి అరెస్టు అయినారు. వీరికి మూడు సం॥లు కఠిన కారాగార శిక్ష విధించి వారిని కూడా వరంగల్ జైలుకు పంపారు.

అకస్మాత్తుగా గాంధీగారు సత్యాగ్రహ ఉద్యమాన్ని విరమించటంతో, మేము జైలు నుండి విడుదల అయినాము. తరువాత నేను, శ్రీ కేశవరావు గారితో కలసి అల్లీనగరం చేరాము. మార్గమధ్యలోని గ్రామాల ప్రజలు మాకు అఖండ స్వాగతం చెప్పారు. కాంగ్రెస్‌పై నిషేదం తొలగించనందున మేము గ్రామాలలో పెద్ద భవనాలలో సమావేశాలు జరిపి ఆనాటి రాజకీయ పరిస్థితిని వివరించాము. సిరిపురం, ఎఱ్ఱుపాలెం, రాయపట్నం మొ॥ అనేక గ్రామాల ప్రజలు మమ్ములను ఆహ్వానించారు. మేము ఆ విధంగా గ్రామాలలో పర్యటనలు జరిపి సభలు, సమావేశాలు నిర్వహించాము. ఈనాడున్న రహదారి సౌకర్యాలు కూడాలేని ఆ రోజులలో శ్రీ కేశవరావుగారు నిద్రాహారాలు కూడా లేకుండా కాలినడకనే ఆ గ్రామాలను తిరిగారు.

తరువాత శ్రీ మాడపాటి హనుమంతరావుగారు నిర్మించిన 'ఆంధ్ర జన సంఘం' ద్వారా పనిచేయాలని నిర్ణయించుకొని, అందులో చేరాము. 1939లో ఆంధ్రజన సంఘం పేరు 'ఆంధ్ర మహాసభ'గా మార్చబడినది. మధిర తాలూకాలోని గ్రామాలను తిరగి, ప్రజలను ఈ మహాసభలో సభ్యులుగా చేర్పించాము. గ్రామ సంఘాలను నియమించాము. వెట్టిచాకిరీకి వ్యతిరేకంగా అనేక పోరాటాలు నడిపాము. లెవీ పేరుతో ప్రభుత్వం రైతుల నుండి ధాన్యం వసూలు చేసిన విధానానికి వ్యతిరేకంగా ఆందోళనలు నిర్వహించాము. సబ్-రిజిష్ట్రార్ ఆఫీసు ముందు ఉండి లంచాలు లేకుండా రిజిష్ట్రేషన్ చేయించాము. తిండికి అనేక ఇబ్బందులను ఎదుర్కొన్నాము. పస్తులతో మాకున్న ఆర్థిక దుస్థితిలో అద్దె చెల్లించే స్తోమత మాకు లేదు.

నాకు మొదటినుండి అతివాద భావాలు ఉన్నప్పటికి నాడు నైజాంకు వ్యతిరేకంగా పోరాటాలు నిర్వహిస్తున్నది కాంగ్రెస్ కనుక ఆ పార్టీలోనే పని చేశాను. తరువాత కాలంలో 'స్వాతంత్ర్య సమరం'లో కాంగ్రెస్ పార్టీ అవలంభిస్తున్న తిరోగమన విధానాలతో ఏకాభవించలేని 'ప్రగతిశీల భావాలు' కలవారము కాంగ్రెస్ సోషలిస్టు దృక్పథాన్ని ఏర్పరచుకొని, క్రమంగా 'కమ్యూనిస్టు పార్టీ' వైపు ఆకర్షితులమైనాము. ఆంధ్ర మహాసభలో చేరిన అనంతరం ప్రజల మన్ననలు పొందుతూ, 'నైజాం ఫ్యూడల్ సంస్థానా'నికి వ్యతిరేకంగా ఉద్యమాలను ఉధృతం చేశాము. ఈ పోరాటాలలో ప్రజలు విశేషంగా పాల్గొని పూర్తి అండదండలందించారు. అయితే ఈ ఉద్యమకారులపైన వారికి సహకరిస్తున్న ప్రజలపైన నరరూప రాక్షసులైన నైజాం కర్కశ పోలీసులు క్రూర నిర్బంధం విధించారు. ఈ రీతిగా అత్యంత దమనకాండ అమలు జరుగుతున్న దారుణ పరిస్థితులలో కూడా శ్రీ కేశవరావుగారు మాతో కలిసి కొంతకాలం పనిచేశారు. తదుపరి ఆంధ్ర మహాసభ అతివాదులు, మితవాదులుగా విడిపోవటం జరిగింది. ఈ సందర్భంగా శ్రీ కేశవరావుగారు మాతో మాట్లాడుతూ, "ఈ దేశ స్థితిగతులలో మార్పు తెచ్చేందుకై మీరు అనుసరిస్తున్న పంథాయే సరియైనదని మీరు విశ్వసిస్తే ఆ రకంగానే పని చేయండి. అయితే నేను ఈ ఉద్యమంలో మీతోపాటు తుది వరకు కలసి రాలేకపోతున్నందుకు విచారిస్తున్నాను. నేను కాంగ్రెస్ పార్టీలోనే ఉండాలని నిర్ణయించుకున్నాను. అటుపోట్ల ప్రవాహానికి ఎదురీడగలిగిన మీరు మాత్రం ఈ పోరాటాన్ని కొనసాగించవలసిందిగా కోరుతున్నాను. ఈ దేశానికి 'సోషలిజమే' శరణ్యమని నేను కూడా నమ్ము తున్నాను" అని తాను కాంగ్రెస్‌లోనే పని చేశారు.

శ్రీ కేశవరావుగారు కాంగ్రెస్ పార్టీలో ఉన్నప్పటికీ తన జీవితాంతం మాతో నిరంతరం సన్నిహిత సంబంధాలను కొనసాగించారు. ఆయన జైలుకు వెళ్ళే ప్రతి సందర్భంలోనూ నన్ను కలిసి, మాట్లాడి వెళ్ళేవారు. ఆయన మాతో కలిసి పనిచేసినప్పుడు తరువాత కాంగ్రెస్‌లో ఉన్నప్పుడు కూడా ప్రజలకు ఎప్పుడూ దూరం కాలేదు. కమ్యూనిస్టు పార్టీకి, కాంగ్రెస్‌కు మధ్య తీవ్ర ఘర్షణలు జరిగే కాలంలో కూడా ఆయన మా వద్దకు వచ్చి ఎంతో ఆప్యాయంగా మాట్లాడేవారు. ఆయన 1947లో నైజాం దుష్టపాలనకు వ్యతిరేకంగా తిరిగి సత్యాగ్రహం నిర్వహించారు. 'తెలంగాణా ప్రాంత కాంగ్రెస్ అధ్యక్షుని'గా కొంతకాలం సమర్థవంతంగా బాధ్యతలను నిర్వహించారు.

1952లో జరిగిన మొదటి జనరల్ ఎన్నికలలో మధిర ప్రాంతంలోని ప్రజా బాహుళ్యంలో ఆయన చూరగొన్నా అభిమానం పట్ల అసూయ చెందిన కొందరు పెద్దలు శ్రీ కేశవరావు గారిని తన స్వంత ప్రాంతంలో కాకుండా వరంగల్

సమీపంలో అభ్యర్థిగా నిలిపిన ఫలితంగా ఆయన గెలుపొందలేకపోయారు. తరువాత వరంగల్ జిల్లాలో కమ్యూనిష్టు పార్టీ గెలిచిన జఫర్‌గఢ్, ఘనపురం నియోజక వర్గాలకు రాజీనామా ఇచ్చిన ఫలితంగా జరిగిన ఉపెన్నికలలో శ్రీ కేశవరావుగారికి ఇష్టం లేనప్పటికీ ఆ రెండు స్థానాలలోనూ కాంగ్రెస్ పార్టీ ఆయనను పోటీ చేయించింది. అయితే ఆయన విజయం సాధించటం సాధ్యపడలేదు.

ఈ ఓటమితో మానసిక వేదనకు గురైన శ్రీ కేవవరావుగారు తమ స్వంత ప్రయత్నాలు, చూసుకోవాలనుకుంటున్నా దశలో గుండె జబ్బు రూపంలో ఉన్న మృత్యువు ఆయనను బలిగొన్నది.

శ్రీ కేశవరావుగారి సతీమణి అన్ని విధాలా భర్తకు తగిన భార్య. శీలవతి. ఇంట్లో ఎన్ని ఇబ్బందులు ఉన్నప్పటికీ, పోరాట కాలంలో మాకు ఎంతో సహాయ, సహకారాలిచ్చింది. మాకు ఆహారం పెట్టింది. శ్రీ కేశవరావుగారితో పాటు ఆమె కూడా అనేక కష్ట, నష్టాలను ఎదుర్కొన్నది.

శ్రీ జమలాపురం కేశవరావుగారు అత్యంత నిజాయితీపరుడు. స్నేహశీలి, స్వాతంత్ర్య సాధనకోసం అష్టకష్టాలు అనుభవించిన నిష్కళంక దేశ భక్తుడు. ప్రజా సేవాతత్పరుడు. రాజకీయాలలో పనిచేయటం కోసం తన ఉద్యోగాన్ని పరిత్యజించిన నిరుపమాన త్యాగశీలి. నిజాం ప్రజల విముక్తికోసం అహరహం శ్రమించిన సద్గుణ సంపన్నుడు, సహృదయుడు. విద్యావంతుడు, మిత భాషి, గంభీర స్వభావుడు, ఆజానుబాహువు, స్ఫురద్రూపి ఆయనను నాయకుడు అనటంకన్నా అవిశ్రాంత ప్రజాసేవకుడు అనటం సమంజసంగా ఉంటుంది. గ్రామ స్థాయి నుండి తెలంగాణా కాంగ్రెస్ అధ్యక్ష స్థానానికి ఎదగటానికి ఆయన నిరంతరం పరిశ్రమ, నిర్మాణ దక్షతే కారణం. తన ప్రతిభా సామర్థ్యాలతో ఆయన 'సర్దార్' బిరుదును పొందారు. తన సాన్నిహిత్యంలో అనేక సంవత్సరము కలిసి పని చేసిన నాపైన ఆయన సాహచర్యం చెరగని ముద్రను వేసింది.

ఆదర్శవంతమైన, త్యాగశీలమైన జీవితాన్ని గడిపిన సర్దార్ జమలాపురం కేశవరావుగారిని తెలంగాణా ప్రజలు ఎప్పుడూ గుర్తుంచుకుంటారు. తాను నమ్మిన ఆశయాలకోసం అష్టకష్టాల కోర్చి పని చేసే ఆయను ప్రజలు ఎన్నటికీ మరువలేరు. ఆయన భావించి మాతో ముచ్చటించిన సోషలిస్టు భావాలు, ఆయన ఆకాంక్షలు ఇంకా మిగిలే ఉన్నాయి. అవి సాధించేందుకు ప్రజలు ముందుకు సాగుతారు. అటువంటి ఉన్నత భావాలుకల సర్దార్ జమలాపురం కేశవరావు గారికివే నా నివాళులు.





# 23. 'సర్దార్ కేశవరావు వైభవం'

- కీ.శే. ఊటుకూరు సత్యనారాయణరావుగారు,
మండాలపాడు, ఖమ్మంజిల్లా

1945 చివరి రోజులు, మా అధ్యక్షులు సర్దార్ కేశవరావుగారు H.A.P.C. (హైదరాబాద్ ఆంధ్రా ప్రావిన్షియల్ కాంగ్రెస్ కమిటీ) కార్యాలయానికి వచ్చి, కార్యదర్శినైన నన్ను పేరుతో పిల్చి "ఏమిరా ! మనం యిక్కడ పట్టణంలో ఏం చేస్తున్నాము ? మన కర్తవ్యమేమిటి ? దేశమంతా స్వాతంత్ర్యం కోసం పరుగులు తీస్తుంటే మనం ........ ! వెంటనే కల్లూరు వెళ్ళు, అక్కడ జిల్లా కాంగ్రెస్ రాజకీయ మహాసభకు సన్నాహాలు చేయి. మన కార్యకర్తలందరికీ, నేను కూడా వస్తానని చెప్పు, పద ......... అంటూ ఆర్డరు వేశారు. పల్లెలే ఆయన ప్రాణము ! ఆందోళనే ఆయన ఊపిరి !!

1946లో దమ్మపేటలో శ్రీ సర్దార్ కేశవరావుగారు నడిపిన 'పాల్వంచ తాలూకా రాజకీయ మహాసభ', ఆయనకు గిరిజనుల యందు గల ప్రేమకు మచ్చుతునక ! ఆ సభా వేదికపై ఆయన చేసిన 'సింహగర్జన'లో ఆయన అరెస్టుకై నాటి ప్రభుత్వం యిచ్చిన వారంటు అణిగి పోయింది !

స్వాతంత్ర్య సముపార్జన తర్వాత 'మహారాష్ట్రుల సాంస్కృతిక మహాసభ' వారు ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షులైన శ్రీ సర్దార్ కేశవరావు గారిని ఆహ్వానించగా శ్రీవారి వెంట వెళ్ళాను. ఆయన సభా ప్రాంగణంలో అడుగిడటం, ఆయన నెమ్మదిగ నడుస్తూ సభలోకి వస్తుంటే, ఆ అద్వితీయ వ్యక్తిత్వాన్ని, ఆ సింహ సమగాంభీర్యాన్ని, ఆ మహాబాహు మందగమనాన్ని అందరి దృష్టిని ఆకట్టుకొని అద్భుతాన్ని సృష్టింప జాలిన ఆయన మూర్తిమత్వం తిరిగి మనలోకి వస్తుందా ? అంతటి మహామూర్తి, ఆయన వెదజల్లిన స్ఫూర్తిని తిరిగి చూతుమా ?

1949లో సర్దార్ కేశవరావు గారి సొంత అనుయాయుల సమావేశం వారు మితవాదులతో, అతివాదులతో ఎలా వ్యవహరించాలో నిర్ణయించుకోవలసిన సమావేశము ఆ గ్రూపులో పిన్నవయస్కుడనైన నన్ను ప్రారంభించ మన్నారు చర్చ. "మనం మితవాదులతో పొత్తు పెట్టుకొని రాజ్యాన్ని చేతిలోనికి తీసికోవాలెననీ, వారిలో జరిగే పోరాటంలో మన శక్తి కోల్పోతామని, కాబట్టి శ్రీ సర్దార్ కేశవరావుగారు

మితవాదులతో మైత్రి నెరపి స్వామిజీకి దూరంగా వుండవలెననీ, కారణాలతో నిరూపించాలని తపించాను. శ్రీ మాడపాటి రామచంద్రరావుగారు మితవాదులతో పొత్తుపనికి రాదన్నారు. స్వామిజీ మనకు ఆదర్శ పురుషుడన్నారు. ఈ వాదనల తర్వాత సర్దార్ ఏమి చేశారు ? మితవాదులవైపుండి తన పదవుల నిలబెట్టుకొన్నారా? లేదు ? తన పదవులకు ఎసరు వచ్చినా లెక్కజేయలేదు. మితవాదము ఆయనకు గిట్టదు. నిరుపేద ప్రజల బాగోగులకై ఆయన ఎవ్వరితో రాజీపడలేదు. చివరకు మితవాదులు ఆయనను ఓడించినా సరే ! జై సర్దార్ కేశవరావు ! నీ ఆదర్శ జీవితానికి నీవేసాటి !

1945 మడికొండ మహాసభలో శ్రీ కేశవరావుగారి నాయకత్వాన మేమంతా పనిచేశాము. సభావేదిక అలంకరణ కూడా మేమే చేశాము. శ్రీ మందుముల నరసింగరావుగారు జాతీయాంధ్ర మహాసభ అధ్యక్షులైనారు - తర్వాత ఒక ఏడాది తర్వాత శ్రీ నరసింగరావు గారు నాతో ఇలా అన్నారు. "మేము మా చేతిలో వున్న తాళపు చెలిని, మా పెద్దకుమారుని వంటి వాడైన శ్రీ కేశవరావు గారికి అప్పచెప్తున్నాము. మా చిరాకాలార్జిత విత్తాన్ని ఆయన చేతిలో వుంచుతున్నాము. మమ్మల్ని పాలముంచినా నీటముంచినా ఆయనదే భారం ! ఆంధ్ర నాయకులకు పెద్ద కుమారుని వంటివాడు మన సర్దార్ కేశవరావ్ !

1944లో 'అఖిల హైద్రాబాద్ కమ్యూనిష్టు పార్టీ' ఆనాటి జనరల్ సెక్రెటరీ శ్రీ పెరవెల్లి వెంకట రమణయ్యగారు శ్రీ కేశవరావు గారిని చూడవచ్చారు. ఆనాడు శ్రీ వెంకటరమణయ్యగారి వద్ద 1500 మంది శిక్షణ పొందిన వలంటీర్లున్నారు. "ఏమి రమణయ్యా ! నన్ను గురించి మీ పార్టీ ఏమంటున్నది ?" "కేశవరావు గారూ! మిమ్ములను ఒక మహోన్నత వ్యక్తిగా, త్యాగమూర్తిగా మా పార్టీ గౌరవిస్తుంది. ఎటొచ్చీ మా వ్యతిరేకత మితవాదులతోనే" శభాష్ కేశవరావు ! వ్యతిరేక పార్టీలు గూడ మెచ్చుకొనిన నీ వ్యక్తిత్వమునకు ఇవే మా జోహార్లు !!

# 24. 'సర్దార్ మామయ్య'

- శ్రీ మాడపాటి వసంత్‌కుమార్
బెంగుళూరు.

'సర్దార్' అనేది వల్లభాయి పటేలుకు చెందింది. సర్దార్ అంటే సర్దార్ పటేల్ నానుడి మన అందరికి తెలిసిన విషయము. అయితే ఈ 'సర్దార్' కేశవరావుగారికి ఆపాదించటంలో వున్న విశిష్టత, సౌమ్యత వారి వారి నడవడి ఆదర్శాలతో కూడుకున్న అనుభూతి నుంచి వచ్చిన వ్యక్తిత్వం, ఈ 'సర్దార్'.

ఈ సర్దారు ...... అంత పొట్టివాడు కాదు. ఆకారములో అజానుబాహువు. నిరాడంబరతకు మారుపేరు. వారిది ఆకారంలో తండ్రి పోలిక, అందానికి తగిన పడ్డూ, పొడుగు గంభీరమైన కంఠం. ఒక రకంగా మగవారిని కూడ ఆకర్షించగల శరీర ధారుడ్యం అదే కాదూ !

వారి తల్లి వెంకటనర్సమ్మగారి నుండి పుణికి పుచ్చుకున్న ఆప్యాయత, అనురాగం, సౌమ్యత మాతృత్వంలో వున్న ఆర్ద్రతతో ఆకారంలో వారి తల్లి చిన్నగా వున్నా అనుభూతిటి ఆదర్శంలో గొప్పవారు. తల్లిదండ్రుల విశిష్ట, విశేష గుణాలచే పొందుపరచుకున్న ఈ నిరాడంబర 'సర్దార్ కేశవరావు పంతులు' అందుకే వారిని 'తెలంగాణా కేసరి'గా కూడ గుర్తించారు.

గృహాస్థాశ్రమంలో కూడా ఎదుటివారి కష్టాలకు స్పందించేవాడు. ఆంధ్రకరోడ్గిరిలో ఉద్యోగం చేస్తూ, అప్పటి నిజాం ప్రభుత్వంలో వున్న అటవికంగా నిత్యావసరమైన, ఉప్పు మరియు బట్టలకు 'టాక్స్' విధానంతో ఏమడలేక అప్పటి ఆ వుద్యోగాన్ని వదులు కొన్నారు.

'తెలంగాణా ఉద్యమ' కారణంగా జైల్లో ఉన్నప్పుడు కూడ సాటి 'జైలు మిూటులకు విద్యాభ్యాసం చేస్తూ, అక్కడ జైలు వాతావరణంలో కూడ అందర్ని ప్రశాంత కోసం జైలు అధికారులను వప్పించి ఇమ్మెట్స్‌కు కావలసిన కనీస సదుపాయలకు పోరాడేవారు. అప్పటి వారి ప్రవర్తన నడవడి ఆ కాలంలో వున్న కుల, మత వైషమ్యాలకు దూరంగా వుంటూ సమైక్య సాధనకు వారి ఆచరణ ఈ రోజువరకు చాలమందికి స్ఫూర్తిగా మిగిలింది. అంతే కాదూ! తరువాత పార్టీ పరిస్తతకు వారు నిర్వహించిన సభా సమావేశాలలో చిన్న, పెద్ద అనే తారతమ్యం లేకుండా ఆహార, వ్యవహారాలలోనే కాకుండా పనిపాటలలో కూడ ఎంతో నిబ్బరంగా కలుపుకోలుతో వ్యవహరించేవారు. (ఆ కాలంలో సభలు, సమావేశాలకు అప్పటి నిజాం ప్రభుత్వం నిషేధించిన కాలము) అంతటి జ్ఞాని కాబట్టే మొదటి కార్యకర్తనుంచి. తెలంగాణా ప్రదేశ కాంగ్రెస్ ప్రెసిడెంటూగా ఏకీగ్రవంగా ఎన్నికైన ఘనుడు.

స్పందన, స్ఫూర్తి మా మామయ్యగారితో పొందిన అనుభూతిని మీతో పంచుకోక తప్పదు. ఒకనాటి మధ్యాహ్నం సన్నజల్లు మొదలైంది. ధాన్యంతో నిండివున్న మా ఎడ్లబండి ఎఱ్ఱుపాలెవూర చెఱువు తూము దగ్గర నీటిగుంటలో దిగబడినపుడు, ఎవరి సహాయత లేని సందర్భంగా, త్వరితంగా బయట పడేందుకు మోరతో వున్న పశువును కొడుతున్నప్పడు చూచి లుంగీతో వున్న కేశవరావుగారు వచ్చి చెఱువులో కుంగిన బండి చక్రాన్ని అమాంతంగా లేపి మమ్ము గట్టుచేర్చారు. అంతటితో ఆగక "పశువుకున్న బుద్ధి కూడ మీకు లేకపోయిందేమిరా"! అని బాగకోప్పడ్డారు. "అది (పశువు) అంతటి భారాన్ని కూడా లాగేందుకు ప్రయత్నిస్తుంటే మొద్దులాగా నిలబడి చూచేకంటే మీరు కూడ మీ చేయూత యిచ్చి అంతటి ప్రయత్నం చేయవచ్చు కదా" ! అని అన్నారు.

మరొక మాట, ఆ కాలంలో అంటరానివారు రాజవీధిలో నడవటమే తప్పగా భావించే రోజుల్లో మావూరు హరిజనవాడలో ఒక నిండు గర్భవతి పిండము ఎదురు తిరిగిన కారణంగా 10 మైళ్లదూరంలో వున్న తాలూకా అయిన మధిర గవర్నమెంటు ఆసుపత్రికి భగీరథ ప్రయత్నంతో మంచంలాంటి డోలిలో తీసుకువెళ్తుండగా, కేశవరావుగారు ఎదురుపడి, విషయాన్ని తెలుసుకొని, వారి చేతిలో వెలుగుతున్న సిగరేటుతో పొట్టమీద చురకవేశారు. అంతే ? వెంటనే పిల్ల బయటపడి కేక వినిపించింది. అది స్ఫూర్తియో, అదృష్టమో నాకు తెలియదు. మాకు మాటరాలేదు. అంతటివారు మా కేశవరావుగారు ఎంతని చెప్పనూ ! వారి ఆప్యాయతతో నిండుకున్న వారి నాలికకు రుచి తెలియని ఒక సందర్భం చెప్పాలి.

ఆనాటి రాజకీయ ప్రచార సందర్భంగా ఒక కుగ్రామంలో మధ్యాహ్నం సుమారు ఒంటిగంట ప్రాంతంలో ఒక ముదుసలి నిరుపేద ప్రేమతో రావుగారికి మా యింటి భోజనం "తినండి" నగా వారి వంట అయిన 'సజ్జ సంకటితో పండు మిరపకాయల ఖారం ముద్దని ఎంతో ఆప్యాయంగా తిన్న ఆ సందర్భాన్ని ఎలా మరచిపోనూ !

నామాటగా, అప్పటి రాజకీయ పెద్దలు ఆనాటి తెలంగాణా ఉద్యమ సందర్భంగా కాంగ్రెస్ కార్యదర్శిగా వున్న మా నాన్నగారు కీ.శే. మాడపాటి రామచంద్రరావుగారిని 'సత్యాగ్రహ' వాదిగా అరెస్టు కావలసిందిగా కోరగా శ్రీ కేశవరావు మామయ్యగారు, వారికి అప్పటి పెద్ద కుటుంబము, బాధ్యత, బరువువున్నదని అప్పటి పెద్దలకు నచ్చచెప్పి వారికి బదులు తానుగా మధిరలో సత్యాగ్రహవాదిగా సర్దారుడు 'సర్దారు' గా అరెస్టు అయ్యారు. అంతటి సర్దారు మామయ్యకు మన జోహార్లు.





# 25. సోషలిజం నా లక్ష్యం

- కీ.శే. మాటూరి నరసింహారావుగారు
అడ్వకేట్, హనుమకొండ (10-12-93)

జమలాపురం కేశవరావుగారు కాంగ్రెస్‌లో ప్రముఖపాత్ర వహించినారు. 1946లో కాంగ్రెస్ 'బాధ్యతాయుత ప్రభుత్వం' కావాలని తీర్మానించిన తదుపరి ఆనాటి వరంగల్ జిల్లాలో ఖమ్మం, మధిరలో తాలూకాలుగా వుండేవి. కేశవరావుగారు విస్తృతంగా గ్రామాల్లో తిరిగి కాంగ్రెస్ ఆశయాలను, ఉద్దేశాలను ప్రచారం చేశారు. వారివెంట ఎప్పుడూ పది, పన్నెండు మంది కార్యకర్తలుండేవారు. అహోరాత్రులు వారితో తిరుగుతుండేవారు. కేశవరావుగారికి కార్యకర్తలమీద అమితమైన ప్రేమ, ఆదరాభిమానములుండేవి. నాయకత్వపు ప్రత్యేకత కార్యకర్తలముందు చూపేవారుకాదు. కార్యకర్తలతో, కార్యకర్తల పంక్తిన భోజనం చేయటం, వారితో పాటే పడుకొనటం, కార్యకర్తల కష్టసుఖాలను విచారించటము ఇవన్నియూ కేశవరావుగారి ప్రత్యేకతలు.

పూర్వపు హైదరాబాద్ రాష్ట్రంలో 'సోషలిష్టు పార్టీ' ప్రారంభించిన వారిలో నేనొకడిని. 1942లో కాంగ్రెస్ 'క్విట్ఇండియా' తీర్మానం చేసిన తరువాత మొత్తం నాయకుల్ని బిర్లా భవనం, బాంబేలో అరెస్టు చేయటం జరిగింది. కాంగ్రెస్‌లోనే 'సోషలిస్టు కాంగ్రెస్' అనే పేరుతో జయప్రకాష్ నారాయణ, డా॥ రామ్‌మనోహర్ లోహియా, అచ్చుత్‌పట్వర్ధన్, అశోక్‌మెహతా, అరుణా ఆసఫ్‌అలీ మున్నగు నాయకులు కూడా కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ సభ్యులుగా వుండేవారు. వీరిని గూడా బాంబేలో అరెస్ట్‌చేసి జైల్లో బంధించారు. 'విప్లవ భావాలు' గల వీరలు జైలులో వుండటానికి ఇష్టపడక 'విప్లవ కార్యక్రమా'లను చేబూని జైల్‌నుండి పరారయినారు. వివిధ ప్రాంతాలలో అజ్ఞాతంలో వున్న వీరు, సోషలిస్టు భావాలుగల సంఘాలకు విప్లవ కార్యక్రమాలు అనగా 'రైలు పట్టాలు పీకటం,' 'టెలిఫోన్ వైర్లు తెంపటం,' 'కరోడ్‌గిరి నాకాల మీద దాడిచేయటం' వగైరా కార్యక్రమాలు రహస్య పత్రముల ద్వారా పంపిస్తుండేవారు. అప్పటికే భారతదేశంలో కమ్యూనిష్టు పార్టీ కార్యకర్తలు, శాఖలు పెక్కు వుండేవి. సోషలిస్టు ఆశయాలలో 'ప్రజాస్వామ్యం'తో పాటు, ఆర్థిక సమానత్వము, 'పెట్టుబడి వర్గపు నిర్మూలన' మొదలగు ఆశయాలుండేవి. కమ్యూనిష్టుల ఆశయాలలో 'బీద ప్రజానీకపు నియంతృత్వము' (Politerate Dictatation ship) వుండేది.

'రెండవ ప్రపంచ యుద్ధం'లో హిట్లర్, చుట్టూ వున్న ప్రాంతాల్ని స్వాధీనం చేసుకొన్నప్పుడు రష్యా కమ్యూనిష్టులు 'ఇంపీరియలిస్ట్‌వార్' అని చెప్పేవారు. తరువాత హిట్లర్ రష్యామీద కూడా దాడిచేసినపుడు భారతదేశపు కమ్యూనిష్టులు 'పేపుల్స్‌వార్' అని ప్రచారం చేయసాగారు. అప్పుడు బ్రిటీష్‌వారితో చేతులు కలిపారు. బ్రిటిష్‌వారికి వ్యతిరేకంగా పోరాడుతున్న సుభాష్‌చంద్రబోస్‌ను 'దేశద్రోహిగా' చిత్రీకరిస్తూ కరపత్రాలు ప్రచురించారు. రష్యా కమ్యూనిష్టుల అడుగుజాడల్లో నడుస్తూ భారతదేశపు పోరాటంలో తప్పటడుగు వేసిన కారణంచేత కమ్యూనిష్టులకు భారతదేశంలో స్థానం లేకుండాపోయింది.

మహాత్మాగాంధీ, ప్రకాశం పంతులుగారిని 'హరిజన్‌ఫండ్' లెక్క జూపమని అడగటం చాలా విడ్డూరంగా వుంది. ఆయన తన 'వకాలత్'మీద సంపాదించిన దానితో ఊటీ, మద్రాస్ మొదలగు ముఖ్య పట్టణాలలో కట్టించిన భవనాలను సైతము అమ్మి, కాంగ్రెస్ ఉద్యమానికి ధారబోసిన 'ప్రజానాయకుడు' ప్రజలే ప్రకాశం, ప్రకాశమే ప్రజలు అన్న ప్రకాశంగారిని ఎవరో చెప్పిన మాటలు విని ఆయనను ప్రశ్నించటం అసమంజసం. కాంగ్రెస్‌తో సరిపడక ప్రకాశం, తెన్నేటి విశ్వనాధం మొదలగు నాయకులు కాంగ్రెస్‌ను విడిచి 'ప్రజాపార్టీ' ని స్థాపించుట జరిగినది. జె.బి. కృపలానీ మున్నగు ఉత్తర భారత నాయకులు ప్రజాపార్టీలో చేరారు. తరువాత ప్రజాపార్టీ, సోషలిస్ట్ పార్టీ విలీనమగుట వల్ల 'ప్రజాసోషలిస్ట్ పార్టీ'గా వ్యవహరించబడింది.

'హైదరాబాద్ స్వాతంత్ర్య పోరాటం'లో కాంగ్రెస్ వారు 'సత్యాగ్రహం' చేసి జైలుకు వెళ్లాలని తీర్మానం చేశారు. సోషలిస్టులకు సత్యాగ్రహం మీద విశ్వాసంలేదు. 'విప్లవ కార్యక్రమా'న్ని చేబూనారు. ఆనాటి హోంమినిష్టర్ సర్దార్ వల్లభాయిపటేల్, Stand Still Understanding ఫలితంగా ఏమీ చేయలేకపోయినాడు. ఇండియన్ యూనియన్ మిలటరీని హైదరాబాద్ పంపాలంటే ఇక్కడ అలజడి చేయక తప్పలేదు. తదనుగుణంగా సోషలిస్టులు విప్లవ కార్యక్రమము చేపట్టారు.

బి.ఏ. చదువుతున్న నేను అరడజను తోటి సోదరులను తీసుకొని బెజవాడ కాంగ్రెస్ క్యాంపుకు వెళ్లాను. అక్కడి వాతావరణం మాకు సరిపడనందున ప్రత్యేకంగా క్యాంపు ఏర్పాటుచేసుకొని కార్యక్రమ నిర్వహణ చేద్దామని భద్రాచలం వెళ్లాము. 'భద్రాచలం కాంగ్రెస్ ప్రచార శాఖ'పేరుతో క్యాంపు ఏర్పాటుచేశాము. అడవి మరియు మన్య ప్రాంతమయినందున కోయలలో పన్నులు కట్టవద్దనియు, నైజాం ప్రభుత్వంతో తెగతెంపులు చేసుకొమ్మనియు ప్రచారం చేసినాము. చిగురు అగ్రహారానికి రామిరెడ్డి అనే దొరపొగాకు Tax Inspector గోదావరి ఒండ్రు భూముల్లో దొరపొగాకు పండిస్తున్న రైతులనుండి Tax మరియు లంచం గూడా

వసూలు చేసేవాడు. Tax డబ్బు, లంచంగూడా వాపసు యిప్పించి అతనిని వెళ్లగొట్టం జరిగింది. అతను బూర్గంపాడు, అశ్వారావు పేటలలో క్యాంపు చేసి బెలూచిస్తాన్ పోలీసుల్ని తీసుకొని వస్తాడనే భయంతో గ్రామాలను ఆత్మరక్షణకోసం సంసిద్ధము చేయాలని నిర్ణయించుకొని కరోడ్గిరి నాకాలమీద పోలీస్‌స్టేషన్‌ల మీద దాడిచేసి వారిని నిరాయుధుల్ని చేశాము. ఆ విధంగానే భూస్వాముల వద్దనున్న తుపాకులను స్వాధీనం చేసుకున్నాము. పేరంటపల్లి స్వాములవారి శిష్యుడు, కోయనాయకుడు అయిన సింగరాజు మాతో పనిచేస్తుండెను. పేరంటపల్లి స్వామిజీ దర్శనం చేసుకొని వారి ఆశీర్వాదం పొందాలని నేను స్వామిజీ దగ్గరకు వెళ్లాను. జరిగిన విషయాలన్నీ స్వామిజీతో చెప్పాము. స్వామిజీ మమ్మల్ని ఎంతో ఉత్సాహపరిచారు. ఆశ్రమంలోనికి వెళ్లి రెండు రివాల్వర్లు తీసుకొని వచ్చి ఒకటి నాకు, ఒకటి సింగరాజుకు యిచ్చినాడు. మా నుదుటబొట్టుపెట్టి "మీకేంగాదు. కార్యక్రమాన్ని ఉధృతంగా సాగండ"ని ఆశీర్వదించారు. అప్పుడు స్వామిజీ విప్లవకారుడని గ్రహించినాము. వంద గ్రామాల్లో పర్యటించి ఇండిపెండెన్స్ ప్రకటించాము. 'అమరారం రిపబ్లిక్' అనిపేరు పెట్టాము. కోయల ప్రాంతమగుటచేత వాళ్లకు మిలటరీ ట్రెయినింగ్ ఇవ్వటానికి 'ఇండియన్ నేషనల్ ఆర్మీ'కు చెందిన వెంకటేశ్వర్లు, శ్రీనివాస్‌లను పిలిపించి ట్రెయినింగ్ యిప్పించినాము. ఈ వందగ్రామాలు అశ్వారావుపేట, బూర్గంపాడు గ్రామాల మధ్యనున్న మన్యప్రాంతము. అమరారం గండిమీద 1500 మంది కార్యకర్తలు వుండేవారు. ఇది బూర్గంపాడుకు 6 కిలోమీటర్లు, చిలకలుగండిమీద 1500 మంది కార్యకర్తలుండే వారు. ఇది అశ్వారావుపేటకు 6 కిలోమీటరు ప్రతినిత్యము నైజాం పోలీస్‌లతో మాకు యుద్ధం జరుగుతుండేది.

పరిటాల పరగణా 7 గ్రామాలను కాంగ్రెస్‌వారు స్వాధీనం చేసుకొని 'పరిటాల రిపబ్లిక్'గా పరిగణించారు. ఈ రిపబ్లిక్ గ్రామాల చుట్టూ అనుకొని మద్రాస్ స్టేట్ గ్రామాలుండుట వల్ల నైజాం మిలటరీ పరిటాల మీదకు పోలేకపోయింది. ఆ విధంగానే 'గానుగపాడు రిపబ్లిక్' 5 గ్రామాలు. దానిచుట్టూ మద్రాస్ స్టేట్ గ్రామాలుండేవి.

1952లో ప్రథమ ఎన్నికలలో నేను వరంగల్ నుండి సోషలిస్ట్ పార్టీ తరపున పోటీచేసినాను. కీ.శే. జమలాపురం కేశవరావుగారు ఘనాపురం, వర్ధన్నపేటల నుండి అభ్యర్థిలేని చోట కేశవరావు గారిని బలపరిచినాము. నర్సంపేటలో వారు పోటీచేసినపుడు మా సోషలిస్టు కార్యకర్తలే వారికి పనిచేసినారు. వారితోనాకు సంబంధం ఆ రకంగా ఏర్పడినది. ఆజానుబాహుడు, ధర్మబుద్ధిలో ధర్మరాజుకు తీసుపోనటువంటి మహావ్యక్తి. అట్టి వ్యక్తి ఆరోజుల్లో వుండే రాజకీయ కుట్రవల్ల ఓడిపోవటం జరిగింది.

'ఒక దినపత్రిక ప్రచురణ నుంచి' (17-9-1998)

# 26. 'ముసలినక్కకు రాచరికంబు దక్కునే!

- శ్రీ Y.V. శ్రీనివాసరావుగారు, హైదరాబాద్

*మేజర్ జనరల్ జె.ఎన్. చౌదరి నేతృత్వంలో భారతసైన్యం 1948 సెప్టెంబర్ 17వ, తేదీన హైదరాబాద్ సంస్థానంలోకి అడుగుపెట్టింది. రెండు మూడు రోజులు కొద్దిగా ప్రతిఘటించినా రజాకార్లూ, నిజాం సైనికులూ చివరికి భారతసైన్యం ముందు మోకరిల్లకతప్పలేదు. 1948 సెప్టెంబర్, 17వ తేదీన బీరాలు పలికిన నిజాం పాదాక్రాంతం అయ్యాడు. ఇస్లాం అధికారపీఠమైన 'ఖిలాఫత్'ను పునరుద్ధరిద్దామనుకున్న ఉస్మానలీఖాన్ పీఠమే కదిలిపోయింది. చరిత్ర బొంగం తిరిగి మరో కిరీటం నేలకొరిగింది. ముసలినక్కకు రాజరికం దక్కలేదు.*



రోజూలాగే పొద్దు పొడిచింది. సూరీడి లేత కిరణాలు తళతళా మెరుస్తూ నేలమీద పరుచుకున్నాయి.

అది 1946 ఆగస్ట్ 4వ తేదీ స్థలం : వరంగల్ కోట.

అక్కడ కొంతమంది యువజనులు చేరి 'భారత జాతీయ కాంగ్రెస్' పతాకాన్ని ఎగరవేసి ధ్వజప్రణామం చేశారు. "విజయీ విశ్వ తిరంగా ప్యారా! ఝండా ఊంచా రహే హమారా"!! అంటూ శ్రద్ధాన్వితంగా దేశభక్తి గీతం పాడారు. పతాక వందనం పూర్తయింది. మొగిలయ్య ఝండా తాడుని సరిచేస్తూ అక్కడ నిలుచుని ఉన్నాడు. అంతలో ఎక్కడి నుంచో ఉన్నట్టుండి రజాకార్ల మూక వచ్చి పడింది. ఒక దుండగీడు మొగిలయ్య మెడ మీద బల్లెంతో బలంగా పొడిచాడు. జివ్వున రక్తం చిమ్మింది. మొగిలయ్య ఝండా తాడు పట్టుకునే కుప్పకూలిపోయాడు. "షాహీ ఉస్మాన్ జిందాబాద్" అని బిగ్గరగా కేకలు వేస్తూ ఆ మూక దాడులకు

దిగింది. ఆ హంతక ముఠాకి నాయకుడు లకడీ పహిల్వాన్ ముఠాకి కాసీం షరీఫ్. మొగిలయ్యని చంపిన తర్వాత ఊరేగింపుగా సాగిన పహిల్వాన్ సుబేదార్ హబీబుల్లా ఖాన్ ఎదురేగి మరీ అభినందించాడు. అక్కడి నుంచీ లూటీలూ గృహదహనాలూ. ఏడో నిజాం పెత్తనంలో నిర్నిరోధంగా సాగిపోయిన హత్యాకాండకు ఈ హత్యాచారమే ఒక నెత్తుటి సాక్ష్యం.

మొగిలయ్యది కల్లుగీతతో పొట్టపోసుకునే కుటుంబం. అతడు పెద్దగా చదువుకున్న వాడూ కాదు. అయితేనేం - జాతీయోద్యమ విస్ఫులింగాలు మొగిలయ్యలో జాతీయతా భావాగ్నిని ప్రజ్వలితం చేశాయి. అతడి కణకణమూ దేశమాతకే సమర్పణమయింది...

ఆనాడు యావత్తు హైదరాబాద్ సంస్థానమూ రగులుతున్న జ్వాలాముఖి. 'నిజాంపాలన' ఒక పీడకు మల్లే దాపురించిన దుర్దినాలవి. "ఓ నిజాము పిశాచమా! 'కనరాడు నిన్నుబోలిన రాజు మాకెన్నడేని' అన్న దాశరథి కవి మాట అక్షరసత్యం. ఏడో నిజామే కాదు - ఆ మాటకొస్తే అంతకు ముందు నుంచీ సంస్థానంలో అరాచకం సాగుతూ వచ్చింది. ఇక్కడ హిందూ జనసామాన్యానికి ఎన్నడూ మానవ హక్కులన్నవి లేవు.

**అస్థిమూల పంజరాలు, ఆర్తరావ మందిరాలు ...**

1830-31లో కాశీయాత్ర ప్రారంభించిన ఏనుగుల వీరాస్వామయ్య హైదరాబాద్ సంస్థానం మీది నుంచి ప్రయాణం చేశాడు. సంస్థానం స్థితిగతుల గురించి ఇలా రాశారు...

"హైదరాబాద్‌లో మనుష్యులందరున్ను ఆయుధప్రాణులై మెత్తనివారిని కొట్టి నరుకుచున్నారు. (కాశీయాత్రా చరిత్ర 34)" షహరులో (హైదరాబాద్) చంపినా అడిగే దిక్కులేదు. బీదలు ఏ చెట్టు వేసినా వాటి ఫలమును క్షేమముగా ఆయుధాలే ఆభరణాలుగా నుంచుకుని దర్పమే యశస్సుగా భావించుకునియుండే లోకులు అనుభవింపనీయరు. సాత్విక ప్రభుత్వము కల రాజ్యములో మెదిగినవారికి ఆ షహరులో ఉనికిన్ని, ఆ రాజ్య సంచారమున్ను భయప్రదములుగా ఉన్నవి" (కా.36).

బిల్గ్రామీ రాసిన 'హిస్టారికల్ అండ్ డిస్క్రిప్షన్ స్కెచెస్ ఆఫ్ హైదరాబాద్' అన్న గ్రంథం కూడా హైదరాబాద్ సంస్థానానికి సంబంధించిన సమాచారాన్ని తెలియజేస్తుంది. ఆ వివరాలను సురవరం ప్రతాప రెడ్డిగారు తమ 'ఆంధ్రుల సాంఘిక చరిత్ర' లో ఉటకించారు. క్రీస్తు తర్వాత 1629.30లో ఇక్కడ భయంకరమైన కరువు వచ్చింది. రొట్టెయిస్తే కన్నబిడ్డను దానికి మారుగా ఇచ్చేవారుండేరట. కుక్కల మాంసాన్ని మేక మాంసమని అమ్మినవారుండేరట.

చచ్చిన ప్రాణుల ఎముకలను పిండి చేసి ధాన్యం పిండిలో కలిపి అమ్మారట. కొందరు మనుషులు ఇతర మనుషుల్నే తిన్నారట కూడా. 1659, 1681 సంవత్సరాల్లో కూడా మళ్లీ క్షామాలు ఉప్పతిల్లాయి.

"1769-93 మధ్య తెలంగాణాలో ఘోరక్షామం కలిగెను. హైదరాబాద్ నగరములో 90,000 మంది చచ్చిరి. ఇండ్లలో చచ్చిన వారి లెక్కలేదు. రాయచూరు జిల్లాలో 2000 మంది సాలెవాండ్లలో 6 మంది మాత్రము క్షామానంతరము మిగిలినవారైరి. దేశమంతా చచ్చినవారి పుర్రెలతో నిండెను. అందుచే దీన్ని 'పుర్రెల కరువు' అనిరి. క్రీ.శ. 1804లో మరల 'క్షామము' కలిగెను. రూపాయికి 60 సేర్లమ్మే రాగులు రెండున్నర సేర్లు ప్రకారమయ్యెను. కొందరు 'మనిషి మాంసమును' తినిరి. మరల 1831లో క్షామము వచ్చెను. పిడికెడు గింజలకు పిల్లలను తండ్రులమ్ముకొనిరి. జొన్నలు రూపాయికి 3 లేక 4 సేర్లమ్మెను. చెట్ల అకులను జనులు మేయదొడగిరి. మరల 1854లో మరొక క్షామము వచ్చెను. వీధులలో పీనుగలు నిండియుండెను." (ఆంధ్రుల సాంఘిక చరిత్ర, పు. 377).

1948కి ముందు ఒక మూడు శతాబ్దాలలో హైదరాబాద్ సంస్థానంలోపల జనం ఎంత దుర్భరంగా బతికారో ఎంత పీడనకి గురయ్యారో ఈ పంక్తుల వల్ల తెలుస్తుంది. జనం వెతలు పట్టించుకున్నవాడు లేడు. పైగా పాలకులే పీడకులయ్యారు.

"తెలంగాణములోని భూములన్నీ గుత్తకిచ్చుచుండిరి. గుత్తేదారులు రైతుల వద్ద ధాన్యభాగము తీసుకొని సర్కారుకు రూపాయలు చెల్లించుచుండిరి. భూములకు నిర్ణయమగు పన్నులు లేకుండెను. దేశముఖులు, దేశాపాండ్యాలు పన్ను వసూలు చేయు అధికారులు. భూమి పన్నే కాక మగ్గం పన్ను, కడప పన్ను, కలాలి, దన్నర్ పట్టి, దేడ్‌పట్టి, కులాల పన్ను, పెండ్లి పన్ను, తోళ్ల పన్ను, హట్టాజినీ, పీనుగుల పట్టి, తోకపన్ను, ఆదంపట్టీ (హిందూ పారిశ్రామికులపై పన్ను) మున్నగు 27 విధాల చిల్లర పన్నులను ప్రజల నుండి లాగుచుండిరి". (బిల్గ్రామీ ఆధారంగా - ఆంధ్రుల సాంఘిక చరిత్ర పు. 378).

జమీందారులు వారి అధీనంలో ఉండే భూమిపై పూర్ణఅధికారం కలిగివున్నారనీ ఆయా భూములలోని కాపురస్తులపై భార్య మీద చలాయించే అధికారం కంటే కూడా ఎక్కువ పెత్తనం సాగిస్తున్నారని బిల్గ్రామీని ఉటంకిస్తూ సురవరంవారు రాశారు. ఈ శోషణ నుంచే, పీడన నుంచే తిరుగుబాటు పుట్టింది. "ప్రాణములొడ్డి ఘోర గహనాటవులన్ బటగొట్టి, మంచి మాగాణములన్ సృజించి, ఎముకల్ మసిజేసి పొలాల దున్ని, భోషాణములన్ నవాబుకు స్వర్ణము నింపిన రైతుదే తెలంగాణము రైతుదే, ముసలి నక్కకు రాచరికంబు దక్కునే?" (దాశరథి) అని తెలంగాణమంతా నినదించింది.

**పరమత ద్వేషము విషవమనం ....**

మొగలాయి ప్రభువైన ఔరంగజేబ్ 1680 వ సంవత్సరంలో గోల్కొండని ఆక్రమించాడు. దీన్ని తన సామ్రాజ్యంలో కలిపేసుకోవటంతో కుతుబ్‌షాహీల పాలన ముగిసింది. ఆనాటి నుంచి దక్కన్ ప్రాంతంలో తన ప్రతినిధిగా నిజాం ఉల్‌ముల్క్ అసఫ్‌జాను నియమించాడు. అయితే ఔరంగజేబ్ 1707లో చనిపోయాడు. దాంతో 1724లో నిజాముల్‌ముల్క్ స్వతంత్రించాడు. అతడి పాలన 1748 వరకూ సాగింది. అతడి వారసుడిగా రెండో నిజాం మీర్ నిజాం అలీఖాన్ 1761 నుంచీ 1803 వరకూ పాలించాడు. మూడవ నిజాం సికందర్‌జా 1803 నుంచి 1828 వరకూ నాల్గవ నిజాం నసీరుద్దౌలా 1828 నుంచి 1856 వరకూ పెత్తనం చేశారు. ఐదవవాడు అఫ్జలుద్దౌలా 1856 నుంచి 1868 దాకా, ఆరవవాడు మీర్‌మహబూబ్ అలీఖాన్ 1868 నుంచి 1911 దాకా పాలన సాగించారు. ఏడవ నిజాం మీర్ ఉస్మాన్ అలీఖాన్ 1911లో అధికారానికి వచ్చాడు. వస్తూ వస్తూనే తండ్రి కాలం నుంచీ ప్రధానమంత్రిగా ఉండిన కిషన్‌ప్రసాద్‌ను తొలగించి ఆస్థానంలో ఒక ముస్లింను నియమించాడు. "మై పాస్‌బనే దీన్ హూ, కుఫ్ర్ కా జల్లాద్ హు" (నేను ఇస్లాం రక్షకుడిని, ముస్లిం కాని వాడి తల నరికేవాడిని) అని ప్రకటించుకున్నాడు. ఇతడు రాసిన కవిత్వంలో అంతటా పరమత విద్వేషమూ విషవమనమూ కనిపిస్తాయి. రహబరే దక్కన్ అన్న దిన పత్రికలో నిజాం రాసిన కవితా పంక్తులు ఇట్లా ఉన్నాయి. "బందే నాకూస్ హువా సున్‌కె నారాయే తక్‌బీర్

జిల్‌జలా ఆహీ గయారిశ్త యే జున్నార్ పర్"

(అల్లాహో అక్బర్ అన్న కల్మా ధ్వని వినటంతోటే శంఖనాదం ఆగిపోయింది. హిందువుల జంధ్యాలపై మత చిహ్నాలపై భూకంపం నుండి లేచిన మట్టి కప్పేసింది)

"సల్‌తనే సల్ఫ్ సబ్‌హోగయే నజరే అజల్ ఉస్మాన్!

ముసల్మానోంకా తేదీ సల్తనత్ సే హై నిశాబాకీ"

(పూర్వీకుల సామ్రాజ్యాలన్నీ కాలగర్భంలో కలిసిపోయాయి. కానీ ఉస్మాన్! నీ రాజ్యం వల్లనే ఈనాడు ముస్లింల చిహ్నాలు ఇంకా మిగిలి ఉన్నాయి)

ఇదీ నిజాం అసలు రూపం. 'పోలీసు చర్య' తర్వాత సర్దార్ పటేల్‌గారిని కలిసినప్పుడు తనకి హిందువులూ, ముస్లింలూ రెండు కళ్లనీ ఆ రెండు వర్గాలూ తనకి సమానమేననీ బొంకబూశాడట నిజాం. అయితే పటేల్ తన కార్యదర్శి మీనన్ చేత నిజాం రాసిన పై కవితా పంక్తులు చదివించి వినిపించారట. నిజాం బిక్కచచ్చిపోయాడని వేరే చెప్పనక్కరలేదు. ఈ సంగతి ఖండేరావు కులకర్ణిగారు రాశారు.

1948 నాటికి హైదరాబాద్ సంస్థాన వైశాల్యం 82,700 చదరపు మైళ్ళు దేశంలోనే ఇది పెద్దది. జనాభా కోటీ ఎనభై ఐదు లక్షలు. వరంగల్, మెదక్, ఔరంగాబాద్, గుల్బర్గా సుబాల కింద సంస్థాన పరిపాలన నడిచేది. తెలంగాణా వైశాల్యం 49,502 చదరుపు మైళ్ళు. సంస్థానంలో కోటిమందికి పైగానే తెలుగువాళ్ళే ఉండువాళ్ళు. నలభై లక్షల మంది మరాఠీలూ కన్నడీగులూ పోతే ఉర్దూ మాట్లాడేవాళ్ళు 20 లక్షల మంది మాత్రమే. అయినప్పటికీ ఉర్దూయే రాజభాష! ఉర్దూ ప్రాబల్యం మూలాన తెలుగుకు గ్రహణం పట్టింది. స్థానిక భాషల్లో విద్యాబోధనకు ప్రభుత్వం అనుమతి అంత సులువుగా ఇచ్చేదే కాదు. ఒక మైనరిటీ భాషలో సాగిన రాజ్యవ్యవహారం మెజారిటీ ప్రజలను ఇక్కట్ల పాల్జేసింది. 1919 ఆగస్ట్ 28న ఉస్మానియా విశ్వవిద్యాలయం పుట్టింది. అక్కడా ఇదే తంతు. చాలాకాలంగా సాగుతున్న శోషణ నేపథ్యంలో జనజాగరణ కోసం 1901 సెప్టెంబర్ 1నాడు హైదరాబాద్‌లో కొమర్రాజు వెంటక లక్షణరావు ప్రోత్సాహంతో 'శ్రీ కృష్ణ దేవరాయాంధ్ర భాషా నిలయం' స్థాపించబడింది. అటుపై ఆంధ్రభాషకు జరుగుతున్న అవమానాలకు రోసి 1922 ఏప్రిల్ 4నాడు కొండా వెంకట రంగారెడ్డిగారి అధ్యక్ష తన 'ఆంధ్ర జన కేంద్ర సంఘాన్ని' ఆంధ్ర భాషాభిమానులైన కొందరు నాయకులు స్థాపించారు. ఆ తర్వాత 1930లో 'ఆంధ్ర మహాసభ' అవతరించింది. జోగిపేటలో జరిగిన తొలి 'ఆంధ్ర మహాసభ' సమావేశాలకు సురవరంవారు అధ్యక్షులు. ఈ సభలకు చాలా కష్టంగా షరతులతో కూడిన అనుమతి లభించింది. ప్రాథమిక విద్యని గురించీ, మద్యపాన దురభ్యాసాన్ని మాన్పటం గురించీ వెట్టిచాకిరీ నిషేధం గురించీ ఆంధ్ర మహాసభ సమావేశాలు తీర్మానాలు చేశాయి. 1930 నుండి 1946 వరకు మొత్తం పదమూడు 'ఆంధ్ర మహాసభ' మహాసభలు జరిగాయి. ఈ సభలు జనంలో స్థైర్యాన్ని కలిగించాయి. విశ్వాసాన్ని పెంచాయి.

రాజకీయాల ప్రస్తావన ఉండనే కూడదన్న షరతును మొదట్లో పాటించిన ఆంధ్ర మహాసభ రాను రాను రాజకీయ వేదికగా మారజొచ్చింది. 1937వ సంవత్సరంలో నిజామాబాద్‌లో జరిగిన ఆంధ్ర మహాసభ ఆరవ సమావేశం తొలిసారిగా "బాధ్యతాయుత ప్రభుత్వం" నిజాం రాష్ట్రాంధ్రుల కాదర్శమని ప్రకటించింది. 1940లో జరిగిన మల్కాపురం ఆంధ్ర మహాసభ కూడా చరిత్రాత్మకమైనది. ప్రభుత్వం ప్రవేశపెట్టిన రాజ్యాంగ సంస్కరణలను బహిష్కరించాలన్న తీర్మాన్ని ఈ మహాసభ ఆమోదించింది. రావి నారాయణరెడ్డిగారు తీర్మానాన్ని ప్రవేశపెడితే మందుముల నరసింగరావు, మాడపాటి హనుమంతరావు, కొండా వెంక రంగారెడ్డి ప్రభృతి మితవాదులు దాన్ని వ్యతిరేకించారు. అయితే అతివాదుల పక్షమే నెగ్గింది. భువనగిరిలో జరిగిన 11వ ఆంధ్ర మహాసభలలో చీలికలు వచ్చాయి. 1946లో జమలాపురం కేశవరావుగారి అధ్యక్షతను

13వ. ఆంధ్ర మహాసభ మెదక్ జిల్లాలో 'కంది'లో జరిగింది. ఇదే చిట్టచివరి ఆంధ్ర మహాసభ సమావేశం. ఆ తర్వాత ఆంధ్ర మహాసభ స్టేట్ కాంగ్రెస్‌లో విలీనమయి స్టేట్ కాంగ్రెస్ ఆంధ్ర ప్రాంత సంఘ' మయింది. అతివాదులు ఒక పక్కన, మితవాదులు మరో పక్కన వేరు వేరుగానే అయినా సంస్థాన విముక్తి కోసం నిబద్ధతతో ఉద్యమించారు. సంస్థానంలో మొదట ఉద్యమానికి బీజవాపనం చేసింది మాత్రం 'ఆర్య సమాజమే'. పౌర హక్కులన్నీ హరించుకు పోయిన నిరాశావహమైన దశలో ఆర్య సమాజం దుశ్శాసనానికి వ్యతిరేకంగా గళమెత్తింది. సంస్థానంలో స్వామి దయానందుని సత్యార్థ ప్రకాశంపై నిషేధం ఉండేది. హవనం చేసుకోవడం పైనా ఆంక్షలుండేవి. గస్తీ నిషాన్ తిరపన్ (53) సభలకూ సమావేశాలకూ అడ్డంకిగా ఉండేది. 1935లో 'వైదిక్ ఆదర్శ్' పేరిట ఆర్య సమాజం ప్రచురిస్తున్న పత్రికని సైతం నిజాం ప్రభుత్వం నిషేధించింది. పాఠశాలలు నెలకొల్పడం పైన ఆంక్షలు పెట్టింది. 'ఓం' పతాకాలను ఎగురవేయడానికి వీలే లేదు. ఈ స్థితిలో ఆర్య సమాజం 'సత్యాగ్రహం' చేయాలని నిర్ణయించింది. ఆర్యసమాజం పిలుపు మేరకు యావద్భారతంలో 'హైదరాబాద్ డే'ని పాటించారు. 1938 జనవరి 21వ తేదీన మహాత్మ నారాయణ స్వామి ఉద్యమ నేతగా హైదారాబాద్ స్టేట్‌లోకి అడుగుపెట్టారు. నిజాం ప్రభుత్వం ఆయనను అరెస్టు చేసింది. వేలాది మంది ఆర్య సత్యాగ్రహులను జైళ్ళలోకి నెట్టింది. అయితే 1939 జూలై నెలలో ప్రభుత్వం దిగివచ్చి కొన్ని 'పరిపాలనా సంస్కరణ'లని ప్రకటించింది.

ఇంకో ప్రక్కన 1938 అక్టోబరు 24న రావి నారాయణరెడ్డి, రామకృష్ణదూత్, జనార్ధన్‌రావ్ దేశాయ్, గోవింద రావ్ నావల్ 'సత్యాగ్రహం' చేశారు. ఆ తర్వాత సత్యాగ్రహోద్యమ నియంత స్వామి రామానంద తీర్థ సత్యాగ్రహం చేసి అరెస్టయ్యారు. స్టేట్ కాంగ్రెస్‌ను నిజాం ప్రభుత్వం నిషేధించింది. 18 జట్లుగా 400 మంది సత్యాగ్రహులు ఈ ఉద్యమంలోకి పాల్గొన్నారు. అయితే గాంధీగారి సూచన మేరకు సత్యాగ్రహాన్ని విరమించవలసి వచ్చింది. సర్ అక్బర్ హైదరీకి గాంధీ గారితో ఉన్న స్నేహ సంబంధాల వల్ల హైదరాబాద్ సంస్థానంలో స్టేట్ కాంగ్రెస్ ఎదగడానికి చిక్కులు వచ్చాయి. 'స్వదేశీ సంస్థానాల' విషయంలో గాంధీ గారు ఒకింత ఉదార వైఖరినే ప్రదర్శించారు. కానీ నిజాం ఆంగ్లేయ పాలకులకు తైనాతీగా వ్యవహరించి కడకు 'స్వతంత్ర రాజ్యా'న్నే స్థాపించాలని కలగన్నాడు.

1947 జూన్ 12వ తేదీన ఒక ఫర్మానా జారీ చేస్తూ బ్రిటిషువారు దేశం విడిచి పోయిన వెంటనే హైదరాబాద్ రాష్ట్రం 'స్వతంత్ర దేశమవు'తుందని ప్రకటించారు. 1947 జూలై 14 నాడు బ్రిటిష రెసిడెంటుకు వీడ్కోలు విందు ఇస్తూ నిజాం ఉద్దేశాన్నే మరొకసారి పునరుద్ఘాటించాడు. 1944 జనవరి 26 నాడు సుబా-ఏ-దక్కన్ అన్న ఉర్దూ పత్రికలో వ్రాస్తూ హైదరాబాద్ భారత్‌లో

అంతర్భాగమవుతుందనుకోవడం అర్థరహితమని వ్యాఖ్యానించాడు నిజాం. చివరకి 1947 ఆగష్టు 17 నాడు 'హైదరాబాద్ సంస్థానాన్ని స్వతంత్ర రాజ్యం'గా ప్రకటించనే ప్రకటించాడు. దీన్ని నిలుపుకోవడం కోసం నిజాం అంతర్జాతీయంగా సైతం భారీ ప్రయత్నాలనే సాగించాడు. పాకిస్తాన్ విదేశాంగ మంత్రి జఫరుల్లాఖాన్ బాహాటంగానే హైదరాబాద్ రాజ్యానికి మద్దతు ప్రకటించాడు. 1948 జూలై 30 నాడు బ్రిటిష్ ప్రధాని విన్‌స్టన్ చర్చిల్ కూడా 'హౌస్ ఆఫ్ కామన్స్'లో ప్రసంగిస్తూ నిజాం ఆలోచనలని సమర్థించాడు. "ఐక్యరాజ్య సమితిలోని 52 భద్రతా మండలి సభ్య దేశాల్లో 39 చాలా చిన్నవి. వాటిల్లో 20 హైదరాబాద్ సంస్థానం కన్నా చిన్నవి. 16 అయితే హైదరాబాద్ సంస్థానం కన్నా తక్కువ ఆదాయం వచ్చేవి. భౌగోళికంగా ఇండియన్ యూనియన్‌లో హైదరాబాద్ ఒక ద్వీపంలాగా వుంటుంది. ఆ ఒక్క కారణం చూపి దాని స్వేచ్ఛనూ, స్వాతంత్ర్యాన్ని హరించకూడదు" ఇట్లా సాగాయి ఆ పెద్ద మనిషి మాటలు.

చివరి బ్రిటిష్ రెసిడెంటు మొదట ఇండియన్ యూనియన్‌లో విలీనం అయిపోమంటూ సలహా యిచ్చినా ఆ తర్వాత మాట మార్చి 'ఆజాద్ హైదరాబాద్' పల్లవి అందుకున్నాడు. అర్జెంటీనాకి చెందిన జోన్ ఆర్సెస్ అనే వాడు భద్రతా మండలిలోనూ ఆజాద్ హైదరాబాద్‌ను సమర్థిస్తూ మాట్లాడాడు. బ్రిటిష్ పత్రికలు సైతం హైదరాబాద్ స్వతంత్రంగా ఉండాలని. వ్యాసాలు రాశాయి. ప్రాచుర్యం ఉన్న 'ది స్పెక్టేటర్' పత్రిక అయితే ఆజాద్ హైదరాబాద్‌ను సమర్థిస్తూ ఎడిటోరియల్ రాసింది. అంతర్జాతీయ స్థాయిలో ఇలా ప్రచారం సాగిపోతుండగా సంస్థానంలో అరాచకాలకి అడ్డూ, అపూ లేకుండా పోయింది. హిందువులను ముస్లింలుగా మార్చే పని ఊపందుకుంది. హిందూ పడతుల మాన ప్రాణాలకి భద్రత లేని స్థితి దాపురించింది. నిజాం పోలీసుల సైన్యం 25 వేలకి పెరిగింది. రజాకార్ల సైన్యం 50 వేలయింది. ఆడవాళ్ళ నుంచి పిల్లల దాకా ముస్లింలందరికీ తుపాకీ శిక్షణ నివ్వడం ప్రారంభించారు. రజాకార్ల నేతకాశీం రజ్వీ దక్కనులో 'ఇస్లాం రాజ్యస్థాపన' కోసం కలలు కనడం మొదలు పెట్టాడు. ఇతగాడు సాగించిన దుశ్చర్యల్ని నిరసించినందుకే 1948 ఆగష్టు 21 నాడు 'ఇమరోజ్' పత్రికా సంపాదకుడు షోయబ్‌ను కిరాతకంగా కాల్చి చంపారు. తూటాలకు నేలకొరిగిన షోయబ్ చేతుల్ని పాశవికంగా నరికారు. అడ్డుపడిన ఇస్మాయిల్ చేతిని సైతం రజాకార్లు నరికేశారు.

## "గడ్డి పోచయును సంధించెన్ కృపాణమ్ము......"

రజాకార్లు నిజాం పోలీసుల అత్యాచారాలకు ఎదురించిన వూరు నాడు నల్లగొండ జిల్లాలో ఉంది. ఆ పల్లె ఆ రోజులలో రజాకార్ల అకృత్యాలకి ఎదురు నిలిచింది. ఆయుధాలు ధరించి ఆత్మ రక్షణకు పూనుకుంది. భైరోనిపల్లె కోట గోడ

బురుజు పై ఆయుధాలతో పల్లె జనం కాపలా కాస్తుండేవాళ్ళు. బెక్కల్, ధూళిమిట్ట, తోరసాల్, జాలపల్లి, కొండాపూర్, కుటిగల్, సోలిపూర్, అంకుశాపూర్ వంటి సమీప గ్రామాలకు కూడా ఆ పల్లె ఆదర్శం అయ్యింది. గ్రామ రక్షక దళాలకు ఏర్పాటు చేయడంలో బైరోనిపల్లె మార్గదర్శకమై నిలిచింది. ఒకసారి రజాకార్లు ఈ గ్రామం మీద దాడిచేయబోయి భంగపడ్డారు. ఆ కక్షతోటే భువనగిరి డిప్యూటీ కలెక్టర్ ఇక్బాల్ హాషీం మొదట కొడకండ్ల గ్రామం మీద పడి నలభై మందిని కాల్చి చంపాడు. ఆ తర్వాతి దాడి బైరోనిపల్లె మీదే. అయితే బైరోనిపల్లి బురుజు మీది నుంచి ఫిరంగి కాల్పులు ప్రారంభం కావడంతో హాషీం మూక పిక్క బలం చూపక తప్పలేదు. హాషీం ముఠాలో 15 మంది అక్కడికక్కడే హతమయ్యారు. చేసేది లేక వెనుదిరిగిన హాషీం బైరోనిపల్లెని నాశనం చేస్తానంటూ ప్రతిజ్ఞ చేసి వెళ్ళాడు. అయిదు వందల మంది సైనికులూ పోలీసులూ రజాకార్లతో ఆ తర్వాత బైరోనిపల్లె మీద దాడి జరిగింది. తెల్లవారు జామున నాలుగున్నర గంటల వేళ సైన్యం బైరోనిపల్లిని చుట్టుముట్టింది. సైన్యం పదమూడు ఫిరంగి గుళ్ళని పేల్చింది. దాంతో బురుజు కూలిపోయింది. అక్కడి మందు గుండు సామగ్రి కూడా పేలిపోయింది. మగుటం రామయ్య, భూమయ్యలు అక్కడే నేలకొరిగారు.

ఇక ప్రతిఘటించి ప్రయోజనం లేదనుకుని పల్లె జనం బురుజు మీద నుంచి 'కాల్పుల విరమణ'ని సూచిస్తూ తెల్లజెండా చూపించారు. అయితే నిజాం సైన్యం దాన్ని పట్టించుకోలేదు. కాల్పులు సాగిపోయాయి. కనబడిన ప్రతివాడినీ షూట్ చేశారు. చేతి బాంబుల విసిరి పదిమంది యువకుల ప్రాణాలు తీశారు.

ప్రతి ఇంట్లోకీ జొరబడి లూటీలు చేశారు. స్త్రీలని బలత్కరించారు. ఇళ్ళకి నిప్పుపెట్టారు. ఊరవతలికి 92 మంది యువకుల్ని లాక్కుపెళ్ళి నిలబెట్టారు. త్రీ నాట్‌త్రీ రైఫిల్‌తో నైపుణ్య పరీక్ష ప్రారంభమయింది. ఒకేసారి ఒక గుండుతో ఎంత మందిని చంపవచ్చో తేల్చాలని నిర్ణయించారు! నాలుగు వరుసల్లో ఒకరి వెనుక ఒకర్ని నిలబెట్టారు. పెడ రెక్కలు విరిచి కట్టివేసిన యువకులపై కర్కశుడైన సైనికాధికారి ఒకరు కాల్పులు జరిపాడు. ఒకే గుండు వరుసగా నలుగురి శరీరాలగుండా దూసుకుపోయింది. రైఫిల్ చప్పుళ్ళు వికట్టాహాసాలతో ఆ ప్రాంతం దద్దరిల్లింది. హాషీం ఎనిమిది మందిని కాల్చి చంపాడు. కాశీం రజ్వీ ముఖ్య అనుచరుడు మొహజ్జిం హుసేన్ చాలా మందిని పొట్టనబెట్టుకున్నాడు. మొత్తం 90 మంది శవాల్ని లెక్కబెట్టారు. ఈ శవాలన్నింటినీ ఒక పాడుబడిన బావిలో వేయించి సమాధి చేశారు. గ్రామంలో మరణించిన వారి లెక్క వేరు.

అక్కడి నుంచి సైన్యం కుటిగల్‌కు వెళ్ళింది. అక్కడ గ్రామ పట్వారి సంహారావుతో సహా పాతిక మందిని హత్య చేశారు. రక్షణ ఏర్పాట్లు చేసుకోవడమే ఆ గ్రామం చేసిన నేరం. ఇట్లా ఒకటి రెండు కాదు వందలాది గ్రామాలపై అరాచకం

సాగిపోయింది. ఇంత జరుగుతున్నా ప్రధానమంత్రి నెహ్రూ తాత్సరం చేశారు. ఆలస్యం అయిన కొద్దీ అమాయక జనంపై అత్యాచారాలు పెరుగుతుండడం, నిజాం విదేశాల నుంచి పెద్ద యెత్తున ఆయుధాలు దిగుమతి చేసుకుంటుండడం చూసి హోంమంత్రి, ఉక్కు మనిషి సర్దార్ వల్లభాయి పటేల్ 'పోలీసు చర్య'కు ఉత్తర్వులు ఇచ్చారు. మేజర్ జనరల్ జె.ఎన్. చౌదరి నేతృత్వంలో భారత సైన్యం 1948 సెప్టెంబరు 13 వ తేదీన హైదారబాద్ సంస్థానంలోకి అడుగు పెట్టింది. మొదట రెండు మూడు రోజులు కొద్దిగా ప్రతిఘటించినా రజాకార్లూ నిజాం సైనికులూ చివరికి మోకరిల్లక తప్పలేదు.

1948 సెప్టెంబరు 17వ తేదీన జీరాలు పలికిన నిజాం పాదాక్రాంతం అయ్యాడు. ఇస్లాం అధికారపీఠమైన 'ఖిలాఫత్'ను పునరుద్ధరిద్దామనుకున్న ఉస్మానలీఖాన్ పీఠమే కదిలిపోయింది. చరిత్ర బొంగరం తిరిగి మరో కిరీటం నేలకొరిగింది. ముసలి నక్కకు రాచరికం దక్కలేదు. రోమాంచకమైన ఈ తెలంగాణా పోరాటంపై స్పందిస్తూ రష్యన్ కవి విక్టర్ గోంచరోవ్ చెప్పిన మాటలు ఎంత నిజం ! ఆయన ఇలా అన్నారు —

"లేవు —
కరకరపొడిచే పొద్దును ఆపే
శక్తులు లేవు —
లేవు —
లేవు ఉదయమాపు జైళ్ళు —



# నైజాం సర్కారోడా !

- కీ.శే. దాసరథి.

నైజాం సర్కారోడా !
నాజీల మించినోడా
యమ బాధ పెడ్తివి కొడుకో
నైజాము సర్కారోడా !
పండిన పంటనంతా

తిండికూనా ఉంచకుండా
తీసుకెళ్ళినావు కొడుకో
నైజాము సర్కారోడా !
దున్నాను భూమి లేక
ఉండాను ఇల్లు లేక
పరదేశ మెల్తిమి కొడుకో
నైజాము సర్కారోడా !

పోలీసు మిల్ట్రి జూసి
మేము లొంగివస్తమాని
నువు ఆశపడ్తివి కొడుకో
నైజాము సర్కారోడా !
లాఠీల దెబ్బలుగాని
తుపాకి కాల్పులుగాని
మిషీను గన్నులుగాని
తుపాకి బాంబులుగాని

నీ వెన్ని తెచ్చినగాని
నీవెన్ని తెచ్చినగాని
మేం లొంగి రాము కొడుకో
నైజాము సర్కారోడా !

కంచారుగాడ్దు లాను
లంచగొండె పోలీసోల్లా
నీవు పెంచినావు కొడుకో
నైజాము సర్కారోడా !

చుట్టుపట్టు సూర్యాపేట
నట్ట నడమ నల్లగొండ
అవాల హైదరాబాదూ
తర్వాత గోలకొండ
గోలకొండ ఖిల్లా క్రింద
నీ గోరీ కడ్తం కొడుకో
నైజాము సర్కారోడా !
నీ గోరీ కడ్తం కొడుకో
నైజాము సర్కారోడా !

(నల్లగొండ యాదగిరి ఈ పాటను ప్రచారంలోకి తీసుకు వచ్చారు)

## ముస్సీతటము

అచట ప్రాక్పశ్చిమాకాశ మూసలించి
నెత్తురులు కక్కుకొన్నది. కుత్తుకలకు
కత్తులను కట్టి ఊరేగు కాలరాత్రి
మానభంగాల తెండాలతో నటించె

అచట, పాపము, దౌర్భాగ్య మావరించి
తెలుగు దేశాన నెత్తురుల్ చిలికివేసె
మత పిశాచము పేదల కుతుక నమిలి
ఉమ్మివేసెను పిచ్చి లోకమ్ము మీద

నా తెలంగాణా కోటి రత్నాల వీణ
తీవియలు తెగి, విరిగి నందించకుండె
నా తెలుగుజాతి ప్రాణమానాలు దోచె
ఈ నిజాము పిశాచి కన్నెర్రజేసె

మా నరాల నెత్తురు. ప్రవాహము కలిసి
ముస్సిలో పారినది. యుద్ధమూర్తులోలె
మా స్థిరీభూత భావ సమూహ వృక్ష
మట్లె నిలిచిన ధీరాత్ములైనగాని

గెలిచినది గర్జించిన ముక్క లయిపోయె
మన్ను కరచెను గొప్పలు కన్నులోని
వేడి అశ్రువు గెలిచెను. వాడి కత్తి
ఓడిపోయెను. ముష్కరాధములయి



# 27. నిస్వార్థ నాయకుడు శ్రీ జమలాపురం కేశవరావు

- శ్రీ భండారు చంద్రమౌళీశ్వరరావుగారు B.A.L.L.B
8.4.48, శ్రీ కిషన్‌కాలనీ, వరంగల్లు 6 506 062

దేశ స్వాతంత్ర్యానికీ, ప్రజల దాస్యవిముక్తికి అకుంఠిత దీక్షతో నిస్వార్థంగా రేయిబవళ్లు కృషిచేసి అనేక త్యాగాలు చేసిన మహామనీషులెందరినో సమాజం మరచిపోయింది. భావితరం వారు వ్యక్తిగతంగా అట్టి మహనీయులను ఎరుగకపోయినా వారి జీవిత విశేషాలను వెలుగులోకి తెచ్చి యువతరానికి స్ఫూర్తి కలిగించే బాధ్యత వారి సమకాలీనులపై ఎంతో ఉన్నది. ఇట్టి మరుగుపడిన దేశ నాయకులలో సర్దార్ జమలాపురం కేశవరావుగారొకు. వారి జీవిత విశేషాలను సేకరించి సంకలన పరచి ప్రచురించుటకు పూనుకొనిన శ్రీ జమలాపురం గోపాలకిషన్‌రావు గారు దేశానికి ఒక గొప్పమేలు చేసినవారవుతున్నారు.

నిజాం కాలేజీలో విద్యార్థిగా ఉన్నప్పటి నుంచి అనగా షుమారు 1938 నుండి శ్రీ కేశవరావు గారిని గురించి నేను తెలుసుకుంటూ వచ్చాను. ఆంధ్ర మహాసభలో వారు నిర్వహించిన పాత్ర, వారి నిరాడంరత, గురించి కథలు కథలుగా వింటూ ఉండేవాణ్ణి. విద్యార్థిగా ఉన్నప్పడే రాజకీయ ప్రవేశం నాకు ప్రారంభమయింది. మా కుటుంబ సభ్యులకు బాల్యంలోనే పూజ్యులు మా పెద్దన్న గారైన శ్రీ భండారు వీరమల్లు ప్రసాదరావుగారు శిక్షణనిచ్చారు. ఆస్ఫూర్తి ఈనాటికి వదలలేదు. విద్యార్థి జీవనం 1940లో పూర్తి అయింది. విద్యాభ్యాసం తరువాత రాజకీయాలలో ప్రవేశించాలన్నదే మొదట్నుంచీ నాఆకాంక్ష. కాని కొన్ని ఈతి బాధల కారణంగా ఆ తరువాత షుమారు నాలుగు సంవత్సరాలు నాకు రాజకీయాలలో పరోక్ష సంబంధం మాత్రమే ఉంది. 1945లో పూర్తి రాజకీయాలలో ప్రవేశించాను. శ్రీ కేశవరావు గారితో సన్నిహితత్వం ఏర్పడింది. దూరంగా ఉన్నప్పడు శ్రీ కేశవరావుగారిపై నాకేర్పడిన గౌరవ మర్యాదలకన్నా సన్నిహిత మేర్పడిన తరువాత వారి పట్ల శ్రద్ధాభక్తులు యినుమడించినవి. వారి నిరాడంబరత, మిత భాషిత్వం, త్యాగశీలము నన్నెంతో ఆకర్షించినవి. నాటి నిజాం రాక్షస ప్రభుత్వాన్ని సహితం పరుషంగా విమర్శించే వారు కాదు. నాటి పోలీసుల దౌర్జన్యం వర్ణనా తీతం. పోలీసు జులుంను విమర్శించేటప్పడు కూడా" జమేదారుపై షికాయతు చేయవద్దు చేశారా ? అతను అమీన్ అవుతాడు. అమీన్ మీద షికాయతు చేశారా ? అతడు

సర్కిల్ అవుతాడు" ఈ విధంగా వారు ప్రభుత్వ దమననీతిని వ్యంగంగా విమర్శించేవారు. వారిని మేమంతా "పెద్దన్న" అని పిలిచేవారము. వాస్తవానికి వారు ఎందరికో పెద్దన్న గారు. అత్యవసరమైతే తప్ప వాహనము ఎక్కేవారుకాదు. కాలి నడకతోనే వారి ప్రచార కార్యక్రమములు కొనసాగించేవారు. బహుశః పాదచారిగా వారు పోని గ్రామం మధిర, ఖమ్మం తదితర సమీప తాలూకాలలో ఉండదు. కొన్ని సందర్భములలో వార్ని మేము అనుసరించేవారము. వారికంటే వయస్సులో చిన్న అయినా మేము అలసిపోయేవారము కానీ వారు అసి పోయినట్లు ఎప్పుడు కన్పించేవారు కారు. కేశరావుగారిని గురించి వ్రాయలంటే ఒక గ్రంధమవుతుంది. అందువలన కొన్ని సంఘటనలను మాత్రమే ప్రస్తావిస్తాను.

ఆనాటి జనగాం తాలూకాలో భాగమైన కుంచనపల్లి గ్రామానికి స్టేట్ కాంగ్రెస్ కార్యక్రమ సందర్భంగా ఒక సమావేశానికి 1946లో శ్రీ కేశవరావు గారితో పాటు నేను కూడా వెళ్లటం తటస్థించింది. సమావేశం చాలా ప్రొద్దుపోయే దాకా జరిగింది. మరునాటి ఉదయాన మేమంతా మాకు ఆతిధ్య మిచ్చిన గృహస్తుని ఇంటి ముందు కొంచెంసేపు కూర్చున్నాము. ఆ సమయాన నాధోవతి నామోకాళ్లపైకి పోయింది. అది నేను గమనించనూ లేదు. బుద్ధి పూర్వకంగా చేసిన పనీ కాదు. కేశవరావుగారు నాచెవిలో అది సభ్యతకాదు అని మృదువుగా చెప్పారు. వెంటనే ధోవతిని సవరించుకున్నాను. జీవితంలో ఆ పొరపాటు మళ్ళీ చేయలేదు. సభ్యతగా మనము ఉండడం సరిపోదు. మనము మర్యాదస్తులమని కూర్చునేటప్పుడు నిలబడేటప్పడు మాట్లాడేటప్పడు ప్రతిచర్యలో ప్రజలు గుర్తించేటట్లు వ్యవహరించాలని శ్రీ కేశవరావు గారు ఉపదేశించారు. ఈ విధంగా నాకే కాదు. నా సహచరులందరిని సభ్యతను పాటించవలసినదిగానూ మర్యాదగా వ్యవహరించమనియూ, పరుష శబ్దాలు వాడవద్దనీ 'ముర్దాబాద్' అనే నినాదాలు చేయవద్దనీ హెచ్చరిస్తూ ఉండేవారు.

శ్రీ కేశవరావుగారు తనకుతానై ఏ పదవిని కాక్షించలేదు. పదవికొరకు వారు రాజకీయాలలోనికి దిగలేదు. హైద్రాబాదు సంస్థాన ప్రజల దాస్య విముక్తి' లను చేయుటయే వారి ధ్యేయము.

1946లో హైద్రాబాదు స్టేట్ కాంగ్రెస్ పై నిషేధం తొలగింపబడ్డది. మెదక్ జిల్లా సంగారెడ్డి గ్రామంలో హైద్రాబాద్ రాష్ట్ర ఆంధ్ర ప్రాంత ప్రధమ కాంగ్రెస్ మహాసభ' జరిగింది. ఆ మహాసభకు శ్రీ కేశవరావుగారు అధ్యక్షులుగా ఎన్నుకోబడ్డారు. ఆనాటి రాజకీయాలలో మితవాద వర్గము, అభ్యుదయ వర్గము అని రెండు విభాగాలు ఏర్పడినవి. అభ్యుదయ వర్గ ముఖ్యులలో శ్రీ కోదాటి

నారాయణ రావుగారు ప్రధములు. శ్రీ కేశవరావు గారు నిస్సందేహంగా అభ్యుదయ గాదేగానీ వారి వ్యవహారిశైలికి అనుగుణ్యంగా ఏ వర్గంతోనూ వ్యతిరేకతను కల్పించి కోలేదు. మితవాదులతో కూడా వారి సంబంధాలు సరసంగానే ఉండేవి. కాని వారి మొగ్గు అభ్యుదయ వర్గంవైపే ఉండేది. శ్రీ కోదాటి నారాయణరావు గారు వ్రాసిన ఒక వ్యాసంలో కీ॥శే॥ మాదిరాజు రామకోటేశ్వరరావు మితవాదులలో కల్లా మితవాది అని వర్ణించటం పట్ల అభ్యంతరం తెల్పుతూ శ్రీ నారాయణరావు గారిపై అభిశంసన తీర్మానాన్ని ప్రవేశపెట్టాలనీ మితవాదులు 'కంది' మహాసభలో పట్టుబడ్డారు. తీర్మానాన్ని ప్రవేశపెట్టడానికి అనుమతి ఇవ్వడమా ? లేదా ? అనే విషయంపై శ్రీ కేశవరావుగారు రూలింగ్ ఇవ్వవల్సి వచ్చింది. దీనిపై చర్చోపచర్చలు జరిగినవి. చివరకు అభ్యుదయ వాదులకు అనుకూలంగా రూలింగ్‌ను ఇచ్చి ఆ తీర్మానాన్ని త్రోసిపుచ్చారు. ఆ తరువాత 'కంది' మహాసభను దిగ్విజయంగా నిర్వహించి సర్దార్ బిరుదాన్ని సార్థక పరుచుకున్నారు. ఆకారానికి శ్రీ కేశవరావు గారు సర్దార్ కానీ వాస్తవానికి ఆయన నవనీత హృదయుడు.

1947 లో శ్రీ కేశవరావుగారు సత్యాగ్రహం చేసి వరంగల్లు జైలులో నిర్బంధిపబడ్డారు. అంతకు ముందే అరెస్టు కాబడిన శ్రీ యం.యస్. రాజలింగం గారూ, నేనూ అదే జైలులో అప్పటికే ఉన్నాము. మా ఇద్దరినీ షుమారు 8 నెలలు "సి" క్లాసులో వుంచి ఆ తరువాత "బి" క్లాసుకు పంపారు. ఆది నుండి "బి" క్లాసులో ఉన్న శ్రీ కేశవరావు గారి వార్డుకే మమ్మల్ని పంపారు. ఆ తరువాత షుమారు 9 నెలలు ఒకే కుటుంబ సభ్యులవలె వరంగల్లు సెంట్రల్ జైల్లో వారితో కలిసి ఉండే భాగ్యం లభించింది. జైలులో కూడా వారు మా అందర్ని ప్రోత్సాహ పరుస్తుండే వారు. నిరుత్సాహపడేవారికి ఊతమిస్తూ ఉండేవారు. ఆ రోజుల్లో జరిగిన ఒక వ్యక్తిగత సంఘటనను నేను ఎన్నడూ మరువజాలను.

వరంగల్లు జైల్లో ఉన్న కాలంలో మా కనిష్ట సోదరి ప్రసవించిన మూడవ రోజున పరలోక ప్రాప్తిచెందింది. ఈ సంగతి మా సోదరుడు నాగభూషణరావు ఇంటర్వ్యూ తీసికొని నాకు తెలిపాడు. ఈ విషాద వార్తను వినగానే దుఃఖం ముంచుకొని వచ్చింది. అప్పటి జైలు సూపరింటెండెంటు 'ఫెరోల్' ఇప్పిస్తానన్నాడు. వార్డుకు వచ్చి శ్రీ కేశవరావు గార్ని సంప్రదించగా వారు నన్ను పెరోల్ కోరవద్దనీ సలహా ఇచ్చారు. ఎంతో మంది సహచరులు జైల్లో ఉండగా భార్యలనూ, సంతానాన్నీ, తల్లిదండ్రులను కోల్పోయినారు. "సి" క్లాసు సహచరులెవ్వరికీ పెరోల్ ఇప్పిస్తానని సూచన ప్రాయంగానైనా జైలు సూపరింటెండెంట్ అన లేదు. "బి" క్లాసు ఖైదీకి ఇప్పిస్తాననడంలో మనలో అనైక్యతను కలిగించి నట్లవుతుందని వారు

అభిప్రాయపడ్డారు. వారి సూచన నాకు నచ్చింది. ఆ ప్రయత్నం నుంచి విరమించాను. ఈ విధంగా సంఘటనలు పేర్కొంటే ఒక భారతం అవుతుంది. మరువరాని మహామనీషి కేశవరావుగారు.

"పోలీసు చర్య" (police action) తరువాత వారిని గురించి వ్రాయడం బాధాకరపు విషయం. police action కు పూర్వము త్యాగం, సేవానిరతి, సత్శీలము, నిరాడంబరత, రాణించినవి. ఆ తరువాత పలురకాల విభేదాలు, రాజకీయ కుతంత్రాలు, కుట్రలు, ప్రాధాన్యత వహించాయి. వీటిలో శ్రీ కేశవరావు గార్కి అనుభవంగానీ, ఆసక్తిగానీ లేవు. 1950లో కాబోలు వారు లోక్‌సభకు M.P.గా నామినేట్ చేయబడ్డారు. కానీ హైద్రాబాద్ రాష్ట్రంలో జరిగిన ప్రథమ ఎన్నికలలో వారు ఓడిపోయినారు. వారికి మిత్రులమని సహచరులమని చెప్పకొన్నవారే కుట్రలు, మిత్రద్రోహము చేసి వారిని ఓడించారు. శ్రీ కేశవరావుగారు గెలిస్తే తమకు నాయకత్వం రాదని వారికి తెలుసు. ఈ మిత్రదోహాన్ని శ్రీ కేశవరావుగారు భరించలేకపోయినారు. విశేషమైన మనస్తాపానికి గురి అయినారు. దాని ప్రభావమే వారి ఆకస్మిక, అకాలమరణానికి కారణం అని నా అభిప్రాయం.

శ్రీ కేశవరావుగారు మంత్రిగా లేక ముఖ్యమంత్రిగా వ్యవహరించి ఉండకపోవచ్చు. ఎంతోమంది అనర్హులు. అపాత్రులు మంత్రులైనారు. స్వాతంత్ర్యము వచ్చిన తరువాత కుట్రలు పన్ని ఎత్తుగడలు వేసి ధనసంచులు ఖాళీచేసి అధికారాన్ని చేపట్టడం ఒక గొప్ప విషయంకాదు. ప్రాణాలకు లెక్కచేయక స్వసౌఖ్యాన్ని మరచి, కుటుంబాన్ని నిర్లక్ష్యం చేసి అగ్నిగుండంలో ప్రవేశించి, త్యాగం చేసి స్వాతంత్ర్య సంగ్రామంలో నాయకత్వం వహించడం మహాఘనమైన విషయం. అట్టి మహాఘనతను సాధించిన త్యాగశీలుడు శ్రీ కేశవరావుగారు. నాటి హైద్రాబాదు సంస్థాన ప్రజలూ ముఖ్యంగా తెలంగాణా వాసులు వారినెన్నటికీ మరచిపోలేదు. వారికి నాజోహార్లు.

---

వదలవలసినది జగద్భావం,
తెలియవలసినది జీవతత్త్వం,
చేరవలసినది పరబ్రహ్మ తత్త్వం,
అదే అమృతత్త్వం

వాక్య విభోది



## 28.మానాన్నగారు
# కీ.శే. జమలాపురపు మాధవరావు గారు



- శ్రీమతి మాడపాటి రూపసుందరి
మద్రాసు

మా తాతగారు కీ.శే. జమలాపురపు రామారావుగారు ఒక విశిష్టమయిన వ్యక్తి. ఆజానుబాహుడు. బంగారురంగు శరీరఛ్ఛాయతో చూడముచ్చటగా ఉండే వారట. అయ్యదేవర రామనరసింహారావుగారు నందిగామకు పెద్ద కరణం. ఆయన చెల్లెలు వెంకట నరసమ్మగారిని వెంకట రామారావుగారు పరిణయమాడారు. ఎత్తు తక్కువయిన చాలా చక్కటి మనిషి ఆవిడ. వెంకటరామారావుగారు తెల్లటి గుర్ర మెక్కి అత్తగారింటికి నందిగామ వెళుతుంటే 'దేశముఖ్', 'దేశపాండ్య' రామారావుగారు వస్తున్నారని అందరు ఎంతో గౌరవంగా ఆయనను ఆహ్వానించేవారట.

ఆయనకు ముగ్గురు సంతానం. పెద్దకుమారుడు కేశవరావుగారు. రెండవ కొడుకు నారాయణరావు మూడవ కొడుకు మాధవరావుగారు. మా నాన్నగారు మాధవరావుగారికి జన్మనిచ్చిన 7వ, రోజుననే వెంకటనరసమ్మగారు స్వర్గస్థులైనారు. 7 రోజుల పసిగుడ్డును పెంచుట మా వల్ల కాదని రామారావు గారు విలపించసాగిరి. నందిగామ నుండి వెళ్లిన రామనరసింహారావుగారు, ఆయన పినతల్లి అయిన శ్రీదేవమ్మగారు, మేనాలో 7 రోజుల పసిగుడ్డును నందిగామకు తీసికొని వచ్చిరి. తల్లి లేని పసిగుడ్డుకు గొల్లవారితో పాలిప్పించసాగిరి. ఆ సమయములోనే రామనరసింహారావుగారి భార్య పిచ్చమ్మగారు కూడా మగబిడ్డకు జన్మనిచ్చిరి. ఆడబిడ్డ కొడుకైన మాధవరావుగారికి తన బిడ్డతోపాటు పాలిచ్చి పెంచింది. మేనమామ, అత్త, చిన్న అమ్మమ్మ చేతులమీదుగా పెరిగి పెద్దవారయినారు. మేనమామకు ముగ్గురు కొడుకులు. సుబ్బారావు, రాజారావు, వెంకటేశ్వరరావు, మాధవరావు ముగ్గురు బావలతో కలసి తమ చదువు సంధ్యలు సాగించిరి. మాధవరావుగారి జన్మ సంవత్సరం 1915. ఆయనకు 10 సంవత్సరాల వయస్సు వచ్చిన తరువాత 1925లో ఆయన మేనమామ రామనరసింహారావు గారికి ఆడబిడ్డ జన్మించింది. ఆ అమ్మాయికి మేనత్తపేరు

"వెంకటనరసమ్మ" అని నామకరణం చేసిరి. మాధవరావుగారు ఆ పాపను ఎంతో ముద్దు చేసేవారుట. "అత్తయ్యా ! మీ అమ్మాయిని నేను పెళ్లి చేసుకొంటాను" అనే వారుట.

మాధవరావుగారి చదువు సంధ్యలన్నీ నందిగామలో జరిగినవి. ఆయన గణితశాస్త్రంలో దిట్ట. స్కూల్లో టీచరు బోర్డు మీద లెక్క వేస్తూ ఉండగానే ఆయన తన పుస్తకములో జవాబు వ్రాసేవారుట. ఆయన మేనమామ పిల్లలకు బంధువుల పిల్లలకు కూడా మాధవరావుగారే లెక్కలు నేర్పించేవారుట. చూడటానికి 6 అడగులకు మించిన ఎత్తు తెల్లటి శరీరఛాయ, చక్కని కనుముక్కు తీరుతో రాజకుమారుడి లాగా ఉండే వారుట. ఆయన గజ ఈతగాడు. స్కూల్ ఫైనల్ వరకు నందిగామలో చదువుకొన్నారు. ఆయన చదువు ముగించిన తరువాత రామనరసింహారావుగారు ఆయనను యుఋపాలెం తీసికొని వెళ్లి తండ్రి అయిన రామారావు గారికి అప్పగించారు.

ఆయన తెలివితేటలకు తేలికగానే మంచి గౌరవనీయమైన గవర్నమెంట్ ఉద్యోగం వచ్చింది. దానిలో రాణించు సమయములో ఆయనకు చెవిలో ఏదో కురుపు లేచింది. దానికి సరియైన మందు సరియైన సమయములో జరగః పోవటం వలన ఆయనకు వినికిడి శక్తి తగ్గిపోయింది. ఆతరువాత తన ఉద్యోగానికి సరియైన న్యాయం చెయ్యలేనేమో అనే భయంతో ఉద్యోగాన్ని వదులుకొన్నారు.

రామనరసింహారావు గారు తనకుమార్తె వెంకటనరసమ్మకు యుక్త వయస్సు వచ్చిన తరువాత మాధవరావుగారికిచ్చి వివాహం జరిపించారు. తల్లిపేరు కూడా వెంకటనరసమ్మ అవటం వలన భార్యపేరు లక్ష్మీనరసమ్మగా మార్చారు. కాపరా వచ్చిన తరువాత లక్ష్మినరసమ్మ మామగారు చెప్పినట్లుగా నడుచుకొని జమలాపు వారి వంశానికి వన్నె తెచ్చే విధంగా కాపురం చేసింది. మాధవరావుగారు విశిష్టమయిన వ్యక్తిత్వం కలవారు. మంచితనం, బంధుప్రీతి, దైవభక్తి పె యందు గౌరవం కలవారు. ఉద్యోగ ధర్మం కరక్టుగా నిర్వర్తించటముల ఆయనకు ఆయనే సాటి. నిజాయితి ఆయనకొక ఆభరణం. నిదానమే ప్రధానమనుకొనేవారు. తొందరపడి ఒక వస్తువును అమ్మటం, అందరు కొనుక్కొంటున్నారని తనుకొనటం చేసేవారుకాదు. కీర్తిదాహం కూడా ఎక్కువే. ఖద్దరు బట్టలు తప్ప వేరే దుస్తులు ధరించేవారు కాదు. జమలాపురపు మాధవరావు పొలం అంతా అమ్ముకొని వెళ్లారు అని అనుకొంటారేమోనని ఎన్ని ఇబ్బందులు వచ్చినా పొలం అమ్మలేదు.

జమలాపురపువారి వారసత్వమయిన "యల్లుపాలెం" కరణీకాలు కొన్ని సంవత్సరాలు చేశారు. మంచి గౌరవ ప్రతిష్టలు సంపాదించుకొన్నారు. తరువాత కరణీకాలు వారసునుకి అప్పచెప్పారు. వారి అన్న నారాయణరావుగారి కరణీకాలు 7 గ్రామాల కరణీకాలు చాలా సంవత్సరాలు చేశారు. అందులో ముఖ్యమయినవి.

1) వెంకటాపురం 2) రాజుపాలెం 3) గట్ల గౌరారం

4) సత్యనారాయణపురం 5) నారాయణపురం.

ఆతరువాత పెగళ్ళపాడు జమలాపురం కరణీకాలు చేశారు. ప్రతి శనివారం జమలాపురంలో వెలిసిన వెంకటేశ్వర స్వామివారి సన్నిదికి వెళ్లి పూజా కార్యక్రమాలు చేయించేవారు. ఎన్ని ఆటంకాలు వచ్చినా వెంకటేశ్వరస్వామిని దర్శించటం మానుకొనేవారుకాదు. ప్రొద్దుటే లేచి పెరగన్నంతిని తన కరణీకపు ఊళ్లకు వెళ్లేవారు. బయట ఏ ఆహారం ముట్టుకొనే వారు కారు. మంచి ఆరోగ్యంగా ఉండేవారు. చనిపోయేవరకు ఆయనకు బ్లడ్ ప్రషరుకాని చక్కర వ్యాధికాని, ఆయన దగ్గరకు రాలేదు. ఎక్కడికి వెళ్లినా 'అయ్యో ! జమాబంది, రకం వసూలు, కలక్టరుగారు వస్తారు' అనుకొంటూ తనకర్తవ్యాన్ని జ్ఞాపకం చేసుకొంటూ ఉండేవారు. ఒక కుమారుని వివాహం, ఇద్దరు కుమార్తెల వివాహములు మాధవరావుగారు తనచేతుల మీదుగా జరిపించినారు. ఆ తరువాత హైదరాబాదులోని కుమారైను కుమారుని చూసుకొని మద్రాసులో నున్న పెద్ద కుమార్తె దగ్గరకు వెళ్లిరి. అప్పడు మాధవరావు గారు జమలాపురం కరణీకం చేస్తూనే ఉన్నారు. ఏ వ్యాధిలేకుండానే 1983 జనవరి 18వ తారీఖున స్వర్గస్థులయినారు. ఆయన చనిపోయిన తరువాత మిగిలిని ఇద్దరు ఆడపిల్లల పెళ్లిళ్ళు ఆయనకుమారులు జరిపించిరి.

జమలాపురపు మాధవరావుగారి భార్య అయిన లక్ష్మినరసమ్మగారు 1999 జనవరి 9వ తారీకున స్వర్గస్థులయినారు.

# చంద్రమౌళీశ్వరా! స్వామి! శరణు! శరణు!

1. ఎఱ్ఱుపాలెంబున వేంచేసియున్నట్టి
చంద్రమౌళీశ్వర శరణు శరణు
భవ బంధములన్ని బాగుగా ద్రెంపెడు
చంద్రమౌళీశ్వర శరణు శరణు
కామితార్థంబులు కలుగజేయుచునుండు
చంద్రమౌళీశ్వర శరణు శరణు
భక్తుల కోర్కెతో బాలించుచుండెడి
చంద్రమౌళీశ్వర శరణు శరణు
ఆడరానట్టి దుర్భాషలాడినాడ
చేయరానట్టి దుష్కృతుల్ చేసినాడ
ఎటుల బ్రోతువో నన్ను ఈ కుటిలమతిని
చంద్రమౌళీశ్వరా స్వామి శరణు శరణు

2 పాశుపతాస్త్రంబు భక్తుని కీయంగ
పందికై దెబ్బల బడితివీవు
లోకంబు రక్షింప పాకారి వేడంగ
పొంగెడు గరళంబు మింగినావు
గంగను మోహించి గట్టిగా బంధించి
ఉత్తమాంగంబున నుంచినావు
అఖిలాండసృష్టికి ఆద్యుండనని తెలిపి
బ్రహ్మవిష్ణుల భ్రాంతి బాపినావు
-ఇట్టి దిట్టడ వెట్లేగితయ్య నీవు
మోహినీ రూపముంజూచి మోహమంద
బాణునింటిలో బంటౌట పాడియగునె
చంద్రమౌళీశ్వరా స్వామి శరణు శరణు

2 పార్వతీపతి నిన్ను భజన చేయుగమన్న
చిత్తంబు నీమీద చేరదాయె
గంగాధరా నీదు ఘనత కాంచెదమన్న
చిత్తంబు నీమీద చేరదాయె

కరుణామయా నీలో కలసిపోదామన్న
చిత్తంబు నీ మీద చేరదాయె
అపమృత్యుహరుడ! నిన్న ర్చించుదామన్న
చిత్తంబు నీమీద చేరదాయె
- ఎన్ని జన్మలకైనను నిన్ను వీడ,
నాదు నిశ్చయ మిది సుమా నాగభూష
తప్పకొనుటకునీ కింక తరము కాదు
చంద్రమౌళీశ్వరా స్వామి శరణు శరణు

4. నన్నిలన్ బుట్టించి నాటకమాడంగ
నీ వొందు ఫలమేమి నీలకంఠ
నీమీద బుద్ధిని నిలువకుండగ జేసి
శ్రమలు పెట్టెదవేమి శంకరుండ.
దీనబాంధవ నీవె దిక్కని వేడితి
కాపాడ వది యేమి గడుసుదనము
భక్తుల మొరలను పాలింపకుంటివా
ధరలోన నీకీర్తి తగ్గిపోవు.
- నిన్ను జూచిన పాపముల్ నిలువవందు
పెద్దలందరు చెప్పిరి పేర్మిమీర
మ్రొక్కుచుంటిని నీకు. నామొరలు వినుము
చంద్రమౌళీశ్వరా స్వామి శరణు శరణు.

5. పుడమిలోనున్నట్టి పుణ్యతీర్థాలను
చరియింప నలసత సల్పినాడ.
సత్యంబునకు విల్వ జాలకుండగజేసి
అనృతభాషణముల నాడినాడ.
పొట్టకూటికిగాను పొరుగు వారల సొమ్ము
కాసించి శీలంబు కాల్చినాడ
కామినీజనులను కాంక్షించి ధరలోన
చేయరాని పనులు చేసినాడ.
పుణ్యకార్యంబులందు నాబుద్ధిపోదు.
- తత్వచింతన చేయంగ దారిలేదు.
నన్ను దయతోడ బ్రోవు మీ కన్నతండ్రి
చంద్రమౌళీశ్వరా స్వామి శరణు శరణు.

6. మంత్రరాజమ్మును మది నిల్పుదామన్న
సంసార బంధముల్ సాగనీవు.
భక్తులందరితోటి భజన చేయుదమన్న
సంసార బంధముల్ సాగనీవు
ఉపవాసదీక్షల నుండి, చూచెదమన్న
సంసార బంధముల్ సాగనీవు.
తీర్థయాత్రలు చేసి తిరిగి వచ్చెదమన్న
సంసార బంధముల్ సాగనీవు.
- ఎందులకు జన్మవచ్చెనో యెరుగరాదు
తేలికగు మోక్షమార్గంబు తెలియదాయె.
ధరణి తరియించు మార్గమేదయ్య నాకు
చంద్రమౌళీశ్వరా స్వామి శరణు శరణు.

7. చంద్రమౌళీశ్వర శరణు జొచ్చితి నన్ను
కాపాడి మన్నించు కరుణతోడ.
కాశీపతీ నాదు కామితంబులు దీర్చి
కాపాడి మన్నించు కరుణతోడ
శ్రీ భవానీపతీ శ్రీఘ్రంబుగా నన్ను
కాపాడి మన్నించు కరుణతోడ
నాగేంద్రభూష నన్నాదరముతోనేలి
కాపాడి మన్నించు కరుణతోడ.
-భక్త జనులను రక్షించు ప్రభుడవీవు.
అవనిజనులను కాపాడునయ్య వీవు
దేవ దేవుడవీవని తెలిసికొంటి
చంద్రమౌళీశ్వరా స్వామి శరణు శరణు.

8. భక్తుల కోరికల్ బాగుగా గమనించి
కాపాడి బ్రోచిన ఘనుడవీవు.
రావణాసురు మొర దయమున గుర్తించి
కాపాడి బ్రోచిన ఘనుడ నీవు.
భస్మాసురుని మొరల్ బాగుగా గమనించి
కాపాడి బ్రోచిన ఘనుడవీవు

కన్నప్ప అందించు కలికుట్లు దిగమింగి
కాపాడి బ్రోచిన ఘనుడవీవు.
-భక్తజనులను రక్షించు ప్రభుడవీవు.
అవని జనులను కాపాడు - అమ్మనీవు
దేవదేవుడవీవని తెలిసికొంటి
చంద్రమౌళీశ్వరా స్వామి శరణు శరణు.
9. చంద్రమౌళీశ్వరా శరణంటిరా నిన్ను.
కాపాడుమయ్యా యో కంబుకంఠ
నీలకంఠా నిన్ను నేర్పుతో భజియింతు
నేరముల్ మన్నింపు మురగభూష.
ఫాలనేత్రా నన్ను పాలింపుమయ్య నా
పాపముల్ దయతోడ బాపుమయ్య
శంకరా నీవు నావంకను దయజూచి
కాపాడగలవని కాచియుంటి.
- దీనరక్షక నీవె నా దిక్కటంటి
లేడు దైవంబు నీకంటె లేడటుంటి
శరణు శరణంటి అమ్మల చేరనంటి
చంద్రమౌళీశ్వరా స్వామి శరణు శరణు
10. పార్వతీపతి! నిన్ను పరిపాలనము చేయ
పాదంబు బట్టితి పరమపురుష
కాత్యాయనీ నాథ! కరుణించి రక్షింప
పాదంబు బట్టితి పరమపురుష.
గంగాధరా! నాదుకష్టముల్ వారింప
పాదంబు బట్టితి పరమపురుష.
శ్రీ భవానీధవ! చిత్తశుద్ధిని జేయ
పాదంబు బట్టితి పరమపురుష.
- నీదు చరణములను నమ్మి నేనుయుంటి
ఇతరులెవ్వరు దిక్కులేరింక నాకు
ఏల బ్రోచెదో నేను నీపాల బడితి.
చంద్రమౌళీశ్వరా స్వామి శరణు శరణు.

11. మూఁడు కన్నులు దాల్చి ముజ్జగమ్ముల నేలు

మోహినీ భర్త - ఓ మోహనాంగ.

నెత్తిపై గంగను నేర్పుమై యుంచియు

కాలకూటము తిన్న గరళకంఠ.

గళమందు రుద్రాక్ష కాకోదరంబులన్

భూషించుకొన్న - ఓ భూతనాథ

ఇరువురి భార్యల మురిపెంబు పెనగొన

పాలించుచుండిన ఫాలనేత్ర.

-వెండికొండను నెలకొని యుండి నీవు

ఆర్తులను బ్రోచుచుందువు ఆమలచరిత

మాదు మొరలను విని మమ్ము మనుపుమయ్య.

చంద్రమౌళీశ్వరా స్వామి శరణు. శరణు.

12. కన్నులు మూఁడగల్గి మము కావగ యుండిన వేల్పు

-మిన్న మా

మన్నన నొంది బ్రోచుటకు మాన్యుఁడ నీవని

-వింటి మయ్య నీ

కన్ననులేదు దిక్కు భువి గానగ నెంతటి

- వారికైన మా

కన్నులపండుగా నటుల కన్పడి బ్రోవు

- గదయ్య ఈశ్వరా.

---

పెద్దల వాక్కులు విందులు కావు, మందులు.

విందులలో ఏ పదార్థమునైనా వదలి వేయవచ్చు.

కానీ భవరోగాన్ని నివారించే మందు అడుగు

పట్టినా అందులో నీరు పోసి త్రాగాలి.

వాక్య విభూతి

# 29. పట్టుదలకు మారు పేరు - మన పెద్దవెంకట్రామారావు గారు

- జమలాపురపు గోపాలకిషన్ రావు



'సర్దార్' జమలాపురం కేశవరావుగారు తల్లిదండ్రులు వెంకట నర్సమ్మ, పెద్ద వెంకట్రామారావుగార్లు వెంకట్రామారావుగారికి పెద్దకుమారుడు మార్కండేశ్వరరావు గారు, రెండవ కుమార్డు పెద్ద వెంకట్రామారావుగారు. వెంకట్రామారావుగారిని పెద్ద తండ్రి సుబ్బారావుగారికి దత్తు ఇచ్చారు.

పెద్ద వెంకట్రామారావుగారు అజానుబాహువు. స్ఫుర ద్రూపి. బంగారు మేను ఛాయ. గంభీరమైన కంఠం. ఆరు ఊళ్ల కరిణీకం చేశారు. నిజాం ప్రభుత్వ దాష్టీకం చూశారు. దాని అంతం చూశారు. నిజాం పరిపాలన అనంతరం కూడా కరిణీకం చేశారు. ఎంతటి వత్తిడి కలిగినా నిజాం ప్రభుత్వంలో కరిణీకం వదిలిపెట్టకుండా రజాకార్ల హడావుడిలో తన ఉద్యోగ ధర్మాన్ని విడువకుండా కరిణీకపు దస్తరాలను జాగ్రత్త చేశారు. తనకు యిష్టం కాని ప్రభుత్వమైనా బాధ్యతను విస్మరించలేదు.

తన కుమారులు కేశవరావు, నారాయణరావు, మాధవరావుగా చిన్నతనంలోనే రామారావుగారికి భార్య వియోగం కలగటంతో రెండవ వివాహం చేసుకొనక తప్పలేదు.

గ్రామంలో గ్రామాధికారిగానే కాక గ్రామంలో పెద్దగా, గ్రామానికి తల మానికంగా భాసించారు. పెత్తండ్రి రామారావుగారి కుమారుడు వెంకట కిషన్‌రావు తనకంటే పెద్దవాడు కావటం వల్ల అన్నగార్కి అండగా వుండేవారు. వెంకటకిషన్‌రావు గారు చనిపోయిన తరువాత అన్నగారి కుమార్డు రామనరసింహారవు గార్ని, తన సొంత అన్నగారు మార్కండేశ్వరరావు గార్కి, వారి కుమార్లు వెంకట్రావు, శేషగిరిరావు గారు, లక్ష్మీనరసింహారావు గార్కి వారి కుంటుంబానికి కుటుంబ పెద్దగా బాధ్యత వహించారు.

తన పెద్ద కుమార్డు కేశవరావుగారు, తన అభీష్టము మేరకు చదువు (బి.ఏ) పూఇర్తి చేయలేదని, అయినప్పటికి వివాహం చేసి ఉద్యోగంలో పెట్టినప్పటికి ఆ ఉద్యోగం కొనసాగించలేదని ఎంతో వెనుక వహించారు. నూరు ఎకరాల ఆసామి అయివుండి, అన్నపానాలకు తరతరాలు తిన్నప్పటికి తరగని ఆస్తి వున్నా ఒక 'రాగి గవ్వ' యివ్వనని భీష్మించుకు కూర్చున్నారు.

కేశవరావుగారు తన ప్రవృత్తి రీత్యా 'హైదరాబాద్ రాష్ట్ర దాస్య విమోచనం' కోసం వృత్తిని లెక్కచేయలేదు. తండ్రి మాట కాదనక తప్పలేదు. ఉద్యోగాన్ని వదలి ఉద్యమంలో ప్రవేశించారు.

ఈ పరిస్థితులో కుమార్డు కేశవరావుగార్కి నచ్చ చెప్పలేక ఎక్కడ ఆస్తీ పాస్తులు అందిస్తే కూడ దక్కించుకోలేడని ఆర్థిక నిర్బందం చేశారు.

వెంకట్రామారావుగారు ద్వితీయ వివాహం చేసుకున్నా భార్య వియోగం తప్పలేదు. రెండవ కుమార్డు చిన్న నారాయణరావుగార్ని చిన్నతనంలోనే దత్తు యిచ్చారు. మూడవ కుమార్డు మాధవరావుగారు తండ్రి అండగా భార్య పిల్లలతో యింటి పట్టున ఉండి తండ్రి కరిణీకపు లెక్కలలో చేదోడు వాదోడుగా వుండటం ఆయనకు కొంత ఊరట కలిగింది.

పెద్దరామారావుగారు తన పెద్ద కుమార్డు కేశవరావుగారు ప్రమాద పరిస్థితిలో వున్న వార్త విని నిలువునా నీరై, నిరా గుండె పడ్డారు. కొడుకును చూడటానికి ఎఱ్ఱుపాలెంలో రైలు ఎక్కటానికి కూడ శక్తి లేక ప్రక్క వాడ్ల సహాయంతో రైల ఎక్కవలసి వచ్చింది.

తన కంటే చిన్నవాడు, పెద్దకుమారుడు 'తెలంగాణా కేసరి', 'సర్దార్' గా పేరుపొందిన గట్టంత కుమార్డు కళ్ల ఎదుట చనిపోవటం ఆయన హృదయం చలించింది. కేసవరావుగారి 'కర్మకాండలు' పూర్తిఅయిన సందర్భంలో పలువురు తన ఎదుట తన కుమారుడిని శ్లాఘించటం, తను పట్టిన పట్టు వ్యర్థమైనందుకు కావచ్చు కుమార్డు పోయిన దుఃఖమే కావచ్చు హృదయమనే సాగరం చెలియలి కట్ట దాటింది. సాగరం ఎప్పుడు ఒడ్డును దాటదు. అంటే చలియలి కట్టదాటదు కాని ఆయన హృదయం అంచులు దాటింది.

ఆనాటి 'సంతాప సభ'లో అందరి ముందు తన ఆ వేదన వ్యక్త పరిచాడు. కొడుకు మీద ప్రేమ లేదనుకున్న వాదందరికి ఆయన మనస్సు అర్థమయింది. ఆయన ప్రేమ ఎంత నిగూఢమైందో అప్పడు తెలిసింది. అందరి మనస్సులో పెద్ద వెంకట్రామారావుగారు ఎంతటి ఉన్నత వ్యక్తో అప్పడనిపించింది.

కాని అప్పటికే ఆయన జీవితం పరిసమాప్తం అయింది. కొడుకు పోయిన 13వ రోజునే ఆయన చనిపోవటం అందర్నీ ఆశ్చర్యపరచింది. విధిని ఎవరూ తప్పించలేరు కదా !

పెద్ద వెంకట్రామారావుగారు 70 సంవత్సరాలు పైబడి జీవించారు.

---

+++

# 30. కీ.శే. జమలాపురపు మార్కండేశ్వరరావుగారి కుటుంబము

- శ్రీ జమలాపురపు రామేశ్వరరావుగారు, ఎఱ్ఱుపాలెం

కీ.శే. జమలాపురపు మార్కండేశ్వరరావు గారు మా చిన్నతాతగారు. మా తాతగారికి స్వంత తమ్ముడు కాకపోయినా స్వంత సోదరుని కన్నా ఎక్కువ ప్రేమ అభిమానములు చూపుతూ ఎనలేని అన్యోన్యము గౌరవము చూపేడివారట. వారి యవ్వన దశను నేను అంతా బాగా ఎరుగను. వారి వృద్ధాప్య దశనే, నేను బాగా ఎరుగుదును. మా స్వంత తాతగారైన జమలాపురపు వెంకటకిషన్‌రావుగారి వద్దకు తరచూ వస్తూ వుండేడివారు. వారికి నలుగురు కుమారులు. నలుగురు కుమార్తెలు. పెద్దవారు వెంకటరావు గారు రెండవవారు శేషగిరిరావు గారు, మూడవవారు లక్ష్మీ నరసింహారావు గారు (బుల్లిబ్బాయి గారు), నాల్గవవారు రాజారావు గారు.

## 1. కీ.శే. జమలాపురపు వెంకటరావుగారు :

ఈయనగారు లాయరు పరీక్ష పాస్ అయి వరంగల్‌లో చాలా కాలము న్యాయవాదిగా పనిచేసినారు. కొంతకాలమయిన తరువాత న్యాయవాద వృత్తి మానుకొని ఎఱ్ఱుపాలెం గ్రామంలో వుండి వ్యవసాయం చేయించు కొనుచూ మా అందరికి ఎంతో అండదండగా వుండేవారు. వారి సలహా మేరకే నేను వదవిని చేవట్టటం ఎఱ్ఱుపాలెం గ్రామాధికారి జరిగింది. ఆయనకు ఒక కుమార్తె కుమారుడు కుమారుడు చిరంజీవరావు. కుమార్తె వివాహం ఆయన యింటివద్దనే ఎఱ్ఱుపాలెం గ్రామంలో డా. మాదిరాజు సుధాకరరావు గారికిచ్చి చేసినారు. ఆయన మంచి స్థూలకాయుడు. ఆరు అడుగుల ఎత్తుగల మనిషి చాలా మంచి ఆరోగ్యము కలవారు. అయినా విధి తప్పించుకొనుట ఎవరి తరము కాదు. ఆయన షుమారు 50వ సంవత్సరములోనే చనిపోయినారు.



## 2. కీ.శే. జమలాపురపు శేషగిరిరావుగారు :

వీరు మంచి బలశాలి. ఆరు అడుగుల ఎత్తు వుండేవారు. మంచి వ్యవసాయవేత్త. అన్నదమ్ములు విభాగములు కాకపూర్వము మొత్తం భూమి అంతయు ఆయనే వ్యవసాయము చేయించేవారు. జమలాపురం గ్రామమునకు ఆయన మాలి పోలీస్ పటేటు (మునసబు) గా పనిచేసేవారు. ఆయనగారు జమలాపురం గ్రామమునకు ప్రతిదినము పోయేవారు. వారికి పటేలు ఉద్యోగమేకాక ఎక్కువ భూమి జమలాపురం గ్రామంలో వుండేది. అందువలన ఆయన కాలినడకనే ఆ గ్రామమునకు చేరుకొనేవారు. ఆయన ఎక్కువగా పచ్చిపోక చెక్కలు నవలటం నాకు ఈరోజు వరకు మరపురానిది. ఈయనగారికి ఒక కుమార్తె. ఒక కుమారుడు. కుమార్తె వివాహం తిరుపతిలో చేశారు. కుమారుని బి.యస్.సి వరకు చదివించారు. ఆయన షుమారు 55 సంవత్సరములకే మరణించారు. ప్రస్తుతం ఆయన కుమారుడు విఠల్‌రావు వరంగల్లులో 'వార్త' దినపత్రికలలో సబ్ ఎడిటర్‌గా పనిచేయుచున్నాడు.

## 3. శ్రీ జమలాపురపు లక్ష్మీ నరసింహారావుగారు (బుల్లెబ్బాయిగారు) :

ఈయన ఆరుఅడుగుల మనిషి. అందంగా నాజూకుగా ఉండే మనిషి. ఈయన నాకు అతిసన్నిహితుడు. నాకంటే సుమారు 10, 12 సంవత్సరములో మాత్రమే పెద్ద. నాకు పినతండ్రి అయినా మేమిద్దరము స్నేహితులుగా వుంటాము. ఈ స్నేహంవలన నేను ఆయన స్వంత వ్యవహారములలో తలదూర్చే వాడిని. ఆయనను మూడు పర్యాయములు నా స్వంత చొరవతో ఒత్తిడిచేసి జమలాపురపు వారి కుటుంబ ప్రతిష్ఠకోసం గ్రామ సర్పంచ్‌గా గెలిపించటం జరిగింది. ఆయనగారే కాక ఆయన భార్య కమలమ్మగారంటే మాపిన తల్లిగారు మరియు వారి ఏకైక కుమారుడు భాస్కరశర్మగాని నన్ను ఎంతో అప్యాయంగా చూడటం నన్ను వారి కుటుంబ సభ్యులలో ఒకరిగా చూడటం వారి కుటుంబము వారిని నేను ఎప్పుడు మరువలేని బాధ్యత. వారు వారి బాధ్యతను పంచాయితి సర్పంచుగా గ్రామానికి ఎనలేని సేవచేసి గ్రామంలో నా వ్యక్తిత్వము నా మీద గ్రామస్థులకు అభిమానము పెంచిన ఏకైక వ్యక్తి ఈయన. ప్రస్తుతము ఆయన కుమారుడు భాస్కరశర్మ ఉద్యోగ రీత్యా వరంగల్లులో నివశించుచున్నారు. వారి సేవలు ఫలితంగా వారు ఎఱ్ఱుపాలెం గ్రామమునకు వస్తే చాలా గౌరవంగా చూస్తారు. ఆయన తరువాత ఎఱ్ఱుపాలెం గ్రామ అభ్యున్నతికోసం మరల నా తమ్ముడు జమలాపురపు

వెంకటకిషన్‌రావు గ్రామ రాజకీయములలో పాల్గొని సర్పంచుగా ఎన్నిక అయినాడు. మేము ఎఱ్ఱుపాలెం గ్రామమునకు నేను గ్రామ పరిపాలనాధికారిగా కాక, గ్రామ సర్పంచులుగా కాక మా కుటుంబ సభ్యులలో ఒకరు పెద్ద భూస్వామి అయిన జమలాపురపు సూర్యనారాయణరావు గారు భాగ్యమంతుడు, నిస్సంతువు అయిన కారణంగా ఆయన తమ స్వంతము సుమారు 50 సంవత్సరముల పూర్వము ఎఱ్ఱుపాలెం గ్రామంలో హైస్కూలు లైబ్రరీ దేవాలయ పునర్నిర్మాణము, సత్రశాల వగైరా భవనములకు విరాళమిచ్చి తన ధర్మ గుణమును చాటుకొని చిరస్థాయిగా వారి పేరును సిలబెట్టుకొన్న ఘనతవారికే దక్కింది. అదేవిధముగా జమలాపురపు సీతారామయ్యగారు తాను స్వంతముగా ఎఱ్ఱుపాలెం గ్రామంలో శివాలయం నిర్మించి తన స్వంత భూమి 42 ఎకరములు దేవుని పేరు పెట్టి తాను ఎప్పుడు అనుకుంటే అప్పుడు తనతో మాట్లాడే శక్తిసంపన్నుడు. ఈ విధంగా జమలాపురపు కుటుంబము వారు గ్రామమునకు అనేక విధములుగా అభివృద్ధి పనులతో సహకరించి గ్రామమునకు సేవచేసినారు.





చిత్రం :
బండారు వెంకటకృష్ణ
విజయవాడ

# VI వ, శాఖ
## పాపరాజు (4వ, తరము నుండి)

| వరుసలో క్రమసం. | తరము | పేరు | పుట్టిన తేది | విద్యార్హత | వృత్తి | ప్రస్తుత చిరునామ | వివాహ సంబంధం |
|---|---|---|---|---|---|---|---|
| 1 | 4 | పాపరాజు | | | | | |
| 2 | 5 | 1) పెద్ద వీరేశం | | | | | |
| 3 | 6 | సింహాచలం | | | | | |
| 4 | 7 | 1) వెంకట్రామయ్య | | | | | |
| 5 | 8 | 1) వెంకట రమణయ్య<br>భార్య సూరమ్మ | | | | | |
| 6 | 9 | 1) గోపాల్‌రావు<br>భార్యలు<br>1) ________<br>2) ________ | | | | | |
| 7 | 5 | 2) వెంకట్రామయ్య<br>భార్య<br>తిరుపతమ్మ | 1888<br><br>1898 | - | కరణం | మోటుమఱ్ఱి | చంద్రపాటి శ్రీ వెంకట — పిచ్చమ్మ గార్ల కూతురు |
| 8 | 10 | సత్యనారాయణ<br>భార్య<br>పద్మావతి | 1947<br><br>1.7.48 | H.Sc | Store keeper A.P.SEB ఏలూరు | మోటుమఱ్ఱి | |
| 9 | 11 | 1) చంద్రమౌళేశ్వరరావు<br>భార్య<br>ఝాన్సీలక్ష్మీ | 1.7.65<br><br>1967 | Inter Ele.Dept.<br>Inter | ప్రైవేటు ఎలక్ట్రీషన్ Hyd. | Plot No.65 శారదానగర్ కనస్థళిపురం, హైదరాబాద్ పంచముఖ అంజనేయస్వామి గుడివెనుక | శ్రీ మాదిరాజు రామరావు — |
| 10 | | 1) హరీష్‌కుమార్ | 1987 | 7th | | | |
| 11 | | 2) సతీష్‌కుమార్ | 1988 | 6th | | | |
| 12 | 11 | 2) వసంతకుమార్<br>భార్య సీత | 19.3.69<br>19.3.70 | 10th<br>T.V.Diplama | ప్రైవేటు మెకానిక్ | మోటుమఱ్ఱి | శ్రీ ఏటూరి — బోసకల్లు |
| 13 | 12 | సాయిభార్గవ్ | - | | | | |
| 14 | 11 | 3) హనుమంతరావు<br>భార్య వాణి | 1.7.73 | 10th | ప్రైవేటు ఎలక్ట్రీషన్ | | శ్రీ ఊటుకూరి వెంక రావుగారు — ________ గా షష్టి కుమార్తె ఖమ్మం |

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 8 | 10 | శ్రీ జమలాపురపు సత్యనారాయణగారి ఆడపిల్లలు | | | | | |
| | | 1) ఛాయారూపిణి<br>భర్త<br>మాదిరాజు శ్రీనివాసరావు<br>సాయిరాం<br>స్వాతి వైదేహి (కూతురు) | | | | | |
| | | 2) జానకి<br>భర్త<br>గొట్టి పర్తియోగానందం<br>కూతుర్లు | | | | | |
| 14A | 11 | 1) పావని | | | | | |
| 14B | | 2) లహరి | | | | | |
| 15 | 9 | 2) లక్ష్మీనారాయణరావు<br>భార్య వరలక్ష్మమ్మ | 1889<br>1898 | | మాలీ,<br>పోలీస్ పటేల్<br>కేసిరెడ్డిపల్లి | ఎఱ్ఱుపాలెం | శ్రీ చెవుటూరి<br>——<br>హరితస, చెవుటూరు |
| 16 | 10 | గోపాల్‌రావు<br>భార్య<br>సత్యావతి | 1925<br><br>1940 | 7th<br><br>6th | పోలీసు<br>ఫారెస్టు<br>గృహిణి | ఎఱ్ఱుపాలెం | శ్రీ — సుబ్బారావు<br>సత్తెనపల్లి |
| 17 | 11 | నాగార్జునరావు (అవి) | 1963 | Inter | ప్రైవేటు<br>గుంటూరు | గుంటూరు<br>బాడీపేట | |
| 18 | 10 | 2) కుటుంబరావు (అవి) | 1934 | 5th | | | |
| 19 | 10 | 3) నాగభూషణరావు<br>భార్య చంద్రావతి | 3.4.37<br>1959 | H.Sc<br>7th | Rtd Major<br>Irogation<br>N.S.P A.P<br>Work inspecter<br>Jaggayapet | 6-2-52<br>జమ్మిబండ<br>ఖమ్మం | శ్రీ పెగళ్లపాటి వెంక<br>టేశ్వరరావుగారు,<br>మధురమ్మ గార్ల<br>పెద్ద కూతురు<br>ఆతుకూరు |
| 20 | 11 | వైకుంఠేశ్వరరావు<br>భార్య అనిత<br>ఆడపిల్ల<br>జ్యోతి | 19.8.67<br>1974<br><br>12.4.96 | | టెలిఫోన్<br>డిపార్టుమెంట్<br>టెంప్రరీజాబ్ | 5-2-521<br>జమ్మిబండ<br>జ్యోతిబాల<br>మందిరం<br>వెనుకగేట్ | శ్రీ ధర్మవరపు శంకర<br>రావుగారు లక్ష్మిగార్ల<br>కుమార్తె అంజనీపురం<br>గోత్రం భారద్వాజస<br>హుజూర్‌నగర్ |
| 19 | 10 | శ్రీ జమలాపురపు నాగభూషణరావుగారి ఆడపిల్లలు | | | | | |
| 20A | 11 | 1) రుక్మిణి<br>భర్త గుండవరపు<br>నరసింహరావు<br>1) సంతోస్‌కుమార్<br>2) హరిశంకర్<br>3) షణ్ముఖ శ్రీనివాసరావు | 6.10.64<br><br>1961<br>1985<br>1986<br>1986 | B.A<br><br>10th<br>10th<br>9th<br>8th | <br><br>బిజినెస్<br>చదువు<br>"<br>" | 11.22.122<br>వరంగల్<br>కొత్తవాడ | శ్రీ గుండవరపు<br>నరహరిరావుగారు,<br>మదనమ్మగార్ల<br>కుమార్తు<br>సత్తెనపల్లి<br>కౌండిన్యస |

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 20B | | 2) వరలక్ష్మి<br>భర్త ర్యాలి శ్రీనివాసరావు<br>1) సాయికుమార్<br>2) రామసాయికుమార్ | 6.6.71<br>1968<br>1993<br>1997 | <br><br>2nd<br>1st | <br>సినిమా<br>ఆపరేటర్<br>కోదాడ | | శ్రీ ర్యాలి రాబన్<br>---------<br>కోదాడ. కౌండన్యస |
| 20C | | 3) సత్యావతి<br>భర్త మోచర్ల వెంకట<br>దుర్గాప్రసాద్<br>ఆడపిల్లలు<br>1) చంద్రకళ<br>2) మోహిని | .10.73<br><br><br><br>1994<br>1996 | <br><br><br><br>1st<br>L.K.G. | క్లర్కు<br>ప్రైవేట్ కాలేజ<br>సత్తుపల్లి | N.T.R<br>colony<br>H.No.13-114120<br>సత్తుపల్లి | |
| 20 | | 4) కృష్ణవేణి<br>భర్త నారపురాజు<br>లక్ష్మీనరసింహారావు<br>వెంకట సీతారామ<br>చంద్రరావు | 1977<br><br>1973<br><br>1997 | Inter<br><br>డిప్లమో<br>ఇంజనీరు | <br>Jr. A<br>stribad<br>welfare<br>సూర్యపేట | <br>శ్రీనివాస<br>నగర్<br>కోదాడ | శ్రీ నారపురాజు సీతా<br>రామచంద్రరావు<br>గారి కుమార్తు, తమ్మర<br>ఆత్రేయస, కోదాడ |
| 21 | 10 | 4) రామకిషన్‌రావు<br>భార్య రమాదేవి | 1939<br>24.12.49 | H.S.C | workInsp.<br>N.S.P. | నేలకొండపల్లి<br>N.S.P.O & M | శ్రీ ఊటుకూరి<br>రామకృష్ణారావు |
| 22 | 11 | జానకి రమారావు (అవి) | 22 | Inter | | వైర్‌లెస్‌సెక్షన్<br>ఆపరేటర్ | గారి కూతురు |
| 22A | | ఆడపిల్లలు<br>1) వరలక్ష్మి<br>భర్త గడ్డమడుగు<br>మాధవరావు | <br>20.1.71<br>1963 | <br>10th<br>Inter | <br><br>ప్రైవేటు<br>జాబ్ | 4.2.75/2/.<br>బెస్తకాలనీ<br>శ్రీనివాసనగర్<br>ఖమ్మం-3 | శ్రీ గడ్డమణుగుసత్య<br>నారాయణరావు<br>స్వరాజ్యలక్ష్మీగార్ల<br>కుమారుడు హరితస |
| 22B | | 2) ఉదయ<br>భర్త<br>ఊటుకూరి శ్రీనివాసరావు<br>ఆడపిల్లలు<br>1) ..........<br>2) .......... | 1972<br><br>1965 | 10th<br><br>10th | Income<br>Tax A/C<br>ప్రైవేటు | <br><br>ఖమ్మం | శ్రీ ఊటుకూరి<br>కిషన్‌రావుగారి<br>కొడుకు |
| 23 | 10 | 5) మార్కండేశ్వరరావు<br>భార్య రాధమ్మ<br>వరలక్ష్మి(కూతురు) | 15.8.45<br>14.1.50<br>12.8.93 | 6th<br>P.U.C | సూపరింటెండెంట్<br>D.L.P.Office<br>ఖమ్మం | <br>గోపాలపురం<br>ఖమ్మం | శ్రీ మాదిరాజు వెంకటేశ్వర<br>రావుగారి శ్రీరంగనాయ<br>కమ్మగార్ల కుమార్తె<br>ఆత్రేయస ఖమ్మం |
| 24 | 10 | 6) హనుమంతరావు<br>(అవి) | 1948 | | | | |

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 25 | 10 | 7) మాధవరావు<br>భార్య అరుణ | 6.6.49<br>20.4.61 | 16.11.405/15<br>Ph.4045221 | A.P.S.R.T.C<br>Hyd | Conductor<br>చార్మినార్ | శ్రీ చక్కిలం మిట్టపల్లి రామారావుగారి కూతురు |
| 26 | 11 | వంశీ వరప్రసాద్‌రావు | 28.10.80 | డిప్లమా ఇంజనీరింగ్ | చదువకొను చున్నాడు | బస్‌డిపో Staff No.85835 గౌలిగూడ డిపో | |
| 26A | | ఆడపిల్ల<br>1) కల్పన<br>భర్త<br>అవినాష్ మహత్‌పూర్<br>2) కవిత | <br>31.7.76<br><br>23.7.77<br>21.10.78 | <br>B.Sc.Comp<br>Electrical<br>Engineering<br>B.Sc.Comp | <br><br>Computer<br>Engineer<br>New Jersty | <br><br><br>U.S.A | శ్రీ దినకర్ మహత్ పూర్ అనూరాధ గార్ల కుమార్తె |
| 27 | 10 | 8) గోవిందరావు<br>భార్య లక్ష్మి | 1953<br>1956 | Inter<br>8th | Medicine<br>Irrigation | 6.2.52<br>పాక్‌బండ | ఊటుకూరు కిషన్‌రావుగారి |
| 28 | 11 | లక్ష్మీనారాయణ | 1978 | Inter<br>ప్రైవేటు | work Insp.<br>గార్లబంగాళా | KMP<br>జ్యోతిబాలమందిర్ | కూతురు |
| 28A | | ఆడపిల్ల<br>వరలక్ష్మి<br>భర్త<br>వనము నరసింహారావు వ్యాస్ | <br>1976<br><br>1997 | <br>10th<br>Inter | <br>ప్రైవేటు | <br>KMP<br>మామిళ్ల గూడెం | శ్రీ వనము పురుషోత్తమ రావు గారి కూతురు |
| 15 | 9 | కీ.శే. జమలాపురపు లక్ష్మీనారాయణగారి ఆడపిల్లలు | | | | | |
| 28B | 10 | 1) అనసూర్య<br>భర్త ఊటుకూరు సుబ్బారావు | 1924<br>1921 | 5th<br>S.S.L.C | <br>టీచర్ | 10.11.93/1<br>మామిళ గూడెం | శ్రీ ఊటుకూరి వెంకమ్మగారి పెద్ద కుమార్తె. కౌండిన్యస గోత్రం, కొమర |
| 28C | 11 | 1) నరసింహమూర్తి<br>భార్య సావిత్రి<br>1) సుబ్బారావు<br>2) ఆంజనేయులు<br>సుమలత (ఆడపిల్ల) | 25.8.46<br>15.1.58<br>26.1.84<br>11.2.86<br>27.3.82 | P.U.C<br>Inter<br>10th<br>9th<br>బి.యస్. కంప్యూటర్ | ఉపాధ్యాయుడు | <br>సుగ్గులవారి తోట.ఖమ్మం | శ్రీ కాటపాడు సీతా రామయ్య, పద్మావతి గార్ల పెద్దకుమార్తె కాసికన చేబ్రోలు |
| 28D | 11<br><br><br>12 | 2) రాఘవరావు<br>భార్య<br>సత్యవతి<br>సుబ్బారావు<br>ఆడపిల్లలు<br>1) కల్పన<br>2) అనూష | 1954<br><br>1957<br>9.2.83<br><br>6.1.82<br>5.10.84 | B.Com<br><br>B.A<br>10th<br><br>B.Com.BCA<br>9th | <br><br><br>చదువు | 10.1.93/1<br>మామిళ్ల గూడెం | శ్రీ కొండపల్లి వెంక ట్రామారావుగారు సుగుణమ్మగార్ల కూతురు |

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 28B | 10 | శ్రీ ఊటుకూరి సుబ్బారావుగారి ఆడపిల్ల | | | | | |
| 28E | 11 | లక్ష్మి<br>భర్త యల్లాప్రగడ<br>శేషచలపతిరావు<br>ఆడపిల్ల<br>అర్చన | 5.2.55<br><br>9.9.54<br><br>16.9.80 | M.A<br><br>B.Com<br><br>B.Sc<br>Computer | రిటైర్డ్ క్లర్క్<br>డి.ఇ.ఓ. ఖమ్మం<br>అనియత<br>విద్యాకేంద్ర<br>డైరెక్టర్<br>బ్రాంచ్<br>ఖమ్మం | 12వలైను<br>బంజారాహిల్సు<br>274-A<br>MLA Colony<br>Hyd-34<br>Ph:3393388<br>3318292 | శ్రీ యల్లాప్రగడ<br>అచ్యుతరామారావుగారు<br>శారదాదేవిగార్ల<br>కుమారుడు,బాపట్ల<br>నిజాంపట్నం<br>భారద్వాజస |
| 15 | 9 | కీ.శే. జమలాపురపు లక్ష్మీనారాయణగారి 2వ కూతురు | | | | | |
| 28F | 10 | 2) భాగ్యలక్ష్మి<br>భర్త బండారు<br>అచ్యుతరామారావు | 1954<br><br>24.6.49 | 5th<br><br>B.A | <br><br>Sr. Asst.<br>D.T.O.<br>Khamm. | <br><br><br><br>ఖమ్మం | శ్రీ బండారు విశ్వనాధం<br>గారు, సరస్వతమ్మ<br>గార్ల దత్తు కుమార్డు<br>శ్రీ బండారు పురు<br>షోత్తమరావుగారు,<br>సుశీలమ్మ గార్ల<br>2వకుమార్డు.<br>మధిర, ఖమ్మంజిల్లా |
| 28F | 10 | శ్రీ బండారు అచ్చుత రామారావుగారి ఆడపిల్లలు | | | | | |
| 28G | 11 | 1) నాగుమణి<br>భర్త<br>గంజాం శ్రీనివాసరావు<br>(నిస్సంతు) | 11.8.69<br><br>1964 | 10th<br><br>Deploma<br>Engineer | <br>A.P. ఆగ్రో<br>ఇండస్ట్రీస్<br>సబ్‌డివిజన్<br>మెకానిక్ | <br>గోపాలపురం<br>హనుమకొండ | శ్రీ గంజాం సాంబ<br>శివరావు —<br>———<br>బాపట్ల |
| 28H | 11 | 2) వరలక్ష్మి<br>భర్త షహమీర్<br>వినోద్‌కుమార్<br>1) హరి<br>2) శ్రీనివాస్<br>ఆడపిల్ల<br>సంతోషిణి | 31.12.70<br><br>1966<br>1993<br>1995<br><br>1993 | Inter<br><br>B.Com | Typest<br>Teliphone<br>వైరా | | |
| 28I | 11 | 3) దివాకరిణి<br>భర్త<br>మల్లెం శ్రీనివాసరావు | 12.9.73<br><br> | M.A<br><br>M.A | లెక్చరర్<br><br>Accountant<br>ప్రైవేట్‌కాలేజి<br>ఖమ్మం | | శ్రీ మల్లెం రామారావు<br>గారు ———<br>గార్ల కుమార్డు.<br>ఖమ్మం |

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 28J | 11 | 4) ఉదయ<br>భర్త<br>పర్సా ఫణిదర్ కుమార్ | 17.2.77 | B.A<br>B.E.<br>Electrance | చదువుతున్నది | రోటరీనగర్<br>S.రాధాకృష్ణ<br>కాలనీ,KMT | శ్రీ పర్సా రామారావుగారు.<br>తాయారమ్మగార్ల<br>కుమార్తె KMT<br>కౌండిన్యస |
| 5 | 8 | కీ.శే. జమలాపురపు వెంకటరమణయ్యగారి ఆడపిల్లలు | | | | | |
| | 9 | 1) లచ్చమ్మ<br>భర్త గడ్డమడుగు<br>---------- | | | | శాయిరి<br>నూకరి | |
| 28K | 10 | కుటుం బరావు<br>భార్య<br>తిరుపతమ్మ | | | | | శ్రీ ఆదిరాజు ____<br>నందలూరు<br>ఫోన్ : 27128 |
| 28L | 9 | 2) పిచ్చమ్మ<br>భర్త చందర్లపాటి<br>వెంకటప్పయ్య | | | | | |
| 28M | 8<br>9 | ఆడపిల్ల<br>తిరుపతమ్మ<br>భర్త జమలాపురపు<br>వెంకట్రామయ్య | | | | | శ్రీ జమలాపురపు<br>వెంకట రమణయ్య<br>గారి 2వ కుమార్తె |
| 29 | 8 | 2) లక్ష్మీనరసయ్య<br>భార్య<br>అనంతమ్మ | 1892 | | మక్తేకేసి<br>రెడ్డిపల్లికి<br>రెండుపటేల్<br>గిరిలకు<br>అసలుదారు | ఎఱ్ఱుపాలెం | |
| 29 | 8 | 2) కీ.శే. జమలాపురపు లక్ష్మీనరసయ్య గారి ఆడపిల్లలు | | | | | |
| 29A | 9 | 1) వెంకమ్మ<br>భర్త ఊటుకూరి<br>సూర్యనారాయణరావు | | | | | కౌండిన్యస కోహిర<br>కృష్ణాజిల్లా |
| 29B | 10 | 1) సుబ్బారావు<br>భార్య<br>అనసూర్య | 1919<br><br>1922 | | | | శ్రీ జమలాపురపు లక్ష్మీ<br>నారాయణ, వరలక్ష్మమ్మ<br>గార్ల ప్రధమ పుత్రిక<br>ఎఱ్ఱుపాలెం |
| 29C | 10 | 2) కృష్ణమూర్తి<br>భార్యలు<br>1) ________<br>2) ________ | | | | | |

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 29D | 10 | 3) సత్యనారాయణరావు<br>భార్య ———<br>ఆడపిల్లలు | | | | | |
| | 11 | 1) ———<br>2) ———<br>3) ——— | | | | | |
| 29A | 9 | కీ.శే. ఊటుకూరి సూర్యనారాయణగారి ఆడపిల్లలు | | | | | |
| 29E | 10 | 1) శేషమ్మ<br>భర్త<br>పర్సా జగన్నాధరావు | 1925<br><br>1920 | | | | శ్రీ పర్సా సీతారామయ్య లక్ష్మీ నరసమ్మగార్ల కుమార్డు. గూడూరు |
| 29F | 11 | 1) వెంకటేశ్వరరావు<br>భార్య<br>నాగలక్ష్మి | 1946<br><br>1951 | | Co-operative Central Bank Cashier | ఖమ్మం | శ్రీ గొట్టుపర్తి సూర్య రావు గారు, కమ్మలమ్మ గార్ల కూతురు కామేపల్లి |
| | 12 | కిరణ్ | 1.3.75 | | | | |
| | | ఆడపిల్ల | | | | | |
| 29G | 12 | 1) శేషుకుమారి<br>భర్త<br>రాఘవేంద్ర | 16.9.69 | | మంజీరాబ్యాంక్ అశోక్‌నగర్ ప్రైవేటుకంపెనీ | | శ్రీ బారు రామారావు గారు, సత్యవతిగార్ల కుమార్డు, హైదరాబాద్ |
| | | గణేష్ భరద్వాజ | 10.9.98 | | | | |
| 29H | 12 | 2) భాను<br>భర్త<br>బయ్యకంగారు<br>శ్రీనివాస్<br>ఆడపిల్ల<br>గాయత్రి | 13.8.72 | | ప్రైవేటు నుగర్ ఫ్యాక్టరీలో ఉద్యోగం సంగారెడ్డి | | |
| 29I | 11 | 2) పర్సా నరసింహారావు<br>భార్య<br>విజయలక్ష్మి | 26.3.49<br><br>27.10.53 | B.Sc<br><br>H.S.C | A.P.E.C.B. ఖమ్మం | ఖమ్మం కోర్టుకు ఎదురుగా | శ్రీ కేసరాజు నరసింహా రావు సీతమ్మ గార్ల 4వ కూతురు కూసుమంచి |
| | 12 | జగదీష్ చంద్ర కశ్యప్<br>రూప (ఆడపిల్ల) | 31.12.74<br>12.11.76 | IIIy B.E<br>M.B.A | | | |
| 29E | 10 | కీ.శే. పర్సా జగన్నాధరావుగారి ఆడపిల్లలు | | | | | |
| 29J | 11 | అన సూర్యాదేవి<br>భర్త ఊటుకూరి<br>శ్రీరామచందర్‌రావు | 1945<br><br>1934 | | ముస్సిల్‌దారు | | శ్రీ ఊటుకూరి నరసింహా రావు గారు, సత్యమ్మగార్ల కుమార్డు |

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 29K | 12 | శ్రీనివాస చంద్రశేఖర్<br>భార్య<br>అనిత పద్మ<br>ఆడపిల్ల<br>ప్రణీత | 1967<br><br>1970<br><br>1997 | B.Com<br>L.L.B | | | మల్లికార్జు సాయి<br>గార్ల కుమార్తె |
| 29L | | 2) రామశేషజగదీస్<br>భార్య<br>వినిత<br>3) సతీష్ | 1971<br><br><br>1974 | | ప్రైవేట్<br>ఉద్యోగం | | |
| 29A | 9 | కీ.శే. ఊటుకూరి సూర్యనారాయణగారి 2వ కుమార్తె | | | | | |
| 29M | 10 | 2) సుబ్బమ్మ<br>భర్త ఆదిరాజు వెంకట<br>సుబ్బారావు | <br><br>1943 | డాక్యుమెంట్<br>రైటర్ కరణం<br>పండితాపురం | పండితాపురం<br>ఇల్లెందు (మం)<br>ఖమ్మంజిల్లా | | |
| 29N | 11 | 1) వెంకటేశ్వరరావు<br>భార్య<br>వరలక్ష్మి (సీతాదేవి) | | | జర్నలిస్టు | F. 8 షిర్డి<br>యపార్టుమెంట్స్<br>రాజభవనరోడ్<br>సోమాజీగూడ<br>హైదరాబాద్<br>ఫోన్ : 040-<br>3311035 | శ్రీ లింగమర్ల ఆది<br>నారాయణగారి<br>________<br>కూతురు భీమవరం |
| 29O | 12 | 1) సత్యనారాయణ<br>భార్య<br>________ | | | లాయర్ | | |
| 29N | 12 | 2) రఘురాం | | | టాటాస్ కంపెనీ | | |
| 29P | 12 | ఆడపిల్ల<br>రాజేశ్వరి<br>భర్త<br>దేవులపల్లి అజయ్ | | | | | |
| 29Q | 11 | సత్యనారాయణరావు (అవి) | | | | | |
| 29M | 10 | కీ.శే. ఆదిరాజు వెంకటసుబ్బారావుగారి ఆడపిల్లలు | | | | | |
| 29R | 11 | 1) లక్ష్మీబాయమ్మ<br>భర్త జమలాపురపు<br>రామమోహన్‌రావు | | | | | జమలాపురపు లక్ష్మణ<br>రావు,రాజ్యలక్ష్మీ గార్ల<br>పెద్దకుమారుడు<br>ఎఱ్ఱుపాలెం |

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 29S | 11 | 2) భారతి<br>భర్త<br>హరనాథ్<br>1) ______<br>2) ______ | | | | | |
| 29T | 11 | 3) శ్యామల (అవి) | | | | | |
| 29A | 9 | కీ.శే. ఊటుకూరి సూర్యనారాయణగారి 3వ కూతురు | | | | | |
| 29U | 10 | 3) సీత<br>భర్త<br>పర్సా రామారావు | | | | | |
| 29V | 11 | పర్సా హనుమంతరావు<br>భార్య<br>లక్ష్మీమంగతాయారు<br>1) వంశీకృష్ణ<br>2) రాహుల్<br>ఆడపిల్ల<br>ప్రత్యూష | 1956<br><br>1960<br>16.4.83<br>6.4.91<br><br>21.3.82 | B.Com<br><br><br>Ist B.A<br><br><br>II Inter | Accounts<br>Privete | ఖమ్మం<br>మామిళ్ల<br>గూడెం | శ్రీ పట్టిపల్లి హను<br>మంతరావుగారు<br>కమలమ్మ గార్ల<br>కూతురు అఘమర్షణ<br>విశ్వామిత్ర కౌసికస<br>(3) ఖమ్మం |
| 29W | 11<br><br><br><br>12 | 2) వెంకటేశ్వరరావు<br>భార్య<br>భాగ్యలక్ష్మి<br>ఆడపిల్ల<br>అనూష | 1950<br><br>1958<br><br>1992 | | | బైండింగ్<br>వర్క్<br>ఖమ్మం | శ్రీ విలగలేరు<br>కుటుంబరావుగారి<br>కూతురు ముచ్చర్ల |
| 29X | 11<br><br><br>12<br>12 | నరసింహారావు<br>భార్య<br>విజయలక్ష్మి<br>రామకృష్ణ<br>సాయిరాం | 1960<br><br>1962<br>1994<br>1995 | | | బైండింగ్<br>వర్క్<br>విజయవాడ | శ్రీ కొండపల్లి రఘు<br>రామారావుగారి<br>ఆడపిల్ల కల్హారు |
| 29Y | 11<br><br><br>12 | 4) తిరుమలరావు<br>భార్య<br>సుష్మ<br>1) ______<br>2) ______ | 1962<br><br>1964 | | | | |
| 29U | 10 | శ్రీ పర్సా సీతారామారావుగారి ఆడపిల్ల | | | | | |
| 29Z | 11 | శాంతకుమారి<br>భర్త<br>______ | | | | | |

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 29 | 7 | కీ.శే. జమలాపురపు లక్ష్మీ నరసయ్యగారి 3వ కూతురు | | | | | |
| 29a | 9 | 2) గౌరమ్మ<br>భర్త ఆదిరాజు<br>సాంబశివరావు | | | | | |
| 29b | 9 | 1) వెంకటేశ్వరరావు<br>భార్య<br>భారతి | 20.6.20<br><br>---.2.30 | | | | శ్రీ అడిదం సత్యనారాయణ రాజ్యలక్ష్మిగార్ల 5వ కుమార్తె భారద్వాజస |
| 29c | 10 | నాగేశ్వరరావు<br>భార్య<br>విజయ | | | | | శ్రీ గొట్టుపర్తి రామాచంద్రరావు సుబ్బమ్మ గార్ల కూతురు |
| | 11 | 1) రవికిరణ్<br>2) శశికాంత్<br>3) కాంతికుమార్ | 10.8.79<br>4.10.80<br>30.12.81 | | చదువు<br>"<br>" | | |
| 29d | 10 | 2) సూర్యనారాయణరావు<br>భార్య (దత్తు)<br>శారద | | | | | చెన్నాప్రగడ వారికి దత్తు వెళ్లెను. |
| 29e | 10 | ఉమామహేశ్వరరావు<br>భార్య<br>మనోరమ<br>సురేష్<br>ఆడపిల్ల<br>శిరీష | | <br><br><br>B.Com<br><br>B.A | పశువుల<br>హాస్పిటల్<br>ఖమ్మం | <br>ఖమ్మం | |
| 29d | | కీ.శే. చెన్నాప్రగడ సూర్యనారాయణరావుగారి ఆడపిల్లలు | | | | | |
| 29f | 10 | భారతి<br>భర్త జమలాపురపు<br>రాఘవరావు | 1954<br><br>17.11.50 | | | | శ్రీ జమలాపురపు లక్ష్మీపతిరావుగారి కూతురు నల్లగొండ |
| 29g | 10 | 2) కమల<br>భర్త ఈశ్వరప్రగడ<br>లక్ష్మణరావు<br>ఆడపిల్లలు<br>1) మాధవి<br>2) పద్మజ | | <br>AMIC | <br>గోదావరి<br>ఖని | | శ్రీ ఈశ్వర ప్రగడ గోపాల్‌రావుగారి కుమార్తె |
| h | 10 | 3) మాధవరావు<br>భార్య<br>సరోజిని | | | | | |

